మార్చి, మే 2009
వెల : రూ.25/-

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక



సంపుటి 28 సంచిక 3

# రాజ్యంపై దండెత్తిన కలం

# మహిళాతేజం



2009
మార్చి - మే
275

సంపాదకుడు
**సి.ప్రసాద్**

మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307,
దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు,
కడప జిల్లా - 516 360.
సెల్ : 9866021257

రచనలు పంపవలసిన చిరునామా :
**టి. కృష్ణాబాయి**
9-19-3
CBM కాంపౌండ్
విశాఖపట్నం - 530 003.
కవర్ డిజైన్ : **జుగాష్ విలి**



# సంపాదక లేఖ

తెలుగుసాహిత్యంలో పతంజలిది విలక్షణమైన శైలి. ప్రజల పక్షాన నిలిచిన కలం పతంజలిది. ఎట్లాంటి రక్షణ, హక్కులు లేని ప్రజల తరపున నిలబడ్డాడు. నోరులేని,దిక్కులేని ప్రజలపట్ల పోలీసు వ్యవస్థ, రాజ్యం సాగిస్తున్న దమనకాండను ఖండించాడు. ప్రజలమీద జులుం చేయడం దేశద్రోహమన్నాడు. ఎట్లాంటి మానవీయ విలువలు, ప్రజాస్వామ్య ఛాయలు లేని అనాగరిక సమాజంలో ప్రజలు నిరాయుధులుగా వుండకూడదన్నాడు. నిరాయుధులుగా వున్న ప్రజల చేతిలో పదునైన అక్షరమై, తిరుగులేని ఆయుధమై నిలిచాడు. విలువలకోసం నిలబడేక్రమంలో వృత్తిపరమైన సంక్షోభాలనెన్నింటినో ఎదుర్కొన్నా, ఆర్థికపరమైన యిబ్బందుల్లో సతమతమైనా, జీవికకోసం వ్యాపారాలు పెట్టినా, ఎన్నడూ ప్రజల పక్షాన్ని వీడలేదు. నగరం నడిబొడ్డులో నక్సలైట్ నాయకుడు మధుసూదన్‌రాజును పోలీసులు పాశవికంగా చంపితే దాన్ని హత్యగా న మోదుచేయాలని ధైర్యంగా వార్త రాశాడు. జీవితంలోకి, వ్యవస్థీకరించబడిన హింసలోకి తొంగిచూడలేని న్యాయవ్యవస్థను ఎద్దేవా చేశాడు. లాఠీలు నిర్ణయించినదే అసలుసిసలు న్యాయంగా చలామణి అవుతోందని చెప్పాడు. 'ఖాకీ వనంలో' పులులూ, సింహాలే రాజ్యం చేస్తాయని, లేళ్లకు, కుందేళ్లకు రక్షణ లేదని రాశాడు.

పోలీసువ్యవస్థ, రాజ్యమూ సమాజంలో ఏయే లోతులకు పోయి విస్తరించాయో, మానవ సంబంధాల్లో అధికారం ఎట్లా అవిభాజ్యమై పోయిందో వివరించాడు. "సేతిల కర్ర" వున్నవాడు చెప్పిందే నీతి, న్యాయమూ అయిపోయాయని చూపించాడు. నిత్యజీవిత సంబంధాల్లో రాజ్యం చొచ్చుకువచ్చి వ్యవస్థీకృతమైపోవడం విషాదమని పతంజలి రచనలు చెప్తాయి. మన చుట్టూ వుండే మనుషుల అధికార దర్పాలు, జుగుప్సాకర ప్రవర్తనలు, నంగిరితనాలు, మూర్ఖత్వాలు, అజ్ఞానాలు, వీటన్నింటిని ప్రముఖంగా చిత్రించాడు. మనుషుల్లోని డొల్లతనాన్ని వెక్కిరించాడు, కపటత్వాన్ని ఈసడించుకున్నాడు. వీరబొబ్బిలి, గోపాత్రుడు, పిలకతిరుగుడు పువ్వు, ఈ మూడు నవలికల్లో విలువల పట్ల, నియమాల పట్ల, విశ్వాసాలపట్ల సమాజం చూపించే కపట వైఖరిని ఎద్దేవాచేశాడు. రచనలు తన సొంత వ్యవహారమని ప్రకటించుకున్నా, తన అంతర్లోకాలను సంతృప్తిపరచుకోవడం కోసమే రాస్తున్నానని చెప్పుకున్నా పతంజలి ఏనాడూ పేరుకోసం రాయలేదు.

తెలుగు సాహిత్యంలో రావిశాస్త్రి మొదలు పెట్టిన విశేషమైన వ్యంగ్యరచనా ధోరణికి పతంజలి ఒక కొనసాగింపు. రచయితలు ప్రజల పక్షాన నిలబడాలని, అందుకు ఏ మినహాయింపులూ, షరతులు, రాజీలు ఉండకూడదని పతంజలి జీవితం చెబుతుంది. రచయితలు విస్తారంగా చదవాలని, ప్రపంచ సాహిత్యంతోపాటు భారతీయ సాహిత్యాన్నీ చదవాలనీ, అప్పుడే రచయితల మనోనేత్రాల దృష్టి వికసిస్తుందని పతంజలి చెప్పేవాడు. పతంజలి అకాలమరణం తెలుగుసాహిత్యానికి తీరని నష్టం. ఆయన రచనల ఔన్నత్యాన్ని, ఆయన వ్యక్తిత్వాన్ని విశ్లేషించుకోవడం ఒక అవసరం.

ఈ సంచిక వెల : 25 రూ.
సంవత్సర చందా : 100 రూ.
జీవితచందా : 1000 రూ.

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి. డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.

## ఈ సంచికలో...



**ముఖ చిత్రం :**

పతంజలి, ఆదివాసీ మహిళలు



☆ ఎన్.డి.

# ఇలాంటిదీ ఒక వేకువ

కావాలని కింది బెర్త్ అడిగితీసుకున్న నాకిష్టమైన్నా కొంకణ్ సౌందర్యాన్ని తనివితీరా చూడచ్చని. చలికాలం మొదలయ్యింది. పొగమంచులో ఆ పచ్చని ప్రకృతిని చూస్తుంటే మనసంతా హాయిగా వుంటుంది. వెచ్చగా టీ దిగుతుంటే ఆ ఆహ్లాదమే వేరు. కీర్తీ, పిల్లలూ కూడా వుంటే ఎంత సంతోషిద్దురో! శెలవల్లో తప్పక ఓ ట్రిప్ వేయాలి.

కంపార్ట్మెంట్‌లో అంతా కేరళవాళ్ళే, ఒక్క కర్ణాటక జంట. అంతా ఇప్పుడిప్పుడే సర్దుకుని కూచున్నారు. సామాన్లు సర్దుకోడానికి నేను సాయం చేసిన కేరళ అమ్మాయిలు 'హ్యాపీ జర్నీ' అన్నారు చిరునవ్వుతో. 'వాళ్ల జుట్టు అంత నల్లగా ఎలావుంటుందో' నేనూ విష్ చేసి సభ్యతగా వుండదని చూపు మరల్చుకున్నా. మెడలో లాకెట్స్‌ని బట్టి 'క్రిస్టియన్స్'అనుకున్నా.

పక్క స్టేషన్‌లో ట్రెయిన్ ఆగింది. పత్రికలు కొనుక్కుని నా పెట్టె ఎక్కుతున్నా.

'సుజీ, జాగ్రత్త, వెళ్లగానే ఫోన్‌చేయి, తర్వాతా చేస్తుండు, అసలే రోజులు బాగోలేవు, మనమీదా వాళ్లు పగబట్టి వున్నారు.....'

వెండర్స్ అరుపుల్లో మిగతా వినిపించలేదు. సుజీ అనే పిలుపూ, వచ్చిరానట్లున్న తెలుగుభాషా విని అటు తల తిప్పి చూసేవరకు ఒక్కసారిగా ఒళ్లు ఝల్లుమంది. సుజీనే, సందేహం లేదు. ప్లాట్‌ఫాం పై వున్న అతనితో ఏదో అంటోంది. ట్రెయిన్ కదిలింది. అతను ప్లాట్‌ఫాం వెంబడే చాలా సేపటివరకు నడుస్తూ వున్నాడు, అచ్చం అప్పట్లో నాలాగే. గుమ్మంలో నుంచునే అతన్ని గమనించాను. ఎక్కడో చూసినట్టు పరిచితంగా అనిపించింది.

గబగబా సుజీ ఎక్కిన పక్క కంపార్ట్మెంట్‌లోకి నడిచాను. తను తన బ్యాగులు సీటు కిందకి తోస్తోంది.

'సుజీ!'

ఆశ్చర్యంగా తలెత్తి 'నువ్వా, నీ ఆత్మా?' అంది తన ట్రేడ్‌మార్క్ చిరునవ్వుతో చేయి చాపి.

అట్లే ఉద్వేగంగా చేయి పట్టుకుని, 'ఎన్నేళ్లయింది!' అన్నా.

ఒక్క క్షణం ఆగి, 'సరిగ్గా పదమూడేళ్ల ఎనిమిది నెలల ఇరవై రోజులు' అంది.

తన చేయి మెల్లగా వదిలిపెట్టాను. తను అంత ఖచ్చితంగా గుర్తుపెట్టుకోడం విని మనసంతా ఎలానో అయింది.

తనకి చివరి సీటు వచ్చినట్లుంది. బ్యాగులు సర్ది అక్కడే కూచుంటూ నా కోసం పక్కకు జరిగింది. నేను కూచోకుండానే, 'ఎక్కడిదాకా' అని అడిగా. చెప్పింది

'నేనూ అక్కడికే, అంటే ఇరవై గంటలు మనం కలిసి వుంటామా, అన్ బిలీవబుల్' నన్ను నేను గిచ్చుకున్నా. సుజీ నవ్వి 'కూచోవా' అంది.

'వూహు, నువ్వే నా సీటు దగ్గరకొచ్చేయ్, కిటికీ పక్కన' అన్నా ఇక వివరణ అవసరం లేనట్లుగా.

'సరే పద' అని లేచింది. పక్కవాళ్లకి తన లగేజి చూస్తుండమని చెప్పి నా వెనకాల వచ్చేసింది. కేరళ అమ్మాయిలకు 'నా పాత దోస్తు' అని ఇంగ్లీషులో చెప్పగానే వాళ్లు నవ్వి చోటు ఇచ్చారు. సుజీ కిటికీ పక్క కూచుంది. నేను తన పక్కన, తననే చూస్తూ......ఇంకా నమ్మకమే కుదరడం లేదు నాకు.......అంతకంటే ఎక్కువ ఆశ్చర్యం తను ఏమాత్రం ముఖం తిప్పేసుకోకుండా నాతో నవ్వుతూ మాట్లాడ్డం..

ఇద్దరం ఒకసారే మాట్లాడబోయి నవ్వుకున్నాం.

'నువ్వే అడుగు' అంది ఇంకా నవ్వుతూ.

'నువ్వే అన్నీ చెప్పు, ఎలా వున్నావు, ఏం చేస్తున్నావు?'

'చాలా బాగున్నాను, ఏం మారలేదు, చాలాకాలం జాబ్ చేశాను, అదే ఇంగ్లీష్ టీచర్‌గా, తర్వాత మా సంస్థ పనులు ఎక్కువై రిజైన్ చేశా. పూర్తికాలం సంస్థలోనే చేస్తున్నా, ముంబైలో బేస్ అయినా అంతటా తిరుగుతున్నా. నువ్వు చెప్పు ఇక' సూటిగా నాకేసి చూస్తూ.

నేను తనకేసి అలాగే చూస్తూ కూచున్నా. కొద్దిగా పాపిట దగ్గర తెల్ల వెంట్రుకలు వచ్చాయి. చిన్న పోనీ వేసుకుంది. ఇంతకు ముందున్నంత ఒత్తుగా లేవు గానీ నాకిష్టమైన తన నల్లని జుట్టు అలాగేవుంది. కళ్లకింద గుంటలు పడి నల్లగా చారలు, నల్లటి ముఖంలోనూ అంత స్పష్టంగా, చిత్రం! వయసు మీద పడ్డట్లు లేదు. చాలా యంగ్‌గానే కన్పిస్తోంది. పిల్లల్ని ఎలాగూ కని వుండదు, లేక ఆలోచనలు ఎప్పుడూ 'యంగ్'గా వుండడం వల్లా?

'అయ్యిందా?'

'ఉహు'

'సరే అయితే చూడ్డం అయ్యాక నీ గురించి చెప్పు'

నిట్టూర్చా. 'ఏం చెప్పను, నువ్వు వెళిపోయాక అక్కడ వుండలేక స్కూలు మారాను గానీ చాలాకాలం అదే హిస్టరీ టీచర్ జాబ్‌లో. తర్వాత నాన్నగారి వారసత్వంగా స్వంత బిజినెస్‌కి మారాను. మెడికల్ ఎక్విప్‌మెంట్. ఆ పనిమీదే ప్రయాణం. ఉహుహూ....జిందగీ సే కోయీ షికువా తోనహీ......' నవ్వుతూనే గున్గునాయించాను 'తేరేబినా' అనేది మింగేసి. కేరళ అమ్మాయిలు మమ్మల్ని చూసి ఏదో అర్థమైనట్లే నవ్వారు.

తనూ నవ్వి కిటికీ కేసి తల తిప్పింది. తనకి కిటికీ దగ్గర కూచోడం ఎంతిష్టమో! ఎప్పుడైనా తన సంస్థ పనుల మీద ప్రయాణాలకి టిక్కెట్లు బుక్ చేయడానికి వెళ్లేదుంటే ఎన్నిసార్లు చెప్పేదో కిటికీ పక్క సీటు కోసం టిక్ చేసి అడగమని. అప్పటికంటే ఇప్పుడు ప్రయాణాలు ఎక్కువై వుంటాయి పూర్తికాలం అంటే....

టీ వస్తే ఇద్దరికీ తీసుకున్నా.

'ఈసారి కిటికీ సీటు దొరకలేదా'

'నీలాగ కొట్లాడి మరీ ఇప్పించేవాళ్లు లేరుగా'

మౌనంగా టీ తాగడం పూర్తి చేశాం బైటకి చూస్తూ.

'సెండాఫ్ ఇచ్చినతను...'

'ఓ, చూశావా, మా సంస్థ సభ్యుడే, ఫరూక్ అని'

ఒక్కసారిగా ఎందుకో ఝల్లుమంది నాకు. తను ఓ క్షణం నాకేసి చురుగ్గా చూసినట్లనిపించింది. లేక నా భ్రమా?

'మీ సంస్థలోనా...?!'

'ఆ, ఇంతకీ నేనిప్పుడు పూర్తికాలం పని చేస్తున్నది మతోన్మాద వ్యతిరేక సంఘంలో. అప్పుడు మహిళా సంఘంలో చేస్తున్నప్పుడే ఇదీ పెట్టాంకదా బాబ్రీది అయినప్పుడు, గుర్తుందిగా'

తలూపాను. ఎలా మర్చిపోతానసలు? కావాలని అడిగిందా?

కానీ తను మామూలుగానే చెప్పుకుపోతోంది.

'అప్పుడు వేదికలా తాత్కాలికంగా పెట్టినా పర్మనెంటుగానే పనిచేయాల్సిన స్థితి వచ్చింది కదా, అందుకని పన్లు ఎక్కువై ఇక నేను పూర్తిగా దానిలోనే చేస్తున్నా. అప్పటికి మహిళా సంఘం బాగానే డెవలప్ అయ్యింది కనక నా ఇంట్రెస్టు చూసి వాళ్లూ పంపడానికి సిద్ధపడ్డారు. ఇప్పుడు వెళ్తున్నది కూడా మొన్న అక్కడ క్రిస్టియన్లమీద దాడి జరిగింది కదా, చూసే వుంటావు, దాని గురించే, ఫరూక్ కూడా రావాల్సింది గానీ పత్రిక ప్రింటింగ్ కోసం ఆగాల్సి వచ్చింది. అక్కడ టీం సరిపడా కుదిరారు అని సంస్థ సభ్యులు చెప్పంపారు, దాంతో నేను మాత్రం బయల్దేరా'

తను ఒక మూడ్‌లో ధారాళంగా తమ సంస్థ కార్యకలాపాల గురించీ, కొన్ని ఫ్యాక్ట్ ఫైండింగ్ అనుభవాల గురించీ చెప్తుంటే వింటూ కూచున్నా. తను ఆగాక అప్రయత్నంగానే నా నోట్లోంచి ప్రశ్న వెలువడింది.

'గుజరాత్ వెళ్లలేదా?'

'వెళ్లలేకపోయాను, ఆస్మా సివియర్ అటాక్‌తో కదలలేకపోయా, మిగతా అంతా వెళ్లారు, ప్రత్యేకంగా అడిగావేంటి?'

'ఆహా ఏం లేదు, పెద్దది అదే కదా, దాని గురించి చెప్పలేదని'

ఇలా అన్నా ఎందుకో తను నా తడబాటుని గమనించిందనిపించింది.

మెల్లగా ఎండలో చురుకుదనం పెరుగుతోంది. తను మఫ్లర్, స్వెటర్, శాలువా అన్నీ తీసేసింది. నేనూ స్వెటర్ తీసేసి పైన కొక్కానికి తగిలించా అన్నీ. అప్పుడు గమనించా. చాలా బక్కగా అయింది. ఎప్పుడూ బక్క ప్రాణమే అయినా ఇప్పుడు మరీ. తన గురించి పట్టించుకునేవాళ్ళు ఎవరూ లేరా? తన పార్ట్‌నర్ గురించి అడగాలని ఎంత అనిపిస్తుందో అంతగానూ ఓ అశక్తత. తనసలు ఆభరణాలు ఎప్పుడూ వేసుకోదు కనక అలా తెలిసే అవకాశం లేదు. అందుకు ఉపోద్ఘాతంగా ఇక నేనే సెల్‌ఫోన్‌లో వున్న కీర్తి, పిల్లలు ఫోటోలు చూపించాను.

'చక్కగా వున్నారోయ్ పిల్లలు. తనూజాబ్ చేస్తోందా?'

'వూ - పార్ట్‌టైంగా. కవలలు కదా ఫుల్‌టైం జాబ్ ప్రసవానికి కొద్ది రోజులముందే మానేసింది. క్రెష్ దొరికాక మళ్ళీ చేరింది'

సుజీ తదేకంగా చూసింది నాకేసి ఎందుకో. 'గుడ్'అని మళ్ళీ కిటికీకేసి తిరిగింది.

'అరేంజ్‌డ్ మ్యారేజే, నాన్న పోయే ముందు వత్తిడితో.......

సుజీ ఏం మాట్లాడలేదు.తనే ఇంకేమన్నా అడుగుతుందేమో అని కొంత సేపు చూశాను. తను అలాగే బయటకుచూస్తోంది. చివరకు ధైర్యం చేశా.

'మరి నువ్వు....?'

'ఏంటి మరి నేను?'

ఇలా అంటే ఇక ఏం అడగను? నేనూ కిటికీ నుండి బైటకి చూస్తూ కూర్చున్నా. మనసంతా ఒకలాంటి అలజడిగా వుంది. మా మధ్య గడచిన ఎన్నో సంతోషకర క్షణాలు, చివరి విషాద క్షణాలూ అన్నీ గజిబిజిగా కలగాపులగంగా బుర్రనిండా తిరుగుతున్నాయి. గాయపడ్డట్లుగా, మౌనంగా నా మీద ఆరోపణ చేస్తున్నట్లుగా చివరిసారిగా సుజీ చూపు....ఇన్నేండ్లలో ఎన్నిసార్లు సరిగ్గా ఆ చూపు వల్లే హఠాత్తుగా మేల్కొని ఉంటాను నిద్రనుంచి? యవ్వనపు తొలి రోజుల్లో ఒకరినొకరం వదలలేనట్లుగా, గాలి కూడా చొరబడకూడదన్నట్లు అతుక్కుపోయి, ఎన్ని కబుర్లు చెప్పుకున్నా తీరనట్లు వుండేవాళ్లం. ఇప్పుడు మౌనం మూడో మనిషిలా మా మధ్య తిష్ట వేసినట్లుగా వుంది.

బ్రేక్‌ఫాస్ట్ చేయలే నేను. తనూ ఏం తినకుండా వున్నాననడంతో టిఫిన్ తీసుకున్నా ఇద్దరికీ.

'కొంకణ్ ట్రెయిన్లలో ఫుడ్ బాగుంటుంది, అందుకే ఎప్పుడూ ఏం తెచ్చుకోను, లేకపోతే కీర్తి వూరుకుంటుందా?'

'అవునట. అందుకే ఫరూక్ ఏం చేసివ్వనన్నాడు. మాకసలు అంత టైం కూడా ఎక్కడలే. ఫ్యాక్ట్ ఫైండింగ్ కోసం అన్నీ చేసుకునేవరకే టైం అయిపోయింది. రిజర్వేషన్ దొరికింది నయమనుకున్నాం, చాలాసార్లు అన్‌రిజర్వుడ్‌లో వెళ్లాల్సి వస్తుంది మేం'

'ఇలా చేసుకునేనా ఆరోగ్యం ఇంతగా పాడు చేసుకున్నావ్?'

'అనారోగ్యంగా కనిపిస్తున్నానా? ఛ- అదేంటీ అయితే ఫరూక్ అబద్ధం చెప్పాడా? చాలా రోజుల తర్వాత ఇప్పుడే బావున్నావు అన్నాడే'

'సుజీ నిజంగా చెప్పు నీ గురించి పట్టించుకునే నీ మనిషి అంటూ వున్నాడా లేడా?' అడిగేశా సాహసించి.

'నువ్వేం మారలేదు' అంది వేళ్లు నాకుతూ.

'నువ్వూ ఏం మారలేదు, ఆ నాకటం అదీ'

'ఆహహా, అలాగైతే నువ్వు చాలా మారావు సుమా, బట్టతలొస్తుంది, పొట్ట కూడా పెంచుతున్నావు, పైగా ప్రపంచాన్ని మోస్తున్నట్టు ఆ ఎక్స్‌ప్రెషన్ ఒకటి కొత్తగా తెచ్చుకున్నావు మొహంలోకి' నాటకీయంగా నన్ను పరిశీలిస్తున్నట్లుగా ఫోజు పెట్టింది.

నాకు ధైర్యం వచ్చింది. ఎందుకో ఉదయంనుండే తనకి నా మీద మునుపటంత కోపం లేదనిపించసాగింది.

'ఇంతకీ నేనడిగింది చెప్పనే లేదు'

'ఏం చెప్పను, నన్ను పట్టించుకునే మనిషి కాదు చాలామంది మనుషులు వున్నారు, చాలా?'

'అది కాదు...'

'ఎందుకంత క్యూరియాసిటీ నీకు? జీవితం పదమూడేళ్ల ఎనిమిది నెలల ఇర్వై రోజుల దగ్గరే ఆగదని నీకూ అర్థమైందిగా. ఇంకేమైనా అడక్కోడదూ'

'క్యూరియాసిటీ కాదు, నీగురించి నాకు బాగా తెలిసిన ఒక్క విషయం నీకు నిన్ను పట్టించుకునే ఒకళ్లు వుండాలి అని' నోటి చివరి దాకా వచ్చినయి ఈ మాటలు గానీ అనలేదు. ఇన్నాళ్ల తర్వాత ఇంకా వివరణలు ఇచ్చుకునే సంబంధం కాదు కదా.

హ్యాండ్‌బ్యాగ్‌లోంచి టాబ్లెట్లు తీసుకుని వేసుకుంది. చేయి చాపాను. ఇచ్చింది, అవే మాత్రలు. కొత్త డెవలప్‌మెంట్స్ ఏవీ ఫాలో అవుతున్నట్లు లేదే. తనకిచ్చేశాను. తను వాటిని బ్యాగులో పడేసుకుంది.

తనలా ప్రకృతిలో మునిగిపోయినట్లు కూచుని వుంటే నేనే ఇక పాత విషయాలు కొన్ని తడిమాను. తనూ ఉత్సాహంగా గుర్తు చేసుకుంది. మేం కలిసి స్కూల్లో కలిసి పని చేసినప్పటి కొలీగ్స్, స్టుడెంట్స్, అమ్మల గురించి ఎవరేం చేస్తున్నారో మాట్లాడుకున్నాం చాలాసేపు. ఆ పాతరోజులు,మనుషులు, ఆ వాతావరణంలోకి వెళ్తుంటే టైం ఎలా గడిచిపోయిందో కూడా తెలీలేదు. లంచ్ ప్యాకెట్లు తీసుకుని వెయిటర్లు వచ్చేవరకు ఆ పాత కబుర్లలోనే మునిగితేలాం.

కేరళ అమ్మాయి నవ్వుతూ 'పాత జ్ఞాపకాలు ఎంతకీ అవ్వడం లేదనుకుంటా?' అనడిగింది ఇంగ్లీషులో.

'యస్' అని ఇద్దరం నవ్వాం. వాళ్లు బాక్స్ తెచ్చుకున్నారు. మా లంచ్, వాళ్ల బాక్స్ అన్నీ కలిపి పంచుకుని తిన్నాం.

వాళ్లని పడుకుంటారా అడిగితే లేదు, లేదు కూచొండి అన్నారుగానీ మొహమాట పడ్డట్టనిపించింది. సరిగ్గా నేను అనుకున్నదే అనుకున్నాదేమో సుజీ 'ఇగో వాళ్లని చక్కగా పడుకోనిద్దాం, నాది పై బర్తే కదా పైకెక్కేద్దాం పద' అంది.

'రైట్' అని ఆ అమ్మాయికి విషయం చెప్పి నా లగేజికి తాళం వేసి ఇద్దరం తన పెట్టెలోకి వెళ్లి పైకెక్కేశాం. తను నేను చెప్పే కబుర్లు వింటోంది గానీ కళ్లు మూతలుపడ్తున్నాయి. పడుకుంటావా అంటే లేదు అంటోంది గానీ నాకర్థమైంది ఎప్పట్లాగే.

'ఏయ్, ఎందుకు మొహమాటం, ఇంకా చాలా గంటలు కలిసే వుంటాం, పడుకో' అన్నా.

'సారీ, ఎలాగూ ప్రయాణంలో పడుకోవచ్చు అని పత్రిక పనిచేస్తూ వున్నా ఫరూక్‌తో రాత్రంతా, జస్ట్ అరగంటలో లేస్తానేం?'

'అరగంట కాకుంటే అరరోజు పడుకో' అని మూలకి జరిగా. తను మిగతా చోట్లో ముడుచుకుని పడుకుంది. అంత పొడుగమ్మాయికి ఎక్కడ సరిపోతుంది?

'సుజీ, లే, ఒళ్లో తల పెట్టుకో, సరిపోతుంది' అన్నా.

తను కదల్లేదు, అప్పుడే నిద్రపోయేసింది. నేనే మెల్లగా తన తలని ఒళ్లో పెట్టుకున్నా, నిద్రలోనే 'ఆ' అని నా కాళ్ల మీద చేయి వేసుకుని తిరిగి పడుతుంది. మనసంతా ఒక గాఢమైన మైత్రీభావంతో నిండిపోయింది తనని చూస్తుంటే. 'ఐయాం సారీ సుజీ' ఏ వందోసారో అనుకున్నా. తప్పు నాదేనని కొత్తగా ఇవ్వాళ తెలిసిందేం కాదు, అప్పుడే తెలుసు కానీ ఒప్పుకోలేని బలహీనత, ఆ బలహీనతని పోగొట్టుకోలేని భయం, నేనంత పిరికిపందగా ఎలా వున్నానో అప్పుడు? అలాగని తెలిస్తే అసలు సుజీ నన్ను ప్రేమించేదే కాదేమో?

బాబ్రీ మసీదు విధ్వంసం తమ వ్యక్తిగత జీవితాల్ని కూడా ఇంతగా విధ్వంసం చేస్తుందని వూహించామా? ఆ దృశ్యం టీవీలో చూసి ఇద్దరం ఎంతగా రగిలిపోయాం? ఆ తర్వాత ముస్లింల మీద దాడులు, సుజీవాళ్లు ఉర్దూలో, గుజరాతీలో పాంప్లెట్లు తీసి క్యాంపెయిన్ చేయడం, తాము పనిచేస్తున్న స్కూలులో ముస్లిం పిల్లలున్నారని సంఘ్‌పరివార్ వాళ్ల దాడికి రావడం... పోలీసు ప్రొటెక్షన్ కోసం యాజమాన్యం అడగడం..స్కూలు ముందు పోలీసులు...భయంభయంగా టీచర్లూ, పిల్లలూ.........ఒక్క నెలలో ఎంత బీభత్సంగా పారిపోయిందో అంతా..

కానీ తమని విడదీసింది బాబ్రీ మసీదు సంఘటనేనా? అది కాకుంటే ఇంకోటి అయ్యేది, నేనలా వున్నాక అప్పుడు కాకుంటే ఇంకెప్పుడైనా బయటపడేదే, ఎన్నో సంవత్సరాలు తనకసలు అర్థమైతేనా? ఇంత చిన్న కారణానికి సుజీ విడిపోవడం ఏంటని తన మీదే దోషారోపణ చేస్కుంటూ...

ఎంత చిన్న విషయం, కానీ నిజంగానే ఎంత పెద్ద విషయం.....ఇప్పుడు ఆలోచిస్తే. గొడవలవుతున్నాయి,సంఘ్ పరివార్ దాడి కూడా జరిగింది కాబట్టి ఆసారి స్కూలు యానివర్శిరీలో ఉర్దూ నాటకం వేయద్దని స్కూలు యాజమాన్యం నిర్ణయం. అది పిల్లలకు సరయిన సంకేతాన్ని ఇవ్వదనీ, వేద్దామనీ సుజీ. ఆఖరికి మిగతా టీచర్లందరితో పాటు నేనూ యాజమాన్యం వైపు మాట్లాడ్డంతో సుజీ ఎంత ఒంటరిదైపోయింది... పాపం ఎంత క్షోభపడి వుంటుందో? ఎంతసేపూ తను మొండిదనీ, తను డైరక్టు చేస్తోంది కాబట్టి పట్టుబడుతోందనీ, పరిస్థితిని అర్థం చేసుకోడం లేదనీ అనుకున్నానే గానీ 'ఆఫ్టరాల్ అరడజనుమంది ముస్లిం పిల్లలు వేసే ఓ నాటకం కోసం తను ఎందుకంత కొట్లాడుతోందో' నాతో సహా ఎవరికీ పట్టలేదు. ఆ మాటే అన్నప్పుడు తన ముఖంలో విస్మయం, గాయపడ్డ చూపు ఎప్పటికయినా మర్చిపోగలనా? 'వాళ్లేదో నిరాశపడ్తారని అనుకుంటున్నావు గానీ అందరు పిల్లల్నీ రిస్క్‌కు గురి చేస్తున్నావు' అని నేను అరిస్తే 'అందరు పిల్లల కోసమేనోయ్ నా బాధ, వాళ్లకి ఏం నేర్పిస్తున్నామని' అని తను కన్నీళ్లు పెట్టుకున్న దృశ్యం..... ఇంకా కళ్లముందు కదులాడుతున్నట్లే.....

చివరికి దానికోసం జాబ్‌నే కాక తను నన్ను కూడా వదులుకుందంటే నా 'అహం' ఎంతగా దెబ్బ తిందో! నేను లేకపోతే తను వుండలేదనే అనుకున్నాను అన్నాళ్లూ........కానీ నాలాంటి బలహీనుడికే తన అవసరం ఎక్కువుందని అర్థం కావడానికి ఎంతకాలం పట్టిందో.... తనదేముంది తన విలువలతో బతికేస్తుంది....

'సుజీ, కొట్టో, తిట్టో అయినా నాకు బుద్ధి వచ్చేలా చేయాల్సింది'

'నువ్వు అసలు వినే స్థితిలో వున్నావా? గుర్తు తెచ్చుకో' సుజీ అన్నట్లే అన్పించింది. నిజమే మరి.. అంత హీనంగా వున్నా కాబట్టే...

వాతావరణం చల్లగా అవుతోంది సాయంత్రానికే. సుజీ ముడుచుకుంటోంది. మెల్లగా తనని పడుకోబెట్టి నా సీటు దగ్గరకి వెళ్లి స్వెటర్లూ అవీ పట్టుకొచ్చా. తనకి రెండు శాలువలు కలిపి కప్పి నేనూ స్వెటర్ వేసుకున్నా. తను అలాగే పడుకుని వుంది కదలకుండా. ఎన్ని రోజుల నిద్రో. అప్పుడూ ఇంతే, మహిళా సంఘంలోనూ తీరిక లేకుండా పని చేసేది, తన గురించి అంతగా పట్టించుకునేది కాదు, అన్నీ నేను చూసుకునేవాడ్ని. వుండడానికి రెండు ఇళ్లల్లో వున్నా ప్రాక్టికల్‌గా ఏదో ఒక దగ్గరే ఇద్దరం వుండేవాళ్లం దాదాపుగా. అమ్మకు కూడా సుజీ ఎంతిష్టమో. నేను వున్నప్పుడే అంతంత మాత్రంగా వుండేది, ఇప్పుడేంటో? సరిగ్గా చెప్పను కూడా లేదు పిల్లి! తల ఎత్తి తన మఫ్లర్ కూడి గడ్డం కిందుగా దూర్చి కట్టాను.

'ఇంకొక్క ఫైవ్ మినిట్స్‌రా, లేస్తాను' అంది కలవరిస్తున్నట్లుగా. ఒక్కసారిగా హృదయంలో ఏ రహస్యపు మూలనో తాకినట్లయి నా కళ్లనుండి టపటపా కన్నీళ్లు రాలాయి. తన తలచుట్టూ చేతులు వేసి పొదువుకుని అట్టే కూచున్నా ఎంతసేపో...వీడని గతాన్ని కౌగిలించుకుని.....

చీకటి పడిపోయింది. సుజీ కదిలింది.

'ఏం కాదు, ఇంకాస్సేపు పడుకో' అన్నా మెల్లగా తల నిమురుతూ.

'వూ' అని కళ్లు తెరిచి మళ్ళీ మూసుకుంది, కానీ నిజంగా మెలుకువ వచ్చేసినట్లుంది, కొంచేపటికే లేచి కూచుంది.

'అబ్బా, చాలా సేపు పడుకున్నట్లున్నా'

'ఏం లేదులే, ఐదు గంటలు మాత్రమే'

నవ్వింది. కిందకి దిగి ముఖం కడుక్కుని వచ్చింది. ఇంతలో చాయ్ వస్తే తీసుకున్నా. ఇద్దరం దాన్ని ఆస్వాదిస్తూ తాగాం ఆ చలికి. కబుర్లు దొర్లుతున్నాయి, ఏవేవో మాట్లాడుతున్నాం కానీ తనకి జీవితంలో ఎప్పటికయినా చెప్పాలనుకున్న విషయం చెప్పాలా వద్దా తేల్చుకోలేకపోతున్నా. ఒకోసారి చెప్పి ప్రాయశ్చిత్తం చేసుకోవాలనిపిస్తుంది, కానీ ఎందుకో గొంతు పెగలడం లేదు.

ఎప్పట్లాగే తనే ఎక్కువ మాట్లాడుతోంది, నేను వింటున్నా. తను బ్యాగులోంచి వాళ్ల పుస్తకాలు తీసి చూపించింది. తీసుకుంటావా అంటే మారుమాట్లాడకుండా అన్నీ కొన్నా ఒక్కో కాపీ, అవన్నీ నా దగ్గర అప్పటికే వున్నాయని మాత్రం చెప్పలేదు.

రాత్రి భోజనం కూడా కానిచ్చాం. ఇక నాసీటు దగ్గరికి వెళ్లాలేమో. కానీ తనతో వుండే ఆ కొద్దిగంటలు నాకు ఎంతో అపురూపమైనవి. కానీ తనకి అలా వుండకపోవచ్చేమో? పైపెచ్చు తనకి నిద్ర అవసరం, మళ్లీ ఉదయం నుండి తిరుగుడే వుంటది తనకు. కానీ ఇద్దరం ఏమనడం లేదు. మళ్లీ ఏవో కబుర్లు.

చివరకి ఇక నేనే 'బడలిక పూర్తిగా తీర్చుకోవాలేమోగా, ఇక వెళ్తాను' అన్నా.

'నీకు అబద్ధాలు చెప్పడం ఇప్పటికీ రాలేదు' అంది.

నవ్వి ఇక రిలాక్స్‌గా కూచున్నా. కంపార్ట్‌మెంట్‌లోలైటు తీసేసి అందరూ పడకకి ఉపక్రమించారు. మామీదకు కారిడార్‌లో లైటు పల్చగా పడుతోంది.

తెల్లారితే ఇక తను ఎటో, నేనెటో, మనసులో మాట అడిగేస్తేనే మంచిదనుకున్నా ఇక.

'సుజీ, ఒక్కటడుగుతాను, కాదనకూడదు, నిజంగా' అన్నా గొంతులో బోలెడు ఆశతో.

'అడుగు' అంది మెల్లగా.

'నువ్వు ఒక్క నెలరోజులు మా ఇంట్లో వుంటే మంచి డాక్టర్ల దగ్గర చూపిస్తా, ఒక్క నెలరోజులు తిరిగే పనులు పెట్టుకోకు, ఇంట్లో వుండి చేసుకునే పనులు ఎన్నైనా తెచ్చుకో...ప్లీజ్..నాకు చాలా మంచి డాక్టర్లు తెలుసిప్పుడు' అంటూ నా జేబులో కార్డులు తీసి చూపించా.

కాస్సేపు ఆ కార్డులు చూస్తూ కూచుంది. చివరికి 'సరే, కానీ 15 రోజులే' అంది. నేను సరిగ్గా వినలేదా అనుకున్నా. నేనే మాత్రం వూహించలేదు తను ఒప్పుకుంటుందని.

'నిజంగానా?'

తలూపింది. తన చేయ పట్టుకుని వూపేశాను. 'థ్యాంక్స్, సుజీ, నీకు నా మీద కోపం పోయిందని ఉదయం నుండే అర్థమైంది కానీ ఇప్పుడు నిజంగా నమ్మకం కలిగింది'అన్నా ఉద్వేగంగా.

'కోపం ఏంటి? కోపమనుకున్నావా?' ఇంతేనా నీకర్థమైంది అన్నట్లు వినిపించింది ఆ ప్రశ్న.

'నేను ఎంతగా ఎన్నిసార్లు కాంటాక్టు చేద్దామన్నా నువ్వు పూర్తిగా కట్ చేసేసుకున్నావు కదా, కోపమే అనుకున్నా.. పోనీ... అసహ్యం...' అన్నా లోగొంతులో.

'ఛ...ఛ..అసహ్యం ఏంటి? ఏదీ కాదు. నీవెంత బాధపడ్డావో అంతకంటే ఎక్కువ బాధే పడ్డా నిన్ను వదులుకున్నందుకు కానీ ఒక విలువ కోసం నిలబడని నీతో జీవితాన్ని వూహించుకోవడం నా వల్ల కాలేదంతే. పైకి ఎంత అభ్యుదయంగా వున్నా నీలో తొంగి చూసిన ఆ హిందుత్వవాదిని ఆ రోజు చూసి తట్టుకోలేకపోయాను, ముస్లిం కాకున్నా నీకు ఎందుకంత బాధ అని నువ్వంటే నాకు దిమ్మెక్కిపోయింది, నిన్నే కాదు ఎవర్నీ, దేన్నీ సగం సగం ప్రేమించడం రాలేదురా, ఇప్పటికీ అంతే....'

ఏమన్నా అనడానికి కూడా నాకు అర్హత లేని విషయం అది. తల వంచుకుని కూచున్నా, తనూ అలాగే కూచుంది. ఇక మాటలు కష్టమే అయినాయి. నాకార్డు మీద కీర్తి నెంబర్ కూడా రాసిచ్చాను. టైం చూసుకుని తనే కాంటాక్టు చేస్తానని మాటిచ్చింది.

మా స్టేషన్ తెల్లారే వచ్చేస్తుంది. వెలుగురేఖలు విచ్చుకునే సమయం దగ్గరకొస్తోంది. చివరికి తను కలిసినప్పటినుండి నన్ను తొలుస్తున్న విషయం మాత్రం అడగకుండా వుండలేకపోయా.

'సుజీ, విడిపోయే ముందు ఇదొక్కటి చెప్పు, ఇప్పుడు నన్నెట్ల కరుణించావు మరి?'



☆ ప్రశాంత్

# ఎర్రబడ్డీ సెంటరు

రాత్రి బాగా పొద్దుపోయింది. రెండవ ఆట సినిమా వదిలి చాలా సేపయింది. గుడివాడ టౌను నిదురలో జోగుతున్నది. అపుడపుడూ గాలి వీధుల వెంట పరుగులు తీస్తున్నది. ఎండాకాలం ఆరంభమవడంతో అర్ధరాత్రి చల్లగాలి అద్భుతంగా తోస్తున్నది. వాహనాల రొద తగ్గి, తూర్పువైపు కొల్లేరు రహదారిపై అడపాదడపా చేపల లారీలు బుయ్యిమని ఉరుకులు పెడుతున్నాయి. లారీలు వెళ్ళినపుడంతా రోడ్డుమీది చెత్తాచెదారం గాలిలో గింగుర్లు తిరిగి మళ్లీ కూలబడి పోతున్నది. కుక్కల అరుపులు తప్ప పెద్దగా మనుషుల సంచారం లేదు. మతి భ్రమించిన స్త్రీ చంకలో పిల్లాణ్ణెత్తుకుని శ్రీనివాస మహలు సెంటరు నుంచి బంటు మిల్లి రోడ్డులోని ఎర్రబడ్డీ సెంటరు మీదుగా అరుస్తూ పాటలు పాడుతూ ముబారక్ సెంటరువైపు వెళ్లిపోయింది.

ఎర్రబడ్డీ ప్రొప్రైటరు స్వామిగారికి ఆరోజెందుకో కొట్టు కట్టెయ్యడం ఆలస్యయింది. మతి భ్రమించిన స్త్రీపాట స్వామిగారి నిమిత్తం లేకుండానే చెవిన పడింది.

"సీకటీ మింగినా సుక్కలా రేత్రిలో
పరిగెత్తుకొచ్చాను బాబో
నడిజాము సీకటిన తోట మలుపులోనా
ఏటి జరిగిందో ఎవరాలకిత్తారు బాబో..."

ఆమె దూరంగా వెళ్లిపోయిన తర్వాత 'సీకాకోలం, సీకాకోలం' అన్న మాటలు లీలగా వినపడ్డాయి. అప్పటికి బడ్డీ దగ్గర రిక్షా పుల్లరు సూరిబాబు నసిగినట్లు మాట్లాడుతూ చుట్ట కాలుస్తున్నాడు.

కోమట్ల బజారు మురాకూలీలు తప్పతాగి తూలుతూ బడ్డీలో చుట్టలు కొని వెళుతూ వెళుతూ "సామిగారూ అది ఎవరో సచ్చిపోయింది. దాన్దారి అది సూసుకుంది. మనవేం సేస్తాం సెప్పండి. అయినా మనసూరుకోదు కదండీ..." అన్నాడు గుంపులోని ఓ పెద్దమనిషి.

గత వారం రోజులబట్టీ స్వామిగారి బడ్డీ దగ్గర సమసిపోని చర్చ ఒకటి సాగుతున్నది. బడ్డీకొచ్చే వాళ్లంతా చనిపోయిన మనిషి గురించి వాకబు చేయడమో, వాపోవడమో జరుగుతున్నది. వాళ్లడిగినపుడంతా స్వామిగారికి చికాకనిపించినా అందరూ వెళ్లిపోయాక ఎంత కాదనుకున్నా ఆ సంఘటన చుట్టే తిరుగుతున్నది మనసు.

ఉదయం ఐదున్నరనగా బడ్డీ తెరిస్తే రాత్రి పన్నెండింటిదాక బడ్డీ ఈ చర్చల్లోనే మునిగి తేలుతున్నది.

సూరిబాబు బడ్డీ ముందు కూర్చున్నాడన్న మాటేగాని ఏదో లోకంలో ఉన్నవాడిలా పరధ్యానంలో ఉన్నాడు. తేరుకున్నట్టే తేరుకుని లోలోపలి దుఃఖాన్ని పైకి తీస్తున్నట్లుగా మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

"ఏవీ... లేదండి సామిగారు, ఈ కడుపుకోసం పిడికెడు సంపాదించాల. మద్దిలో ఏంటి జరిగినా ఈ లోకంతో సమ్మందం తెగిపోద్ది.

రాతిరి అలిసిపోయి పాడుకుంటామండీ..... తెల్లారడం అందరికీ ఎలాగండీ ఒకటవుద్దీ.....! అని, జవాబులేని ప్రశ్న వేసినట్టు స్వామిగారి ముఖంలోకి చూస్తూ చుట్టముట్టిస్తూ తిరిగి మొదలుపెట్టాడు.

"ఒకడికి సిటపట ఎండ మొకంపై పడ్డపుడు లెగుస్తాడు. నానైతే నిద్దరపోయినా, కలొచ్చినా రిచ్చా లాగుతానే వుంటాను. సిరాకు పుట్టి రిచ్చా లాగుతా కోతిబొమ్మ వొయిపు ఎల్తానా.... తెల్లారడం ఒదిలీండి కోడికూడా లెగదండి. కుక్కలు మాత్తరం ప్రతిరోజా నన్ను సూసి అరుత్తాయండీ. ఆ ముసిల్ది అలాగె పోయింది. నీతిగా బతికిందని అందరూ దాని శవం లెగిసిన తర్వాత అన్నారు. అదేమో బతికినన్నాళ్లూ శవంలో ప్రేనాలు పోసుకుని బండిలాగింది. ఈ పూటకి దాని ఇడ్లీ పాత్తర్లన్నీ అదిగో.... కాలి కరిగిపోయి వొంకర్లు తిరగి పోయాయి. దాన్లాగే" అంటూ తుపుక్కున ఊసి, చుట్ట ఆర్పి జేబులో పెట్టుకున్నాడు.

మాటలు అయిపోయిన వాడిలా సూరిబాబు మౌనం దాల్చాడు. స్వామిగారు మాత్రం ఇంకేమైనా చెబుతాడేమోనని ఆయనవైపే చూసి చూసి వికారంగా మొహంపెట్టి తార్రోడ్డు వైపుకి చూపులు మరల్చాడు.

"దాని గుండెలెండి పోయి అదిపోయింది. మనవేం సేత్తామండీ...." సూరిబాబు మాటలో విసుగూ, నిరాశా ధ్వనించాయి. ఈ మాట అంటూ బంటుమిల్లి రోడ్డువైపు తీక్షణ్ణంగా చూస్తున్నాడు సూరిబాబు.

"ఎవరూ లేర్రా పిచ్చిది. ఇందాకటే ఎళ్లింది కదరా" అన్నారు స్వామిగారు.

ఈమాట అంటూ బడ్డీలో ఖాళీ అయిన సరుకుల వైపు చూస్తున్నారు.

"పిచ్చిదాని సంగతొదిలీండి, ముసిల్దాని ప్రాణాలు ఫ్యాక్టరీయే తీసిందంటారా? మరి వొడ్డీ శెట్టి మాత్రం ముసిల్దిపోయిందని బెంగపడి

---

'నేనూ నువ్వే చేస్తావని చూస్తున్నా ఉదయంనుండీ, ముందు నువ్వు ఎలా మారావో నాకు చెప్తావా?'

'నేను మారానా?'

'వూ'

'కలగన్నావా?'

సుజీ నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

'నువ్వు గుజరాత్ వెళ్లలేదా అని ఎందుకడిగావో నాకు తెలీదనుకున్నావా?'

ఆశ్చర్యంగా చూశాను.

'నాక్కూడా కవలలు అని ఎంత సహజంగా చెప్పావు, కీర్తి నిజంగా చాలా గ్రేట్‌రా' అంది మనఃస్ఫూర్తిగా

ఔనన్నట్లు తలూపాను.

'నువ్వు ఫరూక్‌ని గుర్తుపట్టలేదు, అందరూ కలిసి వచ్చిన పెద్ద ఫ్యాక్ట్ ఫైండింగ్ టీంలో భాగంగా వచ్చాడు కదా, గుర్తుండకపోవచ్చు. తనే చెప్పాడు కీర్తి, శివశంకర్ అనే ఇద్దరు తెలుగువాళ్లు తమ ఇంటి పక్కల ముస్లింలను కాపాడారు అని. వివరాలు అడిగినప్పుడు అర్థమైంది నువ్వే అని. కీర్తి అంటే నీ పార్ట్‌నర్ అని వూహించాను. ఒక ముస్లిం జంటను ఆ దాడిలో చంపేస్తే వాళ్ల పాపని మీరు పెంచుతామని తీసుకున్నారని కూడా తనే చెప్పాడు. తర్వాత కాంటాక్టు చేద్దామంటే మీరు అక్కడనుండి వెళ్లిపోయారని తెలిసింది'

'సుజీ, ఒకసారి తప్పు చేసి నిన్ను కోల్పోయాను, మళ్లీ తప్పు చేసి కీర్తిని కోల్పోవడానికి నేను సిద్దంగా లేకుంటి. వూహు, నిజం చెప్పాలంటే అది నన్ను కోల్పోవడమే అనీ అనిపించింది. తనకి పెళ్లికి ముందే నీ గురించి అంతా చెప్పాను, వాళ్లని కాపాడ్డానికి నేను వెనకాముందాడుతుంటే తను నిస్వార్థం చేసింది, ఇంకంతే వెనక్కిచూడలే'

'కీర్తిని చూడాలిరా, సగం అందుకే ఒప్పుకున్నా రావడానికి'

'తెలుసా, రఘు సరిగ్గా ఎనిమిది నెలలవాడు. వాడి గురించీ, కీర్తి గురించే నేను భయపడ్డది కూడా. పాపకీ సరిగ్గా అదే వయస్సు. కీర్తి అసలు పాపను వదలలేకపోయింది. అందుకే ఇక అందరికీ, పిల్లలకీ కూడా కవలలు అనే చెప్దామనుకున్నాం, అహ్మదాబాద్‌నుండి ముంబయికి మారిపోయిందీ అందుకే, నీకూ అందుకే.....'

అదేం ఫర్వాలేదు అన్నట్లు చేయి వూపి, 'బాబుకి రఘు మాస్టర్ పేరు పెట్టుకున్నావన్నమాట అయితే అనుకున్నట్లుగానే, పాప పేరు కీర్తి పెట్టిందా అయితే?'

'అహ, తను సుజాత అని నీ పేరే పెడ్దామంది కానీ నేనే వాళ్ల అమ్మావాళ్లు పెట్టింది వుంది కదా అన్నా, ఆయేషానే తన పేరు'

✻

పోతున్నారండీ...." అన్నాడు సూరిబాబు స్వామిగారిని ఉద్దేశిస్తూ.

పెట్రోలింగ్ జీపు శబ్దం వినిపించడంతో

"వారే ఉదియానే రారా, ఏదీ ఒక పట్టాన తెమల్దు" బడ్డీకి తాళం వేస్తూ అన్నారు స్వామిగారు. స్వామిగారు ఇంటికెళ్లిన తర్వాత సూరిబాబు భారంగా రిక్షా తొక్కుతూ ఇంటిదారి పట్టాడు.

అంత ప్రశాంత వాతావరణంలో రిక్షా పైడిళ్ల శబ్దం చిత్రంగా వినిపించి క్రమంగా దూరమయిపోయింది.

* * *

స్వామిగారి జీవితం మొదలవడమే ఇక్కట్లతో మొదలయింది. అటుఇటుగా డెబ్భై ఏళ్లొచ్చినా స్వామిగారి బాధలు తీరలేదు. యువకుడిగా ఉన్నరోజుల్లో బందరు తాటి పరిశ్రమలో పనిచేస్తూ తీరప్రాంతమంతటా తిరిగారు. పరిశ్రమ మూతపడ్డ తర్వాత ఓ ముక్క (భూమి) అమ్మేసి బడ్డీ పెట్టుకున్నారు. స్వామిగారికి వ్యాపార దృష్టి లేకపోవడం మూలాన అదీ అంతంత మాత్రమే నడుస్తుంది. ఒకసారి దొంగలపాలయింది. మరోసారి అగ్నిప్రమాదంలో బడ్డీ, ఇల్లూ బూడిదై పోయాయి. జేబులో కాణీ లేదంటే అడిగిందే తడవు అరువు మీద సరుకులు ఇస్తారు. బడ్డీ పక్కనే అగ్గిపెట్టెంత పెంకుటిల్లుంది. ఆ ముక్కలోనే చదువూ ఆలోచనా అన్నీ. గదిలో ఎర్రరంగేసిన భగత్సింగు ఫోటో ఒకటి వేలాడుతుంటుంది.

పాతరోజులు గుర్తుకు వస్తే స్వామిగారు ఉద్వేగంతోనూ బాధతోనూ మాట్లాడతారు.

"ఎక్కడి గుడివాడా, బందరూ, ఎక్కడి మదరాసూ, బెంగళూరూ బాబు.... అఖిలభారత విద్యార్థి కాంగ్రెస్‌లో తిరిగాం. చాలా చేశాం. ఆ రోజులు వేరుగా ఉండేవి. మాకూ చాలా కలలుండవి. ఇపుడు వాటి ఊసెత్తితే మాకే విసుగ్గా ఉంటుంది. ఆ రోజులు పోయాయి. తర్వాత్తర్వాత కాలం చాలా మారిపోయింది. కమ్యూనిస్టు పార్టి వచ్చింది. అదీ చూశాం. ఈ రోజుల్లో బతకడవే... దురదృష్టంగా బాబూ...." అంటారు.

గత జీవితం తాలూకు వైఫల్యాలేవో ఆయన మాటల్లో ధ్వనించేవి.

* * *

వారం రోజుల క్రితం ఎర్రబడ్డీ సెంటరు పక్కనే ఉన్న దేవరాపేటలో కొత్తగా పడ్డ హరిహరనాథు అల్యూమినియం ఫ్యాక్టరీని ఆనుకొని ఉన్న పూరిగుడిశెల్లో నివసించే వృద్ధస్త్రీ వెంకాయమ్మ పూరింటికి నిప్పంటుకుంది. అర్ధరాత్రి పేట పేటంతా ఉలిక్కిపడింది. మంటల్లో ఆమె శరీరం చాలా వరకు కాలింది. వయసు అటుఇటుగా అరవైదాకా ఉండొచ్చు. ఆ వీధిలోనే సత్యంగారి మిరాయి కొట్టుకి దగ్గర్లో అట్లమ్ముకొని పొట్టపోసుకుంటుంది.

మంటలనార్పి ఆసుపత్రికి తీసుకెళ్లారు ఒకటవ టౌను పోలీసులు.

తెలవారుజామునగా సూరిబాబు ఆదరాబాదరాగా వార్తమోసు కొచ్చాడు స్వామిగారి బడ్డీ దగ్గరికి.

అప్పటికి స్వామిగారు బడ్డీ తెరిచి ఏవో సర్దుతున్నారు. రాత్రి ఆసుపత్రికి వెళ్లిరావడం వల్ల ఆలస్యమై కంటిమీద కునుకులేదు. ఏవో విషయాలు ఆలోచిస్తూ పరధ్యానంగా ఉన్నారు. ఎన్ని ఇబ్బందులూ, చికాకులున్నా సమయాన్ని మాత్ర కచ్చితంగా పాటిస్తారు.

సూరిబాబు వచ్చీరావడంతోనే కూలబడిపోయాడు. ఎంత ఆవేశంగా వచ్చాడో అంత నీరసంగా కూర్చున్నాడు.

"అదెళిపోయింది. ఈ యాదితో దాని రుణం తీరిపోయింది. ఫ్యాక్టరీ వోన్రు సంబరపడిపోతాడుగావును. దొడ్డ సెయ్యిగలోడేనండే ప్రెపంచికం సామిగారు. ఆల్లు ముద్దిని మూతన్నా జెయికొట్టేవోల్లు ఏలమంది జనం ఉంటారండి" అన్నాడు వేటిపైనో ఏవగింపుతో.

ఇద్దరూ కాసేపు అవీఇవీ మాట్లాడుకున్న తర్వాత "ఉదయం పదింటి తర్వాత ఆస్పత్రికెల్దాంరా.... మనకు తోడు ఎవరైనా వస్తారంటావా..." అన్నారు స్వామిగారు సూరిబాబును ఉద్దేశిస్తూ.

"ఎల్దాం లెండీ ఎవరొస్తారండీ.... ఎవరూరారు. రిచ్చా ఉన్నాది మనవే... సేయాల" అన్నాడు. మెల్లిగా రిక్షా లాగుతూ "పది నిమిషాల్లో వొస్తానండీ" అని ఇంటిదారి పట్టాడు.

* * *

ఎర్రబడ్డీ ముందే బ్రహ్మయ్య శెట్టి డాబా. డెబ్భై పైబడ్డ వయసు ఒకప్పుడు చిల్లర కొట్టున్నా వయసు మళ్లడం, కొట్టు సరిగా నడవకపోవటం మూలాన మానేసి వడ్డీ వ్యాపారాన్ని మాత్రమే నిలుపుకున్నాడు. చుట్టు పక్కలుండే మురాకూలీలు, రిక్షా పుల్లర్లకూ అప్పులిస్తుంటాడు. ఆలస్యమైనా పెద్దగా వొత్తిడి చేయడంటారు.

ఎవరైనా ఇవ్వలేని స్థితిలో "బాబుగారూ...." అంటే

"ఫర్లేదు లేరా... వడ్డీ కలిపితే తడిసి మోపెడవుతుంది. నీకే ఇబ్బందిరా" అంటాడు.

స్వామిగారు మాత్రం "అక్కడే ఉందిరా కిటుకూ" అంటారు. బ్రహ్మయ్య శెట్టి డాబాకు అటుఇటుగా కిలోమీటరు దూరంలో, కుమ్మర చెరువు పక్కన పూర్ణచంద్రరావు అల్యూమినియం ఫ్యాక్టరీ పడుతుందన్న పుకారు జోరందుకున్నప్పటి నుంచి శెట్టి కొంచెం కినుకగా ఉన్నాడు. పూర్ణ చంద్రరావు కనిపిస్తే మాత్రం ఆప్యాయంగా పలకరిస్తాడు.

ఫ్యాక్టరీ పడుతుందన్న వార్త వెలువడ్డప్పటి నుంచి పేట పేటంతా కుతకుతా ఉడుకుతున్నది. ఫ్యాక్టరీ పెట్టాలంటే పూరిగుడిశెలను తొలగించాలి. ఆ గుడిశెల్లో ఉండేవాళ్లకే బ్రహ్మయ్య శెట్టి వడ్డీలకిచ్చాడు. వెంకాయమ్మ సైతం శెట్టి దగ్గర కొంత మొత్తం తెచ్చుకుంది.

సూరిబాబు పూర్ణ చంద్రరావుని, శెట్టినీ తిడుతూనో, విమర్శిస్తూనో ఉంటాడు.

"బంగళాలూ, కారులూ ఉన్నోల్లకి బాధపడేవోల్లంటే గౌరవం ఉండదండి. అసలాలకి బాద తెలీకుండానే బతుకలాగా సాగిపోతుంది. అయినా శెట్టిగాడు అలిసిపోయిన ఆబోతండీ.... ఆడీరోజో రేపో మన్లో కలకపోడు. ఫ్యాట్రీ వోన్రేనండి ప్రెమాదుగాడు. ఆడలాగ పరిగెత్తి పరిగెత్తి ఇమానం ఎక్కేస్తాడండి" అంటాడు.

స్వామిగారు, సూరిబాబు, తెలవారుజామనగా వచ్చి ఏ అర్ధరాత్రో వెళ్లిపోయే ముఠాకూలీలు వీటన్నిటిని గమనించడం, వాళ్లకు తోచిన విధంగా మాట్లాడుకోవడం చేస్తుంటారు. వెంకాయమ్మ మరణం వీళ్లను మరింత సందిగ్ధంలో పడేసింది. పెళ్లైందో కాలేదో తెలియని, పిల్లా జెల్లాలేని ముసిలి వెంకాయమ్మ ఎందుకు చనిపోయిందో, ఎట్లా చనిపోయిందో స్వామిగారికి, సూరిబాబుకూ తెలిసినట్టే తెలిసి మళ్ళీ ఏదో విప్పరాని ముడి ఉన్నట్టు తోచేది.

ప్రతిరోజూ చర్చ అక్కడితోనే మొదలై అక్కడే ముగిసేది. వెంకాయమ్మ శవానికి పోస్టుమార్టం పూర్తయిన తర్వాత పేటలో వాళ్లు ఒకరో ఇద్దరో వచ్చారు. చాలా మంది అప్పటికే గుడిశెలు ఖాళీచేసి వెళ్లిపోయారు. స్వామిగారే పూనుకుని, చందాలు పోగుచేసి దహన సంస్కారాలు చేశారు. మరుసటి రోజు సాయంత్రం సూరిబాబును వెంటేసుకుని కాలిపోయిన గుడికి దగ్గరికెళ్లారు. పరిసరాలన్నీ కలియతిరిగారు. చుట్టుపక్కల ఒకటో, రెండో గుడిశెలు మాత్రమే ఉన్నాయి. కనుచూపు మేరా పేటంతా ఖాళీ అయిపోయి పెద్ద మైదానంలా ఉంది. అక్కడక్కడా పూరిగుడిశెల తాలూకు కర్రలు నిలబడి ఉన్నాయి. పైకప్పు గడ్డీ చిందరవందరగా పడి ఉన్నది. పనికిరాని వస్తువులు విసిరివేయబడి ఉన్నాయి. శిధిల ప్రపంచంలా తోచింది స్వామిగారికి. నెలరోజుల క్రితం ఇటుగా వచ్చినపుడు కొన్ని గుడిశెలు ఉన్నాయి. ఆ వీధి వెంబడి ఎప్పుడూ హడావిడిగా తిరిగేవాళ్ళూ ఇపుడు ఎటెళ్లిపోయారో అనుకున్నారు. అక్కడ తిరుగుతున్నంతసేపూ హింసను అనుభవించారు. వేటి నుంచీ సంతృప్తిని పొందక ముళ్లపై నిలబడ్డ వాడిలా అటూఇటూ పచార్లు చేస్తున్నారు.

ఒకరిద్దరి సహాయంతో కాలిపోయిన గుడిశెను తొలగించారు. ఇనప్పెట్టెను పక్కన ఉంచి, ఊడ్చి శుభ్రం చేశారు. అందరి సమక్షంలో పెట్టెను తెరిచారు. కాలి అట్టకట్టుకుపోయి గుర్తించ వీలులేని ఫోటోలు, ఒకటో రెండో కాలిన పది రూపాయల కాగితాలూ కనిపించాయి.

స్వామిగారి మనసు వికలమయింది. ఆ ఫోటోల్లో వారి వివరాలేమిటో, పదిరూపాయల కాగితాలూ, ఆ వస్తువులూ ఏమనుకుని దాచిందో.... ఎడతెగని ఆలోచనలు చుట్టుముట్టాయి. ఏ ఊరో, ఏం బాధో తెలియని, మానసికంగా దూరమయిపోయిన పిచ్చిదీ, బతుకు వెతుకులాటలో ఏవి కారణాలతోనో వచ్చి ఇట్లా చచ్చిపోయి భౌతికంగా ఈ ప్రపంచంతో సంబంధం తెగిపోయిన వెంకాయమ్మా...

ఇన్ని ఆలోచనల్లో.... స్వామిగారు కాసేపటికి తేరుకుని ఇనప్పెట్టెను మాత్రం గుడిశె ఉన్న స్థలంలో ఉంచి దీపాల వేళనగా ఇంటిదారి పట్టారు. కొద్దిదూరం వచ్చిన తర్వాత సూరిబాబు వెనక్కి తిరిగి పెట్టెవైపూ, స్వామిగారి వైపు అనేకసార్లు చూసి ఏవో ఆలోచనల్తో వెళ్లిపోయారు.

ఇంటికొచ్చి కాళ్ళూ మొహం కడుక్కొని బడ్డీలో కూలబడ్డాడు స్వామిగారు. ఉదయం నుంచి మంచినీళ్ళు తప్ప ఏమీ ముట్టుకోలేదు. కాస్త చీకటిపడ్డ తర్వాత కాఫీ తాగారు. రాత్రి పది దాటినా సూరిబాబు అయిపు లేదు. ఏ పదకొండింటి తర్వాతో బడ్డీ కట్టెయ్యడానికి స్థిరమౌతుంటే పిచ్చిదాని అరుపులు వినిపించాయి.

పరిగెత్తుతూ, వేగంగా అడుగులు వేస్తూ

నాను పరదేసిని, నాను పరదేసిని అంటూ వెళ్లిపోయింది. యాష్టగా బడ్డీ కట్టేసి ఇంటికెళ్లారు.

నిదుర వస్తున్నది కాని. కళ్లు మూసుకుంటే మండుతున్నట్లనిపించింది. ఎప్పుడూ బడ్డీకి వచ్చే వెంకాయమ్మ. ఆమె పద్ధతిగల జీవితం పదే పదే గుర్తుకురావడం స్వామిగారిని ఇబ్బంది పెడుతున్నది.

ప్రతి ఉదయం ఠంచనుగా, రోజూ ఒకే సమయానికి రావడం, కావలసిన కూరగాయలూ, సరుకులూ కొనడం, ఆ సాయంకాలానికి డబ్బు ముట్టజెప్పడం ఎక్కడా సమయం తప్పదు. ఆమె ఎప్పుడైనా, ఎవరితోనైనా గొడవ పడటంకానీ, ఆత్మీయంగా మెలగటం కాని ఎవరూ చూడలేదు, వినలేదు.

వీధి చివరన ఇడ్లీలమ్మే పదోపదకొండో అవగా బల్లను పక్కకు తోసి ఇంటికెళ్లిపోవడం, పూరిగుడిశెలో అస్తమానమూ ఏదో పనిచేసుకుంటూ ఉండటం ఆమె దినచర్య. వ్యాపారం ఎట్లా సాగేదో సైతం ఊహించవలసిందే. అడపాదడపా పిచ్చామె చేయిచాపితే ఇడ్లీలు పెట్టేది.

సూరిబాబు ఎంత సముదాయించినా పిచ్చామె, వెంకాయమ్మల గురించిన ఆలోచనలు వదలడం లేదు స్వామిగారిని.

స్వామిగారు చాలాసార్లు వెంకాయమ్మది ఏ ఊరో అడగాలనీ, తెలుసుకోవాలనీ, ఇక్కడికెందుకొచ్చిందో ఆమె చెబితే వినాలనీ ఉండేది. ఈ ఆలోచనే ఎట్లా తన్నుకు వచ్చేదో అంతే వేగంగా వెనక్కిపోయేది. ఏడాది క్రితం ఒకసారి మాత్రం కొంచెం బెరుకుతో "ఏ ఊరమ్మా మీది" అన్నాడు. సరుకులు చేతిలోకి తీసుకుంటూ ఏ జవాబూ చెప్పకుండా ఒకలాగా చూస్తూ వెళ్లిపోయింది.

సాయంత్రం సరుకులకు వచ్చినపుడు "నేనెందుకు ఈ ఊరొచ్చానో చెబితే నేనీ ఊళ్లో మరిక ఉండలేను. అక్కడేమైందో చెబితే నేనీ లోకంలో బతకలేను" అని వెళ్లిపోయింది.

అడగకపోయినా బావుండనుకున్నారు.

ఆ మాటల్లో ఏదో హింస ఉందని తోచింది స్వామిగారికి. పదే పదే ఆ మాటలే బాధిస్తున్నాయి.

ఆ సంఘటన తర్వాత ఇంకెపుడూ అడిగే ప్రయత్నం చేయలేదు.

ఎవరూ అడగకపోయినా తన గురించి వాగుతూ తిరిగే పిచ్చామె. అడిగినా చెప్పకుండా మౌనందాల్చే వెంకాయమ్మ.... ఇద్దరూ స్వామిగారిని సందిగ్ధావస్థలోకి నెట్టినట్టపించేది.

ఇట్లా ఏవేవో పాత జ్ఞాపకాల దుఃఖంలోకెళ్లిపోయిన స్వామిగారు సత్యంగారి మిఠాయికొట్టు దగ్గర అల్లరేదో వినిపిస్తే తలుపు తెరిచి రోడ్డువైపు చూశారు. కరెంటు పోయి బాగా చీకటిగా ఉంది. ఏమీ కనిపించలేదు. అల్లరిమాత్రం వినిపిస్తుంది. అగ్గిపుల్లగీసి టైం చూస్తే ఒంటిగంట దాటింది.

ఇంట్లోకి వస్తూ తూర్పున ముబారక్ సెంటరు వైపు చూశారు. ప్రతీరోజు రాత్రి పిచ్చామె అటుపోతుంది. ఇటు పడమరన సత్యంగారి మిఠాయి కొట్టు దగ్గర వెంకాయమ్మ అట్లమ్ముకునేది.

ఇట్లా ఏవేవో ఆలోచనలు పోతూ మంచంపై నడుం వాల్చారు.

* * *

రాత్రంతా నిదురపట్టక పెందాలకడే లేచి మొహంపై నీళ్ళు పోసుకుని బడ్డీలో కూర్చున్నారు. కూర్చున్నారన్న మాటేగానీ మనసు స్వాధీనంలో లేదు. రోజు రోజుకూ ఖాళీ అయిపోతున్న దేవరాపేట. తెలిసిన వాళ్ళూ దారీతెన్నూ లేకుండా వెళ్లిపోతున్న వాళ్లందరి చుట్టూ, పేటలో తిరిగే పిచ్చిదాని చుట్టూ తిరుగుతున్నది మనసు.

సూరిబాబు కనపడితే తప్ప మనసు స్థిమితపడదు. రోడ్డువైపే చూస్తున్నారు స్వామిగారు. చూస్తున్నారు గాని కంటికెవరూ కనిపించడం లేదు, కనిపించినా గుర్తించని స్థితి.

వెలుతురు పరుచుకుని ఎండపొలుపు రోడ్డుపై, ఇళ్లపై పడుతున్నది. పాలవాళ్ల, కొబ్బరిబోండాల వాళ్ల సైకిళ్ల హడావిడిగా తిరుగుతున్నాయి.

రిక్షా తోసుకుంటూ వచ్చి బడ్డీ ముందు నిలబడి

"ఓ సుట్టివ్వండీ...." అన్నాడు సూరిబాబు. చుట్టముట్టించుకుని "నిన్నాబేరం లేదు, మొన్నా అంతంత మాత్రమేనండి. గిట్టుబాటవుతుందేమో సూస్తానండి లేకపోతే ఈ రేతిరి పస్తేనండీ...."

అంటూ రిక్షా లాగుతూ ముందుకు కదిలాడు.

కొద్ది దూరం వెళ్లాడో లేదో రిక్షా నిలిపి చక్రం కింద రాయిపెట్టి బడ్డీ దగ్గరకొచ్చి "సామిగారూ... మాపటేల వొస్తానండి. మాట్లాడదాం లెండి. పిచ్చిది ముబారక్ సెంటరులో స్పృహ లేకుండా పడున్నాది. ఇందాకటే ఇంటి నుండొస్తూ సూశానండి" అని నెమ్మరూ సెంటరువైపు వెళ్లిపోయాడు.

స్వామిగారి ఆలోచనలు వెంకాయమ్మ మీది నుంచి మతిస్థిమితం లేని స్త్రీ వైపు మళ్లాయి. ఆ స్థితి తలచుకుంటేనే స్వామిగారికి ఉక్కుగా అనిపించింది.

ఎప్పుడూ బూతులు తిడుతూ, అర్థంలేని పాటలేవో పాడుతూ సీకాకోలం, సీకాకోలం అని పరిగెత్తుకెళ్లడంలో ఆంతర్యమేమిటో అంతుబట్టదు. వచ్చి రెండేళ్లైయినా ఇప్పటికీ ఒకే మాటంటుంది. ఇరవై నాలుగ్గంటలూ అదేమాట వల్లెవేస్తుంది.

"నేనేటి సెయ్యాల సెప్పండి. దయగల బాబుగోరు మీరే సెప్పాల. నాది సిక్కోలన్నానా. నాది సిక్కోలయితే ఈ ఊరెందుకొచ్చినానో సెప్పాలంతాను. నాకేటీ తెల్దుబాబు. ఈ ఊరిపేరోటో పరాయిదాన్ని నాకేటి తెలుస్తాది సెప్పండి. వోటి మాత్తరం నిజం బాబుగోరు ఈ ఊరి పేరేటో తెలాలంటే నాను మా సిక్కోలు ఎందుకొదిల్నానో తెలాల. ఇయాల ఈ ఊల్లో ఎందుకు తొంగున్నానో తేలాలంటే మా సిక్కోలు రాత్తిరిలో.... ఆ వూట దీవంబుడ్డి మినుకుమినుకుమంటున్నపుడు ఏటి జరిగిందో తెలాల. ఆ రోజు మద్దిరాత్తిరి సుక్కల్ని ఏ సీకటి మింగేసిందో దర్మ ప్రెబువులు మీరే సెప్పాల. ఈ రోజేటి జరిగిందో తేల్తె రేపెలా ఉదియమైతాదో తేలిపోతాది" ఈ మాటే ఎప్పుడూ అంటుంది. స్వామిగారికి ఈ మాట విన్నపుడంతా కొత్తగా అనిపిస్తుంది. రెండేళ్ల క్రితం పిచ్చామె టౌనుకు వచ్చింది. ఎప్పుడూ బస్టాండ్‌లో ఉండేది. కొన్నాళ్లకు గర్భం దాల్చింది. పిచ్చిదాన్ని సైతం వదిలిపెట్టలేదుకదా అని అందరూ తిట్టుకున్నారు. నొప్పులు పట్టి పొర్లి పొర్లి ఏడుస్తుంటే ఎవరో స్వామిగారి చెవిన వేశారు. సూరిబాబును వెంటేసుకు వెళ్లి రిక్షాలో ఆసుపత్రికి చేర్చారు. డాక్టరును ప్రాధాయపడి డెలివరీ చేయించారు. ఆ తర్వాత మళ్లీ అంతే.

పిల్లాణ్ణి వెంటేసుకు వీధుల వెంట తిరగటం. ఆమె కనిపించినపుడల్లా స్వామిగారు బాధపడి పోతారు. ఆసుపత్రిలో ఆ రోజు ఆమె పడ్డ యాతన గుర్తు తెచ్చుకుని మనసు కష్టపెట్టుకుంటారు. అప్పుడప్పుడూ బడ్డీ దగ్గరకొచ్చి పిల్లాణ్ణి చూపి చేయిచాపుతుంది. ఏదైనా ఇస్తే తీసుకొని వెళుతూ "సిక్కోలు, సీకాకొలం' అంటుంది.

సూరిబాబు మాత్రం "సామిగారూ... ఇది ఇలాగా లోకంతో బంధం

☆ ఆర్. శశికళ



# మా కిట్టూ యమ స్ట్రిక్టు!

అక్క చున్నీ వంటికి చుట్టుకొని కిట్టూ డాన్స్ మొదలు పెట్టాడు. 'ఆరేసుకోబోయి పారేసుకున్నాను, హరీ హరీ, కోకెత్తుకెళ్లింది కొంటెగాలి' చిన్నా రిథమిక్‌గా పాడుతున్నాడు. 'వన్స్‌మోర్' చప్పట్లు చరుస్తూ నేనూ అరుస్తున్నాను.

క్యారియర్స్, బ్యాగులు, అన్నీ గుట్టగా పడేశాము. ఆ రోజు 'సూర్యగ్రహణం' ఎందుకో త్వరగా వదిలేశారు స్కూలు. కిట్టూ డాన్స్ ఆపి, 'అక్కా, ఇంట్లో ఏం దాచుకోకుండా పడేయాలంట కదా! నీళ్లు అన్నీ పడేద్దామా' అడిగాడు.

'పొద్దునేరా అన్నింటికి పట్టి పెట్టింది అమ్మ, మళ్ళీ నాల్రోజులు రావంట చిన్నా... ఆ ఒక ఐడియా, మా తెలుగు టీచర్ చెప్పుంటే తెల్సింది. అదేందో దర్భ ఇంటిబయట వ్రేలాడగటితే ఇంకేం కాదంట గదా అమ్మ వచ్చాక ఆ పని చేద్దాం' అన్నాను. అమ్మ రాగానే కిట్టూగాని డిమాండులు మొదలయ్యాయి. బజ్జీలు కావాలని కాసేపు. పాయసం చేయమని కాసేపు, గునుస్తూ అమ్మ వెంట తిరుగుతున్నాడు.

'రేయ్ అవన్నీ సర్దుకోండిరా అలాపడేశారు' అన్నాను నేను. 'పోవే' అని పురుగును చూసినట్లు చూశారు నన్ను.... 'నువ్వంటే, నువ్వు' అంటూ కిచకిచలు మొదలయ్యాయి... కిట్టూగాని స్కూల్ బెల్టు సగం బయటికి తీశాడు. అదొకపక్క వేలాడుతోంది... సాక్సు తీసి చిన్నా ముక్కు దగ్గర పెడ్తున్నాడు. సెంటు వాసన.... ఆహా! ఓహో! తాజా సెంటు వాసన చిన్నాగాడు పరిగెడుతున్నాడు. వీడిబారిన పడకుండా నేను జాగ్రత్త పడ్డాను. ఇంతలో మోపెడ్ ఆగిన శబ్దం కావటంతో ఎక్కడి వాళ్ళక్కడ గప్‌చిప్!

'టైగర్.... టైగర్....' వుష్... మా చిన్నాగాడు. ఇల్లంతా నిశ్శబ్దం.... జోక్స్, ఫైట్స్, బ్రేక్స్ అన్నీ బంద్, ఎక్కడి దొంగలు అక్కడే....

'అమ్మ ఏదిరా?' చెప్పులు వదిలి పెడ్తూ అడిగాడు నాన్న... నాన్న చేతిలోంచి క్యారియర్ బ్యాగు తీసుకొని లోపల పెడ్తూ, 'కిట్టూగాడు బజ్జీలు కావాలన్నాడు, ఇంట్లో శెనిగపిండి అయిపోయింది. అందుకని షాపుకెళ్లింది నాన్నా' నేను చెప్పాను. ఇటు తిరిగి చూద్దును గదా! సాక్స్, షూష్ టైలు ఇల్లంతా విసిరేసి ఇంతవరకూ తగాదా పడ్తున్న కిట్టూ, చిన్నాగాళ్ళు ఇద్దరూ బయట వరండాలో పుస్తకాల బ్యాగులు ముందేసుకుని కూర్చొని ఉన్నారు.. ఎక్కడివి, అక్కడే సర్దేశారు క్షణాల్లో... 'ఏమండీ! ఎంత సేపయింది వచ్చి' అంటూ వంటింట్లోకి నడిచింది అమ్మ 'ముందు కొంచెం కాఫీ తగలబెట్టు' అన్నాడు నాన్న చిరాగ్గా. 'వర్షం వస్తోంది.... కాసేపాగండి, బజ్జీలు వేసిస్తాను. నాలుగు తిని తర్వాత తాగొచ్చుగా' అంది అమ్మ. 'అవేవో మీరే తిని తగలబడండి, ముందు కాఫీ నీళ్ళు నా మొహాన గొట్టు..., నాన్న, అమ్మ కాఫీ కలుపుతోంది, ఉల్లిపాయలు, పచ్చిమిర్చి కట్ చేసే పనిలో లీనమయ్యాను. 'ఆ డొక్కు దూరదర్శన్‌లో ఏమీరావు కానీ మీ నాన్నకు మాత్రమే అది పనిచేస్తుంది. ఆహా - ఎంత హాయిగా వార్తలు వింటున్నాడు మహానుభావుడు' అమ్మ గొణుగుతూ ఉంది....

నేనూ హోంవర్కు చేయాలి కానీ ఈ కిట్టూగాని ప్రాజెక్టు వర్కు అయితే గాని నాకు మోక్షం లేదు.... వాడి డిమాండ్లు తప్పక తీరాల్సిందే. లేదంటే ఆ సైరన్ ఆపేశక్తి మా టైగర్ బెల్ట్‌కు కూడా లేదు. రాత్రి 7 గంటలవుతోంది.

'గీతను పిలుచుకొని వస్తా, గేటు వేసుకోండి' చెప్పులు వేసుకొంటూ కేక పెట్టాడు నాన్న. మోపెడ్ స్టార్ట్ చేశాడు - చిన్నాగాడు గేటు వేసి వచ్చాడు.

గీతక్కను ఇంటర్ ఫస్టియర్ చైతన్య కాలేజీలో చేర్పించారు. అక్కను వదిలి పెట్టి మళ్లీ పిలుచుకొచ్చే డ్యూటీ నాన్నదే... సైకిల్ కొనిస్తే తనే వెళ్తానంటుంది గీతక్క. కానీ అమ్మ నాన్నలకు అక్కను అలా పంపాలంటే చాలా భయం....

టెన్త్‌లో అక్కకు 526 మార్కులు వచ్చాయి. ఫీజులో కొంత రాయితీ ఇచ్చారంట.... మేము 550 పైగా మార్కులు తెచ్చుకొంటే ఫ్రీగా చదువు చెప్తారంట. ఆ ఇంట్లో పుస్తకాలు ముట్టకోకుండా ఎవరైనా అల్లర చిల్లరగా కన్పడ్డామా, నాన్న టైగర్‌గా మారి ఓ పదిరోజులు మరచిపోలేని విధంగా క్లాసు తీసుకొంటారు. చిన్నా 8వ తరగతి, నేను తొమ్మిది, కిట్టూ 6వ తరగతి.... కృష్ణమోహన్ అదే కిట్టూగాడికి నంచుకోవటానికి ఉంటేనే అన్నం తింటాడు. నోట్లోకి ముద్ద సులభంగా వెళ్లిపోతుంది. లేదంటే అలుగుతాడు. పిల్లరాక్షసి అని వాని బిరుదు.

'సుమా'... అమ్మ పిలవటంతో పుస్తకాలు వదిలేసి లేచాను. సర్దిపెట్టిన బజ్జీల ప్లేట్లు అందరికీ అందించాను. గీతక్క వస్తూనే ఏవో రాసుకొంటుంది. 'అక్కా నీ ప్లేటు...' 'వూ' అక్కడ పెట్టు అంది. నేను ఇవతలికి వచ్చేశాను. చిన్న

---

తెగిపోయి పిచ్చిలాగా తిరుగుతుంటాది.

మట్టిలో కల్సిపోయి ముసిల్దెళిపోయింది. అదిగో ఆ యీధి చివర్న బల్లుందండీ.... ఈ పిచ్చిదీ అలాగే ఉంటాది. ఈ పిచ్చిదాన్లాగే ఆ ముసిల్ది కూడానూ" అంటాడు.

స్వామిగారికి పిచ్చిదాని మాటల్లాగే సూరిబాబు మాటలూ అంతుబట్టవు. సూరిబాబు మాటలకు కొన్నిసార్లు జవాబుగా ఊ.... కొట్టినా చాలాసార్లు మిన్నకుండి పోతారు.

✻✻✻

పదిగంటల వేళ సూరిబాబు ఆయాసంగా రిక్షాలాగుతూ బడ్డీ దగ్గరకొచ్చి రొప్పుతూ తుండు పరిచి కూలబడ్డాడు.

"ఏంట్రా టిఫినీ అయ్యిందా?" స్వామిగారన్నారు.

"తిన్నానండి. కోతిబొమ్మ దెగ్గిర బేరం కుదిరిందండి. బైపాసు నాగన్న చెరువు దెగ్గిర దించేసి చివకాలవ పాట్లోడి హోటల్లో పరోటా తిన్నానండి. అలాగే ఇంటికెల్లి రెండు చెంబులు పోసుకొచ్చానండి" సానునయంగా అన్నాడు.

సూరిబాబు ముదినేపల్లి రోడ్డు పక్కన శ్రీకాళహస్తి కాలనీ పూరి గుడిసెల్లో ఉంటాడు. కాలనీలో కరెంట్ సౌకర్యం లేకపోవటం వల్ల పొద్దస్తమానం రిక్షాపైనో, స్వామివారి బడ్డీ దగ్గరో ఉంటాడు.

"ఏంటండీ ఏమైనా తెలిసిందా.... నే చెబుతున్నానుకొండి ముసిల్దాని సావుక్కారణం ఇదనీ సెప్పలేం, ఇది కాదనీ సెప్పలేం. వొకడు కాలికింద నేల్లాగితే ఇంకోడు నెత్తిమీద బట్టలాగుతాడు ఏంటోనండి ఏవీ.... సెప్పలేం...."

సూరిబాబు మాటలు విని స్వామిగారు మౌనం దాల్చారు. కష్టమనిపించి నపుడల్లా మాటల్లేని మౌనం దాలుస్తారు. స్వామిగారికి ఎవరేం చెప్పినా ఆయన ఆలోచనలు ఆయనవి.

సూరిబాబు చిన్నగా లేస్తూ

"వొస్తానండి సామిగారూ.... ఏంటోనండి రుణం రణంతో తీరు తాదంటారు. ఆ ముసిల్ది సచ్చిపోయిందని ఎవరైనా పట్టించుకున్నారా? యీ యీధీ అట్లాగే ఉంది ఏళ్ల తరబడి. ఈ బండా, ఆ బడ్డీ పీనుగల గడ్డా అట్లాగే ఉంటాయి. ఆ పిచ్చిదీ అలాగే తిరుగుతుంటాది. ముసిల్దానిలాగే మనమూ. పిచ్చిదీ.... అందరు ఎలిపోతాం. ఈ కన్నీరెందుకండీ ఆగదూ...."

అని తుండు దులిపి భుజానేసుకుని రిక్షావైపు అడుగులు వేశాడు.

సూరిబాబు మాటల గురించి ఆలోచిస్తూ అర్ధరాత్రి దాకా బడ్డీలోనే ఉండిపోయారు స్వామిగారు.

ముఠా కూలీలు చుట్ట ముక్కలు కొని వెళ్లిపోయిన చాలాసేపటికి బడ్డీ కట్టేసి ఇంటికెళ్లిపోయారు.

ఏ అర్ధరాత్రో దాటిన తర్వాత పిచ్చిది వెళ్లిపోయిన అరుపులు వినిపించాయి.

✻

గది గీతక్క ఆక్రమించింది. వరండాలో మా చదువు, మధ్యగతిలో నాన్న.... వంటిల్లు అమ్మ గది. ప్రయివేటు స్కూల్‌లో టీచర్‌గా పనిచేస్తోంది అమ్మ.

జె బ్యాచ్‌లోనే ఉండాలని అక్క ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటుంది. లేదంటే అవమానం. ఫ్రెండ్స్ అందరూ అలాగే అనుకుంటూ ఉంటారు. మార్కులు తగ్గితే వాళ్ల లెక్చరర్లు బాగా తిడ్తారంట... అక్కతో మేం ఆడుకోలేదు. రెండేళ్లుగా చదువే చదువు. నేనూ టెన్త్‌లోకి వెళ్లే నా పరిస్థితి అంతే - అమ్మో! - అక్క టెన్త్ క్లాస్‌లోకి వచ్చాక, నాన్న డిష్ కనెక్షన్ తీసేయించాడు. చదువులు చెడిపోతాయంట - నీటిపారుదల శాఖలో గుమాస్తాగా పనిచేస్తున్న నాన్న చదువు డిగ్రీలోనే ఆగిపోయిందంట. మేం బాగా చదువుకోవాలని చెప్తుంటాడు. బజ్జీలు తింటూ కిట్టూగాడు ఆ రోజు వాడి క్లాసులో జరిగిన విశేషాలు లేవనెత్తాడు.

'డాడి'.. 'డాడి'

'వూ.... ఏందిరా చెప్పు', 'నాన్న మా ఇంగ్లీష్ టీచర్ సుమతి మిస్ లేదూ.... మరి, మరేమో' అంటూ ఆగాడు. 'కాదురా మిసెస్ అంట. పెళ్ళి అయిన వాళ్ళను మిస్ అనరాదు' చిన్నాగాడు. 'సుమతి మేడమ్ కొడుకు రాహుల్‌గాడు పొద్దున మా క్లాస్‌లోకి వచ్చాడు. వాడు యు.కె.జి. వాళ్ళ మమ్మీ మా క్లాస్‌లోనే ఉండిపోయింది. ఇంటర్వెల్‌లో పుస్తకాలు దిద్దుతూ ఉంటే క్లాస్‌లోకి దూరి అందరి బ్యాగులు లాగేస్తూ, క్లాస్ అంతా అల్లరి చేస్తున్నాడు. అందరిని తిడ్తున్నాడు. అవినాష్‌ను కాల్తో ఎగిచ్చి తన్నినాడు. వాడు కడుపు పట్టుకొని చాలాసేపు ఏడ్చాడు. వాళ్ల మమ్మీకి చెప్తే, వాడు చిన్న పిల్లవాడు ఏమనవద్దనీ నవ్వుతోంది డాడీ - వాడు ఒకటే బండ బూతులు తిడ్తున్నాడు. పట్టుకొందామంటే పారిపోయాడు.... కిట్టూగాడు మాత్రమే నాన్నను డాడీ అంటాడు. మేమంతా నాన్ననే పిలుస్తాం. అంతా విన్నాక 'మీ టీచర్ ఏమీ దండించ లేదా?' అడిగాడు నాన్న - 'లేదు డాడీ అవినాష్‌నే తిట్టింది. వాడు రాహుల్‌ను గిచ్చినాడంట, వాడి బాక్స్ చెక్ చేస్తాంటే ఏం చేస్తాడు డాడీ - ఎప్పుడు క్లాసులోకి వచ్చినా అందరికీ కాలు చూపిస్తాడు డాడీ వాడు' 'సరే, నువ్వేం పట్టించుకోవద్దు, నీజోలికి వస్తే మేడంతోనే చెప్పు' అన్నాడు డాడి.. 'కానీ వేస్ట్ డాడీ, ఆయమ్మ, మళ్ళీ మమ్మల్నీ అరుస్తుంది' అన్నాడు కోపంగా, అమ్మ పాత్రలు కడుగుతోంది. 'అమ్మా! ఈ రోజు సూర్యగ్రహణం కదా! ఇంట్లో ఏం ఉంచుకోరాదంట, నేను, చిన్నాగాడు నీళ్ళు పడేద్దామనుకొన్నాం' నేను.

'అవన్నీ నమ్మద్దు, రక్షించారు, లేకపోతే ఈ నీళ్ళే నాలుగురోజులు సర్దుకోవాలి. నీళ్ళు లేకుండా ఏ పనీ చేయలేం కదా!' అమ్మ.

''అది సరే, కిట్టూ క్లాసులో ఒకడు ఏడ్చాడంట, దయ్యాల తిరుగుతున్నాయి, నేను ఇంటికి పోతా అని, దయ్యాలున్నాయామ్మా?' నేను.

'మనుషుల్లో ఎవరు చెడ్డవాళ్లో వాళ్ళే దయ్యాలు' - అంది అమ్మ - అట్లయితే 'టి.విల్లో, సినిమాల్లో, దయ్యాల సినిమాలు, నేరాల - ఘోరాలు చూపించే వాళ్ళే నిజమైన దయ్యాలన్నమాట' - మనసులోనే అనుకుంటా - అమ్మతో అన్నాను - 'ఈ పాత్రలన్నీ ఎత్తి పెట్టినా సర్దు త్వరగా, నాకూ అలసటగా ఉంది - నిద్ర వస్తోంది' అంది ఆవలిస్తూ అమ్మ - 'అయినా నీ సందేహాలన్నీ రేపు మీ సైన్స్ టీచర్‌ను అడుగు, నా చదువు అంతమాత్రమే - నేనేంచెప్పేది?'

'అమ్మో ఆవిడనా? సందేహాలు అడగటమా? తిట్టి తిట్టి పెడ్తుంది. ఎవరైనా మళ్ళీ చెప్పమని అడిగితే. ఇంక డౌట్స్ కూడా అడగడమా?' అనుకున్నాను మనసులోనే, కానీ అమ్మతో చెప్పలేదు... రాత్రి 9 గంటలకు అంతా భోజనాలు ముగించాము. గీతక్క రాత్రి 12 వరకూ చదువుతుంది... మళ్ళీ నాలుగు గంటలకే లేస్తుంది.. చిన్నాగాడు అప్పుడే ముసుగు పెట్టేశాడు. - ఇంక మిగిలింది కిట్టు. నేను అమ్మ, నేను కడిగిన పాత్రలు సర్దుకున్నాము. ప్రొద్దున్నే టైంచాలదని రాత్రే కూరలు తరిగి పెట్టుంది అమ్మ.... 'సుమక్కా, రా అక్కా - నువ్వింకా ఇప్పుడే పడుకోవా' అంటూ నా వెంట పడ్డాడు కిట్టూ... 'ఏందిరా నస. పో, పోయి పడుకోపో అక్క వస్తుందిలే' కసిరింది అమ్మ.... 'రేపు సండే గదా! తర్వాత చేసుకోవచ్చులే రా అమ్మా....' 'వూ సండే కూడా నా బతుక్కు.. ఈచాకిరేవు మీ నాయన చేస్తాడా' అమ్మా. నేను బయటికి వచ్చి 'పదరా పడుకొందాం పా' అన్నాను...

'కిట్టు - పండుకోరా, నాకు నిద్రవస్తోంది' అన్నాను ఆవలిస్తూ - 'సుమా....రా. నీకొక సీక్రెట్ చెప్తాను - ఎవ్వరితో చెప్పొద్దు'. 'ఏందిరా అది' అన్నాను గుసగుసగా.... 'ఆ రాహుల్‌గాడు ఈ రోజు మాక్లాస్‌లో బ్యాగు పెట్టి బయటికి పరిగెత్తి పోయాడు, లంచ్ బ్రేక్‌లో వాడి బ్యాగు కోసేశాను, ఇదిగో వాడి నోట్‌బుక్స్ రెండు ఎత్తేశాను స్కెచ్ పెన్ కూడా తెచ్చి గీతక్క షెల్ఫ్‌లో కింద పెట్టాను...'

'ఎంత పంచేసినావురా, అమ్మో... నాన్నకు తెలిస్తే తోలు వలిచేస్తాడు' అన్నాను భయంతో. 'వాడు చిన్న పిల్లాడు కదా! అలా ఏడిపించవచ్చా తప్పుకదా!' అన్నాను మళ్ళీ.....

'ఏమో! అవన్నీ నాకేం తెలియదు. వాడు చేసేవన్నీ తప్పులు కావా? మా అవినాష్ ఎంతగా ఏడ్చినాడు - ఇప్పుడు వాడి మమ్మీనే వాన్ని తంతుంది. హి.... హి....' అని ఇకిలించాడు కిట్టూగాడు..... వాడేమో విజయ గర్వంతో నిద్రపోయాడు... నాకేమో నిద్రపట్టలేదు. ఏం నెత్తిమీదికి తెస్తాడో ఏమో!

***

అమ్మ నడిగి పక్కింట్లో టీ.వీ చూడటం మాకలవాటే... రాత్రి తొమ్మిది అవుతోంది. నాన్న బయటికి వెళ్ళి ఇంకా రాలేదు..... గీతక్క చదువుకుంటాంది... చిన్నాగాడు గిల్లాడు అక్క - 'వూ సరే వెళ్ళండి' అనటంతో అందరం పక్కింట్లో చేరాము... ఆంటీ సీరియల్ చూస్తోంది. అంకుల్ వచ్చి రిమోట్ తిప్పాడు.... 'నేరాలు - ఘోరాలు - ఛీ-ఛీ ఎప్పుడు వచ్చినా ఈ ప్రోగ్రాం చూడాల్సి వస్తోంది...' 'నల్గురు కూర్చుని.... సిగిరెట్లు వూదుకుంటూ మందుతాగుతూ తూల్తున్నారు. ఒకర్నొకరు తిట్టుకుంటున్నారు.....' 'సుమక్కా - చూడు.... చూడు - అంకుల్ కళ్ళప్పగిచ్చి చూస్తున్నాడు' అన్నాడు గుస గుసగా చిన్నాగాడు నా చెవిలో 'వుష్..' అన్నాను నేను. కిట్టూగాడు నోరు తెరుచుకొని చూస్తున్నాడు...' వాళ్ళు కాసేపటికి లేచారు - గీతక్క అంత అమ్మాయిని తరుముతూ వెంటబడ్డారు - ఆ అమ్మాయి భయంతో పరిగెడుతుంది.... ఇంక నేను. కిట్టూగాన్ని లేపి, 'ఒరేయ్ నాన్న వచ్చింటాడు, పద పద ఇంటికెళ్దాం' చిన్నగాడు అయిష్టంగానే లేచాడు... పక్కింటి అంకుల్‌ను చాలాసార్లు 'జీటెక్స్' పెట్టమని అడిగి, అడిగి విఫలమయ్యాడు కిట్టూగాడు..... అందరం ఇంటికొచ్చాం.... అమ్మ, నాన్న ఇంకా ఇంటికి రాలేదు.... 'ఛీ ఛీ అప్పుడే పిచ్చికొచ్చావు. నీకు బలే తొందర... చూడు ఇంకా అమ్మావాళ్ళు రాలేదు'. అన్నాడు కోపంగా చిన్నాగాడు... ఇంతలోనే గేటు శబ్దం... భోజనాలు అయ్యాయి.....

కిట్టూ కదుల్తున్నాడు. నిద్రపోలేదన్నమాట.

సుమక్కా! ఈ రోజు క్లాసులో అంకిత్ ఏడ్చాడు భయంతో. 'ఏం ఎందుకు?' నేను.

'మరేమో ఈ రోజు సూర్యగ్రహణం కదా రెండు దయ్యాల తిరుగుతూ ఉంటాయంట కదా! ఇంటికి పోతా అని ఒకటే ఏడ్పు...' అన్నాడు...

'వాడి సంగతి సరేగాని మీ ఇంగ్లీష్ టీచర్ నన్ను పిలిపించింది... మీ తమ్ముడు కృష్ణమోహన్ మా బాబు బ్యాగ్ కోసేశాడు. మొన్ననే కొత్త బ్యాగు కొన్నాను. అపర్ణ చూసింది కాబట్టి సరిపోయింది. లేకపోతే మా రాహుల్‌ను బాగా కొట్టేదాన్ని, మీ పేరెంట్స్‌ను కలవమని చెప్పు, అంటూ కోపంగా వెళ్లిపోయింది రా మీ మేడమ్' - అన్నాను నెమ్మదిగా,

'అక్కా! ప్లీజు డాడీతో చెప్పొద్దు, ప్లీజ్ - అంటూ బతిమాలుతూ, మళ్ళీ ఏదో గుర్తొచ్చిన వాడిలా అన్నాడు. 'ఆ అపర్ణ జడలు పట్టి ఏడిపిస్తూ దంటాడక్కా రాహుల్ గాడు అది ఎన్నోసార్లు ఏడ్చింది... కానీ నా పైనే చెప్తుందా! రేపు చెప్తా ఆ పిల్ల పని' అంటూ కోపంతో వూడిపోయాడు కిట్టూ...

మళ్ళీ టాపిక్ మార్చి. 'అక్కా! ప్లీజ్ అక్కా! మళ్ళీ చేయనులే. నాన్నతో చెప్పొద్దు' అంటూ బతిమాలాడు. 'సరేలేరా చూద్దాం' అంటూ ఆవలించాను - వాడు అటు తిరిగి పడుకొన్నాడు...

ఆ మరుసటిరోజు స్కూల్లో నాన్నను చూసి ఆశ్చర్యపోయాను. అమ్మో! కిట్టూవాళ్ళ ఇంగ్లీష్ టీచర్ పిలిచి ఉంటుంది అనుకుంటూ భయంతో వణికి పోయాను. నాన్న ప్రిన్స్‌పాల్ గదిలో ఏదో మాట్లాడుతూ ఉన్నాడు. బయట ఒక్క క్షణం అటూ, ఇటూ తిరిగాను. తెలుగు టీచర్ శ్యామల అక్కడికి రావటంలో తిరిగి క్లాసుకు వెళ్లిపోయాను. నన్ను పిలుస్తారేమో అని ఊహించాను కానీ పిలువనందుకు ఊపిరి పీల్చుకున్నాను.

సాయంత్రం కిట్టూ ఆటోలో అల్లరి చేస్తూనే ఉన్నాడు.... నేను మౌనంగా ఉన్నాను... అమ్మ ఇంకా ఇంటికి రాలేదు. అంటే నాన్న త్వరగా ఇంటికొచ్చాడన్నమాట.

బ్యాగులు పెట్టేసి, షూతీసి, క్యారియర్ బ్యాగులన్నీ తీసికొని లోపలికి వెళ్ళాను. కిట్టూ బాత్రూమ్‌లోకి దూరాడు. నాన్న మొహంలోకి చూడాలంటే భయంగా ఉంది. 'ఏయ్ - సుమా ఇలారా' పిల్చాడు నాన్న. 'ఏయ్, కిట్టూ టీచర్ నన్ను పిలవమని చెప్పిందంట కదా! ఎందుకు చెప్పలేదు నాతో' కోపంతో అరిచాడు నాన్న...

అదీ.... అది.... తడుముకున్నాను... 'మరిచిపోయాను నాన్నా' అన్నాను.

కిట్టూ వైపు తిరిగాడు. వాడింకా ముఖం తుడ్చుకోలేదు... చేతులు విదిలిస్తూ బయటికి వచ్చాడు. 'ఈ వెధవతో అన్నీ సమస్యలే - మంచి స్కూల్ అని ఫీజులు ఎక్కువయినా చేర్పిస్తే; ఈ రోజు నా పరువు తీశాడు - ఈ పనికిమాలిన వెధవ - రేయ్ - ఇట్లారా రా అని పిలిచాడు వాణ్ని. 'ఈ వెధవకు టీ.సీ. ఇస్తారంట - టీ.సి...' బెల్ట్ తీసి ఒక్క దెబ్బ వేశారు నాన్న. 'అంతే వాడి ఏడుపుతో ఇల్లంతా దద్దరిల్లిపోయింది. మీద మీద రెండు, మూడు దెబ్బలు పడ్డాయి కాళ్ళపైన, వాడు గెంతుతూ అరుస్తున్నాడు... 'వద్దు డాడీ ఇంకెప్పుడూ చేయను - డాడీ కిట్టూ. చిన్నా, నేను బెదిరిపోయి వాడివైపే దీనంగా చూస్తున్నాం. ఇంతలో అమ్మ లోపలికి వచ్చింది. కిట్టూగాడు అమ్మ వెనక్కి పరిగెత్తాడు. 'ఏమండీ ఎందుకలా అలా కొడ్తున్నారు వాన్ని. ఏం చేశాడు' అమ్మ.

'స్కూల్లో వీడికి టీ.సి ఇస్తారంట. తీసికొని వూరేగండి. వాన్నే అడుగు ఏంచేశాడో?' నాన్న. 'వాడి తప్పులన్నీ ఒక పట్టిక తయారు చేసి వాడొక లెటర్, నేను ఒక అండర్ టేకింగ్ లెటర్ ఇస్తే ఈ ఒక్కసారికి ఎక్స్‌క్యూజ్ చేస్తారంట.... లేదంటే స్కూల్‌కు రానివ్వమని చెప్పింది'. మళ్ళీ కోపంతో వాన్ని కట్టె తీసుకొని కాళ్ళపై కొట్టాడు నాన్న. నాలుగు బాది, బెల్ట్ అక్కడే పడేసి చెప్పులేసుకొని విసురుగా బయటకి పోయాడు. 'వెళ్తూ, వెళ్తూ నేను వచ్చేసరికి లెటర్ రడీ చేయించువాడితో' గదిమాడు నాన్న. కిట్టూగాని దుఃఖాన్ని పట్టించుకోలేదు అమ్మా - ఈసారి అమ్మ అటూ, ఇటూ కదుపుతూ 'చెప్పురా ఏంచేశావు' అంటూ తీవ్రంగా కేక పెట్టింది - చిన్నాగాడు నోరు మెదిపాడు - 'సుమక్కకు తెల్సమ్మా, నాన్న అక్కను కూడా తిట్టాడు' అన్నాడు. కిట్టూగాన్ని ఈడ్చి కూలేసింది అమ్మ. - పేపర్, పెన్ను తీసుకురా అరిచింది - నావైపే చూస్తూ. నేను పరిగెత్తాను. వాడు కోపంగా వెక్కుతూనే ఉన్నాడు. 'నేనేం తప్పుచేయలేదు'. అరిచాడు...'

'ఒరే రాయరా! మళ్ళీ నాన్న వస్తే కొడ్తాడు' బుజ్జగించాడు చిన్నాగాడు...

అమ్మ అడుగుతోంది - ఒక్కొక్కటి చిట్టా విప్పాడు కిట్టూగాడు - 1. భరత్ అనే వాన్ని కొట్టినాను. సారీ! 2. అపర్ణ పిలక జడ కట్ చేశాను సారీ - 3. రాహూల్ బ్యాగు కోసేశాను. సారీ, వెక్కుతూనే ఒక్కొక్కటి చెప్పాడు - అమ్మలెటర్ రాయించి వాడితో సంతకం పెట్టించింది.

కాసేపు ఎవ్వరం మాట్లాడుకోలేదు.. నాన్న తిరిగొచ్చాడు. కిట్టూగాడు అలిగాడు. గీతక్క, చిన్నాగాడు, నేను పుస్తకాలు ముందరేసుకున్నాము -

కిట్టూగాడు పనీ, పాటా లేకుండా, ఏడ్పు ముఖం పెట్టుకొని, అలిగి అలాగే కూర్చున్నాడు.

అమ్మ వాన్ని డైవర్ట్ చేయాలనే ఉద్దేశ్యంతో 'రేయ్ చిన్నా, కిట్టూ, నువ్వూ అల్మారాలు సర్దుకోండి. 'రోజూ కొట్టుకొని చస్తుంటారు. అన్నీ కలుపుకొని, వెతకటమే మీ పని' కిట్టూ, చిన్నా ఇద్దరూ రోజులో ఒక్కమారన్నా కొట్టుకోకుండా ఉండరు. వాడివి వాడు, వీడి పుస్తకాలు వాడు కలుపుకొని వెతుక్కొంటూనే ఉంటాడు. ఈ రోజు సర్దుకోవటానికి కూర్చున్నారు... ఒక్కటే అసహనంతో వూగిపోతున్నాడు కిట్టూగాడు... చిన్నాగాడు కోపంగా పైకిలేచాడు.

'చూడమ్మా వీడు నా పుస్తకాలు తీసి కింద పడేశాడు' చిన్నాగాడు.

'నేనేం చేయలేదమ్మా! అంతా వాడే చేశాడు' అన్నాడు కిట్టూగాడు

అమ్మ వంటింట్లోకి పోబోతూ కోపంగా కిట్టూగాన్ని మళ్ళీ నాలుగు దెబ్బలేసింది.... వాడు చేతులు అడ్డుపెట్టుకుంటూ నవ్వుతున్నాడు. ఛీ, ఛీ సిగ్గు లేదు వెధవకి. డాడీ అంతగా తన్నినా బుద్దిరాలేదు.

నేనూ అక్కడికి పోయి చూశాను. చిన్నాగాని పుస్తకాలన్నీ చిందర వందరగా చేసినాడు కిట్టుగాడు - 'సుమా! వాన్ని ముందు హోంవర్కు చేసి చావమను' గట్టిగా కేకేసింది అమ్మ...

కాళ్ళపై వాతలు తడుముకుంటూ చలించకుండా అలాగే కూర్చున్నాడు కిట్టూగాడు. తిరిగి నాన్న లోపలికి రావటంతో ఎక్కడి వాళ్ళం అక్కడే గప్‌చిప్.. . కిట్టూగాడు అన్నం తినకుండా అలిగాడు. అమ్మ వాన్ని అడిగి, అడిగి విసిగిపోయింది, నేనూ విసిగిపోయాను. గీతక్క, చిన్నాగాడు ముందు గదిలో నెమ్మదిగా చదువుకొంటున్నారు.

కిట్టూగాడు గుస గుసగా అన్నాడు - అక్కా! అని.

'వూ' - అన్నాను నేను-

ఆ రాస్కెల్ - గాడిద, పంది, అపర్ణ మేడమ్‌తో చెప్తుందా! అందుకే దాని జడ కత్తిరించాను.

'దేనితో కట్ చేశావురా' అడిగాను.

'మనింట్లో పెద్ద సిజర్ బ్యాగులో వేసుకొని వెళ్ళాగదా' అన్నాడు వాడు...

'అసలు దానికి తెలియకుండా ఎలా కట్ చేశావురా' - నేను. 'లంచ్‌టైమ్‌లో బెంచీమీద తలపెట్టి నిద్రపోతాంటే కట్ చేశాను' చెప్పాడు - వాడు. అప్పటికే అది లేచింది - జడ నా చేతిలో ఉంది. అది ఏడ్చుకుంటూ, జడ తీసికొని మా ఇంగ్లీష్ టీచర్ దగ్గరికి పరిగెత్తింది.

నా సిజర్ సుబ్రమణ్యంగాడు లాక్కున్నాడు. మా సోషల్ టీచర్ జబేదా మేడంతో చెప్పి కొట్టించాడు -

'నిన్నంతా నీల్‌డౌన్...' క్లాస్‌లోకి రానివ్వలేదు.

మళ్ళీ డాడీని పిలిపించారు'.

'అది సరే మరి భరత్‌ను ఎందుకు కొట్టావ్!' అడిగాను. అమ్మ బతిమాలుతోంది. 'రా,రా కొంచెం చారన్నం తిందువురా! వూ... హు... వాడు చలించలేదు. ఆ భరత్‌గాడు బలే కొవ్వునాయాలు - ఎప్పుడైనా పొరపాటుగ వాళ్ళ డ్రైవర్ ఆలస్యంగా వస్తే - ఏం రా బాడ్కావ్! లోఫర్ కొవ్వా అని ఒకటే తిడ్తూ ఉంటాడు. ఆయన పాపం ఓల్డ్‌మేన్. వాన్ని ఏమీ అనడు, కామ్‌గా బ్యాగు అందుకొని వాన్ని పిలుచుకొని పోతాడు. క్లాసులో కూడా అందర్ని తిడ్తాడు. నిన్న వాడి ప్లేసులో పొరపాటున కూర్చున్నానని 'ఏరా పంది, దున్నపోతా? సువ్వర్' ఇంకా ఏదో తిడ్తూనే ఉన్నాడు. నేనూ తిట్టాను. 'దుబ్బోడా నువ్వే సువ్వర్, కొవ్వు నా కొడుకా. అని తిట్టినాను. వాడు కొట్టినాడు, నేను వాడి అద్దాలు పడేసి విరగ్గొట్టాను - మళ్ళీ మేడమ్‌తో కూడా చెప్పాడు....

వాడలా చెప్పుకుంటూనే పోతున్నాడు.

ఏ 'తప్పు' ఎందుకు చేసిందీ

వాడికున్న కారణాలు చూచి ఆశ్చర్యపోయాను.

*



# చివరి మజిలీ

☆ పి. వరలక్ష్మి

"జాతస్య హి ధృవో మృత్యుహు:
ధృవజ్జన్మ మృతస్యచ
తస్మాద పరిహార్యేర్దే
నత్వం శోచితుమర్హసి నత్వం శోచితుమర్హసి

"పుట్టిన వానికి మరణం తప్పదు. మరణించిన వానికి జన్మము తప్పదు అనివార్యమగు ఈ విషయము గూర్చి శోకింపతగదు".

ఘంటసాల గొంతులో భగవద్గీత లీలగా వినిపిస్తోంది. ఆ నిశ్శబ్ద ఆవరణని అది మరింత గంభీరం చేస్తోంది. రోజువారీ పరిసరాలకు భిన్నంగా తమకు అసహజమైన వాతావరణంలోకి ప్రవేశించడం వల్లనేమో అప్పటిదాకా ఉన్న గలగలలు గుసగుసలుగా మారాయి.

"అబ్బ! ఎంత పీస్‌ఫుల్‌గా ఉందో" చుట్టూ చూస్తూ మిత్రుల వైపు తిరిగి చిన్నగా అంది దివ్య, ఆ ప్రశాంతతను భగ్నం చేయకూడదని.

తమ కాలేజి కాంపౌండులో పావుభాగం ఉంటుంది. చుట్టూ వేప, రావిచెట్లు. వాటికింద వరుసగా అరుగులు. ఒక వైపుగా 'L' ఆకారంలో గదులు, వాళ్ళ క్లాస్ రూముల్లానే.

ఆ చలికాలపు లేత ఎండ వెచ్చగా హాయిగా తగులుతోంది. చెట్ల కొమ్మల మధ్య సందడిగా తిరుగుతున్న పిచ్చుకలను ఒకింత ఆశ్చర్యంగా చూశారు వాళ్ళు. అక్కడక్కడా పక్షి గూళ్ళను లాబొరేటరీ స్పెసిమెన్స్‌లా గుర్తుబట్టి కొత్త డిస్కవరీ ఏదో చేసినట్టుగా ఒకరికొకరు సంబరంగా చెప్పుకుంటూ కదులుతున్నారు. గదుల బైట, అరుగులపైన, నీడమాటున అక్కడక్కడా వేసిన కూర్చీల్లో అరవై ఏళ్ళ పై బడ్డ వాళ్ళు కూర్చొని మాట్లాడుకుంటున్నారు. కొంతమంది కళ్ళజోళ్ళు సరిచేసుకుంటూ ఏవో చదువుకుంటున్నారు. యూనిఫాంలో అందరూ ఒకే రకం కాషాయం దుస్తులు వేసుకొని ఉన్నారు. వాళ్ళలో ఎక్కువమంది ఆడవాళ్ళే ఉన్నారు. వీళ్ళను చూడగానే లేని ఓపిక తెచ్చుకొని కూర్చున్న చోటునుండి లేచి "రాండమ్మారాండి" అంటూ చిన్నగా నడుచుకుంటూ వెళ్ళి కుర్చీలు తెచ్చి వేయడం మొదలుపెట్టారు.

"కూర్చోండమ్మా, కూర్చోండి నాయనా" అని చేయిపట్టి లాగేంతవరకూ ఆ మర్యాదలు వీళ్ళకే అని అర్థం కాలేదు.

అర్థమయ్యి లికమక పడిపోయి "పెద్దవాళ్ళు, మీరు మాకు మర్యాదలు చేయడం ఏంటి" అన్నారు కాస్త కంగారుగా

వాళ్ళదేమీ పట్టించుకోకుండా అందరికీ సరిపడా కుర్చీలు తీసుకురాసాగారు. ఇంకాస్త కంగారు పడిపోయిన కుర్రవాళ్ళు అటూ ఇటూ పరిగెత్తి గదులబైట ఒక దాని మీదొకటి పేర్చిన కుర్చీలను తీసుకొచ్చారు. కొంతమంది ఆ ముసల వాళ్ళ చేతుల్లోవి లాక్కున్నంత పనిచేసి

"ముందు మీరు కూర్చోండి.... పెద్దవాళ్ళు" అని నసిగారు.

"లేదు లేదు, మీరు మా అతిధులు

చేసేది లేక మొహమాటంగా కూర్చొని దిక్కులు చూడ్డం మొదలు పెట్టారు. అప్పటిదాకా వెంట ఉన్న వాళ్ళ లెక్చరర్స్ వాళ్ళనక్కడ వదిలేసి మేనేజర్ రూంలోకి వెళ్ళారు. కే.ఎస్.ఆర్. డిగ్రీ కాలేజి విద్యార్థులు ఆరోజు అక్కడ చేరడంలో పెద్ద విశేషమేమీ లేదు. ప్రతి సంవత్సరం కాలేజి వదిలి వెళ్ళిపోయే ఆఖరిసంవత్సరం విద్యార్థుల చేత చేయించే ఒక ఛారిటీ ప్రోగ్రామే ఇది. ఈ రోజుల్లో ఇదొక ఫ్యాషన్. నలుగురి కళ్ళలో పడటంకోసం కాలేజి యజమాన్యం చేసే కొన్ని సేవా కార్యక్రమాల్లో ఇది ఒకటి. ఈఏడు దానికి వృద్ధాశ్రమాన్ని ఎంచుకున్నారు. ఏ కార్యక్రమమైనా సరే, చురుగ్గా ముందుకొచ్చే ఐదారు మంది విద్యార్థుల్లో దివ్యఒకత. రిపబ్లిక్ డే కావడంలో కాలేజిలో హాజరు బాగా తగ్గింది. జెండా ఎగరేసే తంతు పూర్తయ్యాక ఈ పదిహేను మంది ఫైనలియర్ విద్యార్థులను వెంటబెట్టుకొని ఓ ఇద్దరు లెక్చరర్స్ కాలేజీ బస్సులో నేరుగా 'విశ్వప్రేమ' వృద్ధాశ్రమానికొచ్చారు.

"మీరిట్ల మర్యాదలు చేయడం మాకు చాలా ఇబ్బందిగా ఉంది" అంది దివ్య ఎదురుగా కూర్చున్న పెద్దవాళ్ళనుద్దేశించి.

"అవునవ్వా, మేం మీ మనవళ్ళు, మనవరాళ్ళలాంటి వాళ్ళమే కదా" అప్పటిదాకా అటూ ఇటూ పచార్లు చేస్తున్న సతీష్ మాట అందుకున్నాడు.

"అయినా సరే! మీరు మా దాతలు. మిమ్మల్ని నిలబెట్టడం మా ఆశ్రమంలో తప్పు నాయనా. అది మా పద్ధతి. కూర్చోండి నాయనా"

సతీష్‌తోపాటు అక్కడక్కడే పచార్లు చేస్తున్న అబ్బాయిలనుద్దేశించి అంది ఒక అవ్వ.

ఎందుకో ఆ మాట కసుక్కున్న గుచ్చుకున్నట్లుగా అనిపించింది దివ్యకు. అప్పటికే తెలీని ఇబ్బందిలో మనసు మూలుగుతోంది. దివ్య ఫ్రెండ్స్ గుసగుసలుగా మాట్లాడుకుంటున్నా తన స్వభావానికి విరుద్ధంగా మౌనంగా పరిసరాల్ని చూస్తోంది. ఏమీ తోచక అక్కడ ఎంతమంది ఉన్నారో లెక్కించడం మొదలు పెట్టింది. మొత్తం నలభై మంది. రూమ్స్‌లో ఎవరూ లేనట్టుంది.

"హాయ్ విజ్జీ! నువ్వొకటి గమనించావా. ఇక్కడ తాతలు చాలా తక్కువ. నాకు ఐదుగురే కనపడ్డారు" పక్కనే ముచ్చట్లలో పడిపోయిన నలుగురు అమ్మాయిల గుంపులో విజయను తడుతూ అంది దివ్య మెల్లగా.

"అవును నిజమే"

"ఆడవాళ్ళ లైఫ్‌స్పాన్ ఎక్కువ. నేనోచోట చదివినా" దానికి వివరణ ఇస్తున్నట్లు అంది కవిత.

"కావొచ్చు. కాని మగవాళ్ళకు చివరిదాకా సేవ చేయడానికి భార్యలుంటారు. వాళ్ళకంటే వీళ్ళు చిన్నవాళ్ళు కదా"

"అయినా మన ఇళ్ళలో కూడా ఎక్కువ అమ్మమ్మలూ, నాయనమ్మలే ఉంటారు" నిర్ధారిస్తున్నట్లు అంది జ్యోతి

"ఇంకా ఎంత సేపుండాలి ఇక్కడ" ఈ సంభాషణను పట్టించుకోకుండా అంది స్వప్న.

"వచ్చి అరగంట కూడా కాలేదు. అయినా వీళ్ళతోపాటు మనం లంచ్ చేశాకే కదా వెళ్ళాలి"

దిగువ కొమ్మమీద పుల్లలు పేరుస్తున్న పిచ్చుకను చూస్తూ ఆలోచనల్లో పడిపోయింది దివ్య. ఫ్రెండ్స్ ఏవేవో మాట్లాడుతున్నారు గాని చెవికెక్కించుకోవడం లేదు.

చిన్నప్పుడు తనకి కాకమ్మ, పిచుకమ్మ కథ చెప్పిన అవ్వ గుర్తొస్తోంది. ఇప్పుడు అవ్వ ఎట్లుందో? ఊరికి పోక ఐదేళ్ళయింటుంది. తను సెవెన్త్‌క్లాస్ కొచ్చేదాకా ఇంట్లో ఉంది. వరసకు జేజి (నాయనమ్మ) అయినా తనకు అవ్వా అని పిలవడం అలవాటు. ఎంత గారాబం చేసేదో! ఎన్ని కథలు చెప్పేదో! తను పెరిగే కొద్దీ ఇంట్లో మనుషుల మధ్య దూరాలు అర్థమవసాగాయి. ముఖ్యంగా అమ్మకు, అవ్వకుమధ్య. తనోరోజు స్కూల్ నుండి ఇంటికొచ్చేసరికి అవ్వలేదు. చిన్నాన్న వాళ్ళ ఊరికిపోయిందని అమ్మ చెప్పింది. నాకు చెప్పలేదే అంటే, మళ్ళీ వస్తుందిలే అంది. ఇంక రాలేదు. ఏం జరిగుంటుందో అర్థమయినా తెలీనట్లుగనే ఉండిపోయింది. చదువులో ప్రపంచమే మర్చిపోయింది. ఓసారి సమ్మర్‌లో చిన్నాన్న వాళ్ళింటికి పోయినప్పుడు అవ్వను చూసింది. చాలా మామూలుగా పిల్లల్ని చుట్టూ కూచోబెట్టుకొని కథలు చెప్తోంది. ఇంటికి రమ్మంటే తనకు ఊళ్ళోనేబాగుంది అంది అవ్వ.

"మీరంతా ఏం చదువుతున్నారు నాయనా" ఒక అవ్వ పలకరింపుకు తమ కాలేజీ, చదువు గురించిహుషారు చెప్పుకొస్తున్నారు దివ్య ఫ్రెండ్స్.

"అవ్వా, మీకిక్కడ బానే ఉందా?" మాటలు కలిపింది దివ్యకూడా.

"యాల పొద్దున ఇంత తింది. ఆ బగవంతున్ని తలచుకోడం తప్ప ఈ

వయసుకు ఇంగేంగావాల నాయనా"

"మీ వాళ్ళను చూడాలనిపించదా?" ఈ మాట వాళ్ళని బాధపెట్టుందేమో అన్న సంకోచంలోనే అడిగింది దివ్య.

"ఎందుకుండదు? మనవళ్ళను, మనవరాళ్ళను చూసుకోవాలని మాకు మాత్రం ఉండదా?" నిట్టూర్పు విడుస్తూ అంది అవ్వ.

"ఇక్కడి రారా... మిమ్మల్ని పలకరించడానికైనా..అప్పుడప్పుడు".

"నేనొచ్చి రెండేడ్లయింది. ఇప్పటికి ఒక మూడు మాట్లు మనవడొచ్చి పోయినాడు. ఇదిగో ఈమె నేనున్నెప్పట్నుంచి ఉంది. వీళ్ళ వాళ్ళయితే ఎప్పుడూ రాల్యా"

ఇంకేం మాట్లాడాలో తోచక మళ్ళీ పిచ్చుక గూడు వైపు చూడ్డం మొదలు పెట్టింది దివ్య.

"పేరెంట్స్‌ని ఇట్లెట్ల వదిలేస్తారో"

"మీ వయసులో బాగానే ఉంటారు. పెళ్ళిళ్ళయి, సంసారాలు మొదలు పెట్టేదాంకే అమ్మానాయినా"

"మే మెప్పుడూ అట్ల చెయ్యడం"

ఈ మాటలు చెవిన పడుతుంటే ఓ అనగనగా కథ గుర్తొస్తోంది దివ్యకు. ఇది కూడా అవ్వ చెప్పిందే. ఒక రాజ్యంలో తిండికి కరువొచ్చినప్పుడు రాజు ఒక శాసనం చేస్తాడు. ఉన్న తిండి గింజలు అందరికీ సరిపోవుకాబట్టి రాజ్యంలో అరవై ఏళ్ళు పైబడిన వాళ్ళందరినీ చంపేయమని భటులకు చెప్తాడు. వాళ్ళెలాగూ పనిచేయలేరు కాబట్టి ఊరికే తినికూర్చోవడం దేశానికి భారమంటాడు. రాజు ఆదేశం అమలవుతుంది గాని ఒక యువకుడు మాత్రం తన తాత మీద ప్రేమతో ఆయనని నేల మాళిగలో దాచిరోజూ అన్నం పెడుతుంటాడు. రోజురోజుకూ కరువు తీవ్రమై ఆకులు, దుంపలు కూడా దొరకని పరిస్థితి వస్తుంది. క్షామం నివారించేందుకు ఏం చేయాలో ఎవరూ రాజుకు సలహా ఇవ్వలేకపోతారు. దాంతో ఉపాయం చెప్పిన వాళ్ళకు అర్థ రాజ్యం ఇస్తానని చాటింపు వేయిస్తాడు. అప్పుడా యువకుడు ముందుకొచ్చి తెలతెలవారేటప్పుడు రోడ్లకిరువైపులా దున్నించమని రాజుకు చెప్తాడు. రాజు అలాగే చేయిస్తాడు. ఓ వారం తిరిగే సరికల్లా దున్నిన చాళ్ళలో మొలకలు వస్తాయి. ఆయువకుడికి ఈ ఉపాయం చెప్పింది ఎవరో కాదు. వాళ్ళ తాత. ధాన్యం బండ్లు రోడ్లమీద గింజల్ని రాలుస్తాయని అవి మట్టిలో పూడుకుపోయి చాలాకాలం పాటు ఉండిపోతాయని ఆయన తన అనుభవంలో చెప్పాడు. విషయం తెలుసుకున్న రాజు పశ్చాత్తాపపడి తను చేసిన శాసనాన్ని వెనక్కు తీసుకుంటాడు.

***

ఓ నడివయస్సాయన అటుగా వచ్చి ఆశ్రమాన్ని చూద్దురండంటూ అందరినీ లోపలికి పిలిచాడు.

"అటు వైపు భజన మందిరం, వెనక వైపు ఇంకా కొన్నిరూమ్స్ ఉన్నాయి. ఇటు పక్క చిన్న హాస్పిటల్ కూడా కట్టాలనుకున్నాం" చూపుడు వేలుతో అన్ని దిక్కులు చూపిస్తూ "వెళ్ళండి, వెళ్ళిచూడండి. నేను కొంచెం భోజనం సంగతి చూడాల" బాగా పరిచయం ఉన్న వ్యక్తిలా టకటకా చకచకా వెళ్ళిపోయాడు.

అప్పటికి ఆ పరిసరాలకు అలవాటు పడినట్లున్నారు. స్వేచ్ఛగా తిరుగుతూ మామూలుగా మాట్లాడుకుంటూ విద్యార్థులంతా చిన్న చిన్న గుంపులుగా బెదిరిపోతున్నారు. భజనమందిరం వెనకవైపున్న రూమ్స్‌కేసి నడిచారు దివ్యతోపాటు అమ్మయిలంతా. ఎప్పుడూ అమ్మాయిల వెనకే తచ్చాడే సతీష్, ఇబ్రాం, విక్రంలు వీళ్ళను చూసి ఆ దిక్కే అడుగులు వేశారు.

మసకబారిన సున్నం గోడలతో రెండు పెద్ద గదులు. అక్కడున్న కట్టడాలన్నిటిలోకి అదే పాతది. ఒకప్పుడది బాటసారులకు నీడనిచ్చే సత్రం. ఇప్పుడు జీవన ప్రయాణంలో అలసిన బాటసారుల ఆఖరి మజిలీ. ఒక దానినుండి ఇంకో దాంట్లోకి ప్రవేశం ఉన్న ఆ రెండు గదుల్లో పదేసి ప్లాస్టిక్ నవ్వారు మంచాలు. వాటికి కర్రల సహాయంతో దోమ తెరలు కట్టి ఉంచారు. నాలుగు వైపుల తెరలు మాత్రం పైకి వేసి ఉంచారు ఇద్దరు ముగ్గురు తప్ప అందరూ పడుకొనే ఉన్నారు. వీళ్ళంతా బాగా వయసు పైబడ్డ వాళ్ళు, జబ్బు పడ్డ వాళ్ళని చూడగానే తెలిసిపోతుంది. బాధలన్నీ కుప్పబోసినట్లుగా, అక్కడక్కడే మృత్యువు సుళ్ళు తిరుగుతున్నట్లుగా దృశ్యమానమై ఏదో తెలీని భయం ఒంట్లోకి పాకి జలదరించినట్లయింది దివ్యకు. ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటున్న అమ్మాయిలు ఉందామా, వెళ్ళిపోదామా అని తటపటాయిస్తున్నారు.

"రాండమ్మా రాండి! కూర్చోండి" ఆహ్వానించింది నడిమంచంలో కూర్చొనున్న ఒకావిడ కొంచెం జరిగి పక్కనే చోటు చూపిస్తూ

"కాలేజీ పిల్లోల్లా" బాగా అలవాటైన ధోరణిలో పలకరించింది ఇంకొకామె. ఆ గదిలో ఉన్న మిగతా వాళ్ళు కూడా మెల్లగా లేచి కూర్చోని వీళ్ళని అట్లాగే ఆహ్వానించారు.

తమలాంటి వాళ్ళు ఎంతోమంది రావడం, చూసిపోవడం ఇక్కడ మామూలేనన్నమాట.

గొప్పవాళ్ళ దానగుణం లోకానికి తెలియాలంటే నిర్భాగ్యులు, నిస్సహాయులు ఉండాల్సిందే. నీకు సహాయం చేసే అవకాశం ఇచ్చినందుకు దరిద్రుడికి నీవు కృతజ్ఞతలు తెలపాలి అని మహాత్మాగాంధీ అన్నాడు కూడా. ఈకాలేజీ విద్యార్థులకు కూడా అటువంటి ఆత్మ సంతృప్తిని వీళ్ళుకలిగిస్తూ ఉండవచ్చు. ఎందుకో దివ్యను మాత్రం ఏదో అపరాధ భావం వెన్నాడుతూ ఉంది.

వీళ్ళకంటే ముందుగానే కొంతమంది అవ్వలు వీళ్ళనే కుశల ప్రశ్నలు వేయడం ఒకింత ఆశ్చర్యం కలిగించింది.

"ఏం నాయనా? బాగున్నారా? ఏం సదువుతున్నారు?"

కాస్త ఇబ్బందిగానే పొడి పొడి సమాధానం ఇచ్చారు. ఆస్థితిలో కూడా వీళ్ళను పక్కన కూర్చోబెట్టుకునే వరకు వదలకపోవడం ఇంకాస్త ఉక్కిరి బిక్కిరి చేసింది.

ఒకటి రెండు నిమిషాలకు సతీష్ కాస్త చొరవ తీసుకొని

"ఏ మవ్వా, ఆరోగ్యం ఎట్లుంది? ఇక్కడ మీకు బాగుందా?" అని ఒకరిని పలకరించాడు.

"బానే ఉంది నాయనా. రెండ్రేజులకొకసారి డాక్టరమ్మ వస్తాది. మందులు అవీ ఇచ్చి పోతాది" అంటూ దిండుకింద కవర్‌లో ఉంచుకున్న టాబ్లెట్లు చూపించింది.

"కాళ్ళు సచ్చుబడినాయి నాయనా. నడ్సల్యాకపోతన్నా"

"మీ వాళ్ళెవరూ రాలేదావ్వా?"

"అంతమటుకైతే ఈడెందుకుంటా నాయనా. అయినా కాళ్లూ చేతులూ బాగుంటే ఏదో చేతనైన పని చేసేదాన్ని, ఈడికొచ్చే దాన్నే కాదు"

"నీకు కొడుకులు లేరావ్వా"

"ఒక్కటే కూతురు. అల్లుడు తాగుబోతోడు. పెళ్ళానికే కూడుబెట్టడు. వాళ్ళ పిల్లోల్లకే తిన్నీక లేదు. నాకు చేతనైనంత వాళ్ళకు చేసి పెట్టినా. ఇప్పుడు వాళ్ళకెందుకులే బరువని ఈడికొచ్చినా"

"ఏమైనా కావాలంటే చెప్పవ్వా. మేం తెచ్చిపెడ్తాం" అన్నాడు విక్రం చొరవగా

"తిండి పెడ్తన్నారు, మందులిస్తన్నారు. మాకు సేవ చేయనీకి నర్సమ్మను కూడా పెట్టినారు ఇంగేం గావాల నాయనా"

"మీకు పొద్దు పోతాదా?"

"పొద్దుపోకపోతే మాత్రం ఏం జేస్తాం? మా చేత ఏమైతాది?"

"మేమంతా కలిసి మీకు టి.వి కొనిస్తాంలే"

"మా నాయనే, మాతండ్రే"

పక్కమంచం మీదున్న ముసలావిడ బోసినోరంతా తెరిచి నవ్వింది. "ముసిల్దానికి టి.వి కావాల్సొచ్చెనమ్మా, ఏదో క్రిష్ణారామ అనుకోకుండ"

ఆమె గొంతు కాస్త పెద్దదే. ఆమాటలు విని మిగతా ముసలోళ్ళు నవ్వారు. తలోమాట అన్నారు. దాంతో అప్పటిదాకా బిగిసుకుపోయి ఉన్న వాతావరణం



# ఇద్దరు వీర వనితలు

☆ షంషేర్

నవంబర్ నెల చలికాలం. వెన్నెలు రాత్రులు....వూరు నిద్రపోయింది... మద్దిమల్ల నిద్రపోయింది.... వూరకుక్కలు అదేపనిగా అరుస్తున్నాయ్...వాటి అరుపులకు వూరంత అదిరిపడుతుంది... వూరవతల, జొన్న చెండ్లు గడ్డకట్టుకుపోయి...ఆశ్చర్య పోయి చూస్తున్నాయ్...

మద్దిమల్ల గ్రామం విప్లవ గ్రామం. విప్లవోద్యమం అండతో ఒకప్పుడు మద్దిమలలో ప్రజలంత సమిష్టి శ్రమతో చెరువుపోసుకొని, ఒక మంచి ఆదర్శగ్రామంగా పేరుతెచ్చుకుంది.... సంఘకార్యకలాపాలలో ముందుండేది....

కామారెడ్డి ఏరియా కమిటి కార్యదర్శి స్వరూప, సభ్యురాలు మానసలకు దళంతో వున్న కాంటాక్టు తెగిపోతే నెలకొల్పడానికి, అనేక మార్గాల ద్వారా ప్రయత్నించారు.. అవి విఫలం అవడంతో.... రెండు రోజుల క్రితం మద్దిమల్లలో వున్న మల్లయ్య దగ్గరకు వచ్చారు. ఆ ఇద్దరు వీరవనితలకు మల్లయ్య అభయమిచ్చాడు.... వాళ్లు నమ్మారు. రహస్యంగా తన జొన్న చెండ్లల్ల షెల్టర్ వారికి కల్పించాడు మల్లయ్య....

రెండురోజులుగా దళాన్ని కలువడం కోసమని, ఆ చుట్టు పక్కల గ్రామాల్లో తిరిగానని మల్లయ్య ఆ ఇద్దరు వీరవనితలకు చెప్పాడు. ఆది వారు నమ్మారు. అతను తెచ్చింది తిన్నారు...జొన్న చేను మంచెమీద పడుకున్నారు....

ఒకరోజు అర్ధరాత్రి మల్లయ్య పోలీసొల్లనువెంట తీసుకొని వచ్చి - తనమంచెపై గాడనిద్రలో వున్న స్వరూప, మానసలను ఆయుధాలతో సహ పట్టించాడు...ఎస్.ఐ నాగేంద్రచారికి

ముప్పైమంది స్పెషల్ పార్టీ పోలీసోల్లు ఎస్.ఐ నాగేంద్రచారి ఆధ్వర్యంలో వెన్నెల వెల వెలబోతుండగా... జొన్న చేను ఆశ్చర్యబోతుండగా.... వూళ్ళె ఊరకుక్కలు మొరుగంగా...విశ్వాసఘాతకుడు మల్లయ్య ముందు నడవంగా, వెనుక నాగేంద్రచారి పోలీసోల్లు నడిచి.... పద్మవ్యూహం ఎన్ని...జొన్న చేనుచుట్టు ముట్టి స్వరూప, మానసలను పట్టుకోని, పెడరెక్కలను విరిచికట్టారు...

"ఎవలం అనుకున్నారు?" ఎస్.ఐ నాగేంద్రచారి మామూలుగానే మానసనుఅడిగాడు.

"మీరు పోలీసోల్లు"....ఆందోళనతోకూడిన స్వరంతో అంది మానస....

"ఇక నిద్ర మత్తు వదలనట్టువుంది మీకు. మీ అన్నలం... రెండు రోజులనుండి ఎదురుచూస్తున్నం..." ఉబ్బు చెంపల అధికారి అన్నాడు..

"అబద్ధం...అంతఅబద్ధం...." స్వరూపక్క అరిచినంతగట్టిగా అంది. అదురుబెదురులేని సింహంల గర్జించింది.... "మీరు నమ్ముతలేరు...ఇగో మీ మల్లన్నను అడగండి..." మల్లయ్యను చూపెడుతూ..ఇందాక మాట్లాడిన ఉబ్బుచెంపల అధికారి వ్యంగ్యంగా అన్నాడు.... కోపంగా స్వరూప "మల్లయ్య ఓద్రోహి...మీరు ఆ ద్రోహికి అన్నలు..." అంది

"అక్క బాగానే కోపానికి వస్తాంది....గటు అడివి దిక్కుపోయి, అన్ని విషయాలు మట్లాడుకోవచ్చు..."అంటు ఎస్.ఐ నాగేంద్రచారి బయలుదేరుతూ అన్నాడు...

ద్రోహి మల్లయ్యను జొన్న చేండ్లల్లోనే వదిలి... స్వరూప, మానసలను పట్టుకొని పక్కనే గల తిమ్మాపూర్ అడివి ప్రాంతానికి చేరుకున్నారు పోలీసులు....

వెన్నెల నిశ్చేష్టురాలై ఈ చోద్యాన్ని చూస్తునేవుంది...

అడవిలో గుడ్లగూబ అరుస్తునే వుంది....చలిగాలి వీస్తుండడంతో పచ్చటి అడవి వూగుతుంది...నక్కలు వూల పెడుతున్నాయ్... వికృతంగా అరుస్తునేవున్నాయ్.... ఆ అరుపులు భీతి గొల్పేలా ఉన్నాయ్....

స్వరూప కోసం, స్వరూప నాయకత్వంలో వున్న దళం కోసం పోలీసొల్లు గ్రామాలమీద దాడులు చేసారు...అడవులు...గుట్టలు గాలించారు....దారులు, వాగులు, వంకలు, చెరువులవద్ద, సెలయేర్ల దగ్గర మాటు వేసారు... అయినా శత్రువుల కోరిక నెరవేరలేదు....

---

సందడిగా మారింది.

దివ్యతోపాటు మిగతా అమ్మాయిలు కూడా ఒక్కోమంచం వద్దకుపోయి పలకరిస్తున్నారు.

"కొడుకులూ, కూతుర్లూ అందరూ ఉండారు. సదివించినా, పెళ్ళిళ్ళు చేసినా. వాళ్ళ పిల్లోల్లు పెద్దోళ్ళయ్యే కొద్దీ నేను బరువైనా, తీసుకొచ్చి ఈడేసినారు"

కొద్దో గొప్పో తేడాలతో ఇంచుమించు అందరి నోటా ఇవే కధలు.

"ఆ అవ్వ ఏంటి పడుకునే ఉంది! అసలు లేవలేదా?"

గోడవైపు తిరిగి పడుకున్నామెను చూస్తూ అంది విజయ.

"ఆమెకు ఈ నడుమ సరిగ్గా కండ్లుకనిపించడం లేదమ్మా. ఇందాకనే డాక్టరమ్మ వచ్చి మందేసి పోయింది. రేపు కళ్ళ డాక్టర్ దగ్గర పరీక్ష చేయిస్తాననింది"

"కండ్లు మూసుకొని అట్నే నిద్రపోయిందేమో"

ఆమె మంచాని కిరువైపుల వాళ్ళు ముందుకువొంగి చూశారు.

అటువైమెపుగా కదిలారు ముగ్గురబ్బాయిలూ. ఆమెను డిస్టర్బ్ చేయొద్దని దివ్య చెప్తున్నా పట్టించుకోలేదు.

"పెద్ద ఇడియట్స్" విసుగ్గా అంది దివ్య తన ఫ్రెండ్స్ వైపు తిరిగి

"సరే! ఇంక మనం పోదామా" వాళ్ళతో మనకెందుకు అని అంది కవిత.

"ప్రశాంతంగా పడుకున్నామెను లేపేశారు కదా..కోతులు"

బైటికి నడుస్తూ తలుపు దగ్గర ఆగిపోయింది దివ్య

"ఇద్దరు కొడుకుల్నీ చదివియ్యాలనుకున్నాం. చిన్నోడికి చదువబ్బలేదు. ఈడ్నే టవున్లో పెద్దోడింట్లో చానేళ్లున్నా. మనవరాలు పెద్దదయ్యేదాకా. కొడుకూ, కోడలూ, ఉద్యోగాలకు పోతారు. ఆ పిల్లను నేనే సాకినా నాయనా. అది పెద్దదయినాక నా అక్కర లేదనుకున్నారో ఏమో, ఇంట్లోంచి పొమ్మనలేదులేగాని.. అయినా నోటితోనే అనాల్నా నాయినా. మా ముసిలోడు పున్నెం జేసుకున్నోడు. తొందరగానే పోయినాడు.

మా పల్లె ఈడ్నించి దగ్గరే. చిన్నోడు భూములు చేసుకుంటున్నాడు. ఆడికిపోయినా. ఎంతైనా పల్లెల్లో మంచి చెడ్డా యిసారించేటోళ్ళుంటారు గదా. నాలుగు నెల్లయింటాది..ఈకాలూ చేయీ చచ్చుబడిపోయినాయి. పచ్చికట్టి వాయింటారే, అదొచ్చింది. డాక్టరుకు చూపిస్తానని ఈడికి తీసుకొచ్చేసినాడు మా చిన్ననాకొడుకు. నాపేరుతో రెండెకరాలు భూమున్యాది. ఖర్చులకని అదీ రాయించుకున్నాడు. ఆరోజు పోయినోడు ఇంగరాల్యా.

సతీష్ వెనక బొమ్మలా నిలబడిపోయింది దివ్య

అవ్వ...! ఇక్కడ! మైగాడ్! భరించలేకపోతోంది. నాన్నకు తెలీదా? తెలీకుండా ఉంటుందా? నన్ను గుర్తుపడుతుందా? చూపు సరిగా లేదన్నారు.

'అవ్వా..నేను. ఇక్కడున్నావేంటి. ఇంటికి పోదాంరా' పెదాలు దాటాల్సిన మాటలు గుండె చిప్పుళ్ళ అలజడిలో అణిగిపోతున్నాయి.

క్లాస్‌మేట్స్ ఏమనుకుంటారో? తనగురించి, అమ్మానాన్న గురించి

కాని అవ్వ...ఇక్కడ... ఇలా ఉండకూడదు.

ఇంటికి పోయాక అమ్మ, నాన్నతో విషయం చెప్తుంది. అవ్వని ఇంటికితీసుకొచ్చేదాక మొండికేస్తుంది. అన్నం తినదు. ఇష్టమైనవన్నీ అట్లా మొండికేసి సాధించడం తనకు కొత్తకాదు. కాని ఇదీ అదీ ఒకటేనా?

"వెల్దాం పద" చెయ్యిపట్టుకొని లాగింది కవిత. అందరూ వెళ్ళిపోతున్నారు. ఆ కుక్కిమంచంలో దిక్కులేకుండా..అవ్వను అట్లా చూస్తూ కూడా ఏమీ తెలీనట్లు నటించాలా.

అందరికీ తెలిస్తే తెలుస్తుంది. అట్లాగైనా అమ్మా నాన్నను ఈజీగా దొరికించుకోవచ్చు. అవును తెలియాల్సిందే! ఇది తన కన్ఫెషన్ స్టేట్‌మెంట్. *

వెతకబోయిన తీగే కాలికి తగిలింది...అవార్డులు రివార్డులు పోలీసోల్ల కండ్లల్లో మెదులుతుండగా...

"ఎట్లా అయితే ఏందే.. దొరికినావ్ దొంగలంజె.... మమ్మల్ని ఎన్ని తిప్పలు పెట్టినవే...?"

"..........."

"నీ మొగుడు రమేష్ ఎక్కడున్నాడే...?" స్వరూపనుద్దేశిస్తూ ఎస్.ఐ నాగేంద్రాచారి ప్రశ్నించాడు...స్వరూప, మానసలను చుట్టు ముట్టి గ్రేహౌండ్స్ బలగాలు నిలుచున్నాయ్...వారి మధ్యలో స్వరూప మానసలు కట్టివేసివున్నారు...నిలబడి వున్నారు....

"రమేష్ జనం మధ్య వున్నాడు..."

"వాన్ని, కాని, దళాలను కాని పట్టిస్తావా....?"

"అడగడానికి సిగ్గువుండాలే...స్వరూప కరుకుగా సమాధానం ఇచ్చింది... అంతే

అవేశంగా ఎస్.ఐనాగేంద్రచారి స్వరూప చెంప పెళ్....పెళ్ మంటు కొట్టాడు.... మరో అధికారి మానసను చితకకొట్టుతున్నాడు...ఆ ప్రాంతమంత అరుపులు పెడబొబ్బలతో, తిట్లతో నిండిపోయింది....

"చలోం...ల గుడ్డ బట్టలను తీసెండిరా.... ఊలం...ల...సంగతి చెప్పుదాం.." సర్కిల్ రెడ్డి గ్రేహౌండ్స్ మూకలను ఆదేశించాడు..ఆవేశంగా ఏవో తిట్టుతూ....

సర్కిల్ రెడ్డి అదేశాలు అందుకున్న, మూక స్వరూప, మానసలపై విరుచుకపడింది.... విరుచుకపడిన ఆ మూకను స్వరూప, మానసలు రక్కుతున్నారు..బూతులు తిట్టుతూ ప్రతిఘటిస్తున్నారు... పెనుగులాడు తున్నారు... అయినా ఫుల్లుగా తాగిన ఆ మూక వెనక్కి తగ్గకుండా పైన పడి గెలిచింది....

స్వరూప, మానసలపై వున్న బట్టలను తొలగించారు... పక్షిరెక్కల్లా వెనక్కివిరిచి కట్టారు.. అప్పుడే తల్లి కడుపుల నుండి పుట్టిన ఆడబిడ్డల్లావున్నారు... పెయ్యి మీద నూలు పోగులేకుండా, వెన్నెల వెలుగుల్లో నగ్నంగా నిలబడ్డారు. ఆ ఇద్దరు వీరవనితలు...

"ఇప్పుడు వీర వనితలను వెన్నెల వెలుగుల్లో, నల్లని విగ్రహాల్లా నిలబడివున్నారు.... నగ్నంగా వున్న వీరవనితలను చూసి గ్రేహౌండ్స్ మూకలు వికృతంగా హ్హా...హ్హా....హ్హా.... అంటు నవ్వసాగారు....

"మేం ఎవరమో తెలుసు కదా?...సి.ఐ రెడ్డి అధికారి గర్జించినట్టుగా అడిగాడు...మల్లీ తానే" దళాల జాడలు...డంపులు... సంఘాల సమాచారం చెప్పక్కా స్వరూపక్క" వ్యంగ్యంగా అన్నాడు..

"ఈ బొందిల ప్రాణం వున్నంత వరకు...ప్రజలకోసం సర్వం అంకిత మైన మేము ఏ ఒక్కరహస్యాన్ని చెప్పం...చెప్పం....చెప్పం..."

"అది ఎక్కడ చెపుతాది సార్. దాని అన్ననే చంపిందిఅది...గుండెలు తీసిన బంటుసార్...." అమూకలోని ఒక అధికారి స్వరూపనుద్దేసించి అన్నాడు..

"నా అన్న అయితే ఏంది...? ఎవడైతే ఏంది? శత్రువుకు లొంగి విప్లవానికి ద్రోహం చేసే, ప్రతి ఒక్కరిని వదలం. ప్రజా ద్రోహులకు ఎప్పటికైనా శిక్ష తప్పదు..."

"ఏహే...నీ సోది రాజకీయాలు బంద్ పెట్టే. అసలు విషయాలకురా..." ఒక అధికారి మాట్లాతున్న క్రమంల మరో అధికారి మధ్యల్లో కల్పించుకొని "పోలీసొల్లు ఏం చేస్తారో తెలుసా...గుండెలు చితకగొట్టి పచ్చడి పచ్చడి చేస్తాం. నీ అయ్యా అవ్వ గుర్తుకు రావలే.... మర్యాదగ విషయాలు చెప్పు..." "ఎస్.ఐ నాగేంద్రచారి బెదిరిస్తున్నట్టుగా గర్జిస్తు.... అదిరిస్తున్నారు....

"మీరు మానవ రూపంలో వున్న మృగాలు..కమ్యూనిస్టులు ఎప్పుడు శత్రువు చిత్రహింలకు బెదిరిపోయి...కన్నతల్లిలాంటి పార్టీని శత్రువు ముందు అమ్ముకోడు..మీ అదిరింపులకు భయపడేది లేదు..." అనికొట్టిపారేసింది స్వరూప.

"మీరు చస్తారు... ఇప్పటికన్నా చెప్పండి...చివరి అవకాశం. లేనట్లయితే మాతడాఖా చూపించాల్సి వస్తుంది... స్వరూపక్క...." మాటలను సాగదీస్తు....చివరి అస్త్రాన్ని ప్రయోగించబోతున్నట్లుగా బెదిరిస్తు సర్కిల్ రెడ్డి...మీసాలు మెలివేస్తు...

"...."

ఆ వీర వనితల చెంపలు చెళ్ళమనిపించాడు...ఎస్.ఐ నాగేంద్రచారి "మాట్లడండి లం..ల్లారా...మంచి మాటలతో చెప్పుతే అర్థం అయితలేదా...దొంగలం..." అంటు బూతుల శాస్త్రం చదువుతున్నాడు.... ఆ ఉబ్బు చెంపల అధికారి... "కానియ్. ఈ స్థలం... అక్కరకు రాకుండ చేస్తనే అర్థమయితాది" గ్రేహౌండ్స్ మూకలను ఆదేశించాడు...ఆ తోడేళ్ల మూకలు ఇద్దరు వీరవనితల పైకి విజృంభించారు...నేలపై పడవేశారు...వీరవనితలు ప్రతిఘటిస్తు నేవున్నారు...అయినా ఒకనితర్వాత ఒకడు తాగిన మత్తులో వికటాట్టహాసంతో ...వీరంగం చేస్తున్నది ఆ గ్రేహౌండ్స్ మూక....

అత్యాచారం చేస్తున్నది ఆమూక. వీరవనితల ఎముకలు విరుగుతున్నాయ్..కండరాలు పగిలి పీలికలు అవుతున్నాయ్..నరాలుతెగి తీవ్రంగా సలుపుపెడుతున్నాయ్.... నెత్తురు నేలతల్లిని తడుపుతోంది....

నెత్తురు చింది వెన్నెలకి ఎర్రంగా రంగేస్తోంది...

వూరి బయట కావటంతో వారి వేదన ఏడ్పు...ఇద్దరు వీరవనితల ఎడ్పులు... అరుపులు.. ఏ మానవ ప్రాణిని స్పృశించటంలేదు...

ఊరు సద్దుమనిషి నిశ్శబ్దంతో జలకమాడుతుంది....

"ఆగండి" సర్కిల్‌రెడ్డి ఆదేశాలతో వీరవనితలపై విరుచుక పడ్డ మూక ఆగిపోయింది...అధికారి మల్లీ ఆదేశిస్తే మీద పడాలన్నంత రడీగా ఆ తోడేల్లు తోక ఆడిస్తూ నిలుచోని చూస్తున్నాయ్...సర్కిల్‌రెడ్డి మాట్లాడుతూ "ఇప్పటికైన చెప్పండే లం.....ల్లారా...చంపేస్తాం..."

"చావంటే మాకు భయంలేదు..సూర్య చంద్రులున్నంత వరకు విప్లవం వుంటుంది.... విప్లవం జయిస్తుంది..." శత్రువు చిత్రహింసల, అత్యాచారాలతో అలిసిపోయిన స్వరూప శక్తి నంతకూడదీసుకొని, శత్రువుకు ముఖం మిద ఈడ్చి తన్నినంత గట్టిగా జవాబు చెప్పింది...

స్వరూప అన్న చివరి మాటలు. శత్రువు గుండెల్లో బాణాల్లా దిగాయ్....వాటి దాటికి తట్టుకొనలేని గ్రేహౌండ్స్ మూకల అధికారులు "కానియండి" అంటు తోడేళ్ళు మూకను ఆ ఇద్దరు పైకి ఉసిగోల్పారు...

ఘోరాతి ఘోర హింసాకాండతో... రాత్రి గతించితెల్ల వారింది...హత్యలకు, అబద్ధాలకు, అమానుషాలకు ప్రసిద్ధికెక్కిన గ్రేహౌండ్స్ మూక... సర్కిల్ రెడ్డి, ఎస్.ఐ నాగేంద్రచారిలు... తెల్లవారు జామున్నే నెత్తురు బట్టలతో ముద్దలవున్న ఇద్దరు వీరవనితలను చిత్రహింసలతో కొన ఊపిరికి తీసుకువచ్చి వుంచారు....

తెల్లవారుతోంది....గ్రేహౌండ్స్ మూకల చిత్ర హింసలతో కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్న స్వరూప, మానసల గుండెల్లో గుండ్లు దించారు.... బైనెట్లతో పోట్లు పొడిచారు.... ఇద్దరు వీరవనితల గుండెల్లో నుండి చిందిన నెత్తుర్లుతో తిమ్మాపూర్ అడవులు ఎర్ర బారినాయ్...సూర్యుడు ఎర్రెఎర్రగా వికసించాడు....

తూర్పున ఎర్రగా ఉదయించిన సూర్యున్ని సాక్షిగా ఆ ఇద్దరు వీరవనితలు తమ ఆత్మకథలను వినిపిస్తున్నారు....

వినండి నా సహచరులారా..

సాయుధ సమరంలో స్వరూప....

నాది భీంనగర్ గ్రామం. నా పేరు మొర్రిలక్ష్మి...కటిక పేదరిక కుటుంబంలో పుట్టిపెరిగినందుకు చదువు సంధ్యలకు నోచుకొని బాల్యం నాది. యుక్తవయస్సు రాగానే తల్లి తండ్రులుపెండ్లి చేసారు.. ఆ పెండ్లి పెడాకులు కాను. భర్తను నమ్ముకొని సంసారం చేయకపోతే...వాడిమీద యింతమన్ను పోయ.... సిగరేట్లతోని తొడలు కాల్చెటోడు..చెప్పుకుంటే సిగ్గుపొయ్యె. చిత్ర హింసలు పెట్టెటోడు....

చేసుకున్న భర్తను యిడ్చిపెట్టి, అవ్వగారింటికి వచ్చినా-భర్తను యిడ్చి

పెట్టినందుకు, ఆ పాపిష్టి భర్త దగ్గరకు పొమ్మని అన్నలు వదినల పోరు...కాళ్లు చేతులు ఆడని తల్లి దండ్రులు తలబాదుకున్నారు....... ఇన్ని పోరులమధ్య నా బ్రతుకుపోరు మొదలుపెట్టిన....

గ్రామ పెత్తందారు గంగరాజుకు వ్యతిరేకంగా,గ్రామమంతా ఒక్కటిగా నిల్చింది.....వర్గపోరాటం కొనసాగుతుంది.....వూళ్లె పెత్తందార్లకు వ్యతిరేకంగా సంఘం కదిలింది....అందులో ముందున్న. అణగారి వున్న నాలోని చైతన్యాన్ని వర్గపోరాటం మేల్కొలిపింది....

1995లో బీంగల్ దళంలో చేరినా...ఆ తర్వాత బాన్సువాడ, సిర్పపల్లి, కామారెడ్డి దళాలలో....ప్రజలను చైతన్యవంతం చేసుకుంటూ తిరిగినా. అనేక పోరాటాల ద్వారా ప్రజలు విజయాలు సాధించేలా పార్టీ నాయకత్వం అందించింది.... ప్రజల్లో విప్లవోత్సాహం పెల్లుబికింది....శత్రువు గుండెలు అదిరినాయ్....

ప్రజలకు నాయకత్వం వహిస్తున్న పార్టీని, దళాలను తుడిచివేయాలని శత్రువు రేయిపగలు తిరిగాడు...ప్రజలపై దాడులు చేసారు... దళాలపై ఎన్‌కౌంటర్స్ చేసారు.. అయినా శత్రువు చేస్తున్న పాశవిక దాడులను, ప్రజల కోటతో తిప్పికొట్టాము..గ్రామాలలో పోటీ రాజ్యం నెలకొంది.... ఆ ప్రజాస్వామిక రాజ్యంలో ప్రజల జీవితాలు వెల్లివిరిసాయ్....

చంద్రబాబు ప్రభుత్వం.... ప్రపంచ బ్యాంకు ఏజెంటు... సామ్రాజ్యవాదుల వద్దనుండి అరువు తెచ్చుకున్న అప్పులతో ఎల్.ఐ.సి యుద్ధవ్యూహాలతో విప్లవోద్యమంపై బహుముఖ దాడులు ఎక్కుపెట్టాడు.

నరహంతక చంద్రబాబు ఎన్‌కౌంటర్ పేరుతో నా సహచరులను ఎంతోమందిని చంపాడు...కౌన్సిలింగ్స్ పేరుతో విప్లవ కుటుంబాలను వేధించాడు.. అరిగొసబెట్టుడు.....

విప్లవోద్యమంపై లొంగుబాట్లును అస్త్రంగా, నజరానాలు ప్రకటించాడు చంద్రబాబు...కమ్యూనిస్టు సిద్ధాంతాలను, లొంగుబాట్లతో డబ్బులతో కొనాలనుకున్నాడు ప్రపంచబ్యాంకు ఏజెంటు.....విప్లవకారులపై దాడులకు, తోడేళ్ళ మూకలకు తర్ఫీదునిచ్చి, ఉసిగొల్పాడు...అలలు అలలుగా పురోగమించే ప్రజాయుద్ధాన్ని సామ్రాజ్యవాదులు, వారి తాబేదార్లు ఆపడం సాధ్యమవుతుందా?

కొంతమందిలో సుదీర్ఘ కాలంగా బలహీనతలు పెరిగిపోయినాయి. శత్రువు దాడికి...శత్రువు బీభత్సానికి గుండెలు నీరు కారిపోయిన పిడికెడు మంది వ్యక్తులు, శత్రువు ముందు తల వంచారు. అంతెందుకు నా సహచరుల్లారా...నేను విప్లవోద్యమంలోకి వచ్చిన తర్వాత, పార్టీ అనుమతితో పెండ్లిచేసుకున్న నా సహచరుడు పారిపోయి, శత్రువు ముందు మోకరిల్లాడు...ఇప్పుడు వాడొక ద్రోహి....ప్రజాయుద్ధం వాడిని శిక్షించాల్సివుంది....

ప్రజలను, కమ్యూనిస్టు సిద్ధాంతాలను నమ్ముకున్న నా విప్లవ సహచరులు...ఎన్నటికి శత్రువు ముందు తలవంచారు..కడవరకు ఆశయాన్ని వదలకుండ ఫాసిస్టు రాజ్య శత్రువుతో తలపడుతూ.... హోరాహోరి పోరాడుతూ నెలకొరిగారు...నేలకొరుగుతున్నారు.... ఎన్నో ఎన్నెన్నో బలిదానాలు చేయడానికి సంసిద్ధులై వున్నారు....

భవిష్యత్తును ఉజ్వలంగా వెలిగించడానికి కార్యోన్ముఖులై వున్నారు... వారంతా పురోగమిస్తున్న చరిత్రకు వారసులు.... ఇప్పుడు వర్తమానంలో అందుకు సజీవ సాక్ష్యం నేనే. నా సహచరుల్లారా...మీరంతా నేనెత్తిన ఎర్రజెండా కింద పోరాట ప్రభంజనమై లేవండి... సోషలిస్టురాజ్యాన్ని స్థాపించండి....

* * *

ఎర్రమందారమై వికసించిన మానస....

కామారెడ్డి దళంలో సభ్యురాల్ని.... సింగరాయపల్లి నా ఊరు. మాచారెడ్డి మండలం. తెనుగుకులంలో పురుడుపోసుకున్న. తల్లితండ్రులు చిన్నప్పుడే కాటికి పోయారు. అన్నవదినలే పెంచి పెద్ద చేసారు...తల్లిదండ్రులు లేని జీవితం ఎలాంటిదో మీకు తెలుసు కదా? కష్టాల కన్నీటి సంద్రం నా జీవితం..చదువు సంధ్యలు లేవు.... మొగోని లెక్క, నాగలిపట్టి భూములు దున్నిన....చెరుకుతోట పెట్టిన... చెరుకులో చెరుకు అయిన, అదే ఇల్లు అయింది...ఆ చెరుకు తోటలోనే తెల్లవారేది... పొద్దుకూకేది... మోదుబారి పోతున్న నాజీవితాన్ని వికసింప చేసుకోవడానికి, పోరు పాఠాలు చెరుకు తోటలోనే నేర్చుకున్న... దోపిడి, అన్యాయం, దౌర్జన్యం, అణిచివేత,పీడితుల ఆక్రందనలు... నిజామాబాద్ విప్లవోద్యమ పోరాట సవ్వడులను చెరుకుతోటనే విన్న. పీడిత జన సామాన్యానికి సేవ చేయాలని, పోరాట మార్గంలో పయనించడానికి సంవత్సరంన్నర క్రితం కామారెడ్డి దళంలో చేరిన... శత్రువు పెను నిర్బంధాల మధ్య పురోగమిస్తున్న క్రమంలో మద్దిమల్లలో మల్లయ్య ద్రోహంతో శత్రువుకు పట్టుపడ్డ...ఇవ్వాళ తెల్లవారు జామున శత్రువుచే హత్యకు గురి చేయపడ్డ...నీలి ఆకాశంలో ధగధగ మెరుస్తున్న రెపరెపలాడుతున్న ఎర్రజెండాకు నావంతు రక్తమిచ్చినా... నా పోరాట జెండాకు వన్నెతెచ్చినందుకు నాకు సంతృప్తి మిగిలింది...కామ్రేడ్స్....

ప్రజాయుద్ధ మార్గంలో పయనిస్తున్న నా ప్రజలారా........త్యాగానికి వెనుదీయని వారే మన సహచరులు, శత్రువుపై జాలిలేనివారే. మన స్నేహితులు......అనేది చారిత్రక సత్యం. మీకు వీలైయితే - పోరాట సంప్రదాయాలను సమున్నతంగా ఎత్తిపట్టి శత్రువు ఘోరాతి ఘోరమైన చిత్రహింసలు అమలయిన గ్రామాలను సందర్శించండి. వీరుల జీవిత చరిత్రలను భారత విప్లవ సంగ్రహంలో సువర్ణ అక్షరాలతో లిఖించండి..... మహోన్నతమైన కమ్యూనిజాన్ని ఈ భూమండలంపై నెలకొల్పడానికి పురోగమించండి....

(2003,నవంబర్‌లో శత్రువు చేసిన ఎన్‌కౌంటర్ కామ్రేడ్ స్వరూప (మొర్రిలక్ష్మి) కామారెడ్డి ఏరియా కమిటి కార్యదర్శి, కామ్రేడ్ మానస (లక్ష్మి) కామారెడ్డి దళ సభ్యురాలు.

# స్వీకారం

**ఆర్తారావం**

జాతశ్రీ కథలు వెల : రూ. 80/-

సృజనాలయ ప్రచురణలు, కొత్తగూడెం

ప్రతులకు : సృజనాలయం,

3-2-45/1,విద్యానగర్ కాలనీ, కొత్తగూడెం

**మూయని దర్వాజ**

చైతన్య ప్రకాష్ కవిత్వం వెల : రూ. 60/-

ఈరజాల ప్రచురణలు

ప్రతులకు : చినబాలు ఎల్లవ్వ,

పి.ఆర్. కొండాపూర్, వయా క్రిష్ణదాస్ పేట, కరీంనగర్ జిల్లా.

**కొన్నికావ్యాలు కొందరుకవులు**

ప్రాచీన, ఆధునిక తెలుగు కవిత్వం మీద వ్యాసాలు

రచన : రాచపాలెం చంద్రశేఖరరెడ్డి వెల : రూ. 142/-

ప్రతులకు : ఆర్.లక్ష్మి, 28-3-169,తారక్‌నాథ్ కాలనీ,అనంతపురం.

**సమ్మె**

సింగరేణి కథలు వెల : రూ. 30/-

శ్రమజీవి ప్రచురణలు

అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో దొరుకుతుంది.

**వెన్నెల బలపం**

కందుకూరి శ్రీరాములు కవిత్వం వెల : రూ. 50/-

ఝురీ పోయెట్రీ సర్కిల్,హైదరాబాద్.

అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో దొరుకుతుంది.




# రాచకార్యం

* గిదే ముపాసా
అనువాదం : జె. బాల్‌రెడ్డి

బెర్లిన్ అధికార పీఠం కుప్పకూలినట్లు అప్పుడప్పుడే పారిస్‌లో వార్త గుప్పుమంది. రిపబ్లిక్ ప్రకటించారు. కూటమి రాజ్యాల అధికారం ప్రకటించే వరకు ఫ్రాన్స్ ఫ్రాన్సంతా వెర్రెత్తి ఉద్రూతలూగింది. దేశం ఆ కొననుంచి ఈ కొనదాకా ప్రతి మనిషి సైనికుడై వ్యవహరించాడు. టోపీలు తయారుచేసే వారు కల్నల్స్ అయ్యారు. ఏకంగా జనరల్ పదవికే ఎగబాకడానికి కలలుగన్నారు. భారీ ఊబకాయాలు ఒంటికి రివాల్వర్లు, చురకత్తుల ఒరలు చుట్టుకున్నాయి. వేలాడే ఎర్రటి ఒరల్లో వాటిని దర్పంగా వేలాడదీసుకున్నారు. మాములు మనుషులు యుద్ధ వీరులయ్యారు. స్వచ్ఛంద సైనికులతో బారులు తీరిన బెటాలియన్లను నడిపే నాయకులయ్యారు. ఎవరికి వారే తమ గొప్పను చాటుకొనే ప్రయత్నం చేస్తున్నారు. స్వచ్ఛందంగా ముందుకు వచ్చి సైనికుల్లా ప్రమాణాలు చేస్తున్నారు.

ఇప్పటివరకైతే ఆయుధాలు ధరించడానికి, తుపాకులు చేతబూనడానికి అక్కడ ఒక పద్ధతి పాడు ఏమీ లేవు. ఎవరు ముందొస్తే వారికే అన్న చందంగా ఆయుధం, అధికారం అందిపోతున్నాయి. అలా అధికారం అందుకున్నవారు దారినపోయే అమాయకుల అసువులు తీశారు. సరిహద్దునున్న జర్మన్ల బంజర్ల దాకా ఊరువాడ కలియ దిరుగుతున్నారు. ప్రపంచం ఏమి పట్టనట్టు గడ్డి పరకల్ని నమిలే గంగి గోవుల్ని, బీళ్లమీదకు మేతకొదిలిన బక్కచిక్కిన గుర్రాల్ని, వీధిన తిరిగే ఊర కుక్కల్ని కాల్చిచంపుతున్నారు. సాగుతున్న మిలటరి వ్యవహారాల్లో తమదే గొప్ప పాత్రని ఎవరికి వారే గట్టిగా నమ్ముతున్నారు. ఊరు చివరున్న టీ హోటల్ దగ్గర, కమ్మరి కొలిమి దగ్గర ఒడ్లాయన దాతి దగ్గర వివిధ చేతి వృత్తుల వాళ్ళు మిలటరి డ్రెస్సుల్లో కనిపిస్తున్నారు. అవన్నీ మిలటరీ బ్యారెక్స్‌లాగా, ఫీల్డ్ ఆస్పత్రులాగా కనిపిస్తున్నాయి.

రాజధాని అధికారం గురించి, కదం తొక్కే మిలటరి కవాతుల గురించి ఉద్రిక్త వార్తలేవి కేన్స్ పట్టణాన్ని చేరడం లేదు. ఏదెట్లున్నా ఒక నెల కాలంగా గొప్ప ఆందోళనలు సాగుతున్నాయి. రాజకీయ పార్టీలు ఒకదానిమీద ఒకటి దాడులు ప్రతి దాడులకు పాల్పడుతున్నాయి. వర్నెతో (జిల్లా అధికారి) విస్కాంట్. ఆ పట్టణానికి మేయర్. పొట్టి బక్కపల్చటి మనిషి. అప్పటికే వయోవృద్ధుడు. ఆయనే ఇప్పుడిక్కడ ప్రష్యన్ సామ్రాజ్యానికి ప్రతినిధి. రిపబ్లికన్ పార్టీ నాయకుడు డాక్టర్ మార్కెట్ ఒక్కడే ఆయనకు ప్రమాదకరంగా కనపడుతున్నడు. మార్సెల్ మాసోనిక్ లాడ్జీకి, వ్యవసాయ సహకార సంఘానికి, అగ్నిమాపక శాఖకు అధ్యక్షుడు. దేశ రక్షణకు రూపొందించిన గ్రామీణ పౌరసైన్యానికి ఆర్గనైజర్. రెండువారాల్లో డాక్టర్ మార్సెల్ అరవై మూడుమందిని స్వచ్ఛంద పటాలాల్లో సమీకరించాడు. పెండ్లయిన వాళ్ళు. కుటుంబానికి ఆదెరువైన తండ్రులు, దూరదృష్టిగల పెద్దరైతులు, పుర వ్యాపారులు ఆయన భర్తీ చేసి సైనికులు. వీరందరితో పొద్దునె మేయర్ భవనం కిటీకి ఎదురుగా కవాతు సాగుతుంది. మేయర్ కనబడి కనబడగానే కమాండర్ మార్సెల్ పిస్తోళ్ళున్న అంగరక్షకుల నడుమ డాబుసరిగా ముందుకు వెనుకకు పటాలం మందు నడుస్తాడు. "మన రాజ్యం వర్ధిల్లాలి..మనదేశం వర్ధిల్లాలి" - అదిరి పోయేలా అరిచి అరిచి నినాదాలిస్తాడు. మేయర్ భవనంలో ఉన్నవాళ్లది గమనిస్తూనే ఉన్నారు. ఇదంతా జిల్లాధికారికొడుక్కు చిరాకు తెప్పించింది. ఇప్పటివరకు ఇలాంటి బెదిరింపులు, అదిరింపులు, విశ్వాసఘాతకం చూసి ఎరగడు. ఇవి మహా విప్లవం నాటి దుస్వప్నాలను గుర్తుకు తెస్తున్నట్లున్నాయి.

ఆరోజు సెప్టెంబర్ 5. కమాండర్ డాక్టర్ మార్సెల్ ఉదయాన్నే యూనిఫారమ్ ధరించి తన కన్సెల్టింగ్ రూమ్‌లో కూర్చున్నాడు. టెబుల్‌మీద రివాల్వార్ పడి ఉంది. ఆరోజయాన ఒక వృద్ధ రైతు దంపతులకు అపాయింట్‌మెంట్ ఇచ్చాడు. ఆ రైతు దీర్ఘకాలంగా వెరికోస్ వెయిన్స్ వ్యాధితో బాధపడుతున్నాడు. ఒక్కడే టౌన్ కెళ్లి వైద్యుడిని కలవడమెందుకులే భార్యకు కూడా వచ్చాకా జోడుగా వెళ్లి చూపించుకోవచ్చని వాయిదా వేస్తూ వచ్చాడు. ఇపుడా భార్యకు అదే వ్యాధి వచ్చింది. వాళ్ళూరికి దినపత్రిక తెచ్చె పోస్టుమేన్ సలహామీద ఇప్పుడిద్దరు కలిసి మార్సెల్‌ను కలవడానికి వచ్చారు.

డాక్టర్ మార్సెల్ తలుపు తీశారు. ఒక్కసారిగా ఆయన మొఖం పాలిపోయింది. హఠాత్తుగా నిటారుగా నిలబడ్డాడు..గౌరవ వందనం స్వీకరించే సేనానిలా ఆకాశంలోకి చేయెత్తాడు. శక్తినంత కూడగట్టుకొని గట్టిగా నినాదలందుకున్నాడు. బిగబట్టిన ఊపిరితో శక్తి కొద్ది అరిచె అరుపులకు మొఖమంతా ఉబ్బరించి భయంకరంగా ముడతలు పడింది."వర్ధిల్లాలి రిపబ్లిక్. రిపబ్లిక్ వర్ధిల్లాలి. వర్ధిల్లాలి రిపబ్లిక్"-పిక్కటిల్లేలా అరిచాడు. తరువాత ఉద్వేగం ఉసూరుమంది. నీరసంగా వాలు కుర్చీలో చేరబడ్డాడు. కాళ్ల నరాల్లో చీమలు బారినట్లవుతుందని రైతు తన బాధను తాను చెప్పుకుపోతున్నాడు. డాక్టర్ ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ "ఏయ్ కొంచెం శాంతించు మూర్ఖుడా ఇప్పటికే మీ కోసం చాల సమయం వృధా చేశాను. గణతంత్రం ప్రకటించారు. చక్రవర్తి ఖైదీ అయ్యాడు. ఫ్రాన్స్ విముక్తయ్యింది. "వర్ధిల్లాలి రిపబ్లిక్" అంటూ తలుపు వరకూ పరిగెత్తాడు. మెల్లగా "సెలెస్ట్.... సెలెస్ట్ తొందరగా రా" - కేకేశాడు.

భయపడుతూ పనిమనిషి పరిగెత్తుకొచ్చింది. మార్సెల్ తొందరగా మాట్లాడే క్రమంలో తత్తర పడుతున్నాడు. "నా బూట్లు..ఖడ్గం.నా తూటాల బాక్స్. ఆ....ఆ.......నా స్పానిష్ డాగర్... అది నా నైట్ టెబుల్ మీద ఉంది. త్వరగా..హు త్వరగా" ఆర్డర్ వేశాడు. ఆశావాదైన రైతు డాక్టర్ ఆగడమే అవకాశం తీసుకొని "చూస్తుంటే కాళ్లలో ఏవో పురుగులు పారుతున్నట్లనిపిస్తుంది. నడుస్తుంటే బాగా బాధ కలుగుతుంది"-

విసిగిపోయిన డాక్టర్ కోపంతో "ఆగవయ్యా! దేవుడి తోడు మీరు ఎప్పటికప్పుడు కాళ్ళు కడుక్కుంటే ఈ జబ్బే వచ్చేదే కాదు."- అతని మెడమీద చేయివేసి మొఖం ముందుకు గుంజుకొని "మూర్ఖుడా నీకు అర్థం కావడం లేదా? మనం రిపబ్లిక్‌లో జీవిస్తున్నా" మంటూ బుసలు కొట్టాడు. హఠాత్తుగా తన వృత్తి ధర్మం గుర్తుకొచ్చింది. వెంటనే ప్రశాంతంగా మారిపోయాడు. వృద్ధ దంపతులు విస్మయంతో వీధిలోకి వెళ్ళారు."రేపునుండి మిత్రులారా! రేపురండి. నాకీరోజు అస్సలు టైం లేదు"- పదే పదే అవే మాటలు చెప్తున్నాడు డాక్టర్ మార్సెల్.

ఆపాద మస్తకం తన సైనికాలంకారాలు తగిలించుకుంటూ మరో వరుస ఆజ్ఞలు జారీ చేశాడు.

"పరిగెట్టు లెఫ్టినెంట్ పికార్డు, సబ్‌లెఫ్టినెంట్ పామ్మెల్‌లను ఉన్నపళంగా నా దగ్గరుండాలని చెప్పు....ఆ...అలాగే టార్చ్‌బోఫ్‌ను కూడా..అతని ఢంకా తీసుకొని రమ్మను. ఉహు...ఇక్కడున్నట్లు రావాలి" - సెబెస్ట్ వెళ్లగానే ఆలోచనలను కూడగట్టుకొంటున్నాడు. గడ్డు పరిస్థితులను గట్టెక్కాలని సిద్ధమౌతున్నాడు...

ముగ్గురు కట్టగట్టుకొని కలిసే వచ్చారు. మార్సెల్‌కు వారిని చూసి ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. ముగ్గురికి ముగ్గురు పనిమీద వేసుకొనే బట్టలే వేసుకున్నారు. సైనిక విధులకు హాజరైనప్పుడు యూనిఫారమ్ ధరించాలనే స్పృహ అయినా వారికున్నట్లు లేదు.

"మీకు ఇంకా ఏమీ తెలియదా? చక్రవర్తిని ఖైదు చేశారు. రిపబ్లిక్‌ను ప్రకటించారు. నా పరిస్థితి చాల క్లిష్టంగా ఉంది. నిజంగా ఇది ఆపత్కాలం"- ఆశ్చర్యం మొఖాల మీద పేరుకుపోయిన అనుచరుల ప్రతిస్పందనకోసం ఒక నిమిషం చూసి తిరిగి కొనసాగించాడు. "ఇంకా వెనుకాముందు చూడొద్దు. ఇక మనం చర్యకు దిగకతప్పదు. ఇప్పుడు ప్రతి నిమిషం విలువయింది. నిర్ణయాల ఖచ్చితత్వం మీదే అంతా ఆధారపడి ఉంటుంది. పికార్ వెళ్లు, వెళ్లి క్యూరేట్‌ను ఎక్కడున్నాడో చూడు. అందర్ని అలెర్ట్ చేస్తూ గంటమోగించి నెనక్కడికి వచ్చేసరికి అందరిని సమీకరించు. టార్చ్‌బఫ్ నీవు...నీవు ఢంకా వాయించి మిలిషియాను ఆయుధాలతో సెంటర్‌లో హాజరు కమ్మను. గెరిసే, స్మల్‌మార్

వంటి దూరప్రాంత పల్లెలకు కూడా కబురు చేరాలి. ఆఁ... పామ్మెల్ వెళ్ళు... వెళ్లి వెంటనే యూనిఫారం వేసుకో. జాకెట్, టోపి మర్చిపోవద్దు. అందరం కదిలి వెళ్లి మేయర్ కార్యాలయం స్వాధీనం చేసుకోవాలి. వెంటనే విస్కొంట్(జిల్లా అధికారి) వెర్నెతో‌కు ఆదేశాలు పంపించు. అధికారం వెంటనే నాకు బదలాయించమను. అర్థమయ్యిందా?."-

"ఆ సరే"

"పదా... అయితే పని పక్కాగా ఉండాలి. నేను నీ ఇంటి వరకు నీతోడొస్తా, పామ్మెల్...ఇకమీద మనమంతా ఒక్కతాటి మీద పనిచేయాలి".- 5 నిమిషాల తర్వాత కమాండర్ అతని అనుచరులు ఆయుధాలతో వీధి కూడలికి చేరుకున్నారు. వీరంతా కూడిన సమయానికి విస్కొంట్ (జిల్లా అధికారి) వెర్నెతో కొడుకు వేట బరిసె పట్టుకొని భుజం మీద రైఫిల్ పెట్టుకొని పక్కవీధినుండి వస్తూ కనిపించాడు. బిరాబిరా నడుస్తున్న అతగాడికి ఇరువైపుల ఆకు పచ్చటి జాకెట్లు వేసుకున్న అంగరక్షకులనుసరిస్తున్నారు. అందరి ఒరలో కత్తులు. భుజాలమీద తుపాకులున్నాయి. వెళ్తూ వెళ్తూ డాక్టర మార్సెల చెంప చెళ్లు మనిపించారు. ఆ దెబ్బకు దిమ్మదిరిగి అచేతనంగా అలాగే నిలబడిపోయాడు. ఆ నలుగురు మేయర్ భవనంలోకి వెళ్లారు. వెంటనే తలుపు మూసుకుంది.

"మనవాళ్లను కొనేశారు" - డాక్టర్ గొనుక్కున్నాడు. "ఇక తప్పదు వేచి చూడాల్సిందే. ముందు బలగాల్ని పునఃసంఘటితం చేయాలి. ఈ పావుగంటలో ఏమి చేయలేం"-ఇంతలో లెఫ్టినెంట పికార్డ్ కనిపించాడు. "క్యూరేట్ మీ అజ్ఞలను ధిక్కరించాడు. అతను బిడేల్, పోర్టర్లతో కలిసి చర్చిలో తలుపేసుకొని ఉండిపోయాడ"ని కబురు తెలిపాడు.- కూడలికి అటువైపున తెల్లటి మేయర్ భవనం. పక్కనే చర్చి. ఇనుప కమ్ములతో బిగించిన భారీ ఓక్ ద్వారాలు. అంతా నిశ్శబ్దం. దిగ్బంధం.

చుట్టుపక్కల వాళ్ళంతా ఆశ్చర్యపోతున్నారు. ఇండ్లకిటికీల సందుల్లోంచి, అరుగుల మీద నిలబడి వింతగా చూస్తున్నారు. బేరిని దొర్లిస్తున్న చప్పుడు వినిపించింది. ఆ వెంటే టార్చిబోఫ్ కనిపించాడు. అతను వెర్రి కోపంతో 'తీన్‌మార్' వాయిస్తున్నాడు. అది అందరు ఆయుధాలతో సిద్ధం కావాలనే సూచన. క్రమశిక్షణతో క్రమబద్ధమైన అడుగులతో కూడలి దాటి గ్రామాల వైపుగా అదృశ్యమయ్యాడు.

కమాండర్ మార్సెల్ యుద్ధఖడ్గాన్ని దూశాడు. ఒక్కడే రెండు భవనాల మధ్య శత్రువు నిర్మించిన బారికేడ్ వరకు వెళ్లి చేయి తల ఎత్తుంటా లేపి కత్తి గాల్లో తిప్పాడు. డొక్కలు పికిలిపోయే ఊపిరితో"రిపబ్లిక్ వర్ధిల్లాలి. విద్రోహులు హతమవ్వాలి" - అరిచి ఎగిరి వెనుకకు మర్లాడు. అతని అనుచర అధికారున్న చోటికి చేరుకున్నాడు. మాంసం దుకాణం యాజమాని, బేకరి ఓనర్, నాడీ వైద్యుడు అయోమయంగా చూస్తున్నారు. షట్టర్లను కిందికి గుంజారు. దుకాణాలను మూసేశారు. కిరాణ దుకాణమొక్కటే తెరిచి ఉంది.

మిలిషియా సైనికులు చిన్న చిన్నగా వచ్చి చేరుకుంటున్నారు. మనిషికో తీరు బట్టలు ధరించారు. అయితే అందరి నెత్తిమీద టోపీలు మాత్రమున్నాయి. మొత్తంగా సైనిక యూనిఫారానికి అదొక్కటే గుర్తుగా ఉంది. తుప్పుపట్టిన నాటు, మోటు తుపాకులు. ముప్పై ఏళ్ళ నుంచి అవి ఇంటి పొగగొట్టాల్లో, చూరుల్లో పెట్టినట్టున్నారు. నల్లగా కదురూపం పట్టి ఉన్నాయి. గ్రామీణ బలగంలా నిశ్శబ్దంగా చూస్తున్నారు. కమాండర్ చుట్టు మూగిన ఓ ముప్పై మందికి ఆయన రాజ్యవ్యవహారాలు వివరించాడు. అటువైపున్న మేజర్ వైపు తిరిగి "ఇప్పుడు మనం దాడి మొదలు పెట్టాలి" - "లెఫ్టినెంట్ పికార్డ్! మేయర్ భవనం కిటికీలను ఆక్రమించుకో! రిపబ్లిక్ అధికారామోదానికి సూచికగా ఖాళీ చేసి నాకప్పగించమని తెలుపు"

లెఫ్టినెంట్ పికార్డ్ నొకెత్తులోడు - "నేను చేయనని" తిరస్కరించాడు. "నీయమ్మా కోతి వెధవ! నన్ను టార్గెట్ చేద్దామనే...ఆ...వాళ్ళు గురివిందను కూడా కొట్టే గురికాళ్ళు అది తెలుసా నీకూ? అయ్యా నమస్తే.... ధన్యవాదాలు. నీ దాడి పథకం నీవే అమలు పర్చుకో". కమాండర్ మార్సెల్ ఉగ్రుడయ్యాడు."నేనా జ్ఞాపిస్తున్నా!. నీవు కదిలి వెళ్ళాల్సిందే. అది క్రమశిక్షణ" శాసించాడు.

"ఎందుకెందో తెలియకుండా నా మొఖం బద్దలు కొట్టుకోవడానికి సిద్ధంగా లేను" లెఫ్టినెంట్ పికార్డ్ జవాబు.

చుట్టున్న మంది మీద దాని ప్రభావం పడింది. వాళ్లు నవ్వుతున్నారు. గుంపులోంచొకడు "పికార్డ్ నీవే రైట్. దాడికిది సరైన సమయం కాదు"-డాక్టర్ ఎగపోస్తూ "మూర్ఖులు" - గొణిగాడు. అతని కత్తి, రివాల్వర్ పక్కనున్న సైనికుని చేతిలో పెట్టి, అడుగులో నేలను కొలుస్తున్నట్టుగా ముందుకు కదిలాడు. కండ్లు మాత్రం మేయర్ భవనం కిటికీలనే చూస్తున్నాయి. ఏ తుపాకి, ఏ ఫిరంగి గురిచూస్తున్నాయేమోనని అదురు.

మరో నాలుగడుగుల్లో భవనాన్ని చేరుతాడనగా దానికి రెండు చివర్లలో ఉన్న పాఠశాలల ప్రవేశ ద్వారాల్ని తెరిచారు. చిన్నారులు ఒకేసారి వరదలా వచ్చిపడ్డారు. అబ్బాయిలు ఒక వైపునుంచి అమ్మాయిలు మరోవైపు నుంచి వచ్చి ఆరు బయట స్థలంలో ఆనందంతో ఆడుకోవడం మొదలుపెట్టారు. ఆనందంతో కేరింతలు కొడుతూ ఆకాశాన్ని క్రమించిన పక్షుల్లా డాక్టర్‌ను చుట్టుముట్టారు. ఆయనకది అరుదైన అనుభవం. ఏమి పాలుపోక కళవెళ పడ్డాడు.

చివరకు తలుపులు మూసేశాడు. పిల్లకోతులు చాలమట్టుకు చెదిరిపోయారు. కమాండర్ మార్సెల్ గొంతెత్తి బిగ్గరగా పిలిచాడు.-'మిస్టర్ వర్నెతో?" చివరికు మొదటి అంతస్తులోని ఒక కిటికీ తెరుచుకుంది. అందులోంచి వెర్నెతో కనిపించాడు.

కమాండర్ చెప్పడం మొదలుపెట్టాడు "అయ్యా! మీకు ఈ పాటికి ప్రభుత్వ వ్యవస్థను మార్చిన పరిణామాలు తెలిసే ఉంటాయి. ఇప్పుడు మీరు ప్రాతినిధ్యం వహించే పార్టీ ఉనికిలో లేదు. మా రిపబ్లికన్ల పక్షం అధికారంలోకి వచ్చింది. ఈ పరిస్థితి విషాదకరమైనా తప్పనిసరి పరిస్థితుల్లో మిమ్మల్ని అడగాల్సి వస్తుంది. కొత్తగా అవతరించిన రిపబ్లిక్ సాక్షిగా మీరు అధికారాన్ని నా చేతిలో పెట్టాల్సి వుంది".

జిల్లాధికారి వెర్నెంతో"డాక్టర్ మార్సెల్ నేను ఈక్యాని పట్టణానికి మేయర్‌ను. అదీ ఉచితానుచితాలు తెలిసిన అధికారులు జరిపిన నియామకం. మేయర్ పదవిని రద్దుపర్చేవరకు నేనే ఈ పట్టణానికి మేయర్‌ను. అదినిన్ను నియమించిన ఉన్నతాధికారులు చేస్తేనే సాధ్యం. మేయర్‌గా నేను ఈ భవనంలో ఉండాలి, ఉన్నాను. ఉంటాను. మీకింకేమైనా కావాలంటే...నన్నిక్కడి నుంచి బయటకు పంపించే ప్రయత్నంచేసి చూడు"- ధాటిగా సమాధానం చెప్పి కిటికీ మూసుకున్నాడు.

కమాండర్ తన బలగాలను చేరుకున్నాడు. విషయం వివరించే ముందు లెఫ్టినెంట్ పికార్డ్‌ను ఎగాదిగా చూసి"మూర్ఖుడా! పిరికిబోతు. నీవలన సైన్యానికే అగౌరవం. ఈ క్షణమే నీ హోదా తగ్గిస్తున్నా!"- అన్నాడు.

లెఫ్టినెంట్ పికార్డ్ తిరుగు జవాబుగా "నీవు తగ్గించేదేంది. నాకు నేనే తగ్గించుకుంటున్నా" - అంటూ అక్కడే గుసగుసలాడుతున్న ఓ గుంపులో దూరాడు

డాక్టర్ సందేహించాడు. ఏం చేయాలిప్పుడు? దాడి చేయాలా? చేస్తే ఈ సైన్యం నా అజ్ఞలు పాటిస్తుందా? నిజంగా దాడికి ఇది సమయమేనా? అతనికి మెరుపులా ఒక ఆలోచనొచ్చింది. కూడలికి ఆవలివైపున్న టెలిగ్రాఫ్ ఆఫీసుకు పరిగెట్టాడు. "పారిస్‌లోని రిపబ్లికన్ ప్రభుత్వానికి". "నూతన రిపబ్లిక్ అధికారులకు, దిగువ సియాన్ నది. రొయేన్. "నూతన రిపబ్లిక్ ఉపవిభాగం, దిఇపే" హడావిడిగా మూడు టెలిగ్రాములు పంపాడు. టెలిగ్రామ్‌లలో పరిస్థితిని సవివరంగా పేర్కొన్నాడు. నియంతృత్వాధికారి మేయర్ వలన కూటమి రాజ్యాలకు రాబోతున్న ప్రమాదాన్ని వివరించాడు. తన విశ్వసనీయమైన సేవల అందుబాటును పేర్కొన్నాడు. తన పేరుమీద అధికార మార్పిడికి ఆజ్ఞాపత్రాలను పంపించవలసిందిగా కోరాడు. తర్వాత వెనుదిరిగి తన బలగాల వద్దకు చేరుకున్నాడు. వెళ్తూనే జేబు నుంచి ఒక పది ఫ్రాంకుల నోటును బయటకు

తీశాడు-"మిత్రులారా!! వెళ్లి ఏదైనా తిని తాగండి. ఒక పదిమంది దళాన్ని మాత్రం ఇక్కడ వదిలిపెట్టండి. అట్లయితే మేయరు భవనం నుంచి ఎవ్వరూ బయటకు వెళ్ళరు". - అని ఆదేశాలిచ్చారు.

మాజీ లెఫ్టినెంట్ పికార్డు అక్కడే ఒక వాచీల రిపేరీదారుతో పిచ్చాపాటిలో ఉన్నాడు. ఈ మాటలు విన్నంతనే చిన్నగా దగ్గి "క్షమించండి. ఒకవేళ వాళ్లు బయటకు పోతే.... లోపటికెళ్లడానికి మీకది చక్కటి అవకాశం అది కాకపోతే మీరు లోపటికి వెళ్ళేదారి నాకైతే కనిపించడంలేదు".అన్నాడు.

డాక్టర్ ఏ జవాబు ఇవ్వకుండానే అక్కడినుండి... భోజనానికి వెళ్లాడు. ఆ మధ్యాహ్నం అన్ని కార్యాలయాలను వదిలి ఏ అద్భుతమో, ఆశ్చర్యమో కలిగించే వార్త వింటానేమోననే ఆశతో అనేకమార్లు మేయర్ భవనం చర్చీల మధ్య కాలుగాలిన పిల్లిలా తిరిగాడు. అనుమానించాల్సిన విషయమేది అక్కడ కన్పించలేదు.భవనంలో మనుసుల అలికిడి లేక బోసిపోయినట్లనిపించింది.

కటికె దుకాణం, బేకరి ఓనర్, నాడీవైద్యుడు దుకాణాలను తెరిచారు. మెట్లరుగు మీద నిలబడి పిచ్చాపాటి వేసుకుంటున్నారు. చక్రవర్తి బందీ అయ్యాడంటే ఎక్కడో, ఎవడో ద్రోహి ఉండే ఉంటాడు. కొత్త ప్రభుత్వం శిస్తు వసూళ్లు చేయడం కష్టమేనని తేల్చారు.

రాత్రయ్యింది. 9 గంటల వేళ డాక్టర్ ఒక్కడే సడిచప్పుడు లేకుండా మేయరు భవనం చేరుకున్నాడు. ఇక ఈ దెబ్బతో కష్టాలు గట్టెక్కినట్లేనని భావించాడు. తలుపులు బద్దలు కొడదామని పిక్కాసుతో నాలుగు దెబ్బలేసాడు. గార్డు గొంతు బొబ్బరించింది. "ఎవరక్కడా?" - డాక్టర్ మార్సెల్ వెనుకకు తిరిగాడు. రిట్రీట్......కాళ్లేపితే దుమ్మేకనబడుతోంది.

మరోరోజు తెల్లారింది. పరిస్థితుల్లో మార్పేమీ లేదు. మిలిషియా సభ్యులు ఆయుధాలతో సెంటర్లో హాజరయ్యారు. చుట్టుపక్కల జనాలు గుమిగూడి ఎదురు చూస్తున్నారు. ఆసక్తి అంతా పరిష్కారం ఏమిటనే, చుట్టు పక్కల గ్రామాలనుండి కూడా జనాలు ఏం జరుగుతుందో చూద్దామని వస్తున్నారు. చివరాకరికి డాక్టర్‌కు అర్థమయ్యింది. పరువు మర్యాదలు మైలపడుతున్నాయిని.

"ఏదోరకంగా ఏదో ఒకటి చేసి పరిష్కారం చూడాలి"- అప్పుడే టెలిగ్రాఫ్ ఆఫీసు తలుపులు తెరుచుకున్నాయి. అధికారిణి సేవిక చేతుల్లో రెండు పేపర్లు పట్టుకొని వస్తుంది. ఒక్కసారే మార్సెల్‌కు పోయే ఊపిరి తిరిగొచ్చినట్లయింది.

ఆమె నేరుగా కమాండర్ దగ్గరికి కొచ్చి ఒక ఈ టెలిగ్రామ్ కాగితం ఇచ్చింది. తిరిగి కూడలి దాటింది. అక్కడున్న వారి కండ్లన్ని ఆమె మీదే ఉన్నాయి.తలవంచుకొని మందగమనంతో బారికేడ్లకు ఆవల ఉన్న తలుపును మెత్తగా తట్టింది. తలుపు కొంచెం తెరుచుకుంది. ఆ సందులోంచి ఓ చేయి ముందుకు వచ్చి ఆ టెలిగ్రామ్ కాగితాన్ని అందుకుంది. ఆ అమ్మాయి వెనుదిరిగింది. జనాల చూపులకు సిగ్గుతో కందిపోయి, కండ్లు ఏడవడానికి సిద్ధంగా ఉన్నాయి. తలవంచుకొని మందగమనంతో బారికేడ్లకు ఆవల ఉన్న తలుపును మెత్తగా తట్టింది. తలుపు కొంతే తెరుచుకుంది. ఆ సందులోంచి ఓ చేయి ముందుకు వచ్చి ఆ టెలిగ్రామ్ అందుకుంది. ఆ అమ్మాయి వెనుదిరిగింది. జనాల చూపులకు సిగ్గుతో కందిపోయి, కండ్లు ఏడవడానికి సిద్ధంగా ఉన్నాయి.

డాక్టర్ అతృత నిండిన గొంతుతో"దయచేసి కొద్దిగా నిశ్శబ్దంగా ఉండండి" - అందరు ఒకింత మౌనందాల్చారు. గర్వంగా"ఇదో సమాచార పత్రం. నేనిది ప్రభుత్వం నుంచి అందుకున్నాను" అంటూ కాగితాన్ని గాలిలో ఊపి చదవడం మొదలుపెట్టాడు.

"పాత మేయరును తొలిగించాం. అత్యవసరాలేమిటో సూచించండి. తక్కిన ఆదేశాలు తర్వాత" -ఫర్ది సబ్ ఫర్‌ఫెక్ట్ సాపిన్. కౌన్సిలర్. అతను ఉబ్బితబ్బిబై పోతున్నాడు. గుండె ఆనందంతో ఉప్పొంగి పోయింది. అతని చేతులు వనుకుతున్నాయి. కమాండర్ మాజీ అనుచరుడు లెఫ్టినెంట్ పికార్డ్ పక్క గుంపులోంచి అరిచే గొంతుతో "అది సరే - ఆ మేయర్ భవనం ఖాళీ చేసి వెళ్లనంటే, నీ కాయితం అధికారం చేస్తుందా?" - అన్నాడు.

డాక్టర్ మొఖం పాలిపోయింది. ఒక వేళ వాళ్ళు ఆజ్ఞలు అమలు పర్చి బయటికెళ్ళకపోతే అతను అడుగు ముందుకేయకతప్పదు. అది హక్కు కాదు బాధ్యత. మేయర్ భవనం వైపు బాధ క్రోధం కలెగలిసిన చూపొకటి చూశాడు. శత్రువు తనకు తానుగా తలుపు తెరుస్తాడని ఆశ, కాని అవి మూసుకొనే ఉంది. ఏం చేయాలి? మిలిషియా చుట్టు గుంపు పెరుగుతోంది. కొందరు నవ్వుతున్నారు. ప్రత్యేకించి ఒక ఆలోచన మరింత బాధిస్తోంది. ఒకవేళ తానేగనుక తెగించి దాడిచేస్తే తప్పనిసరిగా తానేముందు వరుసలో నిలబడాలి. మేయర్ వెర్నెతో అంగరక్షకులు ప్రధానంగా తనకే గురిపెడతారు. ఒకవేళ తను చస్తే పోరాటం అంతమౌతుంది. అంతా ఆఖరవుతుంది. అందులోనూ వాళ్ళు పక్కా గురికాళ్ళు, దెబ్బతప్పరు. ఆ మాట ఇందాకే పికార్డ్ గుర్తు చేశాడు.

అంతే ఒక కొత్తాలోచన ఆక్రమించిందతని మనస్సును. అటు తిరిగి పొమ్మెల్‌తో "త్వరగా వెళ్లు. వెళ్ళి ఆ నాడి వైద్యుని ఒక గెడకర్ర, ఒక తుండుగుడ్డను నాకు పంపించుమను" లెఫ్టినెంట్ అలాగే ఆత్రపడ్డాడు. డాక్టర్‌గారు రాజకీయ బ్యానర్ చేయనున్నాడు. తెల్లది. అది బహుశ ఆ వృద్ధ చట్టపారాయణ వాద (నియతివాద) మేయరు మనస్సును సంతృప్తి పర్చవచ్చు.

పొమ్మెల్ లెనియన్ గుడ్డ, ఒక బూజు దులిపి కర్రతీసుకొని వచ్చాడు. ఆ చేత్తోనే నాలుగు దారపు పోసలు. వాటిని మార్సెల్ రెండు చేతుల్తో అందుకున్నాడు. మరోసారి మేయర్ భవనంవైపు అడుగేశాడు. శాంతి పతాకంతో మేయర్ ముందుకెళ్తున్నాడు. తలుపు ముందు నిలబడి" వెర్నెతోగారూ" - పిలిచాడు.

హఠాత్తుగా తలుపులు తెరుచుకున్నాయి. వెర్నెతో ముగ్గురు అంగరక్షకులతో గడపలో ప్రత్యక్షమయ్యాడు. డాక్టర్ దిగ్గున ఒకడుగు వెనుకకేశాడు. వెంటనే శత్రువుకు గౌరవపూర్వకంగా నమస్కరించాడు. ఉద్వేగంతో గొంతు తడబడుతుండగా "సార్ నేను.... ఇప్పుడే నాకొచ్చిన ఆదేశాలను మీకు వివరించాలని వచ్చాను".

మేయర్ ప్రతి నమస్కారం కూడా చేయలేదు

"సార్ నేను విరమించు కుంటున్నాను. కానీ నేనిది భయంతోనో, అధికారం నుంచివైదొలిగిన ఆ నీచ ప్రభుత్వానికి విధేయతతోనో కాదని అర్థం చేసుకోవాలి" - మార్సెల్ మాట పూర్తవలేదు.

"రిపబ్లిక్ ఒక్కరోజు కూడా అధికారంలో ఉండి పాలన చేయాలని నేను కోరుకోవడం లేదు.'అంతే" - అన్నాడు మేయర్

మార్సెల్ ఆశ్చర్యంతో అప్రతిభుడయ్యాడు. నోట మాట రాలేదు. అంగరక్షకులు వెంటరాగా వెర్నెంతో విసావిసా నడిచి వెళ్ళాడు.

డాక్టర్ ఒకింత దిగులు పడ్డాడు. మూగివున్న జనంవైపు కదిలాడు. మరో పదడుగుల్లో జనాలను సమీపించేంతలో "హుర్రే రిపబ్లిక్ అన్నింటా విజయాలు సాధిస్తూ పురోగమిస్తుంది" - పెద్దగా అరిచాడు.

మూగిన జనాల్లో ఏలాంటి స్పందన లేదు. ఆయన మళ్ళీ మరో ప్రయత్నం చేశాడు. "ప్రజలు స్వేచ్ఛాజీవులు. మీరంతా స్వతంత్రులు. మీకు స్వేచ్ఛ లభించింది మీకర్థమయ్యిందా? ఇందుకు మీరు గర్వించాలి"

అసంఖ్యాకులైన గ్రామస్థులు కళాకాంతులు లేని ముఖాలతో అతనివైపు చూస్తున్నారు. అతను వారి అలక్ష్యం పట్ల తన వంతుగా కోపంగా చూశాడు. వాళ్ళను ప్రభావితం చేసే పనేదో చేయాలనుకున్నాడు. ఈ నీరసించిన దేశానికి విద్యుత్ ఉత్తేజం కావాలి. అతని లక్ష్యానికి మంచి జరగాలి. అతన్ని ఉత్సాహం కమ్మేసింది. పొమ్మెల్ వైపు తిరిగి" లెఫ్టినెంట్ వెళ్ళు. వెళ్లి కౌన్సిహాల్‌లో ఉన్న మాజీ చక్రవర్తి విగ్రహం తీసుకురా. దాంతో పాటే ఓ కుర్చీ కూడా"- అజ్ఞాపించాడు.

పొమ్మెల్ భుజంమీద సుద్దతో చేసినచాతి వరకున్న మాజీ చక్రవర్తి నెపోలియన్ 2 ప్రతిమ, మరో చేత కుర్చీ తెచ్చాడు.

మార్సెల్ ఎదురెళ్లి కుర్చీ అందుకొని దాన్ని అక్కడ పెట్టాడు. విగ్రహాన్ని దాని మీదుంచాడు. నాలుగడుగులు వెనుకకు నడిచి ఖంగుమనే గొంతుతో "ద్రోహి, ద్రోహి నీవిక్కడే పడిపోవాలి.ఈ చిత్తడిలో పడి మట్టి కొట్టుకుపో. ఈ

సమీక్ష

☆ ప్రొ.ఆర్.ఎస్.రావు

# ప్రత్యేక ఆర్థిక మండలాలు: ఒక సమీక్ష

విప్లవ రచయితల సంఘం ఈమధ్య 'ప్రత్యేక మృత్యుమండలాలు, సెజ్‌లపై పరిశీలనా వ్యాసాలు' అనే పుస్తకం ప్రచురించింది. బహుశ విరసానికి ఇది ఒక నూతన ప్రక్రియ. నాకు తెలిసినంతవరకు రచయితలు, అందులోనూ విప్లవ రచయితలు సంఘటితంగా: ఒక రాజకీయ ఆర్థిక పరిణామంపై తమ ఆలోచనారీతిని ప్రజల ముందుకు తీసుకురావటం ఒక గొప్ప విశేషం. దీనికి ప్రేరణ సెజ్‌లకు వ్యతిరేకంగా ప్రబలివస్తున్న ప్రజా ఉద్యమాలు కావచ్చు. ఆ ఉద్యమాలు బెంగాల్‌లో నందిగ్రామ్ నుండి మహారాష్ట్రలో రాయగడ, ఆంధ్రప్రదేశ్‌లో పోలేపల్లి, కాకినాడ తదితర ప్రాంతాల నుంచి వచ్చిన ప్రజా ఉద్యమాల ప్రేరణ కావచ్చు. ఈ ఉద్యమాలు రాజ్యానికి ప్రజలకి మధ్య వచ్చే వైరుధ్యాన్ని చూపిస్తాయి. రాజ్యంలోనే అంతర్గతమైన వైరుధ్యాలు కూడా సెజ్ వ్యతిరేక ఉద్యమాలకి ఒక ఊపుని అందిస్తాయి. సెజ్‌ల వలన రాజ్యానికి వచ్చే రాబడిలో చాలా నష్టం వాటిల్లుతుందని సెజ్ ప్రణాళికల మీద అనుమానంగా ఉండే ఆర్థిక మంత్రిత్వశాఖ, సెజ్‌ల ద్వారానే పారిశ్రామీకరణ జరుకుతుంది. అని భావించే కామర్స్ మంత్రిత్వశాఖ, పర్యాటక శాఖ ద్వారానే అభివృద్ధి జరుగుతుంది, పరిశ్రమల ద్వారా కాదు అని భావించే గోవా ప్రభుత్వం వ్యతిరేకత, వ్యవసాయంలో సంక్షోభాన్ని నివారించడం ద్వారానే అభివృద్ధి జరుగుతుంది అని భావనని సూచించే వైరుధ్యమూ సెజ్ వ్యతిరేక ప్రజా ఉద్యమాలకి ఒక ఆలంబనగా నిలిచాయి. సెజ్ చట్టం పార్లమెంట్‌లో ఆమోదం పొందిన కాలంలో ఏ రాజకీయ పార్టీ కూడా ఊహించని రీతిలో ప్రజా ఉద్యమాలు పెల్లుబికాయి. ఈ నేపథ్యంలో విప్లవ రచయితలు, నూతన ప్రజాస్వామ్యాన్ని ఆకాంక్షించే విప్లవరచయితలు తమదైన ఒక ఆలోచనని, వ్యూహాన్ని నూతన ప్రజాస్వామ్య విప్లవంలో ప్రజా ఉద్యమాన్ని ఒక భాగంగా ఈ పుస్తకాన్ని ప్రచురించారు. ఈపుస్తకంలో ఒక సమగ్రమైన ఆలోచన, ప్రజా ఆందోళనలలో గల ముఖ్యమైన రీతులు, ఆందోళనకారుల ప్రస్తుత ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు క్రోడీకరించి వ్రాయతలపెట్టిన వ్యాస సంకలనమిది.

సెజ్ ప్రక్రియ ఒక వింత ప్రక్రియ. ప్రజా సమూహానికి కావలసిన అభివృద్ధి కార్యక్రమాలు ప్రభుత్వం మీద ఉండే బాధ్యతగా చూడవచ్చు. అది ప్రభుత్వాల హక్కుగా కూడా చూడవచ్చు. ఈ బాధ్యతలనూ, హక్కులనూ ప్రభుత్వం అభివృద్ధి కారకులు అనేబడే డెవలపర్స్ - అది ఒక వ్యక్తి కావచ్చు, ఒక దేశీ కంపెనీ కావచ్చు, ఒక విదేశీ కంపెనీ కావచ్చు - వారికి ధారదత్తం చేయబడుతుంది. ఆ అభివృద్ధి కారకులు ఆ అభ్వివద్ధిలో భాగంగా ఏ భూభాగమైతే తమకు ధారాదత్తమైందో ఆ భూమి మీద మొదటి ప్రక్రియగా నిర్మానుష్యం చెయ్యటం, ఈ నిర్మానుష్యం చేసే క్రమానికి మానవ చరిత్రలో సంబంధంలేదు. ఈమానవ చరిత్ర రెండురకాలు. అందులో మొదటిది ఆ భూభాగంలో జీవించిన, జీవించటానికి అవసరమైన చరిత్ర, ఆర్థిక చరిత్ర, సామాజిక చరిత్ర, సాంస్కృతిక చరిత్రలతో అవసరం ఉండదు. ఇంక రెండో విశేషం మానవ చరిత్రలో ఎన్నో సంఘర్షణలు చేసి సాధించిన ఘన విజయాల చరిత్ర కూడా అక్కరలేదు. ఉదాహరణకి ఎన్నో కార్మిక సంక్షేమ కార్యక్రమాలు, కార్మిక చట్టాలు, వాటిని అమలుపరిచే యంత్రాంగం మానవహక్కుల ఉల్లంఘన జరుగకుండా ఉండే కార్యక్రమాలు, యంత్రాగమూ - ఈ చరిత్ర కూడా ఏమీ అక్కరలేదు. ఒక చరిత్రహీనుల, ప్రక్రియగా సెజ్ మారింది. 'ప్రపంచ కార్మికులారా ఏకం కండి' అనే శ్రామిక నాయకత్వంలో ప్రపంచాన్నంతటినీ ఒకటిగా చూచే కమ్యూనిస్టు దేశాలు అయిన రష్యా, చైనా తదితర దేశాలు ఒక అడుగువెనక్కి వేసిన కాలంలో పెట్టుబడి తనదయిన శైలిలో ప్రవేశపెట్టిన ప్రపంచీకరణ కార్యక్రమంలో సెజ్‌లు ఒక అత్యంత ముఖ్యమైన స్థానము కలిగి ఉన్నాయి. ఈరకమైన ప్రపంచీకరణను చరిత్రలో ఆఖరి మెట్టుగానూ, చరిత్రను ఒక నిర్వీర్యశక్తిగానూ రూపొందించటం జరిగింది. అది ప్రపంచ పెట్టుబడిదారీ వ్యూహం. ఈ సెజ్ ప్రపంచం ముందుగా రష్యాను దాడి చేసింది. అలాగే చైనాను కూడా దాడి చేసింది. సోషలిస్టు సమాజాలను పునర్ నిర్మించే కార్యక్రమంలో అంతర్ రాష్ట్రీయ పెట్టుబడి ఎంచుకున్న రూపం సెజ్. ఈపునర్ నిర్మాణ కార్యక్రమంలో మిగిలిన సమాజం, దాని చరిత్రలో సంబంధం లేకుండా ప్రభుత్వ ఆధిపత్యానికి దూరంగా, స్వచ్ఛందంగా పెరిగినవే ఈ సెజ్‌లు. రష్యాలో ఈ సెజ్‌ల పనితీరు ఎలా ఉన్నా చైనాలో వాటి పనితీరు, ముఖ్యంగా షాంఘై ప్రగతి, మన దేశానికి ఒక ఆదర్శప్రాయమైంది. ఏదో కొంత మేరకు మార్క్సిస్టు ఆలోచనలతో పరిచయం ఉన్న మేధావులకు ఇది ఒక కొరకరాని కొయ్య అయింది. సెజ్‌ల ప్రభావం వలన చైనా ఆర్థికంగా పురోగతి చెందిన మాట వాస్తవం.

ఈ సెజ్‌ల వలన భారతదేశం కూడా పురోగతి సాధిస్తుంది అనే భావజాలం ప్రబలంగా ఉంది. ప్రస్తుతం ఉన్న ఈ భావజాలానికి మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంతో, ంటే నెహ్రూ కాలంలో ఉండే భావజాలానికి ఒక తేడా ఉంది. అప్పుడు ఒక నాగార్జున సాగర్ అన్నా ఒక భూసంస్కరణలన్నా అభివృద్ధిని తెచ్చే అభివృద్ధి పథకం క్రిందే చూడటం జరిగింది. ఆమేరకు అభివృద్ధి జరుగుతుంది అనే నమ్మకం కూడా ప్రబలంగానే ఉండేది. ఆ నమ్మకంనుండి అభివృద్ధి పథకమే అభివృద్ధి అనే గుడ్డినమ్మకం పుట్టింది. ఆ నమ్మకం అప్పటి

---

దేశాన్ని నీ పాదాల కింద నలిపి నజ్జు చేశావ్. ఇప్పుడుకాలం ప్రతీకారం తీర్చుకొమ్మంటుంది. లజ్జాకరమైన ఓటమి నిన్ను కౌగిలించుకోనుంది. నీవు ఓడిపోయావ్. నిన్ను జయించాం. ప్రష్యన్లకు చిక్కిన ఖైదివి. నీ కూలిన సామ్రాజ్యపు శిథిలాల మీద రిపబ్లిక్ మొలిచి నిలిచింది. తునకలైన నీ ఖడ్గాన్ని అందకుంది. "హర్షధ్వానాలకోసం ఎదురు చూశాడు. కాని అక్కడ చడిచప్పుడు లేదు. అనాగరిక రైతు జనం నిశ్శబ్దంగా నిలిచారు. కుర్చీలో ఉన్న ప్రతిమ చెంపలను దాటి నిలిచిన కోరమీసాలు. అది ప్రతిమ. అందుకే చలనం లేదు. మంగలి షాపులో చక్కటి మోడల్‌గా పనికొచ్చేటట్లుంది. డాక్టర్ మార్సెల్‌ను చూస్తున్నట్లుగా నవ్వు. అది చెరగని నవ్వు. కమాండర్‌కు వెక్కిరింత నవ్వు.

వాళ్లు ఒకరెదురుగా ఒకరున్నారు. చక్రవర్తి నెపోలియన్ 2కుర్చీమీద, కమాండర్ మార్సెల్ అతనికి ఎదురుగా మూడడుగుల దూరంలో. హఠాత్తుగా కమాండర్‌కు ఉద్రేకం తన్నుకొచ్చింది. ఏం చేయాల్సివుండే? ఈ ప్రజలకు నిశ్చయ విజయ భావన ఏది కలిగిస్తుంది? నడ్డిమీద చేయి వేసుకున్నంతలో అతనికి రివాల్వర్ పిడిచేతికి తగిలింది. ఉషారు లేదు, ఉత్తేజం లేదు. రివ్వున రివాల్వర్ బయటకు లాగాడు. రెండడుగులు ముందుకుకేసి గురిచూశాడు. చచ్చిన చక్రవర్తిని కాల్చాడు. గుండు నుదురులో దిగబడింది. నల్లటి కన్నం ఒక మచ్చలాగా కనబడుతుంది. తర్వాత రెండోది. రెండోకన్నం. తరువాత మూడోది తరువాత..అలా ఆగకుండా కాల్చి రివాల్వర్‌ను ఖాళీ చేశాడు. నెపోలియన్ కనుబొమ్మలు తుపాకి మందు తెల్లటి బూడిదతో కలిసిపోయాయి. కండ్లు, ముక్కు, కోరమీసాలు చెక్కుచెదరకుండా అలాగే ఉన్నాయి. రెచ్చిపోయిన డాక్టర తరువాత ఒక్క పిడికిటి పోటుతో ఆ కుర్చీ తిరిగేశాడు. విజయోత్సాహంతో ప్రతిమ మిగిలిన భాగాలమీద కాలుబెట్టాడు. "ఇంతే ద్రోహులంతా నశించాలి"-బిగ్గరగా అరిచాడు.

అప్పటికి అక్కడ ఏలాంటి ఉత్సాహం వ్యక్తం కాలేదు. చుట్టున్న జనమంతా ఏదో పిచ్చివాడి వ్యవహారాన్ని చూసినట్లు ఆశ్చర్యపోతున్నారు. కమాండర్ మిలిషియా సైనికులను పిలిచాడు. "ఇప్పుడిక మీరు మీ ఇండ్లకు మరల వచ్చు" - చెప్పి పెద్ద పెద్ద అంగలతో తన ఇంటి వైపు కదిలాడు.

పనిమనిషి వచ్చి ఆస్పత్రి గదిలో రోగులు మూడుగంటలుగా ఎదురు చూస్తున్నారని చెప్పింది. ఆయన లోపలికి అడుగేశాడు. ముందురోజు పంపించిన వెరికోస్ వెయిన్స్ రోగులు తిరిగి వచ్చారు. జడ్డిగా ఉన్నా ప్రశాంతంగానే ఉన్నారు.

ఆ వృద్ధ రైతు వివరించడం మొదలు పెట్టాడు. "ఇది వచ్చినప్పటి నుండి కాళ్ళలో కిందికి మీదికి చీమలు పారుతున్నట్లనిపిస్తుంది".

కమ్యూనిస్టులను కూడా ఒక మాయలో పడేసింది. కాని ప్రస్తుత భావజాలంలో పాలకవర్గాలు అభివృద్ధి అనే మాట వదిలేసి ఆర్థిక వృద్ధి, ఆర్థిక పురోగతి కేంద్రంగా నిలిచాయి. 10శాతము వృద్ధిరేటు, 8శాతము వృద్ధిరేటు అనే ఆశయం ప్రధానమై ఆ వృద్ధిరేటు సాధించటానికి ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడిని సమీకరించటానికి ఒక యత్నం జరుగుతుంది. సెజ్‌ల గురించి చెప్పినప్పుడు విదేశీ ప్రత్యక్షమై పెట్టుబడుల ఆకర్షణ, దాని ద్వారా ఎగుమతులు పెంచి విదేశీ మారక ద్రవ్యం సంపాదించటం ఒక ముఖ్య ఉద్దేశంగా సెజ్‌లను ప్రవేశపెడుతున్నారు. అలాకాకుండా ప్రజా ఆందోళనకారులు కాని, వాటి నేతృత్వంకాని సెజ్‌లును అభివృద్ధి పథకంగానే చూడటం ఒక విశేషం. అలా చూసి ఆ పథకం అభివృద్ధి తీసుకుని రాలేదు, ఇదేమి అభివృద్ధి? అని ప్రశ్నించటం జరుగుతోంది. ఇక్కడ గమనించవలసిన విషయం పాలకపక్షాలు అభివృద్ధి నుంచి వృద్ధి, వృద్ధి నుంచి Inclusive growth పయనిస్తూ ఉంటే ప్రజలు అప్పుడు, ఇప్పుడు కూడా అభివృద్ధి వేపే చూస్తూ ఉన్నారు. ఎప్పుడు, ఎలా అభివృద్ధి జరుగుతుంది అనే ఆశతోనే ఉన్నారు. ప్రజల ఆకాంక్ష అభివృద్ధి అయితే పాలక వర్గాల ఆకాంక్ష ఆర్థిక అభివృద్ధి ఇది ప్రజలకు పాలకులకు ఉండే ఒక వైరుధ్యం. పాలకులు పెట్టుబడి ద్వారా వృద్ధిని వ్యవస్థాగత మార్పులు లేకుండా తేవాలని చూస్తూ ఉంటే ప్రజలు వ్యవస్థలో మార్పు, ఒక కొత్త వ్యవస్థ నిర్మాణములోనే అభివృద్ధిని చూస్తున్నారు. వ్యవస్థాగత మార్పులు మీద కొన్ని ఆలోచనలు, కొంత ఆచరణగల మార్క్సిస్టు పార్టీ వ్యవస్థాగత మార్పులు పారిశ్రామీకరణ ద్వారానే జరుగుతాయి అని చూడటం ఒక విశేషం. బెంగాల్ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య ఈ ప్రతిపాదనను ఒకింత ముందుకు తీసుకుని వెళ్ళి ఆచరణ సాధ్యంగా నందిగ్రామ్‌లో, సింగూరులో చేపట్టటం జరిగింది. నందిగ్రామ్ ఒక సెజ్ అయితే సింగూరు ఒక తాతాగారి కారు ఫ్యాక్టరి. ఇక్కడ చెప్పుకోవలసిన విషయం మార్క్సిస్టు పార్టీ, కాంగ్రెసు పార్టీ హయాంలో ఉన్న రాజ్యాల కంటే భూసంస్కరణలను బాగా అమలులోకి తెచ్చింది. కొంత సఫలీకృతమైంది. ఈ భూసంస్కరణల వలన వ్యవసాయరంగంలో కొన్ని మార్పులు రావడమూ, ఆ మార్పులు వలన ఉత్పాదక శక్తి పెరిగి వ్యవసాయం కొంత మెరుగుపడింది. ఇది చాలా మాటుకు నిర్వివాదాంశం. ప్రపంచవ్యాప్తంగా ఆర్థిక శాస్త్రవేత్తలు గుర్తించిన విషయం. ఇలా గుర్తించినక్రమంలో బెంగాల్‌కి చెందిన ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తలు తయారుచేసిన నమూనాలో బెంగాల్‌లో ఇక చెయ్యవలసిన భూసంస్కరణలు ఏమీలేవు. ఇంక వ్యవసాయాన్ని కార్పొరేటైజేషన్ చెయ్యటమే తక్షణ కర్తవ్యం అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. దాన్ని కొంచెం ముందుకు తీసుకొని వెడితే వ్యవసాయరంగంలో శాస్త్రీయ సాంకేతిక పరంగా ఏమన్నా మార్పులు తీసుకొని రావచ్చునేమోకాని ఇంక చెయ్యవలసింది ఏమీ లేదు. ఒక్క పారిశ్రామీకరణ ద్వారానే బెంగాల్ వృద్ధి సాధించగలదు అనేది బుద్ధదేవ్ గారి పారిశ్రామీకరణ సిద్ధాంతంలో మూలబిందువు.

భూసంస్కరణలను రెండురకాలుగా చూడవచ్చును. అందులో మొదటిది రైతుకు రాజ్యాంగానికి మధ్యగల పెత్తందారులను నిర్మూలించటము లేక కట్టడిలో ఉంచటము. ఈ పెత్తందారులు ఒక రాచరిక వ్యవస్థ వలన రావచ్చు. రాజులుగా చెలామణి అయ్యే జమీందారీ వ్యవస్థ వలన రావచ్చు. లేక అసమ భూపంపిణీ వలన వచ్చే భూస్వామ్య వ్యవస్థవలన రావచ్చును. కాంగ్రెసు పరిపాలనలో రాచరిక వ్యవస్థను రద్దు చేసే క్రమంలో మొదలయి జమీందారీల రద్దు, ఇనాందారీల రద్దు అస్తవ్యస్తంగానయినా ఈపెత్తందారీ వ్యవస్థమీద ఒక మార్పు తీసుకొని రాగలిగారు. ఆ మార్పులు ఎంత సంతుష్టికరంగా జరిగింది, ఎంత లోపభూయిష్టంగా ఉంది అనేది ఒక చర్చనీయాంశము. రాజులు పోయారా? రాచరికం పోయిందా? లేక తాబేదార్లు పెత్తందారులు పోయారా? లేక రూపం మార్చుకొని అక్కడే ఉన్నారా? ఆర్థికంగా పోయి రాజకీయంగా నిలదొక్కుకున్నారా? లేక సాంస్కృతికంగా నిలదొక్కుకున్నారా? అనేవి చర్చించబడుతోన్న అంశాలు. అలాగే జమీందారీ వ్యవస్థ మీద కూడా. జమీందార్లు, ఇనాందార్లు పట్టు ఎంతవరకు సడలింది అనే ప్రశ్నకి సమాధానం ఆచరణలో తెలుసుకోవలసిన విషయం. ఇకపోతే కాంగ్రెసు పార్టీ భూసంస్కరణలలో పెట్టిన ఇంకొక అంశం అసమ భూపంపిణీ వలన వచ్చిన ఇంకొక రకమైన పెత్తందారులు. వీరిని కట్టడి చేసేందుకు వచ్చిన చట్టం కౌలుదారీ చట్టం. ఈ చట్టంలో కౌలుకి ఇచ్చే భూమిమీద ఎంత కౌలు తీసుకోవాలి, కౌలుదారుకి ఉండే హక్కులకు శాశ్వత రూపం ఇవ్వడం ఈ చట్టంయొక్క ముఖ్యఉద్దేశము. ఇకపోతే భూసంస్కరణలలోనే సీలింగు చట్టం అనేది మరొకటి. ఈ భూసంస్కరణల చట్టాలు మొత్తంగా చూస్తే తన వ్యవసాయం ద్వారా వచ్చే పట్ట మీద ఒక శాశ్వత రూపంలో రైతుకే దక్కటానికి చేసిన ప్రయత్నాలు. తన కష్టఫలం తనకే దక్కుతుంది అనే ప్రాతిపదిక మీద చూచినప్పుడు రైతు భూమిమీద పెట్టుబడి పెట్టడానికి సంకోచించడని, ఎక్కువ దిగుబడి వచ్చే ప్రయత్నాలకి ప్రోత్సాహకరంగా ఉంటుందని ఒక ఊహ. ఒక రకంగా చూస్తే ఈ భూసంస్కరణలన్నీ భూమి ఉత్పాదక శక్తిని పెంచే, పెంచడానికి ప్రోత్సహించే సంస్కరణల లాగా కన్పిస్తాయి. అందుకే వీటిని బూర్జువా భూసంస్కరణలుగా చెప్పుకోవచ్చు. ఈకారణం వలననే కావచ్చు బెంగాలులో భూసంస్కరణలు అమలుచేసే సమయంలో అప్పటి కేంద్రప్రభుత్వం బెంగాల్ మార్క్సిస్టు ప్రభుత్వం మీద ఒక దాడి చేసింది. ఆ దాడి సారాంశంలో మార్క్సిస్టు పార్టీ బెంగాలులో విప్లవాన్ని తీసుకొని వస్తోందని. దానికి సమాధానంగా అప్పటి ల్యాండ్ రెవిన్యూ మంత్రి హరేకృష్ణకోనార్క్ తాము చేపట్టిన భూసంస్కరణలు కాంగ్రెసు పార్టీ ప్రవేశపెట్టి అమలుచేయలేకపోయిన భూసంస్కరణలేనని చెప్పారు. ఏమిటి ఈ భూసంస్కరణలు? ఏ అంశాన్ని మార్క్సిస్టు ప్రభుత్వం అమలు పరిచింది? అని చూస్తే అది కౌలుదారీ చట్టం. ప్రతి రాష్ట్రానికి ఒక ఉద్యమ చరిత్ర ఉంటుంది. అది మన రాష్ట్రానికి వస్తే ఒక తెలంగాణ సాయుధ పోరాటం, ఒక శ్రీకాకుళం సాయుధ పోరాటం, మళ్ళీ రెండవసారి తెలంగాణా విప్లవ పోరాటం అదీ ఒక చరిత్ర. అది ప్రజా ఉద్యమాలకి ఒక గమ్యం, గమనం నిర్దేశిస్తుంది. అలాగే బెంగాల్‌కి వస్తే తీవ్రమైనటువంటి తెభాగా ఉద్యమం ఒక నేపథ్యం. తెభాగా ఉద్యమం కౌలుదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమం. 1967లో మార్క్సిస్టు పార్టీ అధికారంలో ఉన్న ప్రభుత్వం ఆ తెభాగా ఉద్యమంలో ఉండే సారాన్ని రెండడుగులు ముందుకు తీసుకుని వెళ్ళి జోతేదారీ వ్యవస్థని నియంత్రించి కౌలుదారుకి ఒక శాశ్వతము, కౌలుకి ఒక పరిమితిని ప్రవేశపెట్టి కౌలుదార్ల ద్వారా వ్యవసాయరంగంలో ఒక మార్పు తీసుకొని వచ్చి ఉత్పాదకతను పెంచి దానికి ఒక ఉనికినిచ్చారు. ఇది ఒక 30 సంవత్సరాల రాజ్యాధికారాన్ని మార్క్సిస్టు పార్టీకి కట్టబెట్టింది. ఇకపోతే రెండవ రకమైన భూసంస్కరణలు, అవి ప్రధానంగా శ్రమ, శ్రామికుడు కేంద్రంగా చూసే భూసంస్కరణలు. శ్రమ ఉత్పాదకతను పెంచే భూసంస్కరణలు. శ్రామికుడికి (రైతుకూలీకి) ఉండే జ్ఞానం, శారీరక శ్రమను పూర్తిగా ఉపయోగించగలిగే సంస్కరణలు, రైతుకూలీ శ్రమను పూర్తిగా వాడుకునే భూసంస్కరణలు. భూమిలేక భూమిని కోల్పోయి భూమిమీదే కూలి చేస్తూ పూర్తిబతుకు లేని, భారతిగారి మాటల్లో చెప్పాలంటే, మిగులు మనుషులు. వారిని, వారి శ్రమని పూర్తిగా ఉపయోగించుకొనేందుకు కావలసిన భూమిని సరఫరా చేసే సంస్కరణలు ఈ రెండో తరహాకి చెందిన భూసంస్కరణలు. ఇవే బహుశా నూతన ప్రజాస్వామిక భూసంస్కరణలని అనుకుంటాను. పెట్టుబడిదారి భూసంస్కరణలు భూమిని కేంద్రంగా తీసుకుంటే, భూమి ఎక్కడ ఉంది? ఏది మిగులు భూమి అనే ప్రశ్నలు వస్తాయి. శ్రమకేంద్రంగా చూసే నూతన ప్రజాస్వామిక భూసంస్కరణలు భూమిని తీసుకోవలసి ఉంటుంది. ఎక్కడా? ఎలాగా? భూ పరిధిని తగ్గించాలా? బంజరు భూమిని సాగుభూమిగా మార్చాలా అనేవి ఆచరణకి సంబంధించినవి. ఇక బెంగాలు విషయానికి వస్తే కౌలుదారీ చట్టం ద్వారా తీసుకుని వచ్చిన వ్యవస్థాగత మార్పులు, అదే అంతిమ పరిష్కారం అని ఆలోచిస్తే బెంగాలులో కూడా మిగులు మనుషులు దేశంలో ఎంతమంది ఉన్నారో అక్కడా అంతేమంది ఉన్నారు. రమారమి 30 శాతం గ్రామీణ ప్రజలు మిగులు మనుషులే. ఇంతే కాకుండా బెంగాల్ వ్యవసాయంలో కౌలుదారీ చట్టంకింద నమోదయిన కౌలుదారులకంటే నమోదుకాని కౌలుదారులకి రక్షణ ఉందో లేదో

పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. నందిగ్రామ్‌లో కాని సింగూరులో కాని భూసంస్కరణలకు నోచుకోలేని ఈ ప్రజానీకం బహుశ సెజ్‌కి వ్యతిరేకంగా, టాటాలకి వ్యతిరేకంగా ఉద్యమించి ఉండవచ్చును. ఒక అసంపూర్ణ భూసంస్కరణలు తెచ్చి దానితో బెంగాల్‌లో భూమి సమస్య తీరిపోయింది, ఇంక పారిశ్రామీకరణే ఏకైక మార్గం అనేది వాస్తవాలకు దూరం. ఒక హాస్యాస్పదమైన పరిస్థితి. ఈ విషయంలో హరేకృష్ణ కోనార్క్ దగ్గర పనిచేసిన ఒక సీనియర్ ఐఏఎస్ అధికారి ఈ మధ్య తీవ్రతరంగా ఈ అంశాన్ని విశ్లేషిస్తున్నారు. States manలోను Main stream, E.P.W. తదితర పత్రికలలో వస్తున్నాయి.

బెంగాల్‌లోనయితేనేమి, యావద్భారత దేశంలోనయితే నేమి, వ్యవసాయరంగం పునర్ వ్యవస్థీకరణ అవకాశాలు, ఆవశ్యకత మీద రెండు భిన్న అభిప్రాయాలు కన్పిస్తాయి. పునర్ వ్యవస్థీకరణ అవసరం గ్రామీణ ప్రాంతాలలో ఉత్పత్తి శక్తులు బందీగా ఉండిపోయాయా, ఉండిపోతే ఆ బంధవిముక్తి ద్వారా నూతన ఉత్పాకతలో ఒక కొత్త వ్యవసాయరంగం గ్రామీణ ప్రాంతాలు ఉద్భవిస్తాయా అనే ప్రశ్నమీద అవగాహనలో ఇమిడిఉన్నాయి. పెట్టుబడిదారి ప్రపంచ దృక్పథంతో చూసినపుడు ఆ అవకాశాలు లేవనే ఒక నిర్ధారణకు రావలసివస్తుంది. అందుచేత మనం ఇంకెక్కడ భూసంస్కరణలు, ఇంకెక్కడి మిగులు భూమి అనే మాటలు తరుచుగా వింటూ ఉంటాం ఒక నూతన ప్రజాస్వామ్య దృక్పథంతో చూచినపుడు పునర్ వ్యవస్థీకరణ దేశవ్యాప్తంగా ఇన్ని భూసంస్కరణలు అయిన తరువాత కూడా ఒక అసంపూర్ణ అజెండాగానే మిగిలిపోతుంది. మొదటి దృక్పథం నుంచి చూచినపుడు గ్రామాలలో ఉండే ఉత్పత్తి శక్తులు రైతుకూలీలు, పేదరైతులు, కులవృత్తులు ఒక పేద జనాభాగానే ఉంటారు. ఒక నూతన ప్రజాస్వామిక విప్లవం ద్వారా చూస్తే వాళ్ళు ఉత్పత్తి శక్తులుగానూ కన్పిస్తారు. సమాజపు పునర్ నిర్మాణానికి కేంద్ర శక్తులుగా, చోదకశక్తిగా కనిపిస్తారు. పెట్టుబడిదారీ దృక్పథం తన తక్షణ కర్తవ్యం గురించి ఆలోచిస్తే, నూతన ప్రజాస్వామిక దృక్పథం దీర్ఘకాలిక ప్రయోజనాల గురించి ఆలోచిస్తుంది. ఈ విషయాన్నే పాణి తన వ్యాసంలో (పేజి 124) "దున్నేవారికి భూమి అనే రాజకీయార్థిక కార్యక్రమాల్లో తక్షణ ప్రయోజనంతోపాటు సమాజ పునర్నిర్మాణ ప్రతిపాదిక కూడా ఉన్నది. ఈమాట చెప్పి ఒప్పించడానికి, ఎంతో కొంతయినా అమలు చేయడానికి దశాబ్దాలుగా రైతాంగం రక్తతర్పణ చేయవలసి వచ్చింది. యిదొక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాగా నిలదొక్కుకునే క్రమంలో పాలకవర్గం ముందునుండే తాను అమలుచేస్తున్న ప్రతీఘాతుక అభివృద్ధి నమూనాను వేగవంతం చేసింది".

పెట్టుబడిదారీ చరిత్రంతా, ఆ వ్యవస్థ ఆవిర్భావం కాని, అందులోంచి పుట్టిన ఆ భావజాలం కాని వ్యవసాయరంగం, గ్రామీణ ప్రాంతాలు పునర్ నిర్మించిన తరువాత వచ్చిన విధానం కాదు. దాని అవతరణే ఒక సమాజపు పునర్ నిర్మాణానికి ఒక తక్షణ కర్తవ్యంగానే జరిగిన చారిత్రక దశ. ఈప్రక్రియ గ్రామీణ ప్రాంతంలో ఉన్న ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తి పద్ధతులను, విధానాలను రూపాంతరం చేసి మానవ శ్రమ కేంద్రంగా ఉత్పత్తులను, మిగులు ఉత్పత్తులను తయారు చేసి, ఆ మిగులు ఉత్పత్తులు పెట్టుబడిదాడుల చేతులలోకి తీసుకునే క్రమంలో వ్యవస్థ పునర్ వ్యవస్థీకరించబడింది. పెట్టుబడిదారీ మొదటి దశలో ఒక నేతపనివాడుకాని, కమ్మరికాని, కుమ్మరికాని తమ ఉత్పత్తి విధానాలను మార్చుకోకుండా, మరొక Form of organisationsలో భాగమయ్యారు. ఒక నేతపనివాడు, అతని కుటుంబం ఉత్పత్తినుంచి పదిమంది నేతపనివాళ్ళు కలిసి పనిచేసే రూపంలోకి వెళ్ళారు. ఈ రూపంలోకి వెళ్ళడమే నేతపనివాడు నేతకూలీగా, జీతగాడుగా, ఒక శ్రామికుడుగా మారిన క్రమం. ఈ రూపంలో మిగిలిన ఉత్పత్తి అంతా మిగులు ఉత్పత్తిగా ఈ పనివాళ్ళను క్రోడీకరించిన వ్యక్తికి చెందుతుంది. ఈ వ్యక్తే పెట్టుబడిదారుగా అవతరించాడు. వ్యవసాయేతర శ్రమలను ఈ పెట్టుబడి రూపంలో మార్పు చేసింది. శ్రామికుడు పెట్టింది కూడా ఈ క్రమంలోనే. పెద్ద పెద్ద పట్టణాలు లండను, మాంచెస్టరు, బర్మింగ్ హాము ఇత్యాది పట్టణాలకు మూలం పైన చెప్పిన క్రమమే. ఈ పట్టణీకరణ, పారిశ్రామీకరణలో భాగంగా వృద్ధిచెందుతూ వచ్చింది. ఈక్రమంలోనే గ్రామాలనుండి పట్టణాలకు వలసపోవడం, వ్యవసాయరంగం పునర్ వ్యవస్థీకరణకు తోడ్పడింది. వ్యవసాయంలో పెట్టుబడి ప్రవేశము వ్యవసాయ పునర్ వ్యవస్థీకరణకు ఒక పెట్టుబడిదారీ పద్ధతి. ఇది ఒక భావజాలంగా పెట్టుబడిదారీ ప్రపంచం ప్రచారం చేస్తుంది. పెద్ద పెద్ద పట్టణాలే అభివృద్ధి అని, పెద్ద పెద్ద పరిశ్రమలే అభివృద్ధి అని, సమాజంలో వ్యవసాయరంగం పాత్ర కుదించుకుపోవాలనీ, అదే అభివృద్ధి అని చెబుతుంది ఈ భావజాలం చెప్పేక్రమంలో తన మూలాన్ని, అదే గ్రామీణ ప్రాంతంలో ఉండే ఉత్పత్తి శక్తులను, పట్టణాలకు తరలించి మరొక రూపంలో ఆ ఉత్పత్తి శక్తులను మిగులు విలువలు తయారుచేసే క్రమంలో పారిశ్రామీకరణ పట్టణాభివృద్ధికి ఒక పునాది అనే విషయాన్ని కనుమరుగు చేస్తుంది. ఈ భావజాలంలో భాగంగానే పెట్టుబడి వ్యవసాయరంగంలో ప్రవేశిస్తే వ్యవసాయరంగం పునర్ వ్యవస్థీకరించబడుతుంది అనే భావం కూడా పుడుతుంది.

బుద్ధదేవుని పారిశ్రామీకరణ ఒక తక్షణ కర్తవ్యంగా చూడడం స్వాతంత్ర్య పోరాటంలో బీజప్రాయంగా ఉండి అధికార మార్పిడి జరిగింతరువాత పాలకవర్గాలు ఎంచుకున్న మార్గం కూడా అదే. ప్రయివేటు పెట్టుబడి అంతంత మాత్రంగా ఉన్న ఆ కాలంలో ప్రభుత్వ పెట్టుబడితో యంత్రాలను తయారుచేసే యంత్రాలు, దానికి కావలసిన ముడిసరకు ఇనుము, సిమెంటు వాటిమీద ప్రభుత్వ పెట్టుబడి పెట్టి అభివృద్ధి క్రమాన్ని ప్రారంభించామని అప్పటి ఊహ. ఆ ఊహలో యంత్రాలు ప్రభుత్వ పెట్టుబడితో చేస్తే ఆ యంత్రాలను ప్రయివేటు పెట్టుబడి ఉపయోగించుకుని వినియోగ ఉచితమైన వస్తువుల తయారీ జరుగుతుందని ఈ క్రమంలో పట్టణంలో ఉన్న ఎక్కువ ఆదాయాల వల్ల వ్యవసాయరంగానికి ప్రోత్సాహకరంగా ఉంటుందని, ఆ క్రమంలో దేశాభివృద్ధి జరుగుతుందని ఒక ఊహ. దీనికి మిశ్రమ ఆర్థిక విధానం అని సాధారణంగా విశ్లేషిస్తే, మార్క్సు వ్యతిరేకులు దీన్ని నెహ్రూ సోషలిజంగా వెక్కిరించటం జరిగింది. అది అభివృద్ధి అవునోకాదో ఇప్పుడు విశ్లేషించవలసిన అవసరం కూడా లేదు. కాని గుర్తించవలసినది పారిశ్రామీకరణ ఒక తక్షణ కర్తవ్యంగా అప్పటినుంచి వస్తూనే ఉంది. హరే కృష్ణ కోనార్క్ లాగా బుద్ధదేవుడు కూడా తనుకూడా కాంగ్రెసు పాలసీనే ఆచరణలోకి తెస్తున్నాను అని అనుకోవచ్చును. కాంగ్రెసు పార్టీకి అది చెల్లవచ్చు. కాని మార్క్సిస్టు సిద్ధాంతాలలో పుట్టి పెరిగిన వాళ్ళు అభివృద్ధి అనేది ఉత్పత్తి శక్తుల ప్రాతిపదిక మీద, ఉత్పత్తి సంబంధాల మార్పు ద్వారా ఒక వ్యవస్థ లోంచి మరొక వ్యవస్థలోకి మారటంలాగా చూడలేకపోవటం ఒక వైపరీత్యం.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే భారతదేశంలో సెజ్‌ల మీద వ్యతిరేకత, ఆ వ్యతిరేకత ఒక ఉద్యమ రూపాన్ని దాల్చటం, ఆ ఉద్యమాన్ని ప్రభుత్వం మార్క్సిస్టు పార్టీ క్యాడర్‌తో, పోలీసులతో అణిచివేసే ప్రయత్నమూ, హింసాకాండ, ఆ రూపంతో నందిగ్రామ్ సెజ్‌ని ఆపివేయటం, సెజ్‌ల ద్వారా పారిశ్రామీకరణ అనే ప్రతిపాదనమీద దేశంలో విస్తృత చర్చకి మూలమైంది. ఈ విస్తృతమైన చర్చలో భాగంగా విప్లవ రచయితల సంఘం తెచ్చిన ఈ పుస్తకానికి ఒక ప్రత్యేకత ఉంది. ఒక నూతన ప్రజాస్వామిక విప్లవం ఆకాంక్షలు తమ ఆలోచన తమ రచనల ద్వారా సామాజిక చైతన్యాన్ని ఒక అడుగు ముందుకు తీసుకుని వెళ్ళాలని ధ్యేయంతో ఉన్న రచయితల అవగాహనా రీతులు చెప్పే పుస్తకం ఇది. మొదట చెప్పినట్లుగా సెజ్ ఒక వైరుధ్యాల పుట్ట. సెజ్‌లు ఉండాలా లేదా, ఉంటే పారిశ్రామీకరణ కోసమా కాదా, పారిశ్రామీకరణ అంటే ఏ పరిశ్రమలు, అవి ఎవరు నిర్ణయిస్తారు. అక్కడి నుండి సెజ్‌లకు భూములు ఎవరు సేకరిస్తారు. ప్రభుత్వమా లేక పెట్టుబడిదారులా, ఏ ధరకి భూమిని తీసుకుంటారు. 1894 భూసేకరణ చట్టం కింద, అందులో ప్రధానమైన ప్రజాహితం ఎంత, అది ఎవరు నిర్ణయిస్తారు, భూమి కొనుగోలు వలన నిర్వాసితులయిన వారి మాటేమిటి, నిర్వాసితులలో ఉండే భూమిలేని కూలీలు, కులవృత్తులు, ఇతరుల మాటేమిటి? నివాసస్థలం మాటేమిటి? ఇలాంటి ఎన్నో ప్రశ్నలు, ఒక నూతన సమాజం ఆవిర్భావం గురించి కలలుకనే విప్లవ

రచయితలు ఏం అనుకుంటున్నారు, అనే జిజ్ఞాస ఉండే వాళ్ళంతా చదవవలసిన పుస్తకం ఇది. ఆంధ్రప్రదేశ్‌లో దేశంలో ఏ రాష్ట్రంలో లేనన్ని సెజ్‌లు ప్రభుత్వ ఆమోదం పొందాయి. అందులో చాలావరకు ఐ.టి.కి సంబంధించినవే అయితే మిగిలిన పరిశ్రమలకు రియల్ ఎస్టేట్ రంగానికి సంబంధించిన సెజ్‌లు కూడా ఉన్నాయి. చాలామంది అభివృద్ధి సాధకులు డెవలపర్స్ సెజ్‌లమీద ఆశ చూపిస్తున్నారు. చాపక్రింద నీరులా కొన్ని సెజ్‌లు పనితీరు మొదలుపెట్టేస్తే, కొన్ని పాత కంపెనీలు, ముఖ్యంగా ఐటీ కంపెనీలు, విశాఖ పట్టణంలో Expose promotion zone, సెజ్‌ల హోదా పొంది ఉన్నాయి. ఇకపోతే, కొన్ని సెజ్‌లు మీద ప్రజా నిరసన, వ్యతిరేకత వెలువడుతోంటే కొన్ని చోట్ల ఆ నిరసన, వ్యతిరేకత ఉద్యమరూపం దాల్చే ప్రథమ దశలో కొన్ని ఉన్నాయి. ఈ వ్యాస సంకలనం ఈ పరిస్థితులను ప్రతిబింబిస్తుంది. వాస్తవ పరిస్థితి మీద చర్చించే వ్యాసాలు కొన్ని అయితే, సెజ్‌లమీద అవగాహనా పత్రాలు రెండు ఉన్నాయి. వాస్తవ పరిస్థితులకు, ఆచరణకు కొంచెం దూరంగా ఉండే నాలాంటి వాళ్ళకు వాస్తవ పరిస్థితుల మీద ఉండే వ్యాసాలు చాలా జ్ఞానాన్నిస్తే, అవగాహనా పత్రాలు కొంత ఇబ్బంది పెట్టాయి. ఆ పత్రాలలో మొదటిది వేణుగోపాల్ వ్రాసిన వ్యాసము "ప్రత్యేక ఆర్థిక మండలాలూ, రాజకీయ ఆర్థిక దృక్పథం". రెండవది పాణివ్రాసిన 'సెజ్‌ల వెనక'. ఈరెండు వ్యాసాలు అందరూ చదవవలసినవి, చదివి చర్చించవలసినవి. నాకుండే స్తోమతలో ఈ వ్యాసాన్ని ఆ రెండు వ్యాసాలకు పరిమితం చేస్తున్నాను. మొదటిగా వేణుగోపాల్ వ్యాసం.

మార్క్సిస్టు పద్ధతిలో చూసినప్పుడు ఏ విషయాన్నైనా చాలా కోణాలనుండి పరిశీలించవచ్చును. సాధారణంగా ఒక కోణం నుంచి చూసి దానిలో మార్పు గురించి చర్చించడమౌతుంది. ఉదాహరణకు ఒక పరిశ్రమను కాని, ఒక డ్యామ్‌ని కాని తీసుకుంటే ఆర్థికంగా ఎంత మార్పువస్తోంది. ఎంత అధిక ఉత్పత్తి వస్తోంది అనేది ఒక కోణమయితే, అదే కోణంలో ఎంత నష్టపోతున్నాము అనేది ఆ కోణంలో ఇంకొక భాగం. అదే ప్రశ్నను తిరగవ్రాస్తే ఈ మార్పు వలన లాభపడేదెవరు, నష్టపడేదెవరు అనే ప్రశ్న పుడుతుంది. నష్టపడే వాళ్ళు ఆ మార్పుని వ్యతిరేకించవచ్చు. ఆ మార్పు ఇంకే ప్రక్రియ ద్వారానయినా తేవచ్చునా అని ప్రత్యామ్నాయ పద్ధతుల గురించి అన్వేషించవచ్చును. ఉదాహరణకి, హిరాకుడ్ డామ్ కడుతున్నపుడు డ్యామ్ వలన మునిగిపోయే ప్రజలు ఎన్నో ప్రత్యామ్నాయ మార్గాలు - చిన్ని డ్యాములు, డ్యామ్ ఎత్తు తగ్గించటమో, డ్యామ్ కట్టే స్థలం మార్చటమూ - ఇటువంటి ఎన్నో ఆలోచనలు డ్యామ్ వలన నిర్వాసితులయ్యే ప్రజలు ప్రత్యామ్నాయం కోసం చూడటం, ప్రతిపాదనలు పెట్టడం జరిగాయి. ఆ ప్రతి పాదనలను త్రోసివేసి డ్యామ్ కట్టడం మొదలుపెట్టడానికి ఒక పోలీసు చర్య, దాని ద్వారా ప్రజలను భయభ్రాంతులను చెయ్యడమూ జరిగింది. ఇది ఆ డామ్‌కి ఉండే ఒక రాజకీయకోణం. ఇక్కడ ఇంకొక విషయం చెప్పుకుంటే మంచిది. చైనాలో విప్లవానంతరం సోవియట్ యూనియన్ పెద్ద స్టీలు ఫ్యాక్టరీ, మన భిలాయ్ లాంటిది, చైనాలో నిర్మించటానికి సహకరిస్తానంటే మావో దానిని నిరాకరించి ప్రతి ఇంట ఒక కొలిమిపెట్టి ఇనుమును తయారుచేస్తాము అనే ఒక ప్రత్యామ్నాయాన్ని చూడటమేగాక దానిని ఆచరణలో పెట్టే ప్రయత్నం కూడా చేసాడు. ఇది అభివృద్ధి మీద ఉండే ఒక రాజకీయ దృక్పధాన్ని సూచిస్తుంది. రాజకీయ దృక్పథంలో ప్రత్యామ్నాయాల గురించి వెతకటం, ప్రత్యామ్నాయాలతో ప్రజల పాత్ర చూడటం, ప్రజలనే ఉత్పత్తి శక్తులుగా చూడటం, ఆ ఉత్పత్తి శక్తుల మార్పుకు సంఘటితంగాఉద్యమించటమూ కీలకం. ఇక మూడవ కోణం నుంచి చూస్తే మార్పుమీద ఉండే అవగాహనమీద కేంద్రీకృతమవుతుంది. ఈ మార్పు సహజమా అసహజమా అనే ప్రశ్నవస్తుంది. సహజమైతే మంచిగాను, అసహజమైతే చెడుగానూ కన్పిస్తుంది. డామ్ కడితే ప్రకృతి విరుద్ధమనీ, ప్రకృతిలో ఉండే సమతుల్యం దెబ్బతింటుందనీ, దాని వలన మానవాళి దీర్ఘకాలికంగా నష్ట పోతుందనీ అనే ధోరణులు ఇందులోంచే పుడతాయి. ఇలా చూసేది ఒక నైతిక దృక్పధం. ఇందులో ఏ ఒక కోణంనుండి చూసినా ఆ విషయం మీద ఒక సమగ్ర దృష్టి లోపిస్తుంది. ఒక ప్రాజెక్టు కడితే, కట్టడం మంచి, చెడు అనే నైతిక కోణంలోంచి, ఎంత మంచి, ఎంత చెడు, ఎంత ఉపయోగము, ఎంత నష్టమూ అనే ఆర్థికాంశం నుంచి ఎవరిలాభాలు, ఎవరి నష్టాలు, ఏ ప్రత్యామ్నాయమైతే ఎక్కువ మందికి ఉపయోగపడుతుంది అనేది ఒక రాజకీయకోణం అవుతుంది. నైతికంలో ఉండే ఈ ప్రశ్న రూపాంతరం చెంది ఆర్థిక కోణంవైపు వెడితే, ఆర్థిక కోణంలో ఉండే ప్రశ్న రూపాంతరం చెంది రాజకీయకోణంలోకి మారుతుంది. అలాగే రాజకీయ కోణంలో ఉండే ప్రశ్న ఆర్థిక కోణం వైపు వెళ్ళి, అక్కడినుండి నైతికంవైపు వెడుతుంది. ఈమూడుం కోణాలు పరస్పరం ఒకదానినొకటి ప్రభావితం చేసుకుంటూ సమాజ పురోగతిని దోహదం చేస్తాయి. మరొక భాషలో మార్క్స్ చెప్పిన సిద్ధాంతం ఇది. మనలాంటి దేశాలలో ఆచరణ సాధ్యమైన సిద్ధాంతంగా మావోయిజం చెబుతుంది.

సాధారణంగా ఏ విషయం మీదైనా చెబితే, ఏకకోణంలోనే అందులో ఒక భాగంలోనో ఉండే మార్పుమీదే జరుగుతుంది. ఇంకా చెప్పాలంటే ఆ మార్పు అనుకున్న తీరులో ఉందా లేదా అనేది ముఖ్యమౌతుంది. అనుకున్నట్టు ఉంటే అది మంచిదనీ, అనుకున్నట్టు లేకపోతే ఆచరణలో లోపాలు ఉన్నాయని, అనుకున్న దాంట్లో అత్యాశ ఉందని, అనుకోవడం నైతికంగా తప్పనీ ఎన్నో రకాలుగా చెప్పుకుంటారు. సెజ్‌ల విషయంలో ప్రభుత్వ రాబడి తగ్గిపోతుంది అనేది ఒక చర్చనీయాంశము. విదేశీ పెట్టుబడులు వస్తాయి అనుకోవడం, అవి రావటం లేదు కదా, వస్తాయేమొ కదా అనేది కూడా చర్చనీయాంశమే. కొత్త సాంకేతిక పరమైన జ్ఞానము, అది కూడా రాలేదు, వస్తాయేమొ అనేది కూడ ఒక చర్చనీయాంశమే. ఈ ప్రశ్నలు పోతే ఎంత వెలకట్టి భూమిని రైతునుంచి బేదఖలు చెయ్యవచ్చు. ఏ పద్ధతిలో అయితే నిర్వాసితుకు పునరావాసము కల్పించవచ్చు, ఏ ఉత్పత్తి క్రమంలో వీరు భాగస్వాములవుతారు, సెజ్‌ల ఉత్పత్తి క్రమంలో వీరిని ఎలా భాగస్వాములను చెయ్యవచ్చు--ఇలా ఎన్నో ప్రశ్నలు, ఎన్నో వాద ప్రతివాదనలు. ఒక సమగ్ర దృష్టితో చూడడము, అందులో Particular సెజ్‌లనుండి 'Universal' సెజ్‌ల గురించి మాట్లాడడానికి కావలసిన ఆలోచనాక్రమాన్ని వేణుగోపాల్ వ్యాసం సూచిస్తుంది. ఉత్పత్తి శక్తుల గురించి చర్చించి అందులో వచ్చిన మార్పులు "ఉత్పత్తి సంబంధాలలో ఎటువంటి మార్పు తేగలదు అనే చర్చ ద్వారానే ఒక పరిణామపు ప్రగతిశీలత, అమోదయోగ్యత నిర్ణయమవుతాయి" అని సూచించి ఆ ఉత్పత్తి సాగడానికి భూమికగా నిలిచే సామాజిక సంబంధాలను ఏదిశగా మారుస్తున్నదో పరిశీలించడమే రాజకీయార్థిక శాస్త్ర దృక్పధం. ఈనేపథ్యంలో దేశంలో ప్రస్తుతం విపరీతంగా అమలవుతున్న ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు ప్రగతిశీలమైనదో కాదో, అమోదయోగ్యమైదో కాదో చర్చించవలసి వుంది.! (పేజీ 10)

ఈనేపథ్యంలో ప్రత్యేక ఆర్థిక మండలాలు గురించి వేణువ్యాసం మాట్లాడుతుంది. సెజ్‌లు ఉత్పత్తి సాధనాల విషయానికొస్తే అవి భూమినిగాని, నీటినిగాని, ఖనిజాలనుగాని, విద్యుత్తునుగాని, పరికరాలనుగాని, యంత్రాలనుగాని, మౌలికసాధన సంపత్తిని గాని ఇవాళ వినియోగిస్తున్న పద్ధతికన్నా భిన్నమైన పద్ధతిలో ఉపయోగించనున్నాయి. అయితే ఎప్పుడయినా మార్పు దానికదిగా అభిలషణీయమూకాదు, తిరస్కరణీయమూకాదు. "ఇదే క్రమంలో ఆర్థిక మండాలాల గురించి లక్షలాది ఎకరాల భూమిని ఇప్పటివరకు వ్యవసాయ వినియోగంలో తిండిగింజల సేద్యంలో ఉన్న భూమిని వ్యవసాయేతర సెజ్ కార్యక్రమాలకు మార్పు చేయవలసి వస్తోంది అని చెబుతూ "భూమిని వ్యవసాయం కోసం వినియోగించడం కన్నా పరిశ్రమలకోసం వినియోగించడం అభివృద్ధికరమేనని రాజకీయార్థిక శాస్త్రం స్థూలంగా అభిప్రాయపడుతుంది. ఉత్పత్తి విధానంగా చూసినప్పుడు వ్యవసాయం కన్న పరిశ్రమ పైమెట్టున ఉండే మాట నిజమే"(పేజి 11) ఈ సూత్రీకరణలలో కొంత అసంతృప్తి ఉంది. చారిత్రక కాలంలో చూస్తే ఆదిమ మానవుడి నుంచి ఇంతవరకూ చేసిన ప్రయాణం ఉత్పత్తి శక్తుల ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యంగా చెప్పుకోడంలో తప్పేమీ లేదు. కాని ఈ సుదీర్ఘ ప్రయాణం చాలా మజిలీలతో కూడిన ప్రయాణం. మానవ సమాజ చరిత్ర ఆ మజిలీలలో కాసేపు విశ్రాంతి తీసుకున్నట్లు ఉత్పత్తి శక్తుల ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యంలో ఐక్యత

ప్రధానంగా కొంతకాలం స్థిరనివాసం ఏర్పరుచుకుంటుంది. ఆ స్థిరనివాస కాలంలో సమాజపు మిగిలిన అంశాలను, ఉదాహరణకు ఉపరితల అంశాలను, నిర్మించుకుంటుంది. ఈ మజిలీలనే modes of production అని మార్క్స్ అంటాడని నా ఊహ. మానవ సమాజ చరిత్రని బానిసత్వము, భూస్వామ్య, పెట్టుబడిదారీ సమాజము, అంతిమంగా కమ్యూనిజం అనే క్రమం ఆ మజిలీల క్రమంగా చూడవచ్చును. ఒక్కొక్క మజిలీలో ఉండే మనిషి చైతన్యం ఆ మజిలీ అస్తిత్వం ద్వారా నిర్దేశించబడుతుంది. ఆ మజిలీ అస్తిత్వం అప్పటి ఉత్పత్తి శక్తుల లెవెల్ మీద, దానికి అనుగుణమైన ఉత్పత్తి సంబంధాల మీద, ఈరెంటికి అవసరమైన సమాజ నిర్మాణపు అవసరాలు ఈ మూడూ కలిసి నిర్మించబడుతుంది. ఉదాహరణకు భూస్వామ్య సమాజంలో ప్రకృతిమీద ఉండే ఒక అవగాహన, ఆ అవగాహన ద్వారా వచ్చిన ఉత్పత్తి సంబంధాలు కలిసి ఆ సమాజపు ఆ మజిలీని గుర్తించడానికి, నిర్వచించటానికి ఉపయోగపడతాయి. ఒక విధంగా ప్రకృతి మీద ఉండే అవగాహన ప్రకృతి స్థిరత్వం మీద ఆధారపడితే, ఆ సమాజపు ఉత్పత్తి సంబంధాలు స్థిరమైన భూమి మీదనే ఆధారపడతాయి. ఇటువంటి మజిలీలో వ్యవసాయం కేంద్రమౌతుంది. ఉత్పత్తి కాని మిగులు ఉత్పత్తికాని మనిషి శ్రమ ద్వారా వచ్చినా కూడా అవి ప్రకృతి సహజంగా భూమికేంద్రంగా కన్పిస్తాయి. ఆ మిగులు మీద అధికారం శ్రమని కాకుండ, శ్రమచేసిన మనిషికి కాకుండా భూమికి, భూమిమీద అధికారం ఉన్న వ్యక్తులకు చెందుతుంది అనడం ఆ మజిలీలో ఉండే సామాన్య చైతన్యం. వ్యవసాయేతర ఉత్పత్తులు ప్రాథమికతని నోచుకోవు. ఎవరి ఇంటిముంగిట్లో వారు కుండలు చేసుకోవడం, ఇంటివెనక పాకలో కొలిమి పెట్టుకోవడం, ఇంటిలోపల ఇంటి వసారాలోను ఇంటివీధిలోనూ సాలీలు నేతపని చేసుకోవటం, వడ్రంగులు కూడా ఇలాగే పనిచేసుకోవడం మనం తరుచు గ్రామాల్లో చూచే పరిస్థితి. వ్యవసాయానికి ఉన్న సామాజిక విలువ, వ్యవసాయేతర ఉత్పత్తులకు, వాటిని తయారుచేసే పనివారికి ఉండకపోవటం ఒక విశేషం.

ఇకపోతే పెట్టుబడిదారీ వ్యవస్థను ఒక రేఖాచిత్రంగా చూస్తే ప్రకృతిమీద ఉండే అవగాహన స్థిరత్వం నుండి మారిపోయి ప్రకృతి సహజంగానే చలనంలో ఉంటుంది. ఆ చలన సూత్రాలు కూడా మనిషి గ్రహించుకోవచ్చు. అలా గ్రహించిన జ్ఞానం ఉత్పత్తి పరికరాలుగా మారవచ్చు. తద్వారా ఉత్పత్తి సంబంధాలలో మార్పు అనేది ఒక ప్రాథమికమైన అవగాహన. ఈఅవగాహన వ్యవసాయేతర ఉత్పత్తులలో ఉత్పత్తి విధానాలలో మౌలికమైన మార్పులకు దారి తీస్తుంది. భూమి కేంద్రంగా ఉన్న మజిలీకి భిన్నంగా మానవశ్రమ కేంద్రంగా ఉన్న మజిలీ ప్రారంభదశ. శ్రమే ఉత్పత్తికి ప్రధానమని మిగులు ఉత్పత్తికి ప్రధానమని, ఆ శ్రమ మీద ఆధిపత్యం, తద్వారా మిగులు ఉత్పత్తిమీద ఆధిపత్యం, శ్రమను కొనుగోలు చేసిన పెట్టుబడిదారుకి చెందటం ఈ మజిలీలో ఉండే చైతన్యానిక ఒక ప్రాథమిక దశ. పెట్టుబడిదారీ అవతరణ, శ్రామికుడి అవతరణ ఈ ప్రారంభదశలోనే మొదలయ్యాయి. వ్యవసాయేతర ఉత్పత్తులకు ప్రాముఖ్యత లభించటం కూడా ఈ ప్రాథమిక దశలోనే మొదలవుతుంది. అలా మొదలయిన పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రకృతి చలన సూత్రాలను అధ్యయనం చేసే క్రమంలో శాస్త్రీయ పద్ధతులలో ఉత్పత్తిని, ఉత్పత్తి క్రమాన్ని మార్చే క్రమంలో ఉత్పత్తి పరికరాల పెరుగుదలను, దానికి కావలసిన ఉత్పత్తి సంబంధాల మార్పును ఒకింత బలప్రయోగంతో ప్రవేశపెడుతుంది. పెట్టుబడి కూడా ఒక రూపాంతరం చెందింది. ఒక పక్క శ్రామికుడే మిగులు ఉత్పత్తికి మూలకారణం. దాని కొనుగోలు చేసిన మూలపెట్టుబడి పెట్టిన పెట్టుబడిదారీ ఆ మిగులు ఉత్పత్తికి హక్కుదారుడు అనేక్రమం నుంచి, ఉత్పత్తి పరికరాల యజమాని మిగులు ఉత్పత్తి మీద హక్కుదారుడని చెప్పే క్రమం చైతన్యంలో భాగమవుతుంది. శాస్త్రీయ పరిజ్ఞానం Labour processలో తెచ్చిన ఒక పెనుమార్పు శ్రామికుని బౌద్ధిక శ్రమని కొంత మేరకు తగ్గించి, ఉత్పత్తి పరికరాలకు ఆపాదించటం జరిగింది. ఈక్రమంలో శ్రామికుడు ఉత్పత్తి పరికరానికి ఒక అనుబంధంగా మార్పు చెందాడు. ఒక కమ్మరి, కుమ్మరి ఒక turner, fitter గా మారిపోయారు. పెట్టుబడి సామ్రాజ్యవాద దశలో ఇంకొక రూపం తీసుకుంటుంది. దాని గురించి తరువాత మాట్లాడుకుందాం. ప్రస్తుతానికి ఒక మజిలీ తీసుకుంటే, కొన్ని వర్గాల కూడలి అని గ్రహించవలసి ఉంటుంది. ఆ వర్గాలు ఆ మజిలీకుండే ప్రత్యేకతను బట్టి ఒక రూపం తీసుకుంటాయి. వర్గము, ఆ వర్గసమీకరణ, చైతన్యము, వర్గపోరాటము ఆ మజిలీలో ఉండే అంతర్గత పరిస్థితిని బట్టి ఆధారపడి ఉంటుంది. ఆ మజిలీ నుంచి మరో మజిలీకి వెళ్ళే క్రమం కూడా అంతర్గత పరిస్థితిని బట్టి, ఆ పరిస్థితులు వలసవచ్చే చైతన్యాన్ని బట్టి ఉంటుంది. వేణుగోపాల్ వ్యాసం ఈ మజిలీల (modes of productione) విషయాన్ని తీసుకోకుండా, అంటే ఒక space dimention చూడకుండా, time dimention చూచినట్టు అనిపించింది. అంటే ఒక విధంగా నిర్దిష్టత లోపించింది. ఒక భూస్వామ్య విధానంలో పైన ఉదహరించినట్లు వ్యవసాయేతర ఉత్పత్తులు వ్యవసాయానికి ఉపయోగపడని భూములనే వాడుకుంటారు. ఆ విధంగా పెట్టుబడిదారీ విధానంలో కూడా వ్యవసాయానికి పనికిరాని భూములలోనే వ్యవసాయేతర ఉత్పత్తులు, అనగా పరిశ్రమలకు వాడుకుంటారు. వ్యవసాయం భూమికి ఉండే ప్రకృతి సిద్ధమైన energy recycling అనేగుణాన్ని వాడుకుంటే పరిశ్రమ భూ ఆకర్షణ అనే గుణాన్ని వాడుకుంటుంది. పెట్టుబడి వ్యవసాయ రంగంలో ప్రవేశించిన కాలంలో ఆ energy recycling కూడా దెబ్బతీస్తుంది. అంటే భూమికి ఉండేప్రత్యేక గుణాలును పరిశ్రమ వాడుకుంటే, పెట్టుబడి (విశృంఖలమైన పెట్టుబడి) వ్యవసాయంలో ప్రవేశిస్తే, energy recycling కూడా దెబ్బతీస్తుంది. అందుచేత పరిశ్రమలు కాని పరిశ్రమలు సూచించే పెట్టుబడిదారీ విధానం కాని భూమిని వినియోగించటం అభివృద్ధికరమని చెప్పటం వివాదాస్పదమే అవుతుంది. కాని ఉత్పత్తి విధానంగా పెట్టుబడిదారీ విధానం భూస్వామ్యంకంటే ఒక మెట్టుపైన ఉంటుందన్నది చాలావరకు నిజమే. ఒక రకంగా శాస్త్రీయపద్ధతులపై ఆధారపడే పెట్టుబడిదారీ విధానం ప్రకృతి వనరులను బాగానే ఉపయోగిస్తుంది. అలాగే చూస్తే మానవ శ్రమలోని drudgeryని కొంచెం తగ్గిస్తుంది. శ్రమించటం కొంచెం సులభతరం చేస్తుంది. అది కొంతవరకు పురోగతి. ఈ పురోగతి వెనకాతలే దాని వైరుధ్యం కూడా దాగి ఉంటుంది. వ్యవసాయం, ప్రకృతి, energy recycling గుణాన్ని పోగొట్టుకోవటం, పర్యావరణ వినాశము దాని ప్రక్కనే జరుగుతూ ఉంటాయి. అలాగే శ్రమలో ఉండే drudgery ని ఉత్పత్తి పరికరాల ద్వారా తగ్గించేక్రమంలో శ్రామికుడి నిరుద్యోగసమస్య అనేది ముఖ్యంగా ఎదురౌతుంది. మార్క్స్ అన్నట్టు యంత్రాల పెరుగుదలకు, ఆయన చెప్పినటువంటి reserve armyని ఒక అవినాభావ సంబంధం ఏర్పడుతుంది. ఇవి వ్యవస్థాగత లోపాలు, ఆ లోపాలో శాస్త్రసాంకేతిక విజ్ఞానాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ ఉపయోగించే పద్ధతిలో లోపాలు. అవి పెట్టుబడికున్న పరిమితి. ఈ విషయాలన్నీ కూలంకషంగా చర్చించిన మార్క్స్ Capital Vol.1 లో ఉపోద్ఘాతంలో తాను పెట్టుబడివ్యవస్థని చిత్రీకరించిన క్రమం పెట్టుబడిని ఒక అందమైన ప్రగతిశీలమైన చిత్రంగా చూపించటం జరిగిందని వ్రాసాడు. ఆ అందం, ప్రగతిశీలత గుడ్డి నమ్మకాలతో మత చాంధసంతో సాంప్రదాయక పద్ధతులలో జరిగే ఉత్పత్తి పద్ధతుల మీద పెట్టుబడిదారీ విధానం ఒక ఘనవిజయం సాధించింది అనటం ఒక కోణమైతే, మరొక కోణం మార్క్సుకి మార్క్సిజానికి కేంద్రం మానవ సమాజంలో ఒక శ్రామికుడి అవతరణ. ఈ శ్రామికుడు ఒక స్వేచ్ఛా జీవి. అతని స్వేచ్ఛ ఉత్పత్తి పరికరాలనుండి స్వేచ్ఛ, Personel dependence నుంచి స్వేచ్ఛ. పాతబంధాలనుండి విముక్తి, ఎక్కడైనా ఏ కర్మాగారంలోనయినా జీవించగల స్వేచ్ఛ, తనని మనిషిగా చూసుకోగల స్వేచ్ఛ. ఈ స్వేచ్ఛాయుత శ్రామికుడే అన్ని బంధాలనుండివిముక్తి చెయ్యగలడని, ఉత్పత్తి సంబంధాలను మానవ సంబంధాలుగా మార్చగలగని కమ్యూనిస్టు వ్యవస్థ వేపు సమాజాన్ని తీసుకుపోగలడని ఊహించే ఆశించే మానవ ప్రతినిధి, ఒక మానవ ప్రతిరూపం. "ప్రపంచ కార్మికులారా ఏకంకండి. పోయేదేమీ లేదు దాస్య శృంఖలాలు తప్ప" అని కమ్యూనిస్టు మేనిఫెస్టోలో చెప్పడం పెట్టుబడి ప్రగతి శీలతకి ఇంకొక ముఖ్యమైన కోణం.

ఇక మనదేశానికి కాని రాష్ట్రానికికాని వస్తే పరిశ్రమలు భూమిని

అభివృద్ధికరంగా వినియోగించగలవు అని చెప్పడం కూడా కష్టమే. చాలా కాలంక్రితం నేను రూర్‌కేలా స్టీలు ఫ్యాక్టరీని సందర్శించటం జరిగింది. ఆ ఫ్యాక్టరీ ఒక కొండల వరుసకి ఒక ప్రక్క Blast furnace మిగిలిన ఫ్యాక్టరీ సముదాయము ఉంటే ఆ కొండలవరుస రెండోపేపు ఫ్యాక్టరీ కట్టడానికి కొన్ని వేల ఎకరాలు ప్రభుత్వము తీసుకొని ఆ క్రమంలో అనేక వేలమందిని నిర్వాసితులను చేసి ఫ్యాక్టరీ ఆవిర్భావం జరిగింది. గృహసముదాయంలోకి వెడితే కొట్టొచ్చిన విషయం కన్పిస్తుంది. అక్కడ కొంత భూభాగంలో వరిచేలు కనిపించాయి. మామూలుగా గృహసముదాయంలో పార్కులు, సినిమాహాళ్ళు, టీ దుకాణాలు ఉండేచోట వ్యవసాయం ఉండటం ఒక గమనించదగ్గ విషయం. ఆ వ్యవసాయం ఫ్యాక్టరీ వాళ్ళే చేయిస్తున్నారా అని అడిగితే నిర్వాసితులయిన పాతరైతులు illegal గా ఆక్రమించి తమపాత పొలాలనే వాడుకుని పంటలు పండిస్తున్నారు. ఇది ఫ్యాక్టరీ పెట్టిన 20ఏళ్ళ తరువాతి మాట. ఏది illegal? ఏది ఆక్రమణ ఏ భూమిని ఎవరు బాగా వాడుకుంటున్నారు అనేది ముఖ్యమైన విషయం. పండించటం illegal కాని పంటమాత్రం legal అయిపోయింది మార్కెట్టులోకి వెడితే. ఇకపోతే ఆ కొండవరుసలు చాలాకాలంగా చెట్టుచేమలలో ఆచుట్టు ప్రక్కల గ్రామాలకి చల్లదనాన్ని ఇవ్వడమే కాకుండా వంట చెరుకు సరఫరాకి కూడ ఉపయోగపడేది. ఇప్పుడు ఫ్యాక్టరీ పక్కనుండి చూస్తే ఆ కొండలు బోడి గుండ్లలా కనిపిస్తాయి. రెండోవైపు చూస్తే ఇంకా కొంచెం పచ్చదనం కనిపిస్తూనే ఉంటుంది. ఒక 50 ఎకరాలలో కట్టవలసిన ఫ్యాక్టరీ కోసం 5000 ఎకరాలు తీసుకోవడం ఎందుకు అని ప్రశ్నిస్తే ఒక సమాధానం - దీర్ఘకాలం ప్రయోజనాలకోసం, ఫ్యాక్టరీ ఉత్పత్తి పెంపుదలకోసం అని. అయితే Public sector గదండీ, అందుచేత ఒక జమీందారులా వ్యవహరిస్తారని అంటారు.

అలాగే విశాఖపట్టణము స్టీలు ఫ్యాక్టరీ నిర్వాసితులను వారి పునరావాసము గురించి అధ్యయనం చేస్తూ ఉంటే చూసిన పరిస్థితి కూడా ఫ్యాక్టరీ యాజమాన్యం కావలసిన దానికంటె ఎక్కువ భూమిని తీసుకోవడం, ఆ భూమిని ఎలా ఉపయోగించుకోవాలో తెలియక నిర్వాసితులు కాని మిగిలిన వాళ్ళు కాని మళ్లీ ఆ భూభాగాన్ని అక్రమ ఆక్రమణ చేస్తారనే భయంతో ఒక పెద్ద ముళ్ళకంచెతో వాళ్ళ ఆస్తి హక్కుని కాపాడుకుంటారు. బస్సులో వెళుతూ ఉంటే అగనంపూడి అనే ఒక గ్రామం దగ్గర మొదలై గాజువాక వరకూ ఈ ముళ్ళకంచెలే. అగనంపూడిలో పునరావాస కేంద్రాలు ఏర్పాటు చేసారు. కంచెకి అవతల భాగం వ్యవసాయ, వ్యవసాయేతర ఉత్పత్తులు నిన్న మొన్నటివరకూ తయారుచేసిన భూములు ఇపుడు బీడుగా మారిన భూములు, కంచెకి ఇటుప్రక్క ఆ భూములను ఉపయోగించి ఉత్పత్తులు తయారుచేసిన మనుష్యులు నిరుద్యోగులుగా ఉండే మనుషులు పునరావాస అధికారుల ఆఫీసు చుట్టూ తిరిగే మనుషులు, ఫ్యాక్టరీ గేటు దగ్గర కూలీ దొరుకుతుందేమోనని పడిగాపులు కాసే మనుష్యులు, ఇసుకలారీలలో ఏమన్నా పని దొరుకుతుందేమోనని చూచే మనుష్యులు, వాళ్ళపాత పొలాల వేపు రోజూ పొద్దుట, సాయంత్రం చూసుకునే మనుష్యులు కోకొల్లలుగా కనిపిస్తారు. వీళ్ళు శ్రామికులుగా కాక ప్రభుత్వం ఏమి ఇస్తుంది అని ఒక పరాధీన దృక్పథంతో ఒక లుంపెన్ గుణాలతో కొటొచ్చినట్లు కనిపిస్తారు. అటు భూమి నిరుపయోగం, ఇటు మనుషులు నిరుపయోగం - ఇవన్నీ Public sector లే, కొత్త జమీందారులే అని సరిపెట్టుకోవచ్చును. కాని ప్రైవేటు పబ్లిక్ సెక్టార్ యాజమాన్యం ఇంతకంటే ఏం ఊడబొడుస్తుంది అనేది పరిశీలించాల్సిన విషయం. పెట్టుబడిదారీ ప్రస్తుత రూపం సామ్రాజ్యవాద రూపం, గుత్తపెట్టుబడిదారీ రూపం, ఫైనాన్స్ కాపిటల్ రూపం వనరులను తక్షణ కర్తవ్యంలో spectulative క్రమంలో అత్యధిక లాభాలు చూస్తుంది కాని సమర్థవంతమైన, శాస్త్రీయమైన వనరుల ఉపయోగం గురించి ప్రయత్నిస్తుంది అని అనుకోవడం బహుశ అత్యాశేనేమో. ఈ పైకారణాలు వలన వేణుగోపాల్ వ్యాసంలో "భూమిని వ్యవసాయం కోసం వినియోగించటం కన్నా పరిశ్రమల కోసం వినియోగించటం అభివృద్ధికరమని రాజకీయార్థిక శాస్త్రం స్థూలంగా అభిప్రాయపడుతుంది" అనేది మనముందరమూ చర్చించవలసిన విషయము. ఇక్కడ ఒక విషయం చెప్పడం సబబు అనుకుంటాను. రాజకీయార్థికశాస్త్రం దీన్నే క్లాసికల్ పొలిటికల్ ఎకానమీ అంటారు. దీని ఆరంభం, పునాది పెట్టుబడిదారీ వ్యవస్థలోని దశ. భూస్వామ్య సమాజం నుంచి ఉద్భవించిన పెట్టుబడిదారీ సమాజం ఆ కాలానికి ఒక విప్లవశక్తి. ఆ కాలంలో పుట్టిన భావాలు ఎదిగి ఒక భావజాలంగా మనముందుకు వచ్చేది క్లాసికల్ పొలిటికల్ ఎకానమీనే కాకుండా అప్పటి ప్రిన్సిపల్స్ ఆఫ్ డెమోక్రసి కూడా. పొలిటికల్ ఆద్యుడు ఆడం స్మిత్ ఇత్యాది హేమాహేమీలు పెట్టుబడిదారీ విధానం దాని ఆర్థికాన్ని సిద్ధాంతీకరించారు. మార్క్స్ ఆ సిద్ధాంతాన్ని, సిద్ధాంతకరించిన క్రమాన్ని విమర్శిస్తూ, విశ్లేషిస్తూ వ్రాసింది కాపిటల్. దాన్ని ఆయన ఒక క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ అన్నాడు. అందులో ముఖ్యమైన అంశాలు ఒకటి మిగులు ఎలా వస్తుంది? ఎక్కడ నుంచి వస్తోంది? ఎక్కడికి వెళుతుంది? అనే ప్రశ్న, తద్వారా వచ్చిన రెండవ ప్రశ్న సమాజాన్ని వర్గ రూపంలో, వర్గాల కూడలిగా చూడటం, క్రిటిక్‌లో మార్క్స్ ప్రత్యేకత. ఇది కూడా మనం గమనించవలసినది, చర్చించవలసిన విషయం. సెజ్‌ల మీద చర్చకాని, అభివృద్ధి మీద చర్చకాని ఒక వర్గపరంగా చూడవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

పుస్తకంలో నన్ను ఆకర్షించిన రెండో వ్యాసం 'సెజ్‌ల వెనక' అనే పాణివ్రాసిన వ్యాసం. పాణి వ్యాసం వేణుగోపాల్ వ్యాసంలాగా సెజ్‌లమీద చర్చను ఒకడుగు ముందుకు తీసుకొని వెడుతుంది. వ్యాసరచనా పద్ధతిలో వేణుగోపాల్ ఒక abstract సిద్ధాంతీకరణ చేసి వాస్తవానికి వస్తే, పాణి వాస్తవాలు ద్వారా abstract వెళ్ళి దాన్ని వ్యాసంలో అంతర్నలీనంగా భాగం చేసినట్లుగా వ్రాసాడు. "ఆ ఫ్యాక్టరీలో ఏం తయారైతదో ఏమో మాకేం తెలుస్తది? తిండి గింజలు పండించుకోకుండా ఏం తయారుచేసుకుంటే మాత్రం ఏం లాభం?" అని సెజ్ కార్యక్రమంలో భూములు పోగొట్టుకొన్న ఒక ఆదివాసీ మహిళ మాటలివి. ఉపయోగపు విలువలను మారకపు విలువలకు ఉండే వైరుధ్యాన్ని చెప్పే ఈ ఆరంభం సెజ్‌ల వలన వచ్చే ఆర్థిక సామాజిక మార్పులు, వాటిని ఎదిరించవలసిన కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ వ్యాసం ముగిస్తుంది. ఆ ఫ్యాక్టరీలో ఏం తయారుచేస్తారు అనేది ఆదివాసీ మహిళకు తెలియకపోవడానికి కారణాలు ఆమె నిరక్షరాస్యత, ఆమెకు గల తక్కువ ప్రపంచజ్ఞానము ఇలా కారణాలు ఎన్నో చెప్పుకోవచ్చును. ఒక వ్యక్తిగా ఆమెకి తెలియవలసిన పని కూడా లేకపోవచ్చును. కాని తన బతుకు తెరువు చూపించలేని ఏ ప్రక్రియ అయినా దానిని ప్రశ్నించే హక్కు ఆ ఆదివాసి మహిళకి ఎంతైనా ఉంది. ఆదివాసీ మహిళకి సెజ్‌లలో ఏం జరుగుతుందో తెలియకపోవడం ఊహించ దగ్గదైనా ఏ రాజ్యమైతే ఆ సెజ్‌లను ప్రవేశపెడుతుందో ఆ రాజ్యానికి కూడా తెలియకపోవడం క్షమించరాని నేరం. రాజ్యం విదేశీ పెట్టుబడులు వస్తాయనుకోవడం, దానివలన ఎగుమతులు పెరుగుతాయనుకోవడం, ఆ ఎగుమతులు విదేశీ మారకం పెంచుతాయనడం, ఆ విదేశీ మారకం తిరిగి దేశంలో పెట్టుబడి పెంచటానికి దోహద పడతాయనుకోవడం అవి అభివృద్ధికారకులైన డెవలపర్స్‌కి భూమి ధారాదత్తం చెయ్యటం ఒక ఆశాజనకమైన వ్యూహంగా కనిపించినా, అది జూదగాడి లక్షణంగా చూడటం మేలు. ఒక జూదగాడు మూడు ఆసులు వస్తాయని పందెం కాస్తాడు. ఈ గుర్రం నెగ్గుతుందని ఆ గుర్రం మీద పందెం కాస్తాడు. ఈ భూటాన్ లాటరీలో ఒక కోటి రూపాయలు వస్తాయని ఒక రూపాయి లాటరీ టిక్కెట్టుకొంటాడు. పాపం ధర్మరాజు పాచికలాటలో సరదాగా ఆడాడేమో, కాని ఫలితం రాజ్యం, భార్యని, పరువుని అన్నీ పోగొట్టుకున్నాడు. ఈ జూదగాడి లక్షణం మన ప్రభుత్వంలో సెజ్ వ్యవహారాల ద్వారా కనిపిస్తూ ఉంటుంది.

సెజ్‌లలో ఏం జరుగుతోందో అని చూడటానికి యాక్షన్ ఎయిడ్ అనే ఎన్‌జీవో ఈ మధ్య సెజ్‌లమీద ఒక రిపోర్టు తయారుచేసింది. ఆ రిపోర్టులో చాలా అంశాల గురించి తెలుసుకోవచ్చుకాని ముందుగా ఒక మాట. మామూలుగా ఒక పరిశ్రమని కాని, ఒక ప్రభుత్వ పనితీరుని కాని అంటే పేదరిక నిర్మూలన పథకాలు ఎలా పని చేస్తున్నాయో విశ్లేషణ చేసినప్పుడు మొదట ఆ పరిశ్రమ పెత్తందారు దగ్గరకు కాని పేదరిక నిర్మూలన కార్యక్రమాలను అమలు చేసే ప్రభుత్వాధికారులను కాని కలుసుకుని వారికి మన investigation ఉపయోగం గురించి నమ్మకం కలిగించి కాని విషయసేకరణ చేయడం

జరుగుతుంది. దానిని verify చెయ్యడానికి ఆ పరిశ్రమలలో పనిచేసే కార్మికుల దగ్గర నుంచి పేదరిక నిర్మూలన కార్యక్రమాలకు సంబంధించిన పేదల దగ్గరనుండి విషయ సేకరణ జరుగుతుంది. సెజ్‌ల విషయానికి వస్తే విషయసేకరణలో కొన్ని గమ్మత్తులున్నాయి. ప్రతి సెజ్‌ని ఒక డెవలప్‌మెంట్ కమీషనర్ ఉంటాడు. వాడి దగ్గర విషయసేకరణ, కంపెనీ వెబ్‌సైట్‌లోనుండి విషయసేకరణ. ప్రజలనుండి విషయసేకరణ, ఈ మధ్యనే వచ్చిన information లో వచ్చిన R.T.I act. ఇందులో కండ్లా (గుజరాత్) సెజ్‌కి website ద్వారా చూస్తే 16,581 ఉద్యోగాలు, కమిషనర్ ద్వారా చూస్తే 14, 299, R.T.I. ద్వారా చూస్తే 17,835 ఇందులో ఏదినిజం, ఏది ఊహ, ఏది ఆశ అనేది ప్రభుత్వానికన్నా తెలుస్తుందా? అలాగే విదేశీ పెట్టుబడులు చూస్తే Website లో 5% ఉంది. ప్రభుత్వ పాలసీగా సెజ్ కార్యక్రమాలను ఉధృతంగా అమలు చేసే క్రమంలో సెజ్‌ల పనితీరు, ప్రభుత్వం ఆశించిన పనితీరు గురించిన అవగాహన ప్రభుత్వానికి లేకపోతే ఆశ విదేశీ పెట్టుబడులు వస్తాయనో, విదేశీ మారకం వస్తుందనో, పారిశ్రామీకరణ జరిగిపోతుందనో, ఉద్యోగావకాశాలు మెండుగా పెరుగుతాయనో, అది ప్రజలను మభ్యపెట్టడానికయినా, ప్రభుత్వం నిజంగా ఆశించినా, అది ఒక జూదగాడి వైఖరే. మన ఉత్పత్తి శక్తులు, మనస్వశక్తి మీద ఆధారపడకుండా ఈ స్థలం మీకిస్తాము, మీరందరూ వచ్చి పెట్టుబడులు పెట్టుకోండి. అందులో మిగులు కొంత మాకివ్వండి అనే వాతావరణం. ఈ గుర్రం మీద Rs. 10/- పెడతాను, ఒక Jockpot వస్తే బాగుంటుంది అనే మనస్తత్వానికంటే తేడా ఏమీ కాదు. ఇంకాపోతే చైనాకి విదేశీ పెట్టుబడులు వెడుతున్నాయి కాని మనకు రావటం లేదేమిటి, ఇవాళ కాకపోతే రేపు, రేపుకాకపోతే ఎల్లుండి మనకికూడా వస్తాయి అని ఒక లాటరీ జూదగాడి మనస్తత్వం. శ్రమద్వారా ఉత్పత్తులు, అధిక ఉత్పత్తులు ఉండే దశనుండి శ్రమకి చేయూతనిచ్చే ఉత్పత్తి పరికరాల సహాయంతో ఉత్పత్తులు, అధిక ఉత్పత్తులు వచ్చే సందర్భంలో పరికరాలే ఉత్పత్తి, మిగులు ఉత్పత్తులు తయారు చేస్తాయనే భావజాలంలోని ప్రవేశించిన పెట్టుబడిదారీ విధానం, శ్రమ, ఉత్పత్తి పరికరాలను కొనుగోలు చేయగలిగిన finance capital దశలో తానే ఉత్పత్తి, మిగులు ఉత్పత్తికి మూలమని ఒక భావజాలం పెట్టుబడి అంతిమదశలో సమాజం ముందుకు వస్తుంది. దీనికి మన stock - exchange ప్రతీకగా నిలుస్తుంది. సత్యం షేర్లు ఒకరోజు పెరుగుతాయి, ఒక రోజు తరుగుతాయి ఇలా దైనందినంగా లాభాలు, నష్టాలు చెబుతూ ఉంటారు. Sensex ఇంత పతనమైనదంటూ ఉంటారు. Sensex 10,000కి మించి రికార్డుస్థాయికి చేరిందంటారు. ఇందులో చాలామంది లాభాలు పొందారంటారు. నష్టాలు పొందారంటారు, కోటీశ్వరులై పోయారంటారు. ఒక ప్రభుత్వం పడిపోయి మరొక ప్రభుత్వం వస్తే Sensex పడిపోవడమో, ఎగిరిగంతెయ్యడమో జరుగుతూ ఉంటుంది. ఒక budget మంచిదో కాదో తెలుసుకోవడానికి Sensex పడిపోవడమో ఎగిరిపోవడమా ఒక సూచికగా తీసుకుంటూ ఉంటారు. ఇదొక వింతప్రపంచం. ఇదొక Finance ప్రపంచం. దీనికి ఉత్పత్తికేంద్రంగా ఉండే వాస్తవ ఆర్థిక ప్రపంచానికి ఒక ఆమడ దూరం. ఏదో ముందుముందు భవిష్యత్తులో జరుగుబోతుంది అనే ఆశ ప్రప్రథమంగా ఉన్నప్పుడు వర్తమానంలో స్థితిగతులు కనుమరుగైపోతాయి. భవిష్యత్తులోనే వర్తమానాన్ని చూడటం జరుగుతుంది. వర్తమానం తన ఉనికిని పోగొట్టుకుంటుంది. Stock Marketలో పెట్టుబడి, real estate రంగంలో పెట్టుబడి, వ్యాపార పెట్టుబడి, వడ్డీ వ్యాపార పెట్టుబడి వీటిలో బాగా అధికలాభాలు వస్తాయి. వీటన్నిటికి వచ్చే ఫలితం కంటే ఎక్కువగా ఉంటుంది.

అధిక లాభాలు వస్తాయి. వీటన్నింటిలో శ్రమద్వారా వచ్చే ఫలితం కంటి ఎక్కువ ఫలితాలు వస్తాయి. ఏదైనా వర్గ సమాజంలో శ్రమించి ఉత్పత్తి చేసే వర్గమూ ఆ ఉత్పత్తిలోని మిగులును సొంతం చేసుకునే ఒక వర్గమూ ఉంటూనే ఉంటాయి. శ్రమ చేసే వర్గము తన భవిష్యత్తుమీద ఆశని శ్రమ చెయ్యకుండా మిగులను పొందే వర్గం ద్వారా చూచుకోవడం తమ బ్రతుకుని ఆ వర్గం ద్వారా ఊహించుకోవడం సహజము. కాని భవిష్యత్తుమీద ఉండే ఆశలు ఒక మారకపు విలువ గానూ, ఒక సరుకుగానూ ఉండే ప్రక్రియ పెట్టుబడి ఒక finance capital గా మారిన సామ్రాజ్యవాద దశలోనే ముఖ్యమౌతుంది. జూదంలో ఉండే ప్రకృతే ఇది. హైదరాబాదు నగరం ముందుముందు చాలా ప్రగతిసాధిస్తుంది. Microsoft, biotech కంపెనీలు అనే విదేశీ పెట్టుబడులు, సత్యం కంప్యూటర్సు, Infosis, రెడ్డి labs అనే దేశీయ పెట్టుబడి హైదరాబాదును రానున్న కాలంలో ప్రగతిపథంలోకి తీసుకునిపోతాయనీ, అలాగే ఒక ప్రాంతంలో సెజ్ వస్తోంది కాబట్టి ఆచుట్టు ప్రక్కల ప్రాంతాలు కూడా అభివృద్ధి చెందుతాయనే అనే ఊహ, ఆ ప్రాంతాలలో మనం ముందుగానే స్థలాలు కొనిపడేస్తే భవిష్యత్తులో బోల్డులాభాలు పొందవచ్చుననీ, ఇప్పుడే ఒక ఇల్లు కట్టిస్తే ముందుముందు బోల్డు అద్దెలు వస్తాయని మనం సామాన్యంగా వింటున్న మాట. ఇందులో వర్తమానం ఒక భవిష్యత్తుకి పునాది కాదు. భవిష్యత్తుమీద ఆశే ఈ ప్రవర్తనకి పునాది. ఆ ఆశే ఒక మారకపు విలువగా, సరుకుగా తయారవుతుంది. వర్తమానం తన ఉనికిని పోగొట్టుకుంటుంది. అభివృద్ధి అనేది వర్తమానం, అందులో ఉండే వైరుధ్యాల resolution ద్వారా భవిష్యత్తులోకి వెళ్ళడమనేది మార్క్సిస్టు అవగాహనలో ప్రాథమికం. మనం ప్రస్తుతం చూస్తున్న అభివృద్ధి పథకాలు, అందులో సెజ్‌లు భవిష్యత్తుమీద ఆశను సరుకుగా మార్చే జూద ప్రపంచం ఈ విషయాన్ని పాణి కొంతమేరకు బాగా చెప్పాడు. "అనూచానమైన, సంప్రదాయకమైన శ్రమ చేసే వాళ్ళకన్నా యితరులు సుఖవంతంగా జీవిస్తున్నారనే నమూనా ఇది. ఈ పోలికకు- తేడాలు మూలం మన ఆధునికత (?) లోనే ఉన్నది." "ఏకకాలంలో ఇది భౌతిక వాస్తవమూ, దాన్నుండి పుట్టిన భావజాలమూ. నిజానికి సుఖవంతం, అర్థవంతం అనే మాటలకు ఉండే నిర్వచనాలు స్థిరమైనవి కావు. వాటిలో ఆత్మీకమైన, విలువల సంబంధమైన అంశం ఉండవచ్చుగాని, వాటిమీదనే నిర్వచనాలు నిలబడవు. జీవితాలు అసలే కొనసాగవు. వ్యవసాయంలో యిప్పుడున్న పాతతరం ఈ సంఘర్షణే తీవ్రంగా ఎదుర్కొంటున్నది. ఆ తర్వాతి తరం వాళ్ళది మరో రకమైన అనుభవం. ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతుల్లో ఎక్కువమంది ముప్పై, నలభై ఏళ్ళ మధ్యవయసు వాళ్ళు కావడం గమనించవచ్చు. ఈ మార్పుల్లో, సంఘర్షణలో అంతిమంగా ప్రాధాన్యాలను నిర్ణయించే శక్తిగా వ్యవస్థ బలిసిపోయింది. అందువల్ల తెలిసిన పనిచేసి, చేతికి అందింది తినడంలో లేని మాధుర్యం బైట ఎంతో కొంత కనిపించక పోలేదు. కొత్త అవకాశాలు, కొత్త వినియోగాలు అనుభవంలోకి వచ్చే కొద్దీ జీవితం గతిశీలమైంది. ఆ కారణం వల్ల పాత జీవితం చుట్టూ ఉన్న తెరలను చీల్చుకొని ఆవలి ప్రపంచంలోకి వెళ్ళిపోవాలనే ఆకాంక్ష వ్యక్తమవుతున్నది. వ్యవసాయం నుండి వేరే జీవనోపాధుల్లోకి వెళ్ళాలని కోరుకునే వాళ్ళు కొద్దిస్థాయిలోనైనా కనిపిస్తున్నారు. అవి సుభిక్షమైన మార్గాలు అవునో కాదో కాని లాభసాటి మాత్రం కావచ్చును. (P.126).

వ్యాసం మొత్తం మారకపువిలువలు, ఉపయోగపు విలువలు మధ్య అసంపూర్ణంగా మిగిలిపోయిన, మరో మాటలో చెప్పాలంటే పెట్టుబడికి భూస్వామ్యానికి అసంపూర్ణంగా మిగిలిపోయిన వైరుధ్యంగానూ మన దేశ సమాజపు 150 ఏళ్ళ చరిత్రనూ ప్రతిబింబిస్తుంది. కాని వ్యాసరచయిత ఎందుకో ఈ వైరుధ్యాన్ని సాంప్రదాయము, ఆధునికతగా చూచినట్టుగా నాకనిపించింది. ఆధునికతలో ఉన్న శాస్త్ర సాంకేతిక జ్ఞానము, సాంప్రదాయంలో ఉన్న జడత్వం కొంత కేంద్రబిందువుగా వ్యాసం నడుస్తుందని అనిపిస్తుంది. అందువలనే వ్యాసం చివరలో సెజ్‌ల గురించి చెబుతూ, "సెజ్‌ల గురించి పాలకులు చెబుతున్నవన్నీ అబద్ధాలే ఒక్కోదాన్ని విప్పి చూపవచ్చు. ఓడించవచ్చు, అయితే సెజ్‌ల వెనుక దాగిన నిజాలు కొన్ని ఉన్నాయి. సాంప్రదాయక సమాజాన్ని వ్యవసాయం ఆధారిత జీవనోపాధుల్నీ ధ్వంసం చేసి ఆ క్షేత్రాలను అత్యున్నత శాస్త్ర సాంకేతిక ఉత్పాదక క్షేత్రాలుగా మార్చివేయాలనే ఉద్దేశమే అసలు నిజం". (P.131) ఈ సూత్రీకరణ నన్ను కొంచెం ఇబ్బందిపెట్టింది. బహుశ ఇది చాలా చర్చనీయాంశమేమో. ఆ చర్చలోకి వెళ్ళకుండా ప్రస్తుతం కొన్ని ప్రశ్నలు వేసుకుంటే చాలనుకుంటాను. శాస్త్రం, శాస్త్రీయత అనే దాంట్లో రెండు ప్రధానాంశాలు ఉన్నాయి. శాస్త్రం ఒక method ఒక పద్ధతి. అది శాస్త్రీయము అనడానికి పునాది ఆ పద్ధతిలో ప్రకృతి

**వ్యాసం** ☆ ఎ.వి.రెడ్డి శాస్త్రి

# మామూలు కథ మంచికథ - గొప్పకథ

కథలు చెప్తున్నాడంటాం --మనకి వినడానికి యిష్టంలేని విషయాన్ని --మనని నమ్మించడానికి కథలా ఎవరేనా చెప్తూవుంటే. దీనిభావం ఏమిటి? ఏదేనా సంగతిని కథలా చెప్పినా, వినడానికి యిష్టం కలగని విధంగా దానిని చెప్తే, దానిని పట్టించుకోం. కథ చెప్పడం ఒక్కటే సరిపోదు. దానిని వినేవాళ్లు వినేటట్టు చెప్పాలి. ఇక్కడ రెండు విషయాలు స్పష్టమయాయి. ఒకటి కథని చెప్పడం (కథావస్తువు, లేక సారం), రెండు కథని వినసొంపుగా చెప్పడం (రూపం లేక శిల్పం లేక టెక్నిక్).

అయితే, అందరూ కథలు చెప్పలేరు. కథలు చెప్పాలనే కోరిక, చెప్పగలిగే నేర్పు కేవలం కొందర్లోనే వుంటుంది. కథని చెప్పాలంటే- కథని వూహించగలిగే శక్తి కావాలి. ఈ వూహించగలిగే నేర్పు కూడా -మనుషుల్లో తేడాలు వున్నట్టుగానే-- రకరకాల తేడాలతో వుంటుంది. మామూలుగా, సాదాసీదాగా వూహించగలగడం, కొంచెం బాగా వూహించగలగడం, చాలా గొప్పగా వూహించగలగడం -- యిలా. హోమర్, షేక్స్పియర్, వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు-- వీరంతా మహోన్నతంగా వూహించగలిగిన కథకులు.

ఒక కథకుడు మహోన్నతంగా ఊహించగలిగేడని ఎలా చెప్పగలం? కథని చెప్పడం కూడా మహోన్నతంగా చెప్పగలిగినప్పుడే. కథకుణ్ని కథకుడిగా మనం గుర్తించగలిగే సాధనం --కథని చెప్పగలిగే అతని సామర్థ్యం (Technique). కథ వూహలోంచి పుడుతుంది. మరి, వూహ ఎక్కడనుంచి, ఎలా పుడుతుంది? ఊహ పుట్టడానికి దోహదపడేది మన చుట్టూవున్న సమాజం. అలా పుట్టిన వూహకి, చిలవలు, పలవలు చేర్చి కథఅల్లుతాడు భావుకుడు. మేజిక్కులగురించీ, మాంత్రిక ప్రపంచాలగురించీ రాసే రచయితలు కూడా (ఉ. harry potter J.K.Rowling) బొత్తిగా నేలవిడిచి సాము చేసినవాళ్లుకాదు. వాళ్లు కూడా చుట్టూవున్న సమాజంనుంచి మాతృకల్ని అసంకల్పితంగానైనా గ్రహించి వూహలతో వాటికి చిత్ర విచిత్రమయినకల్పనల్ని జోడించి, ఒక మాంత్రిక జగత్తుని సృష్టిస్తారు. అంచేత అలాటి రచనలకికూడా, సమాజమే నేపథ్యం అన్న విషయాన్ని మనం విస్మరించకూడదు.

కథకి వూహ ప్రధానం అని చెప్పుకున్నాం. ఈ వూహరకరకాలుగా వుంటుంది. వాస్తవమైన విషయాలకి సంబంధించిన వూహ realistic, చారిత్రక విషయాలకు సంబంధించిన ఊహ (historical), మనోవిశ్లేషణకి సంబంధించిన వూహ (Psychological), సామాజిక విషయాలకి సంబంధించిన వూహ (Sociological), ఆర్థిక సంబంధాల గురించి వూహ (Economical), పారలౌకికవ్యవహారాల గురించిన వూహ (Spritual) ఇలా ఎన్నెన్ని విషయాలకో సంబంధించి వుంటాయి వూహలు. ఇవన్నీ మనచుట్టువున్న సమాజంలో వున్నవే. ఒక్కొక్క కథకుడికి ఒక్కొక్కరకమైన వస్తువంటే మక్కువ.

తనకి నచ్చిన విషయాన్ని కేంద్రంగా చేస్కొని, దానికి తన వూహల్ని

---

మీద, సమాజం మీద సముపార్జించిన జ్ఞానము కూడా శాస్త్రంగానే చలామణి అవుతుంది. ఈ శాస్త్రం ఉపయోగించుకుని తయారైన టెక్నాలజీ, ఉత్పత్తి పరికరాలు శాస్త్రీయపరికరాలుగానీ మనమీద ప్రభావం చూపిస్తాయి. మార్క్సిజం పద్ధతి మార్క్సిజాన్ని స్థల, కాలపరిస్థితులను అన్వయించడం అనేది ఆ పద్ధతిని ఉపయోగించుకొనే క్రమం. మార్క్స్ కాలంలో మార్క్స్ తన పద్ధతిని అన్వయించి ఒక పారిస్ కమ్యూన్ని విశ్లేషిస్తే, సోషలిజం ఆవిర్భావం, పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వం చిందిన దశలో వస్తుందని చెప్పక చెబితే, అందునా యూరప్‌లో జరుగుతుంది అని ఊహిస్తే, లెనిన్ పెట్టుబడినదారీ సమాజంలో అత్యున్నత దశలో లేని రష్యాలో weakest linkగా చూసి సామ్రాజ్యవాద అంతర్గత వైరుధ్యాల ద్వారా రష్యాలో సోషలిస్టు విప్లవానికి ఆద్యుడుగా నిలిస్తే; పెట్టుబడిదారీ వ్యవస్థని ఆమడ దూరంలో ఉన్న చైనాలో మార్క్సిస్టు పద్ధతిలో విశ్లేషించి ఒక నూతన ప్రజాస్వామిక విప్లవంని తద్వారా సోషలిస్టు సమాజానికి ఒక పునాది వేయగలిగాడు. మావో శాస్త్రంలో ఉన్న పద్ధతిని తీసుకుని సమన్వయించుకునే క్రమంలో కొన్ని కొత్త పనిముట్లు, కొన్ని పద్ధతులు వచ్చాయన్నది మన అందరికీ తెలిసిన విషయం. మార్క్స్ చెప్పాడు కదా మా ఊళ్ళో విప్లవం వస్తుంది అని ఊహించుకుంటే, అది మార్క్సిజాన్ని ఒక జ్ఞానంగానే చూడడమవుతుంది. కాని శాస్త్రీయ పద్ధతులు అలవడవు. ఒక ట్రాక్టరుకాని ఒక కంప్యూటరుకాని ఒక blast furnace కానీ ఒక పరికరం మాత్రమే. ఆ పరికరం తయారుచెయ్యడానికి, ప్రకృతి చలన సూత్రాల మీద శాస్త్రీయ జ్ఞానంకాని, ఆ శాస్త్రీయ జ్ఞానం సంపాదించటానికి ఒక శాస్త్రీయ పద్ధతికావాలి. ఈ పద్ధతి అంతా రూపం నుండి సారానికి వెళ్ళటం, సారంనుండి ప్రతిరూపం తయారుచెయ్యటానికి ఉండే క్రమంలో భాగం. ప్రతిరూపం తెలుసుకొని సారం అది గ్రహించే పద్ధతి తెలియకపోతే ప్రతి రూపం కూడా ఒక గుడ్డి నమ్మకంగా మిగిలిపోయే ప్రమాదం ఉంది. సెజ్ కార్యక్రమంలో మనకి కనిపించేవన్నీ చాలావరకూ ప్రతి రూపాలే. అందుచేత సెజ్‌ల వలన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం సమాజంలో పెరుగుతుంది అని అనుకోవడం కొంతవరకూ లోపభూయిష్టమే. సెజ్‌ల స్థాపనలో ముఖ్య ఉద్దేశము, అసలు నిజం సాంప్రదాయక వ్యవసాయాన్ని ధ్వంసం చేసి అత్యున్నత శాస్త్ర సాంకేతిక ఉత్పాదక క్షేత్రాలుగా మార్చివేయాలనేది అనుకోవడంలో కొంత తొందరపాటు తనముందేమో. వేణు వ్యాసంలో పరిశ్రమలు భూమిని మిగిలిన వనరులను మెరుగైన రీతిలో ఉపయోగం జరుగుతుందనీ అనుకోవడంలో కూడా అదే తొందరపాటుగా కన్పిస్తుంది. అసలు సెజ్‌లు ఎందుకు వస్తున్నాయి ఎవరికోసం వస్తున్నాయి. అనేవి సమాధానం కోరే ప్రశ్నలు. సామ్రాజ్యవాద పెట్టుబడి ఇక్కడ స్థానిక పెట్టుబడిదారులతో కలిసి పెట్టుబడి (విస్తరించటానికి) ఇక్కడ చవుకగా దొరికే భూవనరులు ప్రభుత్వ ప్రమేయంకాని కట్టుబడికాని లేకుండా విశృంఖలంగా వ్యవహరించటానికి, భవిష్యత్తులో దేశంలో ఉండే ఆర్థికవృద్ధి ఏమైనా ఉంటే అందులో పెద్ద ఎత్తు భాగం తీసుకోవడానికి, ఒక మాటలో చెప్పాలంటే, భారత దేశంలో ఆధిపత్యాన్ని సొంతం చేసుకోవాలని అభిలాష ఉంటుంది. ఈ క్రమంలో లాభపడేది సామ్రాజ్యవాది, దేశీ పెట్టుబడిదారులు. ఒక ప్రక్కనుంటే పేద రైతాంగం, రైతుకూలీలు తీవ్రంగా నష్టపోతారు. ఇక్కడ రెండురకాలయిన భూదాహం ఉంది. ఒకటి, పెట్టుబడిదారుడికి ఒక భూదాహమైతే, భూమిమీద ఆధారపడి జీవనోపాధి లేనిపేద రైతాంగం, రైతుకూలీలకు ఉండేది రెండవ భూదాహం. మిగిలిన రైతాంగం ఊగిసలాడుతూ ఇటు భూమిమీద బ్రతుక్కు కంటే పట్టణాలలో బ్రతుకు మేలనే ఆశాభావంతో ఉండే రైతాంగం. సెజ్‌లు అభివృద్ధికరమా కాదా అనేది చూడడానికి ఒక శ్రామిక వర్గం వస్తోందా లేదా అనేది ఒక గీటురాయి. అయితే పేదరైతులు, వ్యవసాయ కూలీలు అందులో భాగంగా కాకుండా ఒక లంపెన్ ప్రాసెస్‌లో అర్థంలేనిసగా ఇరుక్కు పోతారా అనేది రెండోగీటురాయి. సెజ్ వ్యతిరేకత - అది ఒక ఉద్యమ రూపం దాల్చటం, అభివృద్ధి పథకాలు అభివృద్ధిని తెచ్చే నూతన ప్రజాస్వామిక ఉద్యమం మధ్య తీవ్ర వైరుధ్యంగా నాకనిపిస్తుంది.

పుస్తకం పేరు: ప్రత్యేక మృత్యుమండలాలు,
సెజ్‌లపై పరిశీలనా వ్యాసాలు, విరసం ప్రచురణ,
వ్యాసాలు, దిశా పుస్తక కేంద్రము, హైదరాబాదు.

తేది: 6-1-2009.

*

జోడించి కథలు అల్లుతాడు కథకుడు. కథకుడు ఎంతలోతుగా వూహించగలిగేడు, ఎంతటి వూహాసామర్ధ్యాన్ని కలిగి వున్నాడు అన్నదానినిబట్టి అతని రచనని మామూలు రచనఅనీ, మంచి రచనఅనీ, గొప్పరచన అనీ వర్గీకరించడానికి వీలుపడుతుంది. ఉదాహరణకి షేక్స్‌పియర్ తన నాటకాల్లోనీ, సానెట్స్‌లోనీ ఎంతటిలోతైన భావాల్ని వ్యక్త పరుస్తాడో చూడండి! వాటి అర్థం 'ఇదే', 'ఇంతే' అని ఎవరేనా నిర్ద్వంద్వంగా చెప్పగలుగుతున్నారా? అలాగే, వాల్మీకి మహాకవి తన రామాయణకావ్యంలో ఒక కాండని 'సుందరకాండ' అని ఎందుకు అన్నాడు? ఈ కారణంచేత దాన్ని సుందరకాండ అని అన్నాడు వాల్మీకి అని ఎవరేనా స్పష్టంగా, మరేరకమైన వ్యాఖ్యానాలకీ తావులేకుండా చెప్పగలుగుతున్నారా? అదీ, గొప్ప కావ్యలక్షణం--వ్యాఖ్యానాలకిగాని, అర్థానికిగాని, అనంతమైన అవకాశాన్ని కలిగిస్తుంది గొప్పరచన. దాని అర్థం, వైశిష్ట్యం, ప్రయోజనం --స్థల కాలాలకి పరిమితంకావు.

కథ చెప్పడం, కథ రాయడం అన్నదే ఒక టెక్నిక్. అది టెక్నిక్ కాదనుకుంటే, కలంపట్టగలిగిన ప్రతి వ్యక్తీ కథలు రాయగలుగుతాడని ఒప్పుకోవాలి. కొడవటిగంటి కుటుంబరావుగారి కథల్లోనీ, కాళీపట్నం రామారావుగారి కథల్లోనీ టెక్నిక్ ప్రసక్తేలేదు. కేవలం కథావస్తువు తప్ప అని ఎవరేనా అంటే అది ఎంతమాత్రం నిజంకాదు. ఏదో టెక్నిక్ లేకపోతే, వాళ్ల కథల్ని చదివి,-- అవిగొప్ప కథలనీ, వాళ్లు గొప్ప కథకులనీ మెచ్చుకొనివుండేవాళ్లమే కాదు. పూవులో వున్న ఏదో సుగంధం తుమ్మెదల్ని తనవైపు ఆకర్షించేటట్టు, టెక్నిక్ అన్నది పాఠకుడ్ని రచనవైపు ఆకర్షిస్తుంది. టెక్నిక్కుల్లో వైవిధ్యాలేతప్ప, అసలు టెక్నిక్ అన్నదేలేని రచనవుండదు. కుటుంబరావు, రామారావుగార్ల కథల్లో కనిపించీకనిపించని టెక్నిక్ ఉంటే, --చలం, రావిశాస్త్రి, బీనాదేవి వంటివారి రచనల్లో టెక్నిక్ విశ్వరూప విజృంభణతో సాగుతుంది.

కథలలో కనిపించే టెక్నిక్ని కూడా మూడురకాలుగా విభజించుకో వచ్చును- పేలవమయినశిల్పం (Poor technique), అదృశ్యశిల్పం (Invisible technique), ప్రస్ఫుటంగా కనిపించేశిల్పం (conspicuous technique) అని. అయితే ఇది కేవలం చాలాపరిమితమైన విభజన. టెక్నిక్ అన్నది విస్తృతమైన పరిధిని కలిగిన పారిభాషి కపదం అన్నసంగతి మనం మరచిపోకూడదు. జోసెఫ్ ఫ్రాంక్ రాసిన టెక్నిక్ యాజ్ డిస్కవరి అన్నవ్యాసం టెక్నిక్ గురించి అవగాహనని విస్తృతపరచుకోడానికి బాగా వుపయోగపడే వ్యాసం

ఒక రచయిత కథని రాస్తాడుగాని, ఆ కథని ఆవిష్కరించడంలో ఏమాత్రం ప్రతిభని కనపరచలేకపోయాడనుకుందాం. అప్పుడాకథ చప్పగా, బొత్తిగామామూలు కథై కూర్చుంటుంది. అలాటి కథని సాధారణంగా ఎవరూ చదవరు. చదివినా వుత్తచెత్తబాబూ అని తీసిపారేస్తారు. ఇలాటి కథలు చాలా పేలవమయిన శిల్పంతో రాయబడ్డకథలని అనుకోకతప్పదు. కొంతమంది రచయితలు కథలు చెప్పే విధానం చాలాగొప్పగా ఉంటుంది. ఉదాహరణకి కుటుంబరావుగారూ, రామారావుమేష్టారూ, ఓల్గా, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారూ, శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారూ-- యిలా చాలామంది మహారచయితలు-- వారి వారికథల్లో కథా వస్తునే ప్రముఖంగా కనిపించేటట్టు రాస్తారు. వారి కథా వస్తువే చాలా ముఖ్యమయినదని ఒప్పుకోకతప్పదు. అయితే, అంతమంచి కథావస్తువుల్ని -పాఠకుడు కిందపెట్టకుండా చదివించే గొప్ప శైలీవిన్యాసం కూడావుంది వారిరచనల్లో. వారు చెప్పున్న కథావస్తువు చాలా బలమైంది కావడంతో -పాఠకులు వస్తువునే చూస్తుంటారుగాని -అది చెప్పబడిన విధానంగురించి అంతపెద్దగా పట్టించుకోరు.

నాకు తెలీదుగాని తెలిసినవాళ్లు అంటుంటారు-- ఒకప్పటి ఆస్థానకవి, మహామహోపాధ్యాయ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు బోలెడు కావ్యాలు రచించారని. నిశ్చయంగా బరువైన విషయాల్నే కావ్యవస్తువులుగా ఆయన ఎన్నుకొని వుంటారు. కాని, ఎవ్వరూ ఆయన పుస్తకాల్ని ఎందుకు చదవరు? దానిని బట్టే తెలిసిపోతోంది-ఆయన రచనల్లో టెక్నిక్ ఎంతమాత్రం బాగుండి వుండదు అని. కాని , కవిసామ్రాట్ విశ్వనాథసత్యన్నారాయణగారి 'కిన్నెరసాని పాటలు, వరలక్ష్మీ త్రిశతి, కల్పవృక్షం'లాంటి పద్యకావ్యాల్ని జువ్వాది గౌతమరావుగారివంటి కవితాభిమానులు గానం చెయ్యడం మనందరికీ తెలిసిందే. సత్యన్నారాయణ గారి ఛాందస భావాల్ని వ్యతిరేకిస్తూనే వారి నవలా రచనా సామర్థ్యాన్ని ఎంతగానో ప్రస్తుతించారు-- వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారు-'వేయిపడగలు' మీదరాసిన ఒకవ్యాసంలో. ఏతావాతా చెప్పవచ్చేదేమిటంటే, గాఢమైన విషయం గురించి చెప్పినా, సరియైన శిల్పం ద్వారా దానిని చెప్పకపోతే, దానిని పాఠకులు చదవరు. పాఠకులు వస్తువుయొక్క గొప్పతనాన్ని మాత్రమే ఫీలవుతూ, టెక్నిక్ విషయాన్ని మరచిపోయేంత గొప్పగా రాయగలగడం--రచయితకి తన వస్తువుమీదా, శిల్పంమీదా వున్న అసాధారణమైన కంట్రోలుకి నిదర్శనం. టెక్నిక్‌ని వేరుచేసి చూడలేనంతగా అది వస్తువుతో మమేకమైపోతుంది. ఈరకంగా పైకి కనిపించని శిల్పాన్ని - అదృశ్యశిల్పం (invisible technique) అనవచ్చును.

ఇక కొన్ని రచన్లోనయితే, శిల్పం కొట్టవచ్చినంత స్పష్టంగా కనిపిస్తుంది. దీన్ని 'దృశ్యశిల్పం' (Visible or conspicious technique) అని పిలవచ్చు. కేవలం శిల్పానికి మాత్రమే ప్రాధాన్యతనిచ్చే రచయితలు చాలామంది వున్నారు. మంచి శైలీ చమత్కారం వున్నది కనకగాని, లేకపోతే చలం రచనల్ని ఎంతమంది చదువుతారు? పాఠకులు చలం రచనలవైపు ముందుగా ఆకర్షితులవడానికి ప్రధాన కారణం అద్భుతమైన ఆయనశైలి. అతని శైలిలో వున్నగొప్పదనం - అతని వస్తువులో వున్న అశ్లీలతని చూడనివ్వదు. అలాకాకపోతే -అతని శైలీ ఔన్నత్యం అశ్లీలతని కూడా అందలం మీద కూర్చోబెట్టి చూపించగల సామర్థ్యాన్ని సంతరించుకుంది. అయితే చలంకి తన వస్తువు విషయంలో అచంచలమైన Commitment కూడావుంది. తను గాఢంగా వాంఛించే మానవసంబంధాల మార్పుని - అద్భుతమైన శైలీ ప్రక్రియద్వారా - పాఠకుల ముందుంచి, వారి చేత తన రచనల్ని చదివించి, ఆలోచింపచెయ్యడంలో కృతకృత్యుడైన రచయిత చలం. చలం శైలి చెప్పదల్చుకున్న దాన్ని ఎలాటి దాపరికం లేకుండా, స్పష్టంగా చెప్పూనే, మహాయిష్టంగా పాఠకులు చదివేటట్టుగా చెప్తుంది. అందులో వ్యంగ్యాలుగాని, వక్రోక్తులుగాని కనిపించవు.

వక్రోక్తంటే Indirection, సూటిగా చెప్పకుండా- అన్యాపదేశంగా చెప్పడం అని అంటారు. Cleantn Brooks అనే ప్రముఖ ఫార్మలిస్టు కూడా తనవ్యాసం Irony as a Principle of Structure లో Indirection -వక్రోక్తి మాత్రమే కవిత్వపు వైశిష్ట్యానికి సూచిక అంటాడు. చెప్పదలుచుకున్న దాన్ని - నేరుగాకాకుండా - indirect గా సూచనల ద్వారా metaphors ద్వారా చెప్పడం వల్ల - కార్యార్థం మరింత పరిపుష్టం అవుతుందని మన లాక్షణికులు కూడా చెప్పి ఉన్నారు.ఈరకమైన వక్రోక్తి వ్యంగ్యాల టెక్నిక్ రావిశాస్త్రిగారి రచనల్లో స్పష్టంగా కనిపిస్తుంది. శైలీ శిల్పాన్నే తన కథన విధానంగా ఎంచుకున్నారు రావిశాస్త్రిగారు. వ్యంగ్యాత్మకమైన రచనా శిల్పాన్నివొక పరిపూర్ణమైన స్థితికి తీసుకువెళ్లిన రచయిత రావిశాస్త్రిగారు.

అయితే, ఆయనరచనల్లో శైలి ఒక్కటేకాదు విశేషం. అతిబలమైన సామాజిక వస్తువుని--అంతకంటే బలమైన కథన కౌశలంతో -- మన ముందుంచుతారు శాస్త్రిగారు. శైలీ విన్యాస ప్రదర్శనకాదు ఆయనలక్ష్యం. ఒక బలమైన సామాజిక సమస్య -- పదునైన ఆయుధంలా పాఠకుడి మనస్సుని తాకాలంటే --అందుకు అవసరమైన మాధ్యమం (medium) అనితర సాధ్యమైన శైలే అని గుర్తించిన మహారచయిత శాస్త్రిగారు. ఆయన out and out అణగారిన వర్గాల spokesman, వారిబాధల్ని, వారి సమస్యల్ని, వారి బతుకు పోరాటాల్ని రావిశాస్త్రి చెప్పినంత బలంగ ఏ శ్రామికవర్గ ప్రవక్తా చెప్పివుండడని నా నమ్మకం. మధ్యతరగతి వారి మనస్తత్వాల్ని ఎండగడుతూ యిలా అనిపిస్తారు పీనుగ్గుమాస్టాచేత --రాజూ-- మహిషిలో 'మనమెవళం? మనం పులివెనక నక్కలం' అని. ఆయన సృష్టించిన వేతనశర్మ మధ్యతరగతి వారి

అసలు సిసలు ప్రతినిధి. రావిశాస్త్రిగారి శిల్పం యావత్తూ అణగారిన వర్గాల హాహాకారాల్ని ఆవిష్కరించడంలోనీ, మధ్యతరగతి వారి మనస్తత్వాన్ని ఎండగట్టడంలోనీ తలమున్కలవుతుంది. రావిశాస్త్రిగారి శిల్పం అద్భుతమైన దృశ్యశిల్పానికి ఉదాహరణ.

అయితే, దేన్ని గొప్పశిల్పం అంటాం? గొప్పశిల్పం ఎన్నడూ తనకి వుద్దేశించబడిన ప్రయోజనాన్ని మరచిపోదు, మరచిపోకూడదు కూడాను. కేవలం శిల్పాన్నే ఎవ్వరూ రాయలేరుకదా! కథని ఆధారంగా చేస్కొని శిల్పాన్ని (technique) ప్రదర్శించాలి.కథావస్తువుని లేక విషయాన్ని బలంగా చెప్పడానికి వుపయోగపడే సాధన శిల్పం. James Joyce నవల Ulysses -- టెక్నిక్‌కి పెద్దపీట వేసిన గొప్ప modernist నవల. ప్రతినాయకుడ్ని ప్రధానపాత్రని చేసి, హోమర్ మహాకవి సృష్టించిన ధీరోత్త నాయకపాత్ర Odyssey ని వ్యంగ్యంగా అనుకరిస్తూ-- నిస్తేజమూ, నిస్సారమూ, లోపభూయిష్టమూ అయిన Post-war Dublin సమాజాన్ని అవహేళన చేసే నవల Ulysses, ఇందులో James Joyce చేసిన శిల్ప ప్రయోగాల హేల సాహితీ ప్రియులందర్నీ ఎనలేని సంభ్రమానికి గురిచేసింది. ఎన్ని ప్రయోజనాల్ని సాధించడానికి, ఎన్నిరకాలుగా శిల్పాన్ని వినియోగించుకోవచ్చునో సాహిత్యలోకానికి తెలియపరచిన సాహితీ మేరు పర్వతం James Joyce. Joyce వరవడి పెట్టిన శిల్ప వైశిష్ట్యాన్ని మరికొన్ని అడుగులు ముందుకు తీసుకువెళ్లి, ఇరవయ్యోశతాబ్దపు అతిగొప్ప ప్రయోగాత్మకమైన, ప్రయోజనాత్మకమైన నాటకం Waiting for Godotని సృష్టించాడు--Joyce వీరాభిమాని అయిన Samuel Beckett. రావిశాస్త్రిగారి టెక్నిక్ కూడా జోయిస్ టెక్నిక్ లాగే వ్యంగ్యాత్మకంగా వుంటుంది. తెలుగు సాహిత్యానికి నోబెల్ బహుమానం లభించివుంటే, అది నిశ్చయంగా రావిశాస్త్రిగారి రచనలకే లభించి వుండేదని నా అభిప్రాయం.

కేవలంశిల్ప ప్రదర్శనకోసమే కథరాయడం అన్నది చాలా చవకబారు ప్రక్రియ అనిపిస్తుంది. ఎంతగానో విచారపడుతూనే చెప్తున్నాను--టెక్నిక్‌ని కేవలం టెక్నిక్‌కోసమేరాసే రచయితలు ఎవరా అని ఆలోచిస్తే, డాక్టర్ వి. చంద్రశేఖరరావుగారు మాత్రమే గుర్తుకువచ్చారు. టెక్నిక్ మాయాజాలం స్పష్టంగా, కొట్టవచ్చినట్లుగా కనిపించేటట్టు రచనలు చేసినవారిలో ప్రముఖులు శ్రీనద్దెరచండీదాసు, శ్రీకాశీభట్లవేణుగోపాల్ వంటివారు కూడా వున్నారు. అయితే వీరివిషయంలో శిల్పసాంద్రతతోపాటు వస్తు వైవిధ్యం, వస్తుసాంద్రత కూడా కనిపిస్తాయి. కనక వీరి రచనలకి మంచి ఆదరణ కూడా వుంది. టెక్నిక్నే చుక్కానిగా చేస్కొని రచనాయానం చేస్తున్న రచయితలు ఒక్కవిషయం గమనించాలి. టెక్నిక్‌ని అతిగా వాడటం వల్ల పాఠకులు అచిరకాలంలోనే విసుగెత్తిపోయే అవకాశంవుంది. అంచేత, శిల్పవిన్యాస ప్రదర్శనకూడా పరిమితులున్నాయి. ఎంత గొప్పటెక్నిక్‌నయినా, పాఠకుల్ని విసుగెత్తించకుండా వుపయోగించాలి. ఒకలడ్డు అయితే తినడానికి చాలా బావుంటుంది. అదే పనిగా లడ్డూల్ని వడ్డిస్తే - అది ఎంత గొప్పవంటకమైనా --ముఖం మొత్తుతుంది.

మూలప్రశ్నకి వద్దాం-- మామూలు కథకులు ఎవరు? మంచి కథలు ఎవరు? మహా కథకులు ఎవరు? మామూలు కథకులు తీసుకునే కథావస్తువులు కూడా మామూలుగానే వుంటాయి. సంసారాల్లో సాగే లోకాభిరామాయణం కబుర్లు, నిత్య వ్యవహారాల్లో సంభవించేచిన్న చిన్న సంఘటనలు -- ఈరకంగా మామూలు రచయితల దృష్టి చాలా తక్కువ దూరం మాత్రమే ప్రసరిస్తుంది. చంటిపిల్లవాడు తనచుట్టువున్న వస్తువుల్ని తప్ప, అంతకంటే దూరంగా వున్న వస్తువుల్ని ఎలా చూడలేకపోతాడో, ఎలా ఆకళింపు చేస్కోలేకపోతాడో-- అలాగే మామూలు కథలు రాసే కథకులు కూడా అతి తక్కువ లోతుని (Depthని), అతి తక్కువ ప్రయోజనాన్ని మాత్రమే చూడగలుగుతాయి. ఇలాటి కథలు కేవలం కాలక్షేపం కథలుగానేనా వుంటాయి, లేదా అత్యంత పరిమితమైన ప్రయోజనాన్నేనా కలిగివుంటాయి. అలాటి కథలు చదవడం పూర్తిచేశాక, పాఠకుల్లో ఏరకమైన కొత్త చైతన్యమూ కలగదు. పిప్పరమెంటు బిళ్లని చప్పరించడం పూర్తవగానే దాని ఉనికీ పూర్తయేటట్టు, యిలాటి కథల్ని చదవడం ముగించగానే, వాటి అస్తిత్వం కూడా ముగుస్తుంది.

ఇక మంచి కథలు- సామాజిక సమస్యలన్నిటి మీదా మంచి కథలు రాయవచ్చును --రాస్తున్నారు కూడాను. ఈకథలకు మంచి అనువైన శిల్పం జోడించగలిగితే, చాలమంచి కథలు వస్తాయి. అయితే, సామాజిక సమస్యల్ని యథాతథంగా కథావస్తువుగా తీస్కుంటే, ఒక సమస్యకూడా ఉత్పన్నమవుతుంది.

సామాజిక కథాంశాలు సాధారణంగా వర్తమాన సామాజిక సమస్యలకే పరిమితమవుతుంటాయి. వుదాహరణకి, నిత్యావసరవస్తువులధరలు రోజురోజుకీ పెరిగిపోతూ, సామాన్యుడి జీవితాన్ని దుర్భరం చేస్తున్న విషయం మీదరాసే కథలు. ఇవి కేవలం స్థలానికీ, కాలానికీ మాత్రమే పరిమితమైన కథలు. ఈ సమస్యలమీద వచ్చిన కథలన్నీ కాలక్రమేణా వాటి వర్తమానతని కోల్పోయి, పాఠకుల నిరాదరణకు గురయ్యే అవకాశం వుంది. ఉదాహరణకి 2006 లో వచ్చిన చాలా మంచి కథ -- అక్కిరాజుభట్టిప్రోలుగారి 'గేటెడ్ కమ్యూనిటీ'. అది హైదరాబాదులోని ఔటర్ రింగ్ రోడ్డు నిర్మాణం, దాని కారణంగా ఎంతోమంది మధ్యతరగతి వాళ్ల ఇళ్లు వాకిళ్లు కోల్పోవడం, అదే సమయంలో privileged sections వాళ్లయిళ్లు సురక్షితంగా వుండడం -- ఆ గేటెడ్ కమ్యునిటీచూసి మధ్య తరగతి వాళ్లఈర్ష్యలూ, ద్వేషాలూ-- ఇదీ కథాంశం. చాలామంచికథ. అయితే, ఇంత మంచి కథకీ, కొంతకాలంపోయాక relavency వుంటుందా?

ఎప్పటిదో హైదరాబాదులో రోడ్లవిస్తరణానికి సంబంధించిన కథ అని భవిష్యత్తులో వచ్చే పాఠకులు నిర్లిప్తభావం ప్రకటించే అవకాశం లేదా? ఈ కథతో బాటు 2006--లో వచ్చిన పెద్దింటి అశోక్‌కుమార్ 'మాయిముంత' కథ --సామాజిక సమస్యని మానవసంబంధాల కథగా--ఎంతో హృద్యంగా ఆవిష్కరించింది. ఈకథ తన charms ని, qppeal ని ఎన్నటికీ కోల్పోదని నా అభిప్రాయం. చెప్పవచ్చేదేమిటంటే, కేవలం వర్తమాన సామాజిక సమస్యలమీదనే రాయబడ్డకథలు-- సమస్యలు తాజాగా వున్నంతకాలం, గొప్పకథలుగాచూడబడినా, అవి స్థల కాలాలకు పరిమితమైన కథలుగానే మిగిలిపోవచ్చును. అంచేత ఇవి మంచి కథలుగానే వుంటాయిగానీ, గొప్పకథల జాబితాలోకి వెళ్లకపోవచ్చును. మరొక సమస్య ఏమిటంటే, సామాజిక సమస్యల నేపథ్యంలో రాయబడిన కథలు-- సర్వసాధారణంగా -- ఏకపార్శ్వ కథలుగా వుంటాయి. (monodimension stories) అంటే --కథని చదివీ చదివగానే దాని భావం, అది వుద్దేశించిన ప్రయోజనం --మనకి సులువుగా బోధపడిపోతాయి. అలాంటి కథల్లో అనేకరకాల అర్థాల్ని చూడడానికిగాని, బహురకాల వ్యాఖ్యానాలు చెయ్యడానికిగానీ అవకాశం వుండదు. ఈవిధంగా కేవలం సామాజిక సమస్యల్ని మాత్రమే చిత్రించే కథలు, మంచికథలు కావటానికి అవకాశం వుందిగానీ-- చిరకాలం పాఠకుల మనస్సులలో చెరగని ముద్రవేసి, నిలిచిపోయే కథలుగా రూపుదిద్దుకోడానికి అవకాశం లేదు. అయితే సామాజిక ప్రయోజనాలతో ముడిపడివున్న కథలు గొప్పకథలు కావడానికి అవకాశం లేదా అంటే --అలాగూ అనలేం. కథ అన్నది తనచుట్టూవున్న సమాజాన్ని ఆలంబన చేస్కునే వుద్భవిస్తుందన్నది కథ ఆవిర్భాగంలో ముఖ్యసూత్రమని అందరికీ తెలుసు. సామాజిక స్పృహలేని కథేవుండదు. --నిశితంగా పరిశీలిస్తే 'కన్యాశుల్కం' సామాజిక స్పృహని కలిగించే కథావస్తువుతో తయారయిన నాటకం కాదా? విశ్వనాథసత్యన్నారాయణగారి 'వేయిపడగలు' ఏవిటి? 'నావూహలకి అనుగుణమయిన సమాజం కాదు ఈ వర్తమాన సమాజం' అనే విశ్వనాథవారి ఆవేదనకి సంకేతం కాదా 'వేయిపడగలు?'. శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారి 'అరికాళ్ల కిందమంటలు' కథ సామాజిక స్పృహనుండి వుద్భవించిన కథకాదా? అందులో సంస్కరణవాదం యిమిడి వుండలేదా? తుమ్మేటి రఘోత్తమరెడ్డిగారి 'పనిపిల్ల' కథ, అల్లంరాజయ్యగారి 'అతడు', ఖదీర్ బాబుగారి 'ఖాదర్‌లేడు'లాంటి గొప్పకథలన్నీ సామాజిక స్పృహనుండి

ఖదీర్ బాబుగారి 'ఖాదర్‌లేడు'లాంటి గొప్పకథలన్నీ సామాజిక స్పృహనుండి పుద్భవించిన కథలే. వీటిని గొప్పకథలని ఎలా చెప్పగలం? ఇవన్నీ వర్తమాన సామాజిక నేపథ్యం కలిగి వుండడమే కాకుండా, స్థలకాలాలకి అతీతమైన, సార్వకాలికమైన, సార్వజనీనమైన ఏదోయూనివెర్సల్ అపీల్‌ని కలిగి వున్నాయి. అందుకని వాటిని గొప్పకథలని నిస్సంశయంగా చెప్పవచ్చును. గొప్పకథకి వుండవలసిన ముఖ్యలక్షణం-- ఒకప్రదేశానికిగాని, ఒకకాలానికిగాని పరిమితమైపోకుండా వుండడం. ఆ కథని ఎవరు ఎప్పుడు ఎక్కడ చదివినా-- ఆ చదివినవారి మనస్సులు ఒక అనిర్వచనీయమైన ఆర్ద్రతా భావంతో నిండిపోతుంది. 'ఆర్ద్రతాభావం' అంటే, అన్నిరకాల finer sensibilities నీ, అన్ని రకాల'emotions'నీ పాఠకుల మనస్సుల్లో కలిగించగలిగే ఒక పుదాత్తమైన కావ్యగుణం అని నా భావన. మానసికమైన యిలాటి పుదాత్తమైన స్థితికి చేరుకోగలగడాన్నే బహుశా, 'రససిద్ధి' అన్నారేమో మన లాక్షణికులు. అంటే, ఇదిAristotle పేర్కొన్న 'Catharsis' లాంటిభావన. మరోమారు ప్రశ్న వేసుకుందాం-- గొప్పకథకి వుండవలసిన లక్షణాలు ఏమిటి అని. అంతకంటే ముందు-- అసలు కథలు ఎందుకు రాస్తాం అని ప్రశ్నించుకుందాం. దీనికి స్పష్టమైన సమాధానం చెప్పటం కష్టం. కథలు వూహల్లోంచి, సామాజిక నేపథ్యంలోంచి పుడతాయని అందరం సాధారణంగా వూహించే వూహ. కాని, 'ఒక అసంతృప్త భావన' కథ వ్యుత్పత్తికి కారణభూతమవుతోందని నావిశ్వాసం. ఎలాగంటే, నిత్యావసర వస్తువుల ధరలు అనూహ్యంగా పెరిగిపోవడం మనం భరించలేకపోతున్నాం. ధరల పెరుగుదలవల్ల వుత్పన్నమవుతున్న ఆర్థికసమస్యలు మనని తీవ్రమైన నిస్పృహకీ, అసంతృప్తికీ గురిచేస్తున్నాయి. కథకుడు ఈ అసంతృప్తిని నేపథ్యంగా చేస్కొని కథ రాస్తాడు. ఈవిధంగా కథ అన్నది ఎప్పుడూ -- a feeling of complacence నుండికాక, a feeling of conflict and concern, resulting out of dissatisfaction నుండి పుడుతుంది. సామాజిక స్పృహతో మనం రాస్తున్న కథలు అన్నీ-- వర్తమాన సామాజిక వ్యవస్థ విషయంలో మన అసంతృప్తినీ, నిరసననీ తెలియచేస్తూ రాసినకథలే.

ఇలాటి కథలన్నిటినీ వాస్తవానికి అద్దంపడుతున్న కథలని అభివర్ణిస్తుంటాం.

ఇవి సాధారణంగా సందేశాత్మకంగానేనా వుంటాయి, అలాకాకపోతే 'ఇలా జరిగితే బాగుంటుంది' అనే సూచనని చేసేవాటిగానేనా వుంటాయి. నేరుగా సూచనలు, సందేశాలు అందించే కథలు taste తెలిసిన పాఠకులు అంతగా మెచ్చుకోరు. మంచి కథ ఎప్పుడూ సందేశాల్ని ఇవ్వదు. చెప్పవలసింది ఏదేనావుంటే, దాన్ని కథా సంఘటనలద్వారానే చెప్తుంది. చెప్పదలచుకున్న దానిని, సూచనలద్వారా, సంకేతాలద్వారా, indirectగా చెప్పడం అన్నది గొప్పకథకుండవలసిన లక్షణాల్లో ఒకటి. అనుభవించడం, చూడడం (experiencing and visualizing) అన్నవి ఎప్పుడూ వ్యక్తిగతమైన అనుభూతులే. అయినా ఈరకమైన అనుభూతుల్ని అందరు మంచి పాఠకులూ, అన్నికాలాల్లోని మంచి పాఠకులూ అనుభవించగలిగితే--ఆ అనుభూతులు సార్వజనీనం, సార్వకాలికం అవుతాయి. విశ్లేషణాత్మకంగా కథ చదివిన ప్రతిపాఠకుడి మనస్సుని ఆర్ద్రపరచే అనుభూతుల్ని కలిగించగలిగే కథ గొప్పకథ. కథ కలిగించే అనుభూతి కేవలం ఏక పార్శ్వమైనది (monodimensional) కాకుండా, బహుపార్శ్వాల దిశగా (multidimensional) వుంటే, -- ఆ కథ నిశ్చయంగా గొప్పకథ.

కేవలం జోకొట్టి వూరుకోబెట్టడం కాకుండా, పాఠకుల్ని ఆలోచనదిశగా తీసుకువెళ్లగలిగిన కథ గొప్పకథ. పరిమితమైన సామాజిక కోణాల్ని అధిగమించి, విస్తృతమైన మానవీయతా కోణాల్ని ఆవిష్కరించగలిగే కథ గొప్పకథ. కరుణ, ఆర్ద్రత, ఈర్ష్య, దుఃఖం, రౌద్రం లాంటి అన్నిరకాల human emotionsనీ --రసజ్ఞులైన పాఠకుల్లో-- వేరువేరు కాలాల్లో, వేరువేరు రకాలుగా ఒక కథ ప్రేరేపించగలిగితే-- నిశ్చయంగా ఆ కథ గొప్పకథ.

Hemingway రాసిన The Old Man and the Sea, అలాటి గొప్పకథ. అల్లం శేషగిరిరావుగారు రాసిన Prince Hemingway అలాటి గొప్పకథే. Gabriel Garcia Marquez రాసిన Nobody Writes to the Colonel కథకూడా ఎంతోగొప్ప కథ. గొప్ప కథ-- ఎన్నాళ్లయినా --దాని అర్థం గురించి మనని అలా భ్రమింపచేస్తూ వుంటుంది-- మృగతృష్ణలా. ప్రఖ్యాత రచయిత, విమర్శకుడు అయిన E.M.Forster తన Aspects of the Novel లో చెప్పినట్లు మామూలు కథలన్నీ monodimension కథలు, గొప్ప కథలన్నీ multidimension కథలు. గొప్ప కథ అన్నది అందర్నీ, అన్ని కాలాల్లోనీ రంజింపచేస్తూనే వుంటుంది. *

# పుస్తక సమీక్షల గురించి మనవి

అరుణతారకు సమీక్ష కోసం చాలా పుస్తకాలు అందుతున్నాయి. వీటిలో కొన్నింటి మీదే సమీక్షలో వస్తున్నాయి. స్వీకారంలో మాత్రమే అన్ని వేస్తున్నాం. ఈ సమస్యను రచయితలతో, పాఠకులతో పంచుకోవలసి ఉన్నది. అరుణతారలో స్థలాభావం వల్ల, ప్రాధాన్యాల వల్ల కొన్ని పుస్తకాల మీదే సమీక్ష రాయించ వలసి వస్తోంది. అయితే ఫలానా పుస్తకాలనే సమీక్షించాలనే నియమం ఏమీలేదు. స్థూలంగా ప్రగతి శీల భావజాలం ఉంటే చాలు. ఈవిషయం పాఠకులు, రచయితలు పత్రికలో గమనించే ఉంటారు. అట్లాగే సమీక్ష వీలైనంత లోతుగా, రచనలోని గుణదోష చర్చ చేయగలిగేలా ఉండాలని, కేవలం ప్రశంసతో మొదలై ప్రశంసతో ముగిసిపోయేలా ఉండరాదని కోరిక. విప్లవ సాహిత్యం మీద కూడా అలాంటి సమీక్షల వల్ల ప్రయోజనం ఉండదని మొదటి నుండి ఉన్న నమ్మకం. అయినా రచనను చాలా పైపైన చూసే పరిచయ వ్యాసాలు, నిర్విమర్శగా సాగే విశ్లేషణా రహిత సమీక్షలు కొన్నైనా పత్రికలో చోటుచేసుకుంటున్నాయి. పుస్తక సమీక్ష ఎలా ఉండాలో ఈ సంచికలో "ప్రత్యేక మృత్యుమండలాలు" పై ప్రొఫెసర్ ఆర్.ఎస్.రావు రచన ఒక మంచి ఉదాహరణ. అభిప్రాయ ఛాయా బేధాలు ఎన్ని ఉన్నా పాఠకుల ఆలోచనలను, రచయిత అవగాహనను కొంచెం పైకి తీసికెళ్లేలా పుస్తక సమీక్ష ఉండటం అవసరం. దీన్ని అన్ని వేళలా పాటించలేకపోయినప్పటికీ సమీక్ష అలా ఉండాలని మేం కోరుకుంటున్నాం. అలాంటి ఆలోచనలను రేకెత్తించగల పుస్తకాల సమీక్షకు (ఏప్రక్రియ అయినా) ప్రాధాన్యత ఇవ్వవలసి ఉన్నది. అట్లాగే కొందరు రచయితలు తాముగా రాసి పంపించే సమీక్షలకు ఎలాగూ చోటు ఇవ్వాల్సిందే. మొత్తంమీద పత్రిక తరపున కొన్ని పుస్తకాలనే సమీక్షించగలము. రచయితలు, పాఠకులు దీన్ని గమనించగలరని మనవి.

సం.



నా బండబుద్ధికి అది అన్యాయం అని తోస్తేనూ, అది ఘోరం అనిపిస్తేనూ, అది పరమ అధర్మం అనిపిస్తేనూ అలా అని రాసేస్తాను. నాకు ఎందు గురించైనా ఏడుపొస్తే కూడా నాకు ఏదైనా రాయాలనిపిస్తుంది. నాకు సంతోషంగా వున్నప్పుడు ఏదైనా రాయబుద్ధి అవుతుంది.

# నీతి మాలిన లోకంపై నిప్పుల కొరడా

# పతంజలి

## సంస్మరణ

# పతంజలి గారితో మూడు దశాబ్దాలు

☆ ఎన్.వేణుగోపాల్

వ్యాసం

పతంజలిగారిని మొదటిసారి చూచి దాదాపు ముప్పై ఏళ్లు కావస్తోంది.

సృజన అక్టోబర్ 1980 సంచిక అచ్చు వేయించడానికి బెజవాడ వెళ్లి కృష్ణక్క వాళ్లింట్లో ఉన్నప్పుడు మొదటిసారి ఆయనను చూశాను. అప్పుడు వేణుగోపాలరావు గారు సిద్దార్థ కాలేజికి ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. బెంజి సర్కిల్‌కు ఇటువైపు కృష్ణక్క వాళ్లిల్లు, అటువైపు ఈనాడు ఆఫీసు. పతంజలి గారు అప్పటికి ఈనాడులో సబ్‌ఎడిటర్‌గా పనిచేస్తున్నారు. ఒక మధ్యాహ్నం వాసు (కె. వాసుదేవరావు) గారితో కలిసి పతంజలి గారు కృష్ణక్క వాళ్లింటికి వచ్చారు. అప్పటికే చతురలో పతంజలి గారి నవల ఖాకీవనం అచ్చయి ఉంది. అంతకు ఒకటి రెండు సంవత్సరాల ముందే ఉత్తరప్రదేశ్‌లో పోలీసుల సమ్మె, ఆ నేపథ్యంలో వచ్చిన ఖాకీవనం నవల అది కలిగించి సంచలనం వల్ల ఖాకీవనం రచయితను కలవడం, దగ్గరిగా చూసి మాట్లాడడం అద్భుతాలుగా తోచాయి. ఒక రకమైన యాసతో, సన్నని, వ్యంగ్యం ధ్వనించే గొంతుతో, తక్కువ మాటలే అయినా చతురోక్తులతో ఆయన మాట్లాడుతుంటే వినడం ఒక అనుభవం.

అప్పటి నుంచి ఆ తర్వాతి ముప్పై సంవత్సరాలు వేరు వేరు సందర్భాలలో వ్యక్తిగా, అభిమానరచయితగా, వైద్యుడిగా, పత్రికారచయితగా ఆయనను దూరం నుంచీ దగ్గరి నుంచీ చూసే అవకాశం కలిగింది. చిట్టచివరికి మార్చ్ 9 సాయంకాలం విశాఖపట్నం సింహాద్రి ఆస్పత్రిలో రూం నంబర్ 510లో అర్ధచేతనలో, బాధతో మూలుగుతున్న ఆయనను చూసినప్పుడు 'ఎటువంటి మనిషి ఎట్లా అయిపోయాడు' అని దుఃఖం కలిగింది. అమ్మా అని ఆయన మూలుగుతుంటే, ఆయన కూతులు ఉపశమనంగా ఆయన నుదుటి మీద ముద్దు పెట్టుకుంటుంటే కళ్లలో నీళ్లు ఆగలేదు. చీపురు పుల్లలా అయిపోయిన కుడి చేతికి అప్పటికే సెలైన్ ఎక్కుతోంది. అప్పుడే రక్తం ఎక్కించడానికి వచ్చిన నర్సులు నరం దొరకడం లేదని కంగారు పడుతున్నారు. 'ఎట్లా ఉన్నారు సార్' అని ఆయన ఎడమచేతిని చేతిలోకి తీసుకుని పలకరిస్తే కళ్ళెగరేసి చిరునవ్వు నవ్వారు గాని, నిజంగా గుర్తించారో లేదో తెలియదు. కలిసిన ప్రతి సందర్భంలోనూ ఏదో ఒక వ్యంగ్యాన్నో, పరిహాసాన్నో, లోతయిన ఆలోచననో పలికించిన ఆ పెదాల మధ్య ఒక బాధాతప్త, వేదనామయ ధ్వని తప్ప, పెదాల వెనుక ఆగిపోయిన పలకరింపు తప్ప అంతకు ముందరి అనేక కలయికల ఆహ్లాదం లేదు. ఆయనతో ఈ ఆఖరి కలయిక కూడ మళ్లీ కృష్ణక్కతో కలిసే జరిగింది.

ఆయన ఉండిన ఆస్పత్రి రావిశాస్త్రి గారి ఇంటికి వందగజాల దూరంలో. ఇటు రావిశాస్త్రి జ్ఞాపకాల వీధి, అటు పడిలేస్తున్న కడలి. మధ్యలో ఆస్పత్రిలో ఆయన చివరి రోజులు గడిపారు. ఒక రకమైన భవిష్యవాణి పలికించినట్టుగా 'చివరి రోజులు విశాఖలో గడుపుతాను' అని ఆయన రెండువారాల కింద హైదరాబాదు వదిలేసి వెళ్లారని తెలిసినప్పుడు, హైదరాబాద్‌లో కలవలేకపోయినా విశాఖలో తప్పనిసరిగా కలవాలనుకున్నది, ఇట్లా ఆయన అకాల మరణానికి ముప్పై గంటల ముందు జరిగింది.

యాభై ఏడు సంవత్సరాల వయసు ఏం వయసని ఈ లోకాన్ని వదిలి వెళ్లిపోవడానికి? వదిలి వెళ్లిన రచనలు రాశిలోనూ వాసిలోనూ చెప్పుకోదగినన్ని ఉన్నా, ఆయన రాయాలనుకున్నవీ, రాయవలసినవీ ఎన్నెన్ని రాయకుండా మిగిలిపోయాయి!

గడచిన ముప్పై ఏళ్లలో ఆయనతో జ్ఞాపకాలనూ, అనుభవాలనూ గుర్తు తెచ్చుకుంటుంటే మనసు పొరల్లో నుంచి ఆయన పట్ల గౌరవం, ఆయనతో ఉండిన ప్రత్యేక అనుబంధం ఉవ్వెత్తున ఎగసివస్తున్నాయి.

ఆయన బెజవాడ ఈనాడు ఉద్యోగం రోజుల్లో మరి ఒకటి రెండు సార్లు కలిశానో లేదో గుర్తు లేదుగాని, మరి మూడు నాలుగు సంవత్సరాలకే ఆయనతో కలిసి పనిచేసే అవకాశం వచ్చింది. తెలుగు దినపత్రికల చరిత్రలోనే మొట్ట మొదటిసారిగా, ఉదయం దినపత్రిక తన సబ్ ఎడిటర్లకూ రిపోర్టర్లకూ శిక్షణ ఇవ్వదలచి, పత్రిక ప్రారంభానికి దాదాపు ఏడాది ముందే ట్రెయినింగ్ కాలేజి ప్రారంభించింది. అలా ట్రెయినింగ్ కోసం ఎంపికయిన ఇరవై మందికి శిక్షణ ఇచ్చే ప్రధాన బాధ్యత పతంజలి గారిది. ఆయనను చీఫ్ సబ్ ఎడిటర్ అన్నారో, న్యూస్ ఎడిటర్ అన్నారో గుర్తు లేదు గాని ఎబికె ఆర్‌బి కోటేశ్వరరావు ప్రిన్సిపాల్. తర్వాత వాసుగారు, తర్వాత పతంజలిగారు. తర్వాత ప్రకాష్. ఎబికెఆర్‌బి, వాసుగారు అప్పటికే పెద్దవారు గనుక ఇరవైల్లో ఉన్న మా సబ్ ఎడిటర్ ట్రెయినీలందరికీ, ఇరవైల చివరా, ముప్పైల మొదటా ఉన్న పతంజలిగారూ, ప్రకాష్ గురువులు మాత్రమే కాక స్నేహితులూ మార్గదర్శకులూ అయ్యారు. అశోక్‌నగర్ చౌరస్తాలో ఒక మూల ఆజాద్ కేఫ్ అనే ఇరానీ హోటల్, సరిగ్గా ఎదురుమూల మోహన్ కోడా ఇంటిపై అంతస్తులో మా ట్రెయినింగ్ కాలేజి. టెలిప్రింటర్ మీద వచ్చిన పిటిఐ వార్తలను మేం అనువాదం చేస్తుంటే పతంజలిగారు దిద్దుతుండేవారు. మా భాషనూ, అనువాదాన్నీ సరిచేస్తూ అనుభవాలూ కథలూ గాథలూ చెపుతుండేవారు. ఆ ఉద్యోగం ఎక్కువ రోజులు చేయలేకపోయినందువల్ల నేను పొందిన నష్టాలన్నిటిలోకీ పెద్దది పతంజలిగారితో కలిసి ఎక్కువ కాలం పనిచేసే అవకాశం పోగొట్టుకోవడం.

కాని ఆ తర్వాత కూడ రచయితగా, పత్రికా రచయితగా ఆయనతో సంబంధం కొనసాగుతూనే ఉండేది. నేను బెజవాడ ఆంధ్రపత్రికలో పనిచేస్తుండగా ఆయన హైదరాబాదు ఉదయంలో ఉన్నారు. కృష్ణుడు (ఎ కృష్ణారావు) ఆయనకు సన్నిహితుడుగా ఉండేవాడు గనుక ఆయన సంగతులు నాకూ, నా సంగతులు ఆయనకూ కృష్ణుడిద్వారా తెలుస్తుండేవి. ఆ రోజుల్లోనే (బహుశా 1987లో కావచ్చు) సాహిత్య విమర్శ మీద నేనొక వ్యాసం రాశాను. అది అప్పుడు హైదరాబాదు నుంచి వస్తుండిన ఉదయం సాహిత్య పేజిలో అచ్చయింది. ఆ వ్యాసం చదివి పతంజలిగారు విరుచుకుపడ్డారనీ, విసుక్కున్నారనీ, దానిలో సాహిత్య వాసనలు లేవన్నారనీ సన్నిహిత మిత్రులొకరు నాకొక ఉత్తరం రాయడమో, టెలిప్రింటర్ మెసేజి పంపడమో చేశారు. నా వ్యాసం ఆయనకు నచ్చనందుకు నాకు బాధ కలిగింది. ఆ తర్వాత మూడు నాలుగు సంవత్సరాలకు తన వ్యాఖ్యల సందర్భాన్ని ఆయనే వివరించేదాకా ఆ నొప్పి అట్లాగే ఉండింది. తాను ఆ వ్యాసం మీద దురుసు వ్యాఖ్యలేమీ చేయలేదనీ, సాహిత్య విమర్శ గురించి అయినా, సాహిత్యం గురించి అయినా నా వ్యాసంలో ఉండిన కటువు వైఖరి మంచిదికాదని మాత్రమే అన్నాననీ ఆయన వివరించారు.

ఆయన ఆ వివరణ ఇచ్చిన సందర్భం పద్దెనిమిది సంవత్సరాల తర్వాత కూడ నిన్న జరిగినంత తాజాగా కనబడుతోంది. అప్పుడు ఆయన సమయంలో ఎడిటర్‌గా ఉన్నారు. నేను చీఫ్ సబ్ ఎడిటర్‌గా చేరి, అప్పటికింకా పత్రిక మొదలు కాలేదు గనుక ట్రెయినీ సబ్ ఎడిటర్ల అనువాదాలు దిద్దే పనిలో ఉన్నాను. ఒక ట్రెయినీ పెళ్లి విందుకు ఆజామాబాదు సమయం ఆఫీసు నుంచి అడిక్‌మెట్ నడిచివెళ్తూ ఉన్నాం. అప్పటికి నాలుగైదు సంవత్సరాలుగా నా మనసులో మెరమెరలాడుతున్న నా బాధ ఆయనకు చెప్పాను. 'నా సాహిత్య విమర్శ వ్యాసం మీద మీకు విమర్శ ఉందని తెలిసింది. ఏం తప్పు రాశానో చెపుతారా' అని. సాహిత్యకారులు సృజనకర్తలుగా, భావుకులుగా ఎంత సున్నితంగా ఉంటారో, అందువల్ల సాహిత్య అధ్యయనాన్ని, విమర్శను ఎంత జాగ్రత్తగా నిర్వహించాలో, విషయం దృఢంగా చెపుతూనే దాన్ని మృదువుగా ఎలా చెప్పాలో ఆయన చాలా ఓపికగా చెప్పారు. రాసిన విషయంతో తనకు పేచీ ఏమీలేదని, కాని పద్ధతి మొరటుగా ఉందేమోనని అనిపించిందని అన్నారు.

బహుశా నా రచనా పద్ధతి మీద ఆయనకు ఏర్పడిన ఆ అభిప్రాయం చివరి వరకూ మారినట్టు లేదు. ఒక సంవత్సరం కింద ఒక విందులో కలిసినప్పుడు

కూడ దగ్గరికి పిలిచి మరీ చాల సేపు నా గురించీ, నా రచన గురించీ మాట్లాడారు. 'ఈ వారం వారం కాలమ్‌లు, అక్కడో ఉపన్యాసం, ఇక్కడో ఉపన్యాసం మానెయ్యండి' అని విసుక్కున్నారు. 'మీ శక్తి వృథా చేసుకోకండి. మీరు ఫుల్ లెంగ్త్ పుస్తకాలు రాయాలి. మీరే రాయవలసినవి ఉన్నాయి. మీరు రాయగలరు' అన్నారు. 'కాని కాస్త కోపం తగ్గించుకోండి. నేను కూడ రచన కోపంతోనే చేస్తాను. కోపం రాకుండా ఉండలేం, రాయలేం. కాని కోపంగా చెప్పేటప్పుడు మన దగ్గర పాయింటు ఉన్నా కూడా బయటివాళ్లు అది గుర్తించరు. వాళ్లకు కోపమే కనబడుతుంది గాని పాయింటు కనబడదు' అని చాలాసేపు చెప్పారు. అప్పటికే ఆయన సాక్షిలో చేరారు. 'ఇంకా పని మొదలు కాలేదు. ఎప్పుడయినా రండి, ఖాళీగానే ఉంటున్నాను. చాలా మాట్లాడుకోవాలి మనం' అన్నారు.

ఆ రోజు సంభాషణంతా ఒక శిష్యుడికి గురువు చేసిన బోధలాగ ఉండింది. కాని చిత్రం. ఆయన ఎప్పుడూ ఎవరికీ గురువునని అనుకోలేదు. ప్రతి ఒక్కరితోనూ స్నేహితుడిగా మెలిగారు. ఆత్మీయుడిగా ఉన్నారు. చాల సందర్భాలలో బిడియంతో, మొహమాటంతో కూడ ఉండేవారు. అంత అద్భుతమైన వ్యక్తీకరణ శక్తి, అంతగా వ్యవస్థ పట్ల ఆగ్రహం, ధిక్కారం ఉన్న ఆయన తోటి మనుషులతో ఇట్లా సంకోచంగా, బిడియంగా ఎందుకు ఉంటారా అని ఆశ్చర్యం వేస్తుండేది.

సరే, మళ్లీ వెనక్కి వెళ్తే, బెజవాడలో ఉండిన రోజుల్లో, 1985-89 తెలుగుదేశం పాలనాకాలంలో, ఆట - మాట - పాట బంద్ రోజుల్లో, ఉదయంలో వారం వారం ఆయన రాస్తుండిన పతంజలి భాష్యం ఎడారిలో ఒయాసిస్సులా ఉండేది. ప్రభుత్వ విధానాల మీద, అక్రమాల మీద ఒక సృజనకర్త కాలమిస్టుగా మారి ఎటువంటి పదునైన వ్యాఖ్యలు చేయడానికి అవకాశం ఉందో చూపిన కాలమ్ అది. అప్పుడే సృజన పునఃప్రారంభించడానికి ఒక విఫలప్రయత్నం చేసి, మరొక సాహిత్య పత్రిక ఏదయినా ప్రారంభించాలనుకుని డానీ, ఖాదర్ వంటి మిత్రుల సహాయంతో సమీక్ష పత్రిక ప్రారంభించాం. ఆ పత్రిక తొలి సంచికలో పతంజలిగారి రచన ఉండాలని మా కోరిక. ఆయన పోయేకాలం అని ఒక వ్యంగ్య కథ పంపించారు. అప్పుడప్పుడే రామోజీరావు ప్రియ పచ్చళ్ల వ్యాపారం ప్రారంభమయింది. పతంజలిగారి కథ నరమాంసం పచ్చళ్ల వ్యాపారం గురించిన కథ. వ్యంగ్యాన్ని ఆశ్రయించి లోతయిన రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వ్యాఖ్య చేసే కథ అది. సమీక్ష రెండు సంచికలతో ఆగిపోయినా ప్రచురించిన విలువైన రచనలలో ఆ కథ ఒకటి.

ఆ రోజుల్లోనే ఉదయం సాహిత్య పేజీలో ఆయన అనుసృజన చేసిన మ్యార్క్‌ట్వేన్ కథలు తుంటర్యాి, నా వ్యవసాయపత్రిక హాస్యస్ఫోరకమైన కథలుగా ఎందరినో ఆకర్షించాయి. అవి కేవలం వ్యంగ్య వైభవాన్ని నింపుకున్న కథలు మాత్రమే కాదు. ఆభిజాత్యాలమీద, భేషజాల మీద ఘాటయిన విమర్శలు అవి. అజ్ఞానంతో కూడిన అహంకారాన్ని కత్తితో చీల్చినట్టుగా వెటకరించిన కథలు అవి. పత్రికా రచన మీద, పాత్రికేయ వృత్తి బోలుతనం మీద ఛెళ్లున చరిచిన కొరడాలు అవి. ఆ రెండు అనువాదకథలను కొన్ని వందల మందికి చదివి వినిపించి ఉంటాను.

పది నెలలపాటు సమయంలో సహోద్యోగులుగా ఉన్నా, సమయం రాకుండానే ఆగిపోవడంతో, నేను కొంతకాలం నిరుద్యోగం చేసి చివరికి ఉద్యోగార్థం బెంగళూరు వెళ్లాను. బహుశా పతంజలి పట్ల, ఆయన రచనల పట్ల ఇనుమడించిన గౌరవంతో బెంగళూరు వెళ్ళేనేమో, బెంగళూరు తొలి జ్ఞాపకాల్లో ఒకటి చూపున్న పాటను ఇంగ్లీషులోకి అనువాదం చెయ్యడం. అది ఎక్కడా అచ్చు కాలేదు గాని, ఆ కథ మీద నా గౌరవాన్ని చూపుకోవడానికే అనువాదం చేసినట్టున్నాను.

అప్పుడే మోహన్ చిరునవ్వు సంచిక తెచ్చి దాంట్లో గోపాత్రుడు, పిలక తిరుగుడు పువ్వు, ఒక దెయ్యం ఆత్మకథ ప్రచురించాడు. ఆ మూడు గొలుసు నవలికలు చదివి ఎంత కదిలిపోయానంటే వెంటనే వాటి మీద విశ్లేషణా వ్యాసం ఒకటి రాసి ఆంధ్రప్రభకు పంపాను. ఆ వ్యాసం ఆయనకు నచ్చిందని విని పొంగిపోయాను.

అప్పుడు బెంగళూరు నుంచి వస్తూపోతూ ఉన్నప్పుడు ఎక్కడో ఒక చోట కలిసేవాళ్లం. అప్పుడే నాకు డయాబెటీస్ ఉందని బయటపడినప్పుడు, ఆయన తన వైద్యంతో అది నయమవుతుందన్నారు. ఎంతో ధైర్యం చెప్పారు. ఒకటి రెండుసార్లు మందులు ఇచ్చారు. ప్రతిరోజు ఒక అంజూర్ ముక్క తినమని కలిసినప్పుడల్లా చెపుతుండేవారు. వాళ్ల పాపకు కూడ డయాబెటీస్ వచ్చినప్పుడు శంకర మఠ్ ఎదురుసందులో ఇంట్లో తన ఆవేదన నాతో పంచుకున్నారు.

ఆ తర్వాత నేను హైదరాబాదు వచ్చి, అప్పటికి మా గోపీ మరణించి పది సంవత్సరాలయిన సందర్భంగా గోపీ స్మృతి అని ఒక ప్రచురణను ప్రారంభించాలనుకున్నప్పుడు వెంటనే తట్టినది పతంజలి కథల సంపుటమే. ఇలా మీ కథల సంపుటం వేయాలనుకుంటున్నాం అనగానే ఆయన వెంటనే అంగీకరించారు. గోపీ స్మృతి మొదటి ప్రచురణగా చూపున్న పాట పుస్తకం అలా వెలువడింది. చూపున్న పాటకు మోహన్ వన్ అండ్ ఓన్లీ పతంజలి అని అప్పటికీ ఇప్పటికీ అద్భుతమైన విశ్లేషణాత్మకమైన, అనుభూతి ప్రధానమైన ముందుమాట రాశాడు.

ఇటు కూర్మనాథ్ ద్వారానో, అటు నందిగం కృష్ణారావు ద్వారానో చాల తరచుగా, చాలా ఎక్కువగా సమాచారం అటూ ఇటూ అందుతున్నప్పటికీ గత ఐదారేళ్లుగా ఆయనను కలవడం చాల తగ్గిపోయింది. 'నువ్వేకాదు' వివాదం సందర్భంగా ఫోన్‌లో చాలాసార్లే మాట్లాడానుగాని, ఆయనతో ఫోన్ సంభాషణ సుదీర్ఘంగా సాగేదికాదు. నువ్వేకాదు మీద పరువు నష్టం దావా వచ్చి, ఒక న్యాయమూర్తి రచయిత మీద అన్యాయమైన వ్యాఖ్యలు చేసి, 'రచయితలయితే ఎక్కువా? నా ముందు వచ్చి బోనులో నిలబడవలసిందే, క్షమాపణలు చెప్పవలసిందే' అన్నప్పుడు ఆయనకు రక్షణగా సాహిత్యలోకం నిలవాలనీ, ఇది భావ ప్రకటనా స్వేచ్ఛ మీద దాడేననీ, కాల్పనిక సాహిత్య సృజనకు అవరోధమనీ ప్రకటిస్తూ హైదరాబాదులో విరసం తరపున ఒక సభ ఏర్పాటు చేశాం. సాహిత్య లోకం నుంచి విస్తృతమైన సంఘీభావం ప్రకటితమైన సభ అది. పతంజలిగారు ఆ సభకు వచ్చారుగాని, వేదిక మీదికి రాలేదు. కనీసం ఒకటి రెండు మాటలు మాట్లాడమన్నా నిరాకరించారు.

ఒక వైపు అటువంటి వినయం, బిడియం, మరొకవైపు ప్రతిదాన్నీ నిర్మమకారంగా, నిర్దాక్షిణ్యంగా చూసి విమర్శించగలగడం, వెటకరించగలగడం, ప్రతి కన్నీటి చుక్కనూ ఒక చిరునవ్వుగా మార్చగలగడం ఆయన విశాల, నిశిత రచనాశక్తికి చిహ్నాలు. రాజుల లోగిళ్ళ శునకాలకు కూడ ఉండే ఆభిజాత్యాల దగ్గర ప్రారంభించి నల్లకుంట గుడ్డి బిచ్చగాడి పిల్లనగ్రోవిలో కూడ పలికే ఉద్యమగీతాల శక్తి దాకా మనం గుర్తించవలసిన అనేక విషయాల మీద అత్యద్భుతమైన రచనలు చేసిన పతంజలిని తెలుగు సమాజం గుర్తించవలసినంత గుర్తించిందా, గౌరవించవలసినంత గౌరవించిందా అనుమానమే.

మార్చి 14, 2009

# రచయితలకు విజ్ఞప్తి

అరుణతారకు రచనలు పంపండి.

కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి.

అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి.

మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ - - సంపాదకవర్గం

వ్యాసం ☆ (నామిని సుబ్రమణ్యం) నాయుడుగారు

# నా విస్తరాకు

రామోజీరావును నేనేడిపించినానా, ఆయన నన్నేడిపించినాడా అంటే చెప్పడం కష్టం. చూడండి - అమాసను మించిన తమాసా.

సందర్భం ఏమిటిదంటే -

నేను ఈనాడు వాళ్ల న్యూస్‌టుడే డెస్క్‌లో సబ్బెడిటరుగా ఒకటిన్నర సంవత్సరం దాకా తిరుపడి ఎడిషన్‌లో (పని) చేసినాను. నన్ను పర్మనెంటుగా తీసుకొని ట్రెనింగు ఇచ్చుకోవచ్చునా అనే దాని మింద పదిమందితో పాటు హైద్రాబాదులో నాకు పరీక్ష. ఒక పక్క జ్వరం కాస్తా వుండినా తిరప్తి నుంచి మొట్టమొదటిసారి హైదరాబాదు దిగి ఆ బహుళ అంతస్తుల భవనం ఎక్కి పెద్ద పుడింగి మాదిరిగా పరీక్షకు కూచ్చున్నాను. ఒకటిన్నర సమ్మచ్చరం ఈనాడులో చేసినాను, నేను రాసిన వార్తలు కొన్ని వందలు అచ్చయినాయి, ఆ మాత్రం టెస్టు నేను రాసి ఉండలేనా అనేసి టెస్టు అదరగొట్టేసినానని ఇప్పుడు 25 ఏండ్ల తర్వాత చెప్పేయొచ్చు. కానీ కూడు తినే నోరిది.

టెస్ట్ అంటే ఎట్ల వుంటుందంటే ఇంగ్లీషులో కూడా రెండు వార్తలిచ్చి తెలుగులో రాయమంటారు. ఒకటి రెండు తెలుగునే ఇంగ్లీషు టైపు కొట్టి వాటిని తెలుగులో రాయమంటారు. ఇట్లా ఏవో వున్నాయి.

అనువాదం జోలికి అస్సలు పోనేలేదు. గ్యారంటీ ఫెయిల్, ఇంటర్వ్యూ వుండదనుకున్న నాకు ఇచ్చిత్రంగా పాసయినట్టు, ఇంటర్వ్యూకు ఉండమన్నట్టు గోడకు అంటించిన కాగితంలో వుంది. ఈ జానా బిత్తెడు వాడికి వెయ్యేనుగుల బలం వచ్చింది.

ఫుల్ మీల్స్ తినేసి ఎగిరేసుకుంటా నా పేరు పిలవంగానే ఇంటర్వ్యూ జరుగుతున్న గదిలోకెళ్లి రామోజీకెదురుగా చిన్నంతరం, పెద్దంతరం లేకుండా కూచ్చునేసినా.

"ఎమ్మెస్సీ మ్యాథ్స్ చేసి జర్నలిజంలోకి ఎందుకొచ్చావయ్యా?" అనడిగాడు రామోజీరావు.

కథలూ నవల్లూ రాయొచ్చు అని సార్ అని చెప్పే ఏమొచ్చి చస్తుందో అని, "నాకిష్టం సార్" అనేసినాను. ఆ గదిలో ఆయతోపాటు ఎం.వి.ఆర్.శాస్త్రి అని ఒకాయనా, ఇంకెవరో ఇద్దరు ముగ్గురు అధికారులూ వున్నారు.

"ఆంధ్ర రాష్ట్రానికి మొట్టమొదటి ముఖ్యమంత్రి ఎవరూ?" అనడిగినాడు రామోజీరావు ఆయనకేదో పెద్ద తెలియనట్టు. పేరు ఘనంగా వుంది కాబట్టి నేను, "నీలం సంజీవరెడ్డి" అనేసినాను పుసక్కన.

ఆయన మొహం చూస్తేనే నాకు అర్థమైపోయింది. ఆన్సర్ చీదేసినట్టుండాదని.

తర్వాత ఆయన నాకు రెండో చాన్స్ ఇస్తున్నట్టు, చానా ఈజీ ప్రశ్న వేసినాడు.

"ఆంధ్ర రాష్ట్రానికి మొట్టమొదటి రాజధాని ఏది?" అంటూ.

నాకు వొళ్లు పొగలు బొయ్యింది. పేరుకి ఎమ్మెస్సీ అయినా ఆర్ట్స్‌లో, జి.కెలో మరీ అంత పూర్ ఏం కాదులే అన్నట్టు,

"అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ హైద్రాబాదే సార్" అన్నాను.

ఆయన దాదాపుగా బిత్తర పోయినాడు.

"అదేందయ్యా, కర్నూలు మనకు రాజధాని కదా అప్పట్లో!" అన్నాడాయన.

ఇదేందిరా ఖర్మా అని సన్నగా వొణుకు ప్రారంభమైపోయింది నాలో.

"మన రాష్ట్రానికి జిల్లాలెన్ని?" అన్నాడు వున్నట్టుండి.

నేను ఒక్క సెకను కూడా ఆలోచించకుండా 22 వుంటే 23 అనో, లేదా 23 ఉంటే 24 అనో అనేసినాను. ఇప్పటికీ ఎన్ని జిల్లాలున్నాయో నాకవసరం.

ఆయనెంత దయగల మనిషంటే నిజంగానే, "ఏమయ్యా, జిల్లాలూ వాటి కేంద్రాలూ అన్నీ చెప్పెయ్. నీకు వుద్యోగం ఇస్తానమ్మా" అన్నాడు.

నేను రాష్ట్రం మొత్తం మీద పన్నెండు జిల్లాలు మాత్రమే చెప్పగలిగినాను.

ఇంటర్వ్యూ సభ్యుల్లో రామోజీరావు తప్ప మిగతా అందరూ "ఈ గాడిద కొడుకుని పంపించేయండిక" అన్నట్టు చూస్తున్నారు నన్ను.

రామోజీరావు మాత్రం నన్ను వొదలడం లేదు.

"ప్రకాశం జిల్లా ముఖ్య పట్టణం చెప్పుపోనీ!" అన్నాడు.

నేను మొహం వేళ్లాడేసుకుని నీళ్లు తాగినాను.

నెల్లూరుకి నెల్లూరే, చిత్తూరికి చిత్తూరే అన్నట్టు ప్రకాశానికి ప్రకాశమే కదా అని తలదించుకుని నంగినంగిగా "ప్రకాశం పట్టణం" అన్నాను, మచిలీపట్టణం మాదిరిగా ఆ వూరూ వుండకపోతుందా అని.

అక్కడున్న వాళ్లంతా ఎంత నవ్వునవ్వినారో చెప్పలేను.

ఆ ఇంటర్వ్యూ మొదలైన 5 నిముషాలల్లోనే నేను ఫుట్‌బాల్ అయిపోయినట్టు నాకు తెలస్తా వుంటే గదా.

రామోజీరావు ఎవరితోనో అన్నాడు.

"చూడయ్యా, పీజీ చేశాడు. ఇతని స్టాండర్డ్ చూడు. ఇంత ఘోరంగా వుందా ఇప్పుడు ఎడ్యుకేషన్ ? ఒనండాఫ్ ఇయర్ ఇతను ఈనాడులో పనిచేయడమేంటసలు? తిరప్తి ఎడిషన్ వాళ్లకు లైను కలుపు" అనేసి నాతో ఎంతో జాలిగా, అవిటి కొడుకుని చూసినంత దయగా, "మీదేవూరమ్మా!" అన్నాడు.

"మిట్టూరు సార్" అన్నాను.

"బాగా రిమోట్ ఏరియానా?" అన్నాడు.

దైవసాక్షిగా రిమోట్ ఏరియా అంటే తెలీక, "అంటే ఏందిసార్, ఏమంటారు సార్ మీరు" అనడిగినా.

"సారీ అమ్మా. వెళ్లు" అనేసి పంపించేసినాడాయన.

ఆ ఇంటర్వ్యూ గదిలో నుంచి ఈనాడు బయటికి రోడ్డు మీదికి ఎట్లా వచ్చినానో కూడా తెల్లా నాకు. - ఇదంతా నేనిప్పుడెందుకు చెప్పినట్టు? 'సాక్షి' పత్రికలోకొచ్చి ఈనాడు పెద్దాయన్ని పలచన చేద్దామనా? ఈ యొక్క నామిని సుబ్రహ్మణ్యం నాయుడుగారిని ఆ యొక్క రామోజీ ఎట్టా మిస్ చేసుకున్నాడో చూడండి అని చెప్పుకుందామనా? ఇదే అవితే నా కళ్లిప్పుడే పోతాయి!

ఎందుకోసరమని చెప్పుకున్నానంటే - నా పతంజలి ప్రభువు ఈ చేపలు పట్టుకునే చెంగణ్ణి, "నాయుడు గారూ!" అని పిలిచి 'నా వెనకాన రండి' అని నన్నెత్తుకొని భుజాలమింద పెట్టుకుని మోసినాడని చెప్పుకోవడానికి!

ఇప్పుడు టీవీ5ని చూసే కొమ్మినేని శ్రీనివాసరావు అప్పుడు పతంజలి కింద పనిచేసేవాడు 'ఈనాడు'. శ్రీనివాసరావు కింద ఇప్పుడు విశాఖపట్నంలో టీవీ9లో విలేకరిగా వున్న శశాంకమోహన్ పనిచేసేవాడు. ఆ శశాంకమోహన్ కింద నేను పని చేసేవాణ్ని. నెలకు 300 రూపాయల జీతం మీద.

ఒకసారి రాత్రి 9 గంటల దాకా నన్ను వదేసి పట్టుకుని నాకేమాత్రమూ వినబుద్ధికాని గోగోల్ ఓవర్‌కోటు మీద వుపన్యాసమిచ్చి, "నాయుడు గారూ సైకిలెక్కండి" అని సైకిల్ మీద కూర్చోబెట్టుకుని ఇంటికి తీసుకుని పోయినాడు భోజనానికి పతంజలి.

అన్నంలో వుల్లగడ్డల కూర కలుపుకుని "వుల్లగడ్డలు చానా బాగుండాయి సార్" అని తింటూ వుంటే, ప్రమీలమ్మని పిలిచి, "నాయుడుగారు నువ్వు చేసిన బంగాళాదుంపల కూర భలే ఉందని మెచ్చుకుంటున్నాడు ప్రమీ!" అన్నాడు. ప్రమీలమ్మా, పతంజలీ పడీ పడీ నవ్వుతుండారు.

"ఏం సార్, దీంట్లో అంత నవ్వేదానికి ఏముండాది! వుల్లగడ్డల కూర బాగుండ కూడదా ఏంది?" అన్నాను.

"నాయుడు గారూ! మీకొక తమాషా చెప్పనా? ఇది వుల్లగడ్డల కూర కాదోయ్. మాంసాన్ని ఖైమా చేసి వండింది!" అన్నాడు ప్రమీలమ్మను చూపిస్తూ.

"ఇది చియ్యల కూరా! పొండి సార్. మాంసం కూర అంటే తునకలు తునకలుగా ఉంటుంది. ఇదేంది ముద్ద మాదిరిగా! ఆమెని చెప్పమనండి ఇది

మాంసం కూరేమో!" అన్నా. మొగుడూ పెళ్లాలు మళ్లీ నవ్వేదానికి పెట్టుకున్నారు.

పతంజలి ఇంట్లో తినేదాకా మాంసం కూరను అట్లా ఖైమాచేసి తింటారని నాకు తెల్వానే తెల్వదు.

ఇదట్టా పెడితే, సందేళ డ్యూటీలో ఉన్న నన్ను టీకి పిల్చి రోడ్డు పక్క గుడిసె దగ్గరికి తీసుకెళ్తాడా - మూడు గంటలు నాలుగు గంటలయినా ఆఫీసులోకి ఆయన రాడు, నన్ను పోనియ్యడు. టీలూ, సిగరెట్లూ, సాహిత్యం!

"సార్, నేను పనిజేసేది మీ కింద కాదు. మీ కింద కింద కింద మూడు కిందల కింద పని చేసేవాడిని గదా. వాళ్లేమన్నా అనుకుంటారు సార్. రండి ఆఫీసులోకి పోదాం!" అని అంటా నేను ఉంటే ఆయన, "ఇప్పుడు నాయుడుగారూ, చెహోవ్ జీవితాన్ని శుభ్రంగా గడపాలని కోరుకున్నాడు. కానీ ఆయన చచ్చిపోతే ఆయన శవం గుడ్స్‌లో ఉప్పుచేపల మధ్య ప్రయాణించాల్సి వచ్చింది. ఇది లైఫ్‌లో ఉన్న ఐరనీ" ఇట్లా ఏవో మాటలు! (ఆయనకేం, ఎడిషన్ ఇన్‌చార్జి, పనంతా ప్రకాష్ చూసి పెట్టేస్తాడు.)

"ఐరనీ అంటే ఏందిసార్"? అంటూ నేను. ఆయన అర్థం చెప్పేవాడు. పాపం కొమ్మినేని శ్రీనివాసరావు ఎందుకో నన్ను 'తమ్ముడూ!" అనడం తప్ప ఇంకోమాట అనేవాడు కాదు.

"సార్ లేటయ్యింది. పతంజలి వదిల్తే గదా!" అంటూ పనంతా అయిపోయినాక ఆఫీసుకెళ్తే అప్పుడు శ్రీనివాసరావు, "తప్పు తమ్ముడూ! పతంజలి గారు అనాలి" అనేవాడు.

పతంజలి ఒకసారి, "నాయుడుగారూ! 'ఖాకీవనం' అని నేనొకటి రాశాను. ఇదేమైనా చదివి నాతో ఏమైనా చెప్తారా?" అని 'చతుర' పుస్తకాన్నొకసారి ఇచ్చినాడు.

నేనొక రోజులో చదివేసి, "ఏమన్నా అర్థం ఉండాదా? మీకేమిటికీ పోలీసోళ్లతో! ఛా నాశనం. దరిద్రంగా ఉండాది సార్. మీ ఊరోళ్ల గురించి ఏమన్నా రాయండి బాగుంటాది" అనేసినా.

"నాయుడు గారూ! ఒక్కడన్లేదీ మాట. మనకు జనాలలో మంచి పేరు తెచ్చిందోయీ యీ పుస్తకం!" అన్నాడాయన. ఎప్పుడైనా కులుకు ఎక్కువైపోతే 'ఓయీ ఓయీ' అనడం ఆయన వాడిక.

ఆయనకు టాల్‌స్టాయ్ అంటే పిచ్చి. పిచ్చి అనే పదం కంటే ఉమాదం అనే పదం వాడడం మంచిది.

ఒకసారి నన్ను పట్టుకుని టాల్‌స్టాయ్ గొప్పతనం చెప్పేదానికి కుచ్చువేసినాడు. గంటకాదు, రెండు గంటలు కాదు, మూడు గంటలు కాదు. ఒక రోజంతా ఇల్లు దగ్గరున్న మెస్‌లోనే భోజనం ఇద్దరమూ. ఆయనా స్నానం చెయ్యలా. నేనూ చెయ్యలా. ఆయన టాల్‌స్టాయ్ 'ఆరడుగుల నేల' కథ నాకు మొత్తం పూస గుచ్చినట్టు చెప్పినాడు.

నేను పొగరుగా ఒకేమాట అన్నాను.

"ఆయనంత చెత్త రచయిత ఈ భూమండలం మీద ఇంక పుట్టడు సార్. ఇదా మీరు చదువుకున్న చదువు? నన్ను చదువుకోమనే చదువు?" ఈ మాట నా నోట్లో ఉండంగానే ఆయన చెయ్యిపైకి లేచింది నా చెంపమీద పడేదానికి. ఒక్క కథ కూడా అచ్చుకాని వాడికి అంత పొగురు ఉండకూడదనేది ఆయన ఉద్దేశం. ఉండాలనేది నా ఉద్దేశం. నేనూ ఏం తగ్గలా! "కొట్టండి సార్ పర్వాలేదు. ఈ ఆరడుగుల నేల అనేది ఎట్లా మంచి కథో చెప్పండి వింటా. అది ఏరకంగా చెత్త కతో నేను జెప్తా విందురు". అన్నాన్నేను కుదురుగా, ఆయన సిగరెట్లనే కాలస్తా.

"అది ప్రపంచంలోనే గొప్ప కథ. ఆయనంత పరిశుద్ధమైన రచయిత మరోడు లేడు. రష్యన్ సాహిత్యం, ప్రపంచ సాహిత్యం మీకు బొత్తిగా తెలియదు" అనేసి అన్నాడు ఆయన.

"అది ప్రపంచంలోనే చెత్త కథ. సార్ - కోపం తగ్గించుకొని నేను చెప్పేది వినండి. నేను చదువుకోలా. మేథ్స్‌లో వచ్చే సిన్స్, ఫ్రం, దేర్‌ఫోర్, వై బికాస్ ఇట్టాంటి పదాలకు. మించి ఇంగ్లీషు నాకు రాదు. మీరొకసారి టాల్‌స్టాయ్‌ని వుద్దేశించి ఆయనో పెద్ద కౌంట్ అని అంటే కౌంట్ అంటే లెక్కించడం కద సార్. ఆయన్ని నేనెక్కడ లెక్కించేది అని అడిగిన్నాకొడుకుని నేను. మీరు నన్నప్పుడు ఎగతాళి చెయ్యకుండా కౌంట్ అంటే వందలాది ఎకరాలున్న ప్రభువు అనిఅర్థం చెప్పినారు. గుర్తుండాదా? వందలాది ఎకరాలు ఉన్నవాడూ, వ్యవసాయాల్ని గుర్రాల మీద తిరిగి చెయ్యించేవాళ్లూ మాత్రమే రాసే కథ అది. నాకు మాదిరిగా రెండెకరాలే ఉండి, దానికి తోడు ఒక అన్న కూడా ఉన్నవాడు ఆ కథ రాయనే రాయడు. చచ్చినాక ఆరడుగుల నేలచాలు సరే, బతికున్నప్పుడా! ఈ భూమండలాన్నంతా జనాభాతో భాగించేస్తే పాయింట్ల తర్వాత వచ్చేనేల కూడా కావాల నాకు. మీరు రాజు, ఆయన ప్రభువు. ఇద్దరూ దొందో దొందే!".

ఆ రోజు నాకొచ్చింది చూడూ కోపం. చంద్రబాబు మీద వైఎస్ మండిపడ్డాడు అని పత్రికల్లో రాస్తారే అట్లా నేను టాల్‌స్టాయ్ మీద మండిపడ్డాను. ఇంకా నేను ఏం వాగానంటే "మీరు టాల్‌స్టాయ్‌దే ఇంకో చెత్త పుస్తకం ఫాదర్ ఫెర్యూసన్ గురించి చెప్తిరి. అది ఇంకా చెత్త. భూమిని వేలంలో పాడాలని ఆబగా, ఆశిగా ఫెర్యూసన్ పోతే చచ్చిపోయి తిరిగొచ్చే కథ అదేదో. భూమిని వేలంలో పాడుకొని క్షేమంగా ఫెర్యూసన్ ఇంటికొస్తే టాల్‌స్టాయ్‌కేం తీపా? కానీ ఆయన రానియ్యడు. అదే మాదిరిగా టాల్‌స్టాయ్‌దే అన్నాకెరినినా - రైలుకింద పడి కుక్కచావు చచ్చినట్టు ఆ నవల గెంటల కొద్దీ చెప్పినారు. లంజరికం చేసినంత మాత్రాన ఆ ఆడమనిషి అట్లాంటి చావు చచ్చి పోవాల్నా? నీతేంది సార్, నీతి దరిద్దరంగా....! ఇట్టాంటి వన్నీ భూములు బావులు పుష్కలంగా ఉన్నవాళ్లు తప్ప లేనివాళ్లు రాయరు సార్. మీరు చెప్పండి దాస్తొవిస్కీ ఇట్టాంటి చెత్త ఏమన్నా రాసినాడా? ఆయన నిత్య దరిద్రుడని మీరే చెప్తిరి. ఆయన చచ్చినా రాసుండడు. ఇంకా ఏ రష్యన్ రచయిత అన్నా బీదా బిక్కీకి ఇట్టాంటి శిక్షలు వేసుంటే చెప్పండి చూద్దాం ఆ టాల్‌స్టాయ్ ప్రభువు తప్ప" తోటకూర కాడ మాదిరిగా ఆయన అట్లానే మెడ వాల్చేసినాడు, నాతో ఏగలేక.

నేను దేశదేశాల సాహిత్యాన్ని చదువుకోలేదని ఆయనకు పెద్ద బాధ. నాకు ఇంగ్లీషు పుస్తకాలిచ్చేవాడు చదవమని చెప్పి. నాకు ఒక వాక్యంలో అన్ని పదాలకూ అర్థాలు డిక్షనరీ చూసి తెలుసుకున్నా ఆ వాక్యం అర్థమయ్యేది కాదు. నాకొకసారి కోపమొచ్చేసి, "సార్, నన్నుగాని ఇంగ్లీషు పుస్తకాలిచ్చి చదువుకోమంటే మీ మొకం కూడా చూడను" అన్నా. ఆ తర్వాత నన్నెప్పుడూ ఆయన" ఇంగ్లీషు పుస్తకాన్నిచ్చి చదువుకోండి నాయుడుగారూ" అని అననే అనలేదు.

టాల్‌స్టాయ్ మీద చర్చ జరిగినాక ఒక రోజు, "నాయుడుగా గారూ! మిమ్మల్ని మెప్పించేది ఒకటి రాయాలని మహా దురదగా ఉంది. మీ ఊరి వాళ్లమీద మరొక పెద్ద కథ, మా ఊరోళ్ళ మీద నేనొక పెద్ద కథ రాద్దాం. నాలుగే నాలుగురోజుల్లో రాసెయ్యాలి. ఇద్దరం రాసేసి 'చతుర'కు పంపిద్దాం" అని సవాలేసినాడాయన.

నేనూ కూచ్చున్నా, ఆయనా కూచ్చున్నాడు.

నేను "పాలపాదుగు" అనేది రెండు రోజులలో రాసినా, పతంజలి "రాజుగోరు" అనేది నాలుగైదు రోజులకు రాసినాడు. ఒకరిదొకరం చదువుకున్నాం. ఆయనొకేమాట అన్నాడు.

"నాయుడు గారూ! మీరు మీ కథని ఎట్టి పరిస్థితుల్లో ఎడిటర్‌కి కూడా అర్థం కాకూడదనీ, అది అచ్చుకాకూడదనీ రాశారు. నేను ఇది ఎలాగైనా అచ్చయిపోవాలని రాశాను. అదీ తేడా!"

"రాజుగోరు" నవల రాయక ముందు ఆయన రాసిన కథలన్నా, ఖాకీవనం నవల అన్నా నాకు పట్టేవి కావు. "రాజుగోరు" నవల ఎంత గొప్పదంటే అలమండలో పుట్టి పెరిగిన వాడు తప్ప మరో నరమానవుడు రాయలేని పుస్తకమది. రావిశాస్త్రి ఎక్కడా తొంగి కూడా చూడడు.

ఆయనా, నేనూ ఇద్దరమూ చతురకు ఎయిర్ పార్సిల్‌లో పంపిచినాము. ఖచ్చితంగా మూడో రోజుకే చతుర ఎడిటర్ చలసాని ప్రసాదరావు నుంచి నాది తిరిగొచ్చేసింది. "రాజుగోరు" నవలకి యాక్సెప్టెన్స్ కార్డు కూడా నా కథ తిరిగొచ్చిన ఎయిర్ పార్సిల్‌లోనే వచ్చింది.

చలసాని ప్రసాదరావుకి పాపం చెముడు. దాన్ని దృష్టిలో పెట్టుకుని పతంజలి ఏమన్నాడంటే, "నాయుడు గారూ చెవిటి మేళానికి పాలపాదుగు సాగను

అర్థమవుతుందా?" అనేసి అన్నాడు.

ఆ టయింలో "పాలపొదుగు"ను చదివిన ప్రకాష్‌కూడా అక్కడే వున్నాడు. ఆయన పతంజలిలో, "ఏంటండీ! వేషాలేస్తున్నారా? "రాజుగోరు" అచ్చుకాకపోవడమేమిటి? పాలపొదుగు అచ్చు అవడమేమిటి? నాయుడుగారిని మీరు పొరపాటున నాయుడుగారు నాయుడుగారు అని అంటున్నారు. ఆయన నాయుడుగారు కాదు, సైనాయుడుగారు. సైనేడ్ వేసుకున్న వాడు రుచీ పచీ చెప్పలేక చస్తాడు గదా. అలాగే మన సైనాయుడు రచనను జనాలు చదవలేరు చస్తారు" అన్నాడు.

ముప్పూటల నన్ను పోషిస్తూ కూడా ప్రకాష్ ఆ మాట ఎందుకున్నాడంటే - నేనేమైనా రాస్తే అది ఎవరికైనా అర్థమవ్వాలి కదా అనే పేపరు భాషలో భయాందోళనలతో!

ఈనాడులో వుద్యోగం పోయింది గదా. ఇంక మా వూరికెళ్లిపోయినాను. రెండు మూడు రోజులు వూర్లో, మూడునాలుగు రోజులు ప్రకాష్ వాళ్ల ఇంట్లో.

"నాయుడు గారూ! రేణిగుంటలో ఒక స్కూలు పెట్టకూడదూ! లక్షలు సంపాదిద్దురుగానీ!" అన్నాడొకసారి పతంజలి.

"మీ గురువు రావిశాస్త్రికి మించి రచయిత అయిపోదామని గదా గుల!" అని అన్నా.

ఇంతలో దాసరినారాయణరావు "ఉదయం" పేపరు పెట్టడం ఆయన అక్కడకు - ఆ దరిద్రపు హైదరాబాద్‌కు వెళ్లిపోవడం జరిగింది.

నేనొకసారి మావూరి నుంచి రేణిగుంటకొచ్చి ఆయన్ని కలిస్తే, "నాయుడుగారూ రడీగా వుండండి, నేను ఉదయానికి వెళ్తున్నాను. మీకక్కడ ఉద్యోగం చూస్తా వచ్చేద్దురుగానీ" అని సామానుతో పాటు లారీ ఎక్కేసినాడు.

ఆయన హైదరాబాద్‌కు పోయిన కొంత కాలానికి నాకు ఉత్తరం.

"నాయుడుగారూ! అర్జంటు. వచ్చేయండి చార్జీలకు డబ్బులున్నాయా? వెంటనే వచ్చేయండి".

నేను వెంటనే బయలుదేరేసి, "పతంజలి స్వామీ! రెండేండ్లు పనిచేశాక టెస్టుపెట్టి ఇంటర్వ్యూ చేసేస్తాడు దాసరి నారాయణరావు. రామోజీరావు ఇంటర్వ్యూ చాలు నా బతుక్కి, ఇంగ్లీషుతో ఇంటర్వ్యూలతో నేను వేగలేను. నేను తిరిగి వెళ్లిపోవాల్సిందే గదా" అన్నా హైదరాబాదు వెళ్లి ఆయన సీటు ముందు కూర్చోని.

నిజంగా సిగరెట్ ఫ్యాక్టరీ పక్కన వుండిన ఆ ఉదయం రేకులషెడ్డులో నేను స్వర్గాన్ని చూస్తిని. మహామహులు ఆ ఉదయంలో వున్న సబ్‌ఎడిటర్లు. అంబటి సురేంద్రరాజు, గుడిపాళం, మురళి, రామ్‌ప్రసాద్, ఇప్పటి ఆంధ్రజ్యోతి ఎడిటర్ కె. శ్రీనివాస్, కెఆర్.మూర్తి, ఇప్పుడు ప్రెస్ అకాడమీ ఛైర్మన్ అయిన దేవులపల్లి అమర్, ఇప్పటి లాయర్ మాడభూషి శ్రీధర్. మహామహులు అని ఎందుకంటున్నానంటే ప్రతి గన్నయ్య చేతిలోనూ దెయ్యం మాదిరిగా ఒక ఇంగ్లీష్ పుస్తకం. నీషే అంట, ఆక్టోవియాపజ్ అంట, కంఠస్తం పెడితే తప్ప నోరు తిరగని పేర్లు.

అక్కడ వులిక్కిపడాల్సింది ఏమంటే ఆడపిలకాయలు కూడా భలే చదువుకున్న వాళ్లే. ఒక్క చిన్న వూరి నుంచి వచ్చిన నాకు ఇది విచిత్రమే. మృణాళిని, ఇప్పటి ఆంధ్రజ్యోతి ఫీచర్స్ ఎడిటర్ వసంతలక్ష్మి, సత్యవతి.

అందరిలోకీ అఆఇఈలు రాంది నిజంగా నాకొక్కడికే. నాకున్న ఒకే ఒక అర్హత నా యెనకన పతంజలి కొండ.

అందరూ ఇంగ్లీషు వచ్చిన వాళ్లే. అందరూ టెస్ట్ రాసి పాసయి ఇంటర్వ్యూలో నెగ్గి సబ్‌లుగా చేరిన వాళ్లే. వాళ్ల జీతంతో సమానంగా నాకూ ఇప్పించి వాళ్ల సరసన ఈ గులకరాయిని కూచ్చోబెట్టేసినాడు పతంజలి.

ఏం మంత్రం వేశాడోగానీ నాకు ట్రైనింగు కూడా లేదు. దేవీప్రియ కింద "ఆదివారం ఉదయం"లో పడేశాడు. నాతో కూడా అంబటి సురేంద్రరాజు. నాకు దేవీప్రియ ఎప్పుడైనా ఇంగ్లీషు వ్యాసం ఇచ్చి తెలుగు చేసెయ్యమంటాడేమోనని వుచ్చ. సురేంద్రరాజు వుండాడులే అని ధైర్యం. అంత టెంసం పగవాడికి కూడా వద్దు.

ఉదయం పదిరోజుల్లో ఇంక ప్రారంభమవుతుందనంగా పతంజలి, "నాయుడు గారూ! ఇట్లా ఎడిటర్ గారి దగ్గర కొస్తారా ఒక మాటు" అని పిలుచుకుపోయాడు. కాబిన్‌లోకి పోయి ఎడిటర్ ఎ.బి.కె.ప్రసాద్‌కి నమస్తే చెప్పి నోర్మసుకొని గమ్మునుండాను.

"చూపులకు అట్లా వుంటాడు గానీ మన ఎడిటోరియల్ స్టాఫ్ మొత్తానికీ తెలివైనవాడు. ఇతని గురించి నాకు మొత్తం తెలుసు. మీరు ఇతనికి ఒక కాలమ్ ఇస్తున్నారు, ఇతను రాస్తున్నాడు. ఇతనితో మీరేం మాట్లాడక్కర్లేదు. నాయుడు గారూ! మీరొక కాలమ్ ప్లాన్ చేసుకోండి. బుధవారం బుధవారం మీరు కాలమ్ రాస్తున్నారు" అని అన్నాడు పతంజలి.

సబ్‌ఎడిటర్లలో అందరికీ నాకేంది? కాలమేంది? ఇట్లాంటి విచిత్రాలు కూడా జరుగుతాయా అని ఆ అజామాబాద్ అంతా ముక్కున వేలేసుకునే పనే.

ఇంక అంతే. ఎడిట్ పేజీని వసంత లక్ష్మి చూసేది. నేను ఎడిటర్‌కి కానీ, పతంజలికి కానీ, ఎడిట్ పేజీ చూసే వసంతకి కానీ, ఏ రోజూ నేను రాసింది చూపించేది లేదు. కంపోజ్ చేయించి నేను బ్రోమైడ్ తీసుకుని ఇచ్చేవాణ్ణి.

ఆరు వారాలు పచ్చనాకు సాక్షిగా.... రాసేసరికి పతంజలి నాకొక వుత్తరం చూపించినాడు. "నాయుడుగారూ! నమస్కారమండీ మీ దగ్గర జాగ్రత్తగా వుండాలండోయి. ఎక్కడికో వెళ్ళిపోయేటట్టున్నారు. మమ్మల్ని గుర్తుంచుకుంటారా?" అని అంటా.

వుత్తరం చూస్తే అది ఎమ్వీఎల్‌ది.

"నేను ముఖ్యమంత్రినైతే మూడేళ్ళే ఖర్మ ఎప్పుడూ నామినినే విద్యాశాఖామంత్రిగా పెట్టుకుంటా" అంటూ - నేను రాసిన "మూడేళ్లు విద్యాశాఖామంత్రినే!" అనేది చదివి - రాసిన ఉత్తరమది. అప్పట్నుంచీ ఈనాడు ముందు వెళ్తుంటే అబ్బో నేనెంత పొగరుగా ఆ బిల్డింగును చూసేవాణ్నో చెప్పలేను.

పత్రికల్లో పని చెయ్యాలంటే జిల్లాలెన్నో తెలియాల్నా? వాటికి ముఖ్యకేంద్రాలు తెలియాల్నా? రామోజీరావూ! పత్రికల్లో పని చెయ్యాలంటే ఏమీ తెలియఖ్ఖర్లా! ఒక్క పతంజలిలాంటివాడు వెనకానవుంటే చాలు, చిటికేసినంతలో ప్రఖ్యాత రచయితా అయిపోవచ్చు, జర్నలిస్టూ అయిపోవచ్చు! అని తమాషాగా ఈనాడు ముందు నిలబడి నోరు తెరిచి అనేవాణ్ణి కూడా.

నాకు ఊపిరాడేది కాదు. ఆంధ్రదేశం మొత్తం మింద నక్క తోక తొక్కిన రచయిత ఎవరన్నా వుంటే అది నేనే!

నా బట్టా అని రాస్తే అది అచ్చు అయేది. లంజా అని రాస్తే అది అచ్చయిపొయ్యేది. ఇంతలో నాకు పెండ్లి కుదిరింది. "నాయుడుగారూ! మీకు సొంత పెళ్లాం ఒకటీ, సొంత పొయ్యి ఒక్కటీ, ఇంకా సొంత కలం ఒకటీ!" అని వెక్కిరించేవాడు. నేను హైద్రాబాద్‌లో పతంజలి ఇంట్లో తిన్నన్ని సార్లు మా అత్తగారి ఇంట్లో అయినా తిని వుంటానా! ఎన్ని నీసులు? ఒకటా రెండా?

కోడిగుడ్డును అర్థం చేసి అన్నకూ తమ్ముడికీ పెట్టని తల్లి మా జిల్లాలో లేదు నాకు తెలిసి.

మా చంద్రబాబుకు, రామ్మూర్తికి కూడా మా అమ్మణ్ణమ్మ కోడి గుడ్డును సగం చేసి పెట్టిన తల్లే!

కానీ పతంజలి రాజు. ఆ ఇంట్లో ఎన్నెన్ని వుంటాయి అంటే కోడిగుడ్లూ, కోడి కూరా, పాటేలి కూరా, చేపలూ, నెండ్రకాయలూ!

నాకు పెండ్లై నాలుగు నెలలు అయిందో లేదో వున్నట్టుండి మా అక్క చచ్చిపోయింది. వూరికే తేలు కుట్టి. ఆ రోజు విరిగిపోయిన నడుములు ఇప్పటికీ కుదురుకోలా. మా అమ్మ, మా నాయన, మా అక్క వొదిలి పెట్టిన రెండేండ్ల పసిపాప.

నాకు తెలిసినంతలో 1984 చివర్న ఉదయం మొదలైందనుకుంటా. ఒక పక్క పచ్చనాకు సాక్షిగా.... ఇంకో పక్క పాలపొదుగు అచ్చవతా వుండాయి. అనవసరంగా పేరు. పది రూపాయిల కష్టానికి నూటాపది వచ్చేస్తున్నట్టు. బలేబలే చదువుకున్న వాళ్ల మధ్య ఏమీ చదువుకోని నేనే హీరో.

మా అక్క చావుతో ఆ మత్తంతా పోయింది. 'ఉదయం'లో పనంతా అయి పోయినాక ఇంటికొచ్చి మా అక్కలేని మా అమ్మనీ, నాయన్నీ, ఆ పసిబిడ్డనీ తల్చుకోని తల్చుకోని బోల పొనుకోని ఏడ్వడం! ఇట్టాంటి రాతల వల్ల ఏమైనా ఈ చావు సంభవించిందా అని ఒకటే మనేద. రుచిగా ఏమన్నా తింటావుంటే ఈ తిండి 30 ఏండ్ల వయసుకే మా అక్కకు లేకపాయనే అని దిగులు. నా మొకం చూసి, పతంజలే ఒకసారి, "అవునండీ, నాయుడుగారూ చచ్చింది మీ అక్కగారా, ఇంట్లో వుండే నీ కొత్త పెండ్లి కూతురా?" అని తిట్టినాడు.

కానీ మేం బతికింది అట్లా! మా అమ్మా మా అక్కా నేనూ ముగ్గురమూ ఒకరి కొంగులు ఒకరం పట్టుకొని తిరిగిన వాళ్లం. ఇంతలో ఆంధ్రజ్యోతి హైదరాబాద్ ఎడిషన్ పెట్టినారు. ఎ.బి.కె. నన్ను దాంట్లోకి రమ్మన్నాడు. పతంజలికి ఎట్లా చెప్పాలో అర్థం కాలా.

పిల్లి మాదిరిగా ఆయనకెదురుగా కూర్చుని, "సార్. రెండు నిమిషాలు నోరు తెరవకుండా నేను చెప్పేది వినండి. నన్ను ఎబికె జ్యోతికి రమ్మన్నాడు. నేను పోతుండాను. ఇక్కడ నాకు ఏం కొదవ అని అక్కడికి పోతా వున్నట్టు చెప్పండి. ఆంధ్రజ్యోతి వాళ్లు తిరుపతిలో కూడా తొందరలో ఎడిషన్ పెడతారంట. నన్నక్కడికి పంపిస్తానని కూడా ఎ.బి.కె. మాటిచ్చినాడు. నేను రేణిగుంటలో ఉద్యోగం చూసుకుంటా మా వూళ్లోనే కాపరం ఉండి నా తల్లిదండ్రులకు ఆ పసిబిడ్డకు తోడుగా వుండిపోతాన్ సార్" అని బోరోమని ఏడ్చేసినా.

నావి మరీ నంగి ఏడుపులు అని ఆయన ఆత్మలో కూడా అనుకోని వుండడు గానీ అప్పటికీ ఆయన ఒప్పుకోలా.

"నాయుడు గారూ! మీ తీరే నాకు విచిత్రంగా వుంది. నోరు మూసుకొని హైదరాబాద్‌లోనే వుండండి. తిరుపతి వొద్దు. మీరక్కడికెళ్లి ఏం చేస్తారు? ఇక్కడి అవకాశాలు అక్కడ వుండవు. జర్నలిస్టులకు ఇక్కడ స్థలాలిస్తారు. బాగా రాసుకోవచ్చు. ఇంకేం మాట్లాడొద్దు. ఆ పాపని ఇక్కడికి తెచ్చేసుకోండి. ఇక్కడ సాక్కుందురు చక్కగా! లేచెల్లి పని చూసుకోండి" ఇదీ ఆయన వాటం.

నేను నేరుగా ఆంధ్రజ్యోతికొచ్చి ఎ.బి.కె.ని కలిసినా ఎ.బి.కె. నన్ను తీసుకొని జ్యోతి ఎం.డి. జగదీష్ ప్రసాద్ కేబిన్‌లోకి వెళ్తుండగా "సార్ ఇంటర్వ్యూ ఏం చెయ్యడు గదాసార్ ఆయన! రెండు సెకండ్లలో నన్ను బయటకు పంపించెయ్యండి" అని అన్నా.

"నువ్వు రారా మగడా" అని ఎ.బి.కె. నా చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకెళ్లి జగదీష్ ప్రసాద్‌తో, "రే అబ్బాయ్ జగదీషూ! చాకులాంటి వాడు. నీకు తెలీదులే. ఉదయం నుంచి పట్టుకొచ్చేశా" అన్నాడు.

జగదీష్ ప్రసాద్ నా బిత్తర చూపుల్ని భరించలేక, 'కూర్చోండి' అని అంటూ వున్నా యజమాని ముందు కూర్చోవడం ఎందుకులెండి అని మర్యాదకు పోయినట్టు యాక్షన్ చేసేసి పట్టూ పరుగు!

నేను జ్యోతిలో చేరిన సంగతి చెప్పాలంటేనే భయమేసేసింది పతంజలికి. ఒకరోజు ఆలస్యం చేసి పెద్ద తప్పుచేసి రెండోరోజు ఆలస్యం చెయ్యలేక చేసేసి మూడోరోజు పతంజలి ఇంటికి పొయ్ చెప్పేసినా.

"నాయుడు గారూ మీరు ఎన్ని ఏడుపులు ఏడ్చినా ఇది అన్యాయం. మీ ఖర్మ" అని ఆయన అంటా వుంటే నేను తలొంచుకుని జారుకుంటా వుంటే, "సొంతంగా ఉద్యోగం కూడా సంపాయించడం ఏమీ బాగా లేదండీ నాయుడు గారూ!" అని ఎత్తి పొడిచినాడు.

ఆంధ్రజ్యోతి ఆఫీసు బంజారాహిల్స్‌లో. నేనుండేది శంకరమఠం దగ్గర. అయినా ఇల్లు మార్చలా. పతంజలిని మాత్రం ఇంటికెళ్లి అప్పుడప్పుడూ కలిసే పనే.

అట్లా ఏడెనిమిది నెలలయ్యిందో లేదో తిరుపతి జ్యోతి ఎడిషన్ ప్రారంభమైంది. మా వూరొచ్చేసినా.

1987 మొదట్లో వొచ్చేసిన వాణ్ణి ఆయనకొక జాబు రాసుంటే వొట్టు. 1988లో మా నాయన చచ్చిపోయినాడు. మా అమ్మ మా అక్కను తల్చుకోని ఏడ్చేవాటం చూస్తే ఆమె కూడా చచ్చిపోతుందని భయమేసి దేముడి సత్యానికన్నట్టు సినబ్బ కతలు, మిట్టూరోడి కతలు, ముని కన్నడి సేద్యం వారసబెట్టి రాసేసినా. 1991లో మా అమ్మ ఇప్పటి పతంజలి వయసంతలోనే చచ్చి పూడిసింది. ఇదేందిరా 85లో ఒకరు, 88లో ఒకరు, 91లో ఒకరా... అని దిగులు. 1994లో నేను చచ్చిపోతానేమో ఒకవేళ అని బిత్తర. 94 దాటినాక నాకు కాసింత వూపిరాడింది. పతంజలి ఎగతాళి చేసినట్టు సొంత రచనలు ఇన్ని చేసినా పుస్తకాలు అచ్చయిన కబుర్లు కానీ, చావు కబుర్లు కానీ ఆయనకు ఫోను చేసి కానీ జాబు రాసికానీ చెప్పిన పాపాన పోలా. దీన్నంతా ఆయన కృతఘ్నత అనుకునేవాడో ఏం కర్మో!

1998 ఆగష్టులో నాకు ఆంధ్రజ్యోతి వీక్లీకి హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ అయింది. అప్పట్లో నేను గడపతొక్కింది రెండే ఇండ్లు. ఒకటి పతంజలిదీ, రెండు తోట వైకుంఠానిదీ.

పతంజలి ఇంటికిపోయి, సిగరెట్టు ముట్టిస్తూ, "సార్, వీక్లీకి ఈ హైదరాబాద్‌కు వొచ్చి చచ్చినా. ఏమన్నా రాయండి సార్" అనడిగినా, పదకొండేండ్ల తరువాత ఆయన మొకం చూసి.

"ఆ సిగరెట్టు అక్కడ పారేస్తారా నాయుడుగారూ! సొంతంగా సిగరెట్టొకటి!" అని ఆయన ఎగతాళి. చేతిలో ఉన్నదాన్ని పారేయించి ఆయనిచ్చిందాన్ని తాగనిచ్చాడు.

చివరకు ఆయన వీక్లీకి రాసిందేమంటే 'పతంజలి ఆయుర్వేదం' వారం వారం ఒక పేజీ. అడ్రసూ, ఫోన్ నెంబరు ఇచ్చి కింద వేయమన్నాడు. అందువల్ల ఆయన డిక్షనరీలోనే లేని బిజినెస్ అనే పదం వాడి అది పెరుగుతుందన్నాడు.

ఆయన చెప్పినట్టే వేసినా. మూడు వారాలయ్యే సరికి మా ఎం.డి. నన్ను కిందికి రమ్మని పిలిపించినాడు.

"అదేంది నామినీ! ఎవరో ఆయుర్వేదం డాక్టరుది అడ్రస్సూ, ఫోను నెంబరు వేస్తున్నావంట. తీసెయ్" అనేసి అన్నాడు. నేను దీనికి జగదీష్ ప్రసాద్ ఎదురుగుండా కుర్చీలో చక్కాముక్కాళ్లు వేసుకుని కూర్చొని, "చూడండి సార్. ఆయన ఆయుర్వేద వైద్యుడూ కాదు పాడూ కాదు. పతంజలి. ఇక్కడ తిరుగులాడే జర్నలిస్టులందరి కంటే పనోడు. ఆయననే వోడే లేకపోతే నేననే వోడే మీ ఎదురుగా కూర్చుని వుండను. మీరంటూ ఉంటారు చూడండి 'నామినీ ఇది నా అబ్లిగేషను' అని. అట్లా ఆ పేజీ నా అబ్లిగేషను" అని. అట్లా ఆ పేజీ నా అబ్లిగేషను" అనేసి అన్నా.

ఎం.డి. తలగాయ గీరుకొని, "నిన్నెవురన్నా ఆ పేజీ తీసేయ్‌మని అంటే అట్లాగే అట్లాగే అని అంటూ అది వేస్తూనే వుండు. నాతో మాట్లాడినట్టు వాళ్లతో మాట్లాడొద్దు. సరేనా?" అన్నాడు.

నేను సరే అని చెప్పి ఒకాయన చెప్పినా, రెండాయన్లు చెప్పినా ఆ పేజీ పతంజలి రాసినన్ని వారాలూ వేస్తూనే ఉన్న. జగదీష్ ప్రసాద్‌తో చెప్పి ఆ ఆయుర్వేద పేజీకి అయిదారు వేల రూపాయల చెక్కొకటి! దాన్నిచ్చేప్పుడు నేనెంత సిగ్గు పడినానో పతంజలి అంత పొంగిపోయినాడు. కుడుమిస్తే పండగనే వెర్రి మారాజు.

సరే. ఆంధ్రజ్యోతిని మూసేసినారు. 2001 జనవరి 1న ముందూ వెనుకగా నాకు ఇంటికి సీ సుబ్బారావూ, పతంజలి ఫోను చేసినారు.

"ఏమోయి నాయుడు గారూ! ఆంధ్రజ్యోతిలో మీకెంతిచ్చే వోరు ఏటి?" అంటూ పతంజలి.

"12 వేలు సార్" అన్నాన్నేను.

"నేను నెలనెలా 15 అరేంజ్ చేస్తా. చెప్పా పెట్టకుండా తిరుపతికెళ్లిపోతే అక్కడికొచ్చి తన్నేయగలను" అనేసి ఆయన. రాజుగదా, కోటలు దాటే మాటలు. ఆయనే ఆయన్ని మోసుకోలేక ఎన్ని అగచాట్లు పడినాడో అందరికీ తెలుసు. నన్ను మోస్తాడంట. అదాయన గుణం.

"నేరుగా ఇంటికొచ్చేయండి" అని ఒక రోజు ఫోను. నేరుగా ఇంటికెళ్లిపోతే "అవునోయ్ నాయుడుగారూ! మీకు మన రామకృష్ణారెడ్డి తెలుసుగదా" అనేసి అన్నాడు పతంజలి.

ఇక్కడ సజ్జల రామకృష్ణారెడ్డి గురించి కాసింత చెప్పాల. మామూలుగా జర్నలిస్టులంతా వీలైతే కట్‌డ్రాయర్‌లో పెట్టుకుని సిగరెట్లు కాల్చేస్తూ వుంటారు.

కరపత్రం

# నీతి తప్పిన లోకంపై నిప్పుల కొరడా పతంజలి

సెర్వాంటీస్ స్పెయిన్ దేశంలో పుట్టాడు. స్పెయిన్ చాలా దేశాల్ని వలసలుగా చేసుకుంది. అందువల్లో మరెందువల్లో డాన్ క్విక్జోట్ ప్రపంచం అంతా చదువుకుంది. మార్క్‌ట్వేన్ అమెరికన్. అఖండ వ్యంగ్య వైభవంతో రచనలు చేశాడు. ప్రపంచాన్నంతా తన గుప్పిట్లో బిగించింది అమెరికా. అందువల్లో మరెందువల్లో ఆయన రచనల్ని ప్రపంచం చదువుకుంది. చెఖోవ్, రష్యన్ సమాజాన్ని రోగగ్రస్త వార్డుతో పోల్చాడు. అమాయకంగానైనా భరించలేని తనంతో అయినా సరిదిద్దాలనుకోవడం ఎంత ఎబ్బెట్టు వ్యవహారమో కథలో చెప్పాడు. చనిపోయిన రైతు బానిసల ఆత్మలని కొని కులీన వర్గాలలో చేరిపోయిన చిరు అధికారి ఉత్థానంలో రష్యన్ సమాజ పతనాన్ని వ్యంగ్యాత్మకంగా చిత్రించాడు గోగోల్. నవసమాజ ఆదర్శాన్ని తొలిసారిగా ఆవిష్కరించింది రష్యా. అందువల్లోమరెందువల్లో వారి రచనల్ని ప్రపంచం చదువుతుంది. వాళ్లందరూ చేసిన పనిని ఒక్కడూ మన పతంజలి అమోఘంగా చేసి వెళ్లిపోయాడు. ఆ దేశాలు చేసిన పనులేవీ మన తెలుగువాళ్ళు చేయలేదు. తెలివైన వాళ్ళు. అందుచేత పతంజలిని చదువుకునే అవకాశం మనకే దక్కింది. ప్రపంచానికి ఆ దురదృష్టం ఎన్నటికి తీరునో కదా.

తెలుగునాట మాంత్రిక వాస్తవికత వ్యాప్తిలోకి రాకముందే మన సాంప్రదాయంలోంచి దాన్ని స్వీకరించి ఇతరుల శ్రమపై రికామీగా బతుకుతూ డాబూదర్పం చెలాయించే వాళ్ళ గోరోజనం ఇంటి కుక్క దర్పంకంటె అధికమైంది కాదని వీర బొబ్బిలి నోటపలికించాడు. పనిచేయక కుచ్చాటప్పాలు కొట్టేవాళ్ళ తాత్విక విన్యాసాలు ఎంత హాస్యాస్పదంగా వుంటాయో కుక్కనోట పలికించాడు. దెయ్యాలకోట, కీటకాల నోటివెంటా పలికించాడు. 'భోజనం ముఖ్యమా? విశ్వాసం ముఖ్యమా?' అనే తాత్విక చర్చ కుక్క బతుకునుంచే తెలిపి అబ్బురపోయేట్లు చేశాడు. విలువలు, జీవిత సత్యాలు, నమ్మకాలు, ఇత్యాదులన్నీ పరిస్థితులననుసరించి పనికివచ్చేవే కానీ, అన్ని వేళలా, అన్ని సందర్భాలల్లో అనుసరిస్తే ఎంత హాస్యాస్పదంగా వుంటాయో క్రిమికీటకాదులు, నానాజాతి జంతువుల స్వభావ చిత్రణ మీదుగా చేసి ఆధునిక నీతికథలు రాసి జ్ఞానోదయం చేసిపోయాడు.

కండావాపు చూసి బలం అనుకునే పాత్రికేయులు పాలకవర్గాల పెంపుడు జంతువులని నిలువుటద్దంలాంటి నవల రాశాడు. పెన్ను పట్టిన తొట్టతొలితే 'మోటుమనిషి' సంస్కారం నుంచి నాజూకు మనుషులు నేర్చుకోవలసిందే ఎక్కువని కథనం చేశాడు. పోలీసులో మనిషితనాన్ని చంపి పాతరవేసే అధికార సంస్కృతిపై ఖాకీవనంలో కత్తిదూశాడు. పరమ దగుల్బాజీ రాజకీయ వ్యవస్థలోకి అప్పన్న సర్దార్‌లతో పాటు చొరవబడిన వర్తమాన వారసత్వ రాజకీయ కుతంత్రాల భ్రష్టుత్వాన్ని ఎంత అవహేళన చేయాలో చేసి ఎంత అసహ్యం కలిగించాలో అంతా కల్గించాడు. మధ్యలో జనంమీద జనంమీద ప్రేమతో వుద్యమించే వాళ్ల మీదా ఏ నాగరిక ప్రపంచం ఒప్పని చిత్రహింసలు, హత్యాకాండలు, బూటకపు ఎన్‌కౌంటర్లు, కిడ్నాప్‌లు చేసి నిర్లజ్జగా అన్ని హక్కులను కాలరాసిన దమనకాండపై నిప్పులే చెరిగాడు. మంటలే మండించాడు. పతంజలి భాష్యంలో ప్రభుత్వంపై శాపనార్థాలు పెట్టాడు. ఎంత అవకతవకలతో అయినా ప్రజల న్యాయస్థానం ఒకటి ఉండాలి. పాలకవర్గాల

---

ఈ రామకృష్ణారెడ్డి అట్లాకాదు. కేప్‌స్టెన్ ప్యాకెట్టు అగ్గిపెట్టే చొక్కా పై జేబులో పెట్టుకుని తిరిగిన మొగలాయి. ఈ రామకృష్ణారెడ్డి పతంజలి నాణ్యంలో 10% వున్నవాడు కూడా. నన్నాయన "ఏమబ్బా నామినీ!" అనేవాడు. నేను ఆయన్ని "ఏమబ్బా కేప్‌స్టెన్" అనేవాణ్ణి. ఇంతకుమించి మేమిద్దరం ఒకముక్క మాట్లాడుకున్న పాపాన పోలా. ఇప్పుడీయన 'సాక్షి'లో ఏదో పొజిషన్‌లో వున్నట్టు వింటూనే వున్నా.

బాపూ రమణా, వైఎస్సు కేవీపీ అని స్నేహాల గురించి చెప్తావుంటారు కదా. పతంజలి నాతో అన్నదాన్ని బట్టి ఇది మూడో జంట. పతంజలి రామకృష్ణారెడ్డీ. ఇంతకంటే నేను చెప్పలేను. ఈ రామకృష్ణారెడ్డి సాహిత్యం గురించి ఎప్పుడూ మాట్లాడంగా కూడా నేను వినలా. రామకృష్ణారెడ్డి అప్పట్లో పతంజలితో కంటే కూడా మోహన్‌తో, ప్రకాష్‌తో తిరిగేవాడు జాస్తిగా.
పతంజలి 'సాహితీ వైచిత్రి'కి కూడా రామకృష్ణారెడ్డి మూర్ఛపోయింది లేదు. పతంజలి అమాయక చక్రవర్తి అని నమ్మిన రామకృష్ణారెడ్డి పతంజలిని కడదాకా భుజాల మీద ఎత్తుకుని తిరిగినాడు.

రామకృష్ణారెడ్డికి నా గురించి చెప్పి యాభయ్యో, లక్షో పెరికి నాకు కొంచెం వూపిరాడేటట్టు చేద్దామని పతంజలి నన్ను ఇంటికి పిలిపించిన కథ.

"నాయుడు గారూ! మన చేతినిండా టీవీ సీరియల్స్ వున్నాయి. వాటినన్నింటినీ మీకు చూపిస్తా. మీరు రాయాలి మీకు నెలకు 25 వేలు, అడ్వాన్సు 50 రామకృష్ణారెడ్డితో చెప్పి!" అన్నాడు.

నాకు ఏకకాలంలో అన్ని అవయవాలకూ చెమట్లు పట్టేసినాయి. అమ్మో! ఇప్పుడీయన టీవీ సీరియల్స్ చూపిస్తాడా! "సార్, ఊపిరుంటే వుప్పమ్ముకుని బతకతా" అని అనబోతున్నానో లేదో, "నాయుడు గారూ గాభరా పడకండి. అత్తో కోడలో ఒకటుంటుంది. అది దేనికో ఒక దానికి టీ ఇస్తుంది. ఆ టీ ఉప్పగా వుందని విసిరి కొడుతుంది! దట్సాల్. ఒక్కవారం అయిపోతుంది. నోర్మూసుకోని మీరు రాస్తున్నారు" అనేసి అన్నాడు.

"సార్, నేనెక్కడ రాస్తాను సార్ అవన్నీ" అనేసి అన్నా.

"రేయ్ నంజికొడకా. పైకి లెయ్‌రా. ప్రపంచ సాహిత్యాన్నంతా చదువుకున్న వాడినిరా, మార్క్వెజ్ అంటే స్పెల్లింగ్ రాదు నీకు. నేను మేధావివా నువ్వు మేధావివా? నేను రాయంగా లేంది నువ్వు రాయలేవు ఆ ఆడంగి రాతలు. అప్పటికి నేను ఆడంగి రాతలు రాసే వాణ్ణన్న మాట. ఆహాహా వోహోహో! అబ్బో! బాగా పొగరు పట్టిందే! భార్యాబిడ్డల కోసం నానా చంకలూ నాకాలండీ. లైఫ్‌లో ఐరనీ అంటే ఏంటనుకున్నారు. తన్నేవోడు లేకపోతే సరి" అనేసి తిట్టినాడు. నేను నవ్వతానే వుండిపోయినా.

ఆ తర్వాత రెండు మూడుసార్లు ఆయన ఫోన్ చేసినా పిలకాయల చేత లేడని చెప్పించేసి, పిల్లల స్కూళ్ల సీజను అయిపోయినాక 2001 జూన్ కంతా తిరప్తికి తిరిగొచ్చేసినా. 2004లో అనుకుంటా. ఆయన సెల్లు నెంబరు సంపాయించి సోక్రటీసాయన సెల్లు నుంచి ఫోను చేసినా. ఎందుకంటే ఒక వారమంతా 'కెఎన్‌వై. పతంజలి రచనలు' అనే పుస్తకం చదివి.

ఆయన్ని సంతోషపెట్టాలని చెప్పి నాలుగు వేలకు డి.డి. తీసి కొరియర్ చేసి "సార్, గెలుపు సరే... బతకడం ఎలా? ఆ ఎగతాళి పుస్తకాల్ని కొన్ని పంపించండి". అంటే అయిదో ఆరో పంపించి ఫోన్ చేసినాడు.

"ఏమోయి నాయుడుగారూ! డి.డిలు కాదు నాక్కావాల్సింది. మీ నుంచి నాకు అంకితం ఎప్పుడోయీ! ఒక్క పుస్తకం కాని నాయుడుగారూ, నాకు అంకితం ఇవ్వకపోయారో పురుగులు పడిపోతారు" అని మాట్లాడినాడు.
ఆ తర్వాత ఆయన ఫోను చేసింది లేదు. నేనూ చేసింది లేదు.

'సాక్షి' ఎడిటర్ అయిన అయిదారు రోజుల్లో."నాయుడుగారూ! నేనిప్పుడు 'సాక్షి'కి ఎడిటర్‌నోయీ! మీరు వైఎస్‌నయినా సరే తిడుతూ ఒక కాలమ్ రాయాలి. దొంగమాటలు మాట్లాడకూడదు. మీరు ఏమి రాస్తే అది అచ్చుఅవుతుంది. నా మాట వినండి. మీరు రాయాలి. నేను రాస్తున్నాను అని చెప్పండి. చెప్పండి. నా ఎడిట్ పేజీలో మీ కాలమ్ లేకుండా ఏమిటి నాన్సెన్స్. నాయుడుగారూ! మీరు రాస్తున్నారు. ఎప్పుడు రాస్తున్నారు. పంపించండి. మీరు రాస్తున్నారు...."

ఆయన బతికుండంగా ఇదంతా రాసి సంతోషపెట్టాల్సిన ఈ దొంగముండా కొడుకు ఆయన చచ్చిపోయినాక రాసిందిదీ!

*

కరపత్రం

# దొంగనోట్ల దొంగ ఓట్ల రాజ్యం ఒక రాజ్యమా

✯ శ్రీశ్రీ

పాపలూ కనుపాపలూ జాగ్రత్త

-చెరబండరాజు

('మళ్లీ వస్తున్నాయి మన ఊరికి' -21.01.1971)

మళ్లీ వస్తున్నాయి మన ఊరికి
చిలుక పలుకుల డేగలు
రక్తంతాగే రాబందుల మూకలు
కలల పర్యాయ పదాల పచ్చనిచెట్లూ
కళ్ల లోగిళ్లలోని ఆశాప్రసూనాలు
పాపలూ కనుపాపలూ జాగ్రత్త

మొత్తంగా రెక్కలిప్పి
ఇనుప ముక్కులకూ ఉక్కుగోళ్లకూ
లేచిగుళ్ల కవచాలు కప్పి
దేశం ఆకాశం నిండా
దోపిడీ దేశభక్తి గీతాలు పాడుకుంటూ
పుక్కిటినిండా పుచ్చు వాగ్దానాల
గింజల్ని నములుకుంటూ
వలల వలయాన్ని అల్లుకుంటూ
వస్తున్నాయి డేగలు
రక్తం తాగే డేగలు
రక్తం తాగే రాబందుల మూకలు
ఉషస్సులూ మనస్సులూ జాగ్రత్త

పరమ కిరాతకంగా
ప్రజల ప్రాణాల్ని పొట్టన పెట్టుకుంటూ
సైదోడు వంతపాటల్లో
గుండెల్ని అమ్ముకుంటూ
కాలాన్ని వెనక్కినెట్టే
కలవాళ్లకూ రాళ్లకూ బాకాపట్టే
రకరకాల జనద్రోహపు సంఘాల
చిలుక పలుకుల డేగలు
మళ్లీ వస్తున్నాయి మన ఊరికి
రక్తం తాగే రాబందుల మూకలు

ఊళ్లో వాటికి గూళ్లున్నాయి గుళ్లున్నాయి
అంతశ్శత్రువుల పల్లమధ్య
మనయిండ్లూ నలిగే ఉన్నాయి

అయినా మిత్రులారా పుత్రులారా
శత్రు శిబిరాల శిఖరాగ్రాల మీదికి
దోపిడీ గుండెల పాదాలమీదికి
పోరాటం బండల్ని దొర్లించి
ఊరూరికి ప్రాకుతున్న
ఎరుపుండగ వెరపేటికి

ఆవని మనది ఆకాశం మనది
ఊరు మనది పేరు మనది
మన పేదల ఎదల మొదళ్లలోని ఎరుపును
ఏశక్తీ చెరపలేదు
కష్టజీవి కడుపుకొట్టే
ప్రతి వ్యక్తిని కాల్చుతుంది
ఈమూకల కుతంత్రాల్ని
బట్టబయలు చేస్తోంది

మళ్లీ వస్తున్నాయి మన ఊరికి
చిలుక పలుకుల డేగలు
రక్తంతాగే రాబందుల మూకలు
ఉషస్సులూ మనస్సులూ జాగ్రత్త

ఎన్నికలైపోయిన తర్వాత దేశమంతా ఎలాగుంటుంది?
దగా పడిన ఒక ఆడకూతురిలాగా వుంటుంది!
దొంగ నవ్వుల బ్రోకర్ని నమ్మేసి అమాయకంగా రైలెక్కిపోయిన పల్లెటూరి పిచ్చి పిల్లలాగా ఉంటుంది దేశం.
ఎన్నికలు పూర్తి అయిపోయిన తర్వాత దేశం ఎలాగుంటుంది?
తీరని కోరికలతో లక్ష బ్యాలేటు పత్రాల నోమునోస్తున్న బాలవితంతువులాగా ఉంటుంది దేశం.
గాలికి ఉబ్బిపోయిన ఒక గుడారంలాగుంటుంది.
చిరిగిపోయిన ప్రచార పత్రాల గుట్టలాగుంటుంది.
ఎన్నికలైపోయినాక దేశం ఎలాగుంటుంది?
అయిదేళ్ల దీర్ఘనిద్రకు కొంగుపరుచుకొంటున్న పిల్లల తల్లిలాగుంటుంది నాదేశం.
ఎన్నికలైపోయినాక ఏమౌతుంది?
అసత్య ప్రచారాల, జయ విజయధ్వానాల ఘోష తగ్గినాక

విచ్చలవిడి అధికారాన్ని, రాజ్యాన్ని నిలదీసే న్యాయస్థానం విప్లవ ప్రజానీకం నుంచి వుండాల్సిందేనని విశ్వసించాడు.

"మన జ్ఞానానికి సార్థకతలేదు. మన విశ్వాసాల మీద మనకు విశ్వాసం లేదు. మన విలువల మీద మనకు గౌరవం లేదు. మన తోటివాళ్ళమీద మనకు మమకారంలేదు. జ్ఞానానికీ విశ్వాసానికీ పొంతనలేదు. విశ్వాసానికీ ఆచరణకు పొంతనలేదు. విశ్వాసానికీ ఆచరణకు పొందికలేదు. భూమి బల్లపరుపుగా వున్నప్పుడే ఇలాటి జీవితం కళ్ళబడుతుంది" అని మన సామాజిక జీవితంలో డొల్లతనాన్ని, విలువల రాహిత్యాన్ని, గుండెలు పగిలే సత్యాన్ని నవ్వు మెలిపెట్టి చెప్పి వెళ్లిపోయాడు. ప్రజాస్వామ్యంలో పోలీసు వ్యవస్థే అంతిమంగా అన్నిటిని పక్కకుపెట్టి, అణిచిపెట్టి, నిరాటంక అధికార వ్యవస్థకి వెన్నుముకగా నిలుస్తుందని, పిలకతిరుగడు పువ్వులో మరొకసారి హెచ్చరించిపోయాడు.

పోయిందేమో ప్రధానమంత్రికి అందాల్సిన దొంగసొమ్ము. దానికోసం దొంగలు, పోలీసులు కలసికట్టుగా వూళ్ళపై పడి దొంగలు దొంగలు వూళ్ళు దోచుకున్నట్లు దొంగతనాలు చేయడం. వారి తగవులు తీర్చడం కోసం లాయర్లు న్యాయమూర్తులు సిద్ధమవడం. పరస్పర హననకాండ ఎంత వైభవంగా వెలిగిపోతుందో 'మేరా భారత్ మహాన్'. సిగ్గూ లజ్జాలేని లోకం తీరును మొహం గుద్ది చెప్పి వెళ్లిపోయాడు. తన రచనల్లో మనం పోల్చుకోలేని రాజ్యాధినేతలు, రాజకీయనాయకులు లేరు. పోలీసులు, ఉన్నతాధికారి లేడు - న్యాయమూర్తిలేడు - పాత్రికేయుడు లేడు - అయినాతెలిసీ మాట్లాడలేని మధ్యతరగతి అవకాశవాదాన్ని ఎంత గేలిచేయాలో అంతాచేసి పోయాడు. ఉత్తరాంధ్ర పల్లెల అచ్చునుడి కారంలో ఎన్నో సజీవ పాత్రలు మనం పదేపదే తలుచుకొనే విధంగా చిత్రించి పోయాడు. అమాయకత్వంలో - అల్పత్వంతో - జిత్తులమారితనంతో - వెర్రిబాగులతనంతో జిగేల్ మనే పాత్రలు శాశ్వతంగా నిలిచేట్టు సృజించాడు. 'వీరబొబ్బిలి'ని మర్చిపోలే, - ఫకీర్రాజుని, మర్చిపోలేం - గోపాత్రుడుని మర్చిపోలేం. అన్యాయంపై ఉడుకులెత్తే యువరక్తంతో పత్రికావ్యవస్థ మొహంపై వుమ్మేసిన పాత్రికేయుడ్ని మర్చిపోలేం. ఎన్ని సజీవ పాత్రలు. బాబోరే అంతా అద్భుత ప్రతిసృష్టి.

పతంజలి అమాయకులపై ప్రేమ ప్రకటించాడు. అన్యాయాలని తూర్పారబట్టాడు. దుర్మార్గంపై ఆగ్రహించాడు. మానవ ప్రవృత్తిలో అల్పత్వాలని ఎన్నివిధాల అధిక్షేపించాలో అన్ని విధాల వ్వెవ్వెవ్వె అని వెక్కిరించాడు. వెధవల్లారా అని తిట్టిపోయాడు. అనితరసాధ్యమైన రీతిలో తలుచుకు తలుచుకు పడిపడి నవ్వేట్టు అక్షర, వ్యంగ్యంతో చెలగాటాలాడాడు. సమాజంలోని కుళ్ళుని ఎండగట్టిన నిప్పురవ్వ, అగ్గిమంట - పతంజలి అక్షరం. దెయ్యాలు, పిశాచాలు ఎంతో నయమనిపించే దుర్మార్గులు. ధూర్తులు రాజ్యమేలుతున్న అవ్యవస్థలోని అన్ని అంగాలని తన అక్షర ఇంద్రజాలంలో ప్రతి సృష్టిచేసి మనకు ఎంతో ప్రేమగా, మరెంతో చమత్కారంగా అందించి పోయాడు పతంజలి.

తెలుగు సాహిత్యంలో పతంజలిది మోస్ట్ ఒరిజినల్ సిగ్నేచర్. భారతీయ సాహిత్యంలోనూ అతనొక్కడే. విశ్వసాహిత్యంలోనూ తనకుతనే. ఒకే ఒక్కడు. పతంజలి సృజన ఓ మిస్టరీ - ఓ అద్భుతం -అంతుబట్టని ఇంద్రజాల ప్రపంచం. ఆయనలోని లోలోకాలు మనకు అంతుపట్టని ఇంద్రజాల ఇంద్రజాల లోకం.

నువ్వుండవు. నవ్వులుండవు. దుష్టులపై వెక్కిరింతలుండవు. కానీలే...లోకం కొన్నాళ్ళు మూగవోతుందిలే. నిన్న నీవు వదిలిన స్వప్నం మాకు ఓ వెలుతురు దీపం. నవ్వులు, అనురాగాలు, మమతలు విరగాసే కాలం వస్తుందిలే. స్వప్నాలు ఫలించి లోకాన పూసే నవ్వుల్లో నిన్ను స్మరించుకుంటాములే. ఏమయ్యా నిన్ను స్మరించడానికి మాటలే కరువయ్యాయి కదయ్యా! అయినా క్షమించు...మము దీవించు...

తేది 12-3-2009. మిత్రసాహితి, విశాఖపట్నం.

మనకి హఠాత్తుగా మన దరిద్ర సముద్రం హోరు వినిపిస్తుంది.
మనకి భోజనం లేదని గుర్తుకొస్తుంది.
మనకి ఉపాధిలేదని, మనకి దిక్కూ, దివాణం లేదని,
మనకి తెరువూ, తీరూ లేదని మళ్లీ గుర్తుకొస్తుంది.
మనకి మళ్లీ వెనుకటి మన చక్రవర్తుల బిడ్డల పట్టాభిషేకం గుర్తుకువస్తుంది.
మన త్రివర్ణ పతాకం మీద పరాయి మనుషుల నీడల పడుతున్నాయని మనకి మళ్లీ భయం వేస్తుంది.
పంచవర్ష ప్రణాళికల ఓటి చప్పుడు వినిపిస్తుంది.
ఇరవై సూత్రాలకు ముడి లేదని, పథకాలు పారడం లేదని మళ్లీ గుర్తుకొచ్చి మనమీద మనకి జాలేస్తుంది.
సమస్యల పరిష్కారం కోసం కాక ఓట్లు నొల్లుకోవటానికి మనకి నినాదాలు వినిపించారని తెలుస్తుంది.
మనల్ని భయపెట్టి, మనల్ని భ్రమపెట్టి, మనభయాల్ని, మనభ్రమల్ని మనకి ఎరగా చూపి మనల్ని మనవాళ్లే వలలో వేసుకున్నారని తెలిసి మనకి కొంత బాధ కలుగుతుంది.
రోగాలతో కుళ్లిపోతున్న మన అమాయక దేశాన్ని మోసంచేయడం పెద్ద కష్టమైన పనేమీ కాదు.
గోపి చిన్నవాడి పడుచుని మందలోడు మోసం చేసినంత తేలికగా మనల్ని 'మనవాళ్లు' చేయగలరు.
సోలెడు గింజలకు మందులున్నాయి
అడ్డెడు గింజలకు మందులున్నాయి
పిడికెడు గింజలకు మందులున్నాయి
తలనొప్పులకు మందులున్నాయి
శిరసు బాధలకు మందులున్నాయి
సూతిక నొప్పులకు మందులున్నాయి

అని సైకిలెక్కి అసత్యప్రచారం చేస్తాడు.
ఉత్తరాంధ్ర జానపదంలోని మందుల మోసగాడు.
దారిద్ర్యానికి మందులున్నాయి
నిరుద్యోగానికి మందులున్నాయి
సమైక్యతకూ మందులున్నాయి
సౌష్టవానికి మందులున్నాయి....

అంటారు ఎన్నికల్లో మనవాళ్లు.
సమస్యలు మిగిలిపోతాయి.
నినాదాలు మారిపోతాయి.
మందలోడు మారువేషం వేసుకుని, మరో అసత్య ప్రచారం ఆరంభిస్తాడు.
గోపి చిన్న వాళ్ల భార్యలు, అక్కచెల్లెల్లు, అన్నదమ్ములు మళ్లీ వాటిని నమ్ముతారు.
అందుకనే-
ఎన్నికలైపోయినాక ఒక విషాదంతమైన ప్రహసనం ముగిసిపోయినట్టుంటుంది.
ఎన్నికలైపోయినాక దేశం పరాయివాడి పాలనలోకి వెళ్లిపోయినట్టు అనిపిస్తుంది.
ఎన్నికలైపోయినాక మనల్ని ఎవరో వెక్కిరిస్తున్నట్టు అనిపిస్తుంది.
ఎవరో మనల్ని చూసి నవ్వినట్టుంటుంది.
ఎన్నికల జ్వరం తగ్గిపోయిన తర్వాత మన పూర్వస్థితి గుర్తుకొచ్చి అంతా మునపటిలాగే చీకటిగా, ఆకలిగా, నిరాశగా, నిస్సత్తువగా, అగమ్యంగా ఉన్నట్టు అర్థమవుతుంది.
పంచుకోలేక మనం తగువులాడుకుంటున్న రొట్టెను కోతి తినేసినట్లు తెలుస్తుంది.
అందరూ సమానులేనని మనకి ఎన్నికలైపోయినాక తెలుస్తుంది.
పరాయి గజనీలైనా, మన సొంత నిజాములైనా ఒకటే అని బోధపడుతుంది.
శ్రీకృష్ణదేవరాయులైనా, ఔరంగజేబైనా ఒకటేనని అర్థమవుతుంది.
మన ఇంట పుట్టిన దోమైనా, పరాయింట పుట్టిన జలగైనా మన రక్తం పీల్చే బతుకుతాయని స్పష్టపడుతుంది.
తెలిసి తెలిసీ అయిదేళ్లకోసారి జీవితాంతం మోసపోవడం గుర్చి ఏడుపొస్తుంది.
మనమీద మనకి కొంచెం అసహ్యం వేస్తుంది.
మనమీద కొంత రోత పుడుతుంది.
మనబుద్ధి గడ్డి తింటున్నాదని తెలిసి సిగ్గేస్తుంది.
ఎన్నికల పతాకాలు విప్పేసిన తర్వాత, గుడారాలు పీకేసిన తర్వాత, పట్టాభిషేకం మహోత్సవం ముగిసిన తర్వాత తుపాకీ ఇంకా మనకేసే గురిపెట్టి ఉందని తెలుస్తుంది.
మన ఓటే మనల్ని కాటేసిందని తెలుస్తుంది.
ఈమోహం మరో అయిదేళ్ల వరకూ ఎవరికీ చూపించలేం గదా అనిపిస్తుంది.
దిగులేస్తుంది.

('మందలోడా ఓరి మాయలోడా' -29.12.1984 - పతంజలి భాష్యం)

**మి**డతాన కృష్ణారావు గారిని మీకందరకూ పరిచయం చేయబోతున్నందుకు సంతోషిస్తున్నాను. ఒకరోజు రాజమండ్రి ఎక్స్‌ప్రెస్ బస్సు విజయనగరం బస్సు స్టాండులో బయలుదేరి రోడ్డుమీదకి వచ్చింది. వేగం అందుకోబోతున్న ఆ బస్సుని ఒక వ్యక్తి గాభరాగా ఆపుచేశాడు. బస్సు ఆగింది.

బస్సు ఆపిన వ్యక్తి డ్రయివర్ దగ్గరకు పరిగెట్టుకుని వచ్చి 'గురూ...అగ్గిపెట్టి ఉందా?'అని అడిగాడు.

'అందుకేనా బస్సు ఆపావు?' అని ఉగ్రంగా అడిగాడు డ్రయివరు! ముందు నాను అడిగినదానికి నువు సమాధానం జెప్పు అని చిరాకు పడ్డాడు బస్సు ఆపిన వ్యక్తి.

ఆయనే మిడతాన కృష్ణారావు గారు.

పార్టీ టిక్కెట్టు దొరికితే ఎన్నికల్లో పోటీ చేయాలని వారికి అభిలాష.

'జనం ఓట్లేసి గెలిపిస్తే ఏమిటి జేస్తావు' అని మా ప్రభాకరం తమ్ముడు అడిగితే-

"అనుమానం అక్కర్లేదండీ బాబూ - ఏటికావాలంటే అదిజేస్తాను...సర్వనాశనం చేసేస్తాను..." అని చాలా ఆత్మవిశ్వాసంతో చెప్పాడు.

"నీకేమైనా ఓట్లొస్తాయా? కనీసం నీ పెళ్లాం నీకు ఓటేస్తాదని గ్యారంటీ ఉందా?" అని మా తమ్ముడు అనుమానంగా అడిగాడు.

"గారంటేనండీ....ముందు మావైఫ్ ఓటేనండి మనకి పడతాది".

"నిన్ను అప్పుడప్పుడు ఆవిడ కొడుతుంటుందని.."

"ఆడదాని దెబ్బలు మనకి లెక్కేటండి....మనకి ఖాతరే లేదండి బాబు...కొట్టినా ఓటు మాత్రం గ్యారంటండి....."

"ఆవిడ వేస్తుందనుకో తక్కిన ఓట్లో...?"

"తక్కిన ఓట్లు కూడా మా సక్కా ఒస్తాయండి..మొత్తం ఊరందరూ ఓటు వెయ్యవలసిందేనండి...లేకపోతేబాబూ...జబ్బాకాలూ తీసేస్తానండీ... మనకాపాటి రగుడీ పవర్సున్నాయండీ...." అని కృష్ణారావుగారు గట్టిగా అన్నారు.

"నిజమే గానీ....ఈ ఓట్లు గెలవడానికి చాలకపోతేనో?" అని మా ప్రభాకరం మళ్లీ అడిగాడు.

"చాలకపోతే ఊరుకుంటానేటండీ బాబూ. వైజాగ్‌లో మన పెదబాబు గారున్నారు గదండీ......కావలిసినన్ని ఓట్లు కార్లోవడేసి ఆయన పట్టుకొస్తారండి..... ఇంకా కావాలంటే మన గాంధీ బాబుగోరు హైద్రాబాదు నుంచి మనకి ఎన్ని ఓట్లు కావాలో అన్ని పంపిస్తారు. పంపించడవేటి నానుగాని సిటికేస్తే ఆయనే పట్టుకోని పారొస్తారు..ఆ బాబుకి నానంటే అంత అభిమానం.... ఇంకా మన శంకరం బాబుగోరున్నారు. మన రొంగలిచన్నాసున్నాడు. సగుడు సిమ్మాద్రి నాయుడున్నాడు...దత్తుడి బావు గోరిబంగారి బాబున్నారు...మనకేటి బయ్యంలేదండి".

"అవునవునని ప్రభాకరం ఒప్పుకున్నాడు, ఒప్పుకుని- "మరీ? రాజకీయాలంటే అబద్ధాలాడాలి....మోనం చెయ్యాలి....లంచాలు తీసుకోవాలి.....ఇవ్వాలి......అల్లర్లు చెయ్యాలి..అవసరం అయితే మర్డర్లు చెయ్యాలి".

"అవునండి...నాకాసంగతి తెలుసండి, మనకి అయ్యన్నీ శానా బాగా తెలుసండి....నేను జగత్‌కంత్రీ నా కొడుకునండి...పొద్దున్న నెగిసిన కాడ్నించి అన్నీ అబద్ధాలేనండి... నేనసలు శానా పెద్ద కేటునాకొడుకునండి...మర్డర్లు సంగతంటారా? ఇందిరాగాంధీ మర్డరు నాను చేయించిందేనండీ బాబు..... నాను తక్కువోడ్నిగాదు...."

ఇందిరాగాంధీ మర్డరా?.....జాగర్త కృష్ణా జైల్లో పడేసి కుమ్మీగరలు...ఉరి తీసేగలు అని మా ప్రభాకరం కంగారుగా అన్నాడు.

"సర్దాకి అన్నానండి బాబు.. ఇందిరా గాంధీని నేనెప్పుడూ చూడే చూడనేదండి..." అని సర్దుకున్నాడు కృష్ణారావు.

"పూర్వం రోజుల్లో అయితే స్వాతంత్ర్యం ఒచ్చిన కొత్త కాబట్టి వేలిముద్ర వెయ్యటం ఎన్నికల్లో నిలబడ్డానికి కనీస అర్హతగా ఉండేది. ఇపుడు దొంగ సంతకం పెట్టడం చేతకావాలి....మరీ నీకు సంతకం, ఒచ్చునా?" అని మా తమ్ముడు అడిగాడు.

"సంతకం అంటే సిగినేచరే గదండీ?"

"అవును".

"అదైతే ఒచ్చునండీ.....వాల్‌రైటుగా పెట్టేస్తాను."

"మరి ఉపన్యాసాలు చెప్పగలవా?"

"దంచేస్తానండి...హాంధ్రుల ఆత్మాభిమానవండి....అఖాచెల్లెలారా అండి.. ఆఢభఢుచులారా! అండి..."

"ఒచ్చులే...మరీ రాజీవ్ గాంధీని చూసేవా?"

"ఎరుగుదునండి..ఆల్లమ్మని బాగా ఎరుగుదునండి.... సంజీవని ఆళ్ల బ్రెదరుండీ వోడండి...ఒకసారి మన వైజాగొచ్చినాడు....అతినిపుడు లేడండి....రాజీవుగారి తాతగోర్నికూడా ఎరుగుదునండి.... నెహురుగారని చెప్పి నెహురూ అనేవోళ్లు....ఫేమిలీ అందర్నీ ఎరుగుదునండి.... పేపర్లో బొమ్మచూస్తే టక్కున పోల్చేస్తానండి..." అన్నాడు కృష్ణారావు.

మిడతాన కృష్ణారావు గారికి ఒకానొక పార్టీ టిక్కెట్లు వచ్చినట్టు ఆఖరి క్షణంలో చేజారిపోయినట్టు తెలిసింది. అదే నిజమైతే న్యాయం కాదు. ఆయనలాంటివారు మన ప్రజాస్వామ్యానికి చాలా అవసరం.

('మా కృష్ణకి మీ పార్టీ టిక్కెటివ్వరా?' -16.02.1985 - పతంజలి భాష్యం)

తోటరాముడు జ్ఞాపకం వున్నాడా?

రాజుగారి కూతుర్ని పెళ్లాడి తోటరాముడు రాజ్యాధికారం చేపట్టిన తర్వాత ఏమైంది?

ఏమీ జరగలేదు.

తోటరాముడి బంధువులు రాజబంధువులైనారు. పూలతోటకు కొత్తమాలి వచ్చాడు.

ప్రజలు పన్నులు కట్టక తప్పలేదు. పస్తులుండక తప్పలేదు. భూస్వాముల దగ్గర కంబారీలూ, కమతగాళ్లు ఒళ్లు హూనం చేసుకోక తప్పలేదు. రక్షకభటులు దండం రాజరీవితో రహదారులు మీద దుండగాలు చేయటం మానలేదు.

తోటరాముడి మంచివాడే కావచ్చునుగానీ అతని రాజ్యం మంచిది కాదు.

తోటరాముడు రాజ్యమేగాదు ఏ రాముడి రాజ్యం కూడా మంచిదికాదు.

ఇంత దయాదాక్షిణ్యాలు ప్రదర్శించిన తారకరామ రాజ్యంలో ముత్తుకూరు హరిజనులు ఊరొదిరి ఎందుకు పారిపోయారు? కడిపికొండలోని కొడవటి సుదర్శన్ పోలీసులాకప్పులో ఎందుకు చిత్రహింసలు అనుభవించాడు? చిల్లర నేరస్తులు మొదలు రాజకీయ ఖైదీల వరకూ రెండేళ్ల కాలంలో పోలీసు నిర్బంధంలో 25మంది ఎలాగ చనిపోయారు?

జైలులో జబ్బుచేసి, జైలులోనే ముసలితనం పైబడి, జైలులోనే జీవితం మీద విరక్తికలిగి చనిపోయారా?

బూటకపు ఎదురుకాల్పులలో చనిపోయిన వాళ్లెంతమంది?

దయాసింధుదేశాధినేతే సమాధానం చెప్పాలి.

కరీంనగర్ జిల్లా కోరుట్లకు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో వున్న కొండాపూర్ గ్రామంలో ముగ్గురు యువతులను పోలీసులు చిత్రహింసలు పెట్టారనే ఆరోపణ మీద విచారణ జరుగుతోంది.

ఆళ్లగడ లక్ష్మి

కొండమ్మ

బూదమ్మ

ఎన్నికలను బహిష్కరించాలని ప్రచారం చేస్తూ పోలీసులకు 'పట్టుబడిపోయారు'. ప్రజాస్వామ్య దేశంలో ఆ నేరం చిన్నది కాదుగదా! వారిని మూడురోజులపాటు పోలీసులు హింసించి వదిలారట.

ఆళ్లగడ్డ లక్ష్మిలాంటి వాళ్లు రాజ్యానికి చాలా ప్రమాదకరం. ఎన్నికలు బహిష్కరించాలని కోరావాళ్లకి ఈ వ్యవస్థ సయించదు. అలాంటి వాళ్ళ ప్రయత్నాలు ఫలిస్తే పునాదులు మారిపోతాయి. రాములవారు కానీ, తమ్ములైన లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు కానీ, వారి విరోధులైన రావణ, కుంభకర్ణ, విభీషణులు కానీ రాజ్యాధికారం చేపట్టలేదు.

ఆ అవకాశం ఉండదు. అందువల్లనే వ్యవస్థను మార్చాలని చూసేవాళ్లు చాలా ప్రమాదకరం.

కండలు పెంచుకుని, కోరలూ, కొమ్ములూ పెంచుకుని, రెక్కలూ, డెక్కలూ పెంచుకుని నాలుక్కాళ్లమీద నడుస్తున్న పాలకవర్గాల కావలి భటులు వాళ్లమీద ఎర్రకన్నేసి ఉంచుతారు.

విచారణ లేకుండా జైళ్లలో ఎవరూ మగ్గిపోరాదనీ, ఎవరిమీదా కూడా దొంగకేసులు బనాయించరాదనీ, ఎదురుకాల్పులు పేరిట ఎవరినీ మట్టుపెట్టరాదనీ, కుట్ర కేసుల పేరుతో ఎవరినీ వేధించరాదనీ, పీడించరాదనీ, విప్లవాన్ని ప్రేమించేవాళ్లని చెట్లకు కట్టేసి కాల్చివేయరాదనీ, ఒక్క శాసనంగానీ, ఒక్క ఆజ్ఞగానీ జారీచేయగలరా?

చెయ్యలేరు.

ఎందుకంటే వ్యవస్థమీద తిరగబడేవాళ్ల గురించి ముఖ్యమంత్రి కంటే వ్యవస్థలకి కావలి కాస్తున్న అధికార యంత్రాంగానికి పట్టింపు ఎక్కువ.

ఖాకీ దుస్తులు విప్పేసి కాషాయివస్త్రాలు వేసుకున్నా, సఫారీ సూటు సింగారించుకున్నా, పంచే, లాల్చీ ధరించి తెలుగుహొయలు ఒలకబోసినా ఫర్వాలేదు. దేహం మారనంతకాలం దుస్తుల గురించి పట్టింపు లేదు. అంజయ్య అయినా, ఎన్టీఆర్ అయినా, నాదెండ్ల, చెన్నారెడ్డి, బ్రహ్మానందరెడ్డి, వెంగళరావు, భవనం ఎవరైనా ఫరవాలేదు, అందరూ కావలసినవారే. ఉన్న కుర్చీ మీదే సంప్రదాయల్ని మన్నిస్తూ మర్యాదగా కూర్చునేవారే. పంపిన కాగితాలమీద సంతోషంగా సంతకాలు చేసేవారే.

అలాంటివారితో అధికార యంత్రాంగానికి ముఖ్యంగా, పోలీసులకు పేచీలేదు.

ఆ కుర్చీ పనికిరాదనే వాళ్లతోనే వాళ్లపేచీ అంతా.

కుర్చీమీద కూర్చోవటం వరకే పాలకుల వంతు.

రాజ్యాన్ని నడిపే ధనస్వాములున్నారు, వ్యవస్థను కాపాడడానికి కత్తుల, కమ్చీల అధికారులున్నారు. అందువల్లనే ఎవరు ఎన్నికైనా పరిస్థితి యథాతథంగా ఉంటుంది. ఎప్పుడూ ఒక నెత్తుటి సంధ్య ఆవరించుకొని ఉంటుంది.

అందువల్ల ప్రభువుల్లాగా నటిస్తున్నవాళ్లు 'నేను పాలకుణ్ని' అని అహంకరించటానికి ఏమీలేదు.

పాలకులకు హింసామార్గమే చక్కని రాజమార్గం.

('హింసే చక్కని రాజమార్గమే!' -12.01.1985 -పతంజలి భాష్యం)

హైదరాబాద్

02.04.2009 - విప్లవ రచయితల సంఘం

*

వ్యాసం

☆ ఎన్.వేణుగోపాల్

# పతంజలి గారూ, ఈ తగువు ఇంకెవరికి చెప్పేది?

పతంజలిగారూ.
మీరు అత్యద్భుత ఇంద్రజాలిక కాల్పనిక కళా దృష్టితో ఊహించిన అలమండ తగువు నిజంగానే మొదలయింది.

అలమండ పెదరామకోవెలలో అటువంటి తగువును మీరు నిజంగా చూశారో లేదో! అందులో గోపాత్రుడూ ఫకీర్రాజు రొంగలి అమ్మన్నా విరుపుల అప్పన్నా రంగరాజు మాష్టారూ ఉప్పలపాటి చినబాబూ గాజుల పాపయ్యా తెలకలి గురయ్యా బొబ్బిలీ పోలీసులూ మెజిస్ట్రేటూ వగైరా వగైరా నిర్వహించిన పాత్రలను మీరు స్వయంగా చూశారో లేదో! కాని ఇప్పుడు ఆ పాత్రలన్నిటినీ, ఆ పాత్రల సమానులందరినీ, వారి వ్యాఖ్యానాలన్నిటినీ మేం కళ్లారా చూస్తున్నాం.

ఈ సారి ఆ తగువు భూమి గుండ్రంగా ఉందా, బల్లపరుపుగా ఉందా అని కాదు. అది 'అలమండ పుట్టిన కాడ్నించి ఈయాల్టి పొద్దున్న వరకూ చూడనంత మూర్ఖపు గాడిదకొడుకు' గోపాత్రుడు తెచ్చిన తగువు కాదు. 'సాక్షాత్తూ భూదేవతే వచ్చి నాను గుండ్రంగా పంపర పనాసకాయ లాగున్నా (నా తండ్రీ అని చెప్పినా నేను నమ్మను' అనే మొండి తర్కం గురించీ కాదీ తగువు. 'కలబడి కొట్టేసుకుంటే తేలిపోతాది. గెలిచిన వాడి విశ్వాసాన్ని ఓడిపోయినవాడి నెత్తిన రుద్దీవచ్చున్నమాట' అని తగువులు తెగిపోయే సులభ మార్గం చెప్పిన తగువూ కాదు. మన అభిప్రాయాలు ఏర్పడుతున్న తీరు మీదా, ఆ అభిప్రాయాల పట్ల మన నిబద్ధత మీదా, ఏలినవారి అభిప్రాయాలమీదా, మరీ ముఖ్యంగా పోలీసులకూ న్యాయవ్యవస్థకూ ఉన్న అభిప్రాయాల మీదా మీ విశ్లేషణను ఏకకాలంలో కత్తివాదరతోనూ, వెన్నెలో ముంచిన కలంతోనూ దరహాసరేఖలతో చిత్రించిన తగువు కాదిది.

ఈసారి తగువు పతంజలి అనే అక్షరమాంత్రికుడిని ఎలా గుర్తించాలి అని. ఆయన మావాడా మీవాడా అని. ఆయన అక్షరాల వెనుక రాజకీయాలూ, సామాజిక దృష్టీ ఉన్నాయా లేవా అని. ఆయన రచనల్లో నాకు నచ్చినదే బల్లపరుపూ మిగిలిందంతా గుండుసున్నా అని. ఆయన రాసిపారేసిన కాగితాలు కాదు, తాగిపారేసిన సిసాలే ముఖ్యం అని. నాకు నచ్చని రాజకీయాలంటే ఆయనకు కూడ ఒళ్లుమంట అని. నా శత్రువులందరూ ఆయనకు కూడ శత్రువులే అని. నా అభిప్రాయాలే ఆయనవీనూ, పాసం అమాయకుడు అని.

వీటిలో ఏవి నిజమో ఏవి కాదో, ఏ అభిప్రాయాలవల్ల భూమి బల్లపరుపుగా ఉందని నమ్మక తప్పదో మీరే చెప్పాలి. గోపాత్రుడు తన వాదనను వదులుకోవడానికి ఎనిమిదేళ్లకింద కాలంచేసిన తన తండ్రిని తీసుకురమ్మన్నట్టు, ఈ వాదనలన్నీ నిజమో అబద్ధమో తేల్చడానికి మీరే రావాలి.

అలా మీరు ప్రారంభించిన, ఊహించిన మౌలికమైన సంశాదం మీ మరణానంతరం మీ గురివే మొదలుకావడం చాలా కవితా న్యాయంగా కనిపిస్తోంది గదూ.

ఈ రసవత్తరమైన బుకాయింపులు, రసహీనమైన వ్యాఖ్యానాలు, మీ అక్షరాల వెనుక తమ అభిప్రాయాలు చదువుకోవడాలు, తమ మాటలు మీ పెదాలకు అతికించడాలు, మీ అసాధారణ అద్భుత వ్యంగ్య వైభవానికి తమ వెకిలి పరిహాసాన్ని సమానం చెయ్యడాలు, మీ భుజం మీద తమ తుపాకి పెట్టి తమ శత్రువులనూ కొండొకచో మీ మిత్రులనూ గురిచూడడానికి ప్రయత్నించడాలు చూస్తూ, వింటూ నవ్వుకుంటున్నారా గురువుగారూ? శ్రీశ్రీ గురించి చలం అన్నట్టు మిమ్మల్ని పొగుడుతున్నట్టు కనబడుతూనే చిరునవ్వుతో మా కళ్లలో కారంకొట్టజూస్తున్న, పొగడ్తలతో మానోట్లో విషం కక్కిపోతున్న ఈ మీ 'సన్నిహిత ప్రియమిత్రులను' చూస్తుంటే మీకేమనిపిస్తోందో చెప్పరూ? సత్యాన్ని ఊహించి కనిపెడుతున్న, గంభీరంగా ప్రకటిస్తున్న ఈ వ్యాఖ్యాతలను వింటుంటే, 'మన అజ్ఞానం వల్లనే మనకు ఎలాంటి నష్టమూ లేనప్పుడు ఎదటివాడి అజ్ఞానం వల్ల మనకొచ్చే నష్టం ఏమనుంది' అని నిర్లిప్తంగా నవ్వుకుంటున్నారు గదూ.

ఇవాళ మీ 'పతంజలి భాష్యం' అనే అతిసాధారణ జర్నలిస్టు రచనకు పేరు వస్తున్నదట గాని అది అసలు మీ ప్రాతినిధ్య రచనే కాదట. అది మీ రచనలలో అల్పమైన రచన అట. మిమ్మల్ని మీరు కొన్ని నవలల్లోనే వ్యక్తం చేసుకున్నారట. అయినా అది కూడ మీ పూర్తి వ్యక్తిత్వం కాదట. మీకు కూడ తెలియని, మీ జీవితంలోనూ రచనలలోనూ వ్యక్తంగాని మీ వ్యక్తిత్వమేదో వారికే తెలుసునట!

సాహిత్యంలో సమాజం కనబడగూడదనీ, సమాజం ఉంటే అది కళ కానేకాదనీ అనుకునే వాళ్లకు అలాకాక ఇంకెలా అర్థమవుతుంది? స్పష్టమైన రాజకీయ, సామాజిక వైఖరి ప్రకటించడం అసాహిత్యమనుకునే అచారిత్రక అసామాజిక అసందర్భపు వ్యాఖ్య అది. కళను గౌరవిస్తున్నామనే పేరుమీద సమాజం నుంచి దూరంగా సుదూరంగా పారిపోవాలనుకునే హక్కు వారికి ఉంది కాని మిమ్మల్ని ప్రశంసించే పేరుతో ఆ పని చేయడమే సాహసం. మీ రచనను వారి ప్రాధాన్యాలనుంచీ, వారి అభిప్రాయ దురభిప్రాయాలనుంచీ వెలకట్టడం, మిమ్మల్ని ప్రశంసిస్తున్నట్టు కనిపిస్తూనే మీమీద బురద జల్లడం - మన గురజాడ అన్నట్టు 'ఏమి బేహద్బీ'!

కళాత్మకత లేకుండా రాజకీయ, సామాజిక వైఖరి దానికదిగా రచన అవుతుందనే అమాయకులూ మూర్ఖులూ ఎవరూ లేరు. కాని మీ 'పతంజలి భాష్యం' ఒక అద్భుతమైన కళాసృజన. ఏకకాలంలో లోతయిన సామాజిక ఆగ్రహాన్నీ కళాత్మక వ్యక్తీకరణనూ ఎలాసాధించడమో మీరా రచనలో చూపారు. అది ఒక తక్కువస్థాయి రచన అవుతుందా?

గుర్తుందా మీకు, ఒక సందర్భంలో 'పతంజలి భాష్యం' గురించి మీరే ఏమన్నారో?

"నాకోపం, దుఃఖం పదిమందికి చెప్పడం కోసం నేను పతంజలి భాష్యం రాశాను. నా చుట్టూ జరుగుతున్న వాటి మీద అది నా వ్యక్తిగత నిరసన. అయితే సామాజిక పరిణామాల్లో మంచికో చెడ్డకో బాధ్యులు కాని వారెవ్వరూ ఉండరు. నా చుట్టూ ఉన్న సమాజం ఇంత దుర్మార్గంగా ఉండటానికి కచ్చితంగా నా బాధ్యత ఎంతో కొంత ఉండి తీరుతుంది. అది మార్చడానికి జరుగుతున్న ప్రయత్నాల్లో కూడ ఎంతో కొంత నా భాగస్వామ్యముంటుంది. ఈ బాధ్యతల నుంచి ఎవరూ తప్పించుకోలేరు. ఫలితంగా నా వ్యక్తిగత ప్రకటనే మరొక స్థాయిలో సామూహిక ప్రకటన అవుతుంది. సామూహిక క్రోధమే ఒక్కొక్కపుడు నా వ్యక్తిగత క్రోధమవుతుంది. సామూహిక శోకం నా కంట్లో ఒక నీటిబొట్టవుతుంది. ఏది సమూహం, ఏది వైయక్తికం? దినపత్రికల్లో పనిచేస్తున్నాం కాబట్టి మిగిలినవారికంటె ఎక్కడేమి జరిగిందీ మాకు ముందే తెలుస్తుంది. ఒక రాజకీయ అవగాహన ఉన్నందువల్ల జరిగిన సంఘటన మీద నా రియాక్షన్ ఆ అవగాహనకు అనుగుణంగా ఉంటుంది. రాజ్యం చేసిన దుర్మార్గం ప్రజల దృష్టికి వచ్చిన తరుణంలోనే దానిమీద నా రియాక్షన్ కూడా వెలువడడం వల్ల అది ఎక్కువమందిని ఆలోచింపజేస్తుంది. కథలు, నవలలు ఈ రకమైన తక్షణ కర్తవ్యాన్ని చేయలేవు" అన్నారు మీరు.

'ఖాకీవనం' నవలను మొరటు రచనగా, తెలిసీ తెలియని సమయంలో రాసిన రచనగా మీరే డిజోన్ చేసుకున్నారని మరొక అభిప్రాయం.

ఏ రచయిత రచనలోనయినా ఒక పరిణామ క్రమం ఉంటుంది. ఒక పరిణత రచయితకు తన తొలినాళ్ల రచనలమీద అసంతృప్తి ఉండే అవకాశం ఉంటుందనీ మీకు చెప్పనక్కరలేదు. ఆరకంగా తొలి నవలగా మీకు 'ఖాకీవనం' నిర్మాణం మీద అసంతృప్తులు ఉండవచ్చు. దాన్ని ఇంకా మెరుగ్గా రాసి ఉండవచ్చుననీ అనిపించవచ్చు. ఆ మాట ఎపుడైనా మిత్రులతో అని ఉండవచ్చు కూడ. కాని 'ఖాకీవనం'లో మీరు చెప్పదలచిన విషయాన్ని డిజోన్ చేసుకున్నారా? ఈ దేశంలో పోలీసు వ్యవస్థ ఎంతగా దుర్మార్గంతో నిండిపోయిందీ 'ఖాకీవనం'లో మీరు చెప్పిన విషయాల్నే మళ్లీ మళ్లీ 'గోపాత్రుడు'లోనూ, 'పిలకతిరుగుడు పువ్వు'లోనూ, 'నువ్వేకాదు'లోనూ చెప్పారంటే 'ఖాకీవనా'న్ని డిజోన్ చేసుకున్నట్టా?

'ఇజాల, సైద్ధాంతిక వాదోపవాదాల చీలికలు నిలిపేందుకు వట్టివాక్యాల పోగులు పోసే వాజమ్మ వాగుడు లాటి రచనలను చీరిపారేసే రచనలు పతంజలివి' అని మరొక వ్యాఖ్య. మీమీద అభిమానమూ, మీ మరణానంతరం మిమ్మల్ని పొగడాలనుకోవడమూ చాలా సంతోషం. ఆ వ్యాఖ్య చేసినవారు మీకు అత్యంత సన్నిహితులనేది కూడ నిర్వివాదం. కాని మీ భుజం మీద తుపాకి పెట్టి మరెవరినో గురిచూడడం ఎందుకు? ఆ వాక్యానికి ఒక్కొక్క పదానికీ అర్థం చెప్పుకుంటూ పోతే చివరికి అన్వయం కుదరదనే సంగతి వదిలేయండి గాని, మీరెన్నడయినా 'ఇజాల, సైద్ధాంతిక వాదోపవాదాల....రచనలను చీరిపారేసే రచనలు' చేశారా? నాకు తెలిసినంతవరకూ వ్యక్తిగత సంభాషణల్లో, మీకు నచ్చని అటువంటి రచనల గురించి విమర్శించారేమోగాని, అది కూడ ఆ రచనల్లో కళాత్మకత లోపించినందుకు విమర్శించారేమోగాని ఇజాలూ సిద్ధాంతాలులేని శుద్ధ జీవితం ఉంటుందనీ, దాన్ని చిత్రించే సాహిత్యం ఉంటుందనీ మీరెన్నడన్నా నమ్మారా? మీ కథల్లోనూ, నవలల్లోనూ, ఎక్కడన్నా ఇజాలూ సిద్ధాంతాలూ లేని మనుషులున్నారా? ఆ ఇజాలూ సిద్ధాంతాలూ ఏర్పడుతున్న పద్ధతి సరిగాలేదని మీరు విమర్శించారు. ఇజాలూ సిద్ధాంతాలూ జీవితానికి దూరం కాగూడదనీ, మనుషులను మొరటు మనుషులుగా, మూర్ఖులుగా మార్చగూడదనీ చెప్పడానికి మీరు ప్రయత్నించారు. ఇజాన్నీ సిద్ధాంతాన్నీ చిలక పలుకుల్లాగ వల్లెవేయడం మంచిదికాదనీ, అవి జీవితంలో, వ్యక్తిత్వంలో సహజమైన, అవిభాజ్యమైన భాగాలుగా మారాలనీ చెప్పడానికి మీరు ప్రయత్నించారను కుంటాను. క్రోధమైనా, దుఃఖమైనా వైయక్తికమూ, సామూహికమూ అని మీరు అడిగినప్పుడు ఇజాన్నీ సిద్ధాంతాన్నీ -స్పష్టంగా చెప్పాలంటే మార్క్సిజాన్ని - మీరు మీలో జీర్ణం చేసుకుని పలికించారనే అనుకుంటున్నాను.

ఇక అన్నిటికన్న విచిత్రం మిమ్మల్ని తెలుగునాట ప్రగతిశీల శిబిరం నుంచి వేరు చేయాలనే ప్రయత్నం. బతికి ఉన్నంతకాలం మిమ్మల్ని పట్టించుకోని విప్లవరచయితలు ఇప్పుడు మిమ్మల్ని తమ ఖాతాలో వేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారట. విరసం రచయితల రచనలలో కళాత్మకత లేదని మీరు వాటిని ఈసడించుకున్నారట. ఒకరకంగా మీరు విరసం వ్యతిరేకులట.

మీరు ఏ సంఘంలోనూ, నిర్మాణంలోనూ భాగం కాలేదనే మాట నిజమే గాని తెలుగు ప్రగతిశీల సాహిత్య శిబిరానికి మీరు అందించిన కానుకలు చాలా విలువైనవి. అంతకు ముందరి కథలను వదిలేసినా 'ఖాకీవనం' నాటినుంచీ మీ ప్రతి రచననూ తనలోకి తీసుకున్నది ప్రగతిశీల సాహిత్య శిబిరమే. విప్లవ సాహిత్య శిబిరమే. మీ రచనల విశిష్టతను వివరించడానికి ప్రయత్నించినవారు ప్రగతిశీల సాహిత్యకారులే. మీ మీద వ్యక్తిగతంగానూ, సాహిత్యరంగంలోనూ దాడులు సాగినప్పుడు మీకు తన శక్తిమేరకు అండగా నిలిచినది ప్రగతిశీల సాహిత్య శిబిరమే.

పతంజలిగారూ, మరి మీకూ విరసంకూ లేని విభేదాన్ని ఇవాళ కనిపెడుతున్న దురుద్దేశ్యపూర్వకమైన ఈ అబద్ధాలను ఎవరు సవరించాలి?

విరసం మీద, విరసం రచనలమీద మీకు విమర్శ లేదని కాదు. ఉంది. అది అనేక సంభాషణల్లో మిత్రుల దగ్గర చెప్పారు. ఒకసారో రెండుసార్లో రచనల్లో వ్యక్తం చేశారు. విరసం ఇరవై ఐదేళ్ల మహాసభల సందర్భంలో మీరు అప్పుడు పనిచేస్తుండిన మహానగర్ పత్రికలో మీ పేరు లేకుండా ఒక పెద్ద వ్యాసమే రాశారు. 'ఆదర్శాలు మార్చుకోవద్దుగాని, ఫార్ములా మార్చరాదా?' అనే ఆ వ్యాస శీర్షిక మీ అంతరంగానికి అద్దం పడుతుంది. ఆ వ్యాసంలో విరసం కృషిమీద ప్రశంసా ఉంది, విమర్శా ఉంది. విరసం ప్రభావం గురించీ, విజయాలగురించీ అంచనా ఉంది, విరసం సాధించలేకపోయిన కళాత్మకత మీద విమర్శా ఉంది. ఆ వ్యాసం చదివితే విమర్శే తప్ప వ్యతిరేకత ఎక్కడా కనబడదు.

కాని విమర్శకూ వ్యతిరేకతకూ తేడా తెలియని పాండిత్యం మనవాళ్లది. విమర్శనాత్మకంగా ఉండడమంటే గుణదోష విచారణ చేయడమని తెలియదు. విమర్శనాత్మకత లక్ష్యం విమర్శిస్తున్న విషయం బాగుపడాలనే ఆకాంక్ష అనీ తెలియదు. దోష ప్రస్తావన చేయడమే వ్యతిరేకించడంగా అర్థం చేసుకునే ఈ పండితులను ఏమనాలి? సమర్థకులూ వ్యతిరేకులూ అనే రెండు నలుపు తెలుపు వర్గాలు మాత్రమే ఉంటాయనుకునే ఈ మేధావులను ఏమనాలి? తొంభైతొమ్మిది గుణాలను గుర్తించినవ్యక్తే ఒక దోషాన్నీ గుర్తించవచ్చుననీ, తొంభైతొమ్మిది దోషాలున్న చోట కూడ ఒక గుణం ఉంటే దాన్ని గుర్తించవలసి ఉంటుందనీ తెలియకపోవడం అమాయకత్వమా, ధూర్తత్వమా?

ఇక్కడే మీ స్వభావంలోని, వ్యక్తిత్వంలోని ఒక విలక్షణత కూడ గుర్తు చేయాలనిపిస్తున్నది. మీ ఎదురుగా ఉన్నవారిలో ఏదయినా ఒక అంశం పట్ల వ్యతిరేకత ఉన్నదంటే మీరు వారిని కిర్రెక్కించేలా, రెచ్చగొట్టేలా వారికి అనుకూలమైన వాదనలు పెట్టేవారు. నిజానికి అవి మీ అభిప్రాయాలవునో కాదో తెలియదు. ఎందుకంటే మరొక సందర్భంలో మీరే ఆ వాదనలకు జవాబులు చెప్పేవారు. ఒకరకమైన కొంటెతనం అది. అవతలివాళ్లు పొంగిపోతారనుకుంటే వారికి అనువైన మాటలు మాట్లాడి వాళ్ల అల్పసంతోషం మీద మీరు సరదాపడే ఒక లౌల్యం అది. అలా డిబేటింగ్ క్లబ్బులో లాగ అటూ ఇటూ వాదనలు మీరే పెట్టినా అది అవకాశవాదం కాదు. ఒక వివేకవంతుడు, ఒక జ్ఞాని తనకన్నా తక్కువ వివేకవంతుల మీద చూపించే జాలి అది. ఏమి మాట్లాడినా మీరేమిటో, మీ హృదయం ఎక్కడ ఉందో మీ అక్షరాలలో వ్యక్తమయ్యే ఉంది. వాటిని ఇప్పుడెవరూ చెరిపివెయ్యలేరు. తమ ఇష్టానుసారం మార్చి వెయ్యలేరు.

'పామర జనం ఎవడి మూర్ఖత్వాన్ని బట్టి వాడు తనకు తోచిన విధంగా నమ్ముతారు. పరమాత్మ స్వరూపం గురించి ఎవరికి తోచిన విధంగా ఆలోచిస్తారు' అని మన బొబ్బిలి అన్నట్టు, ఆ వ్యాఖ్యానాల సంగతికేమి గాని, మీ గురించి, మిమ్మల్ని అంచనా వేయడం గురించి ఇంత గందరగోళం ఎందుకు జరుగుతున్నదా అని ఆలోచించవలసి ఉంది.

ఒకటి రెండు విషయాలు తడుతున్నాయి.

మీరు తెలుగు సమాజ సాహిత్యాలు గర్వించదగిన అద్భుతమైన సృజన కర్త. బహుశా గత శతాబ్దిలో మన తెలుగు సాహిత్యలోకం సృష్టించిన అపార ప్రజ్ఞావంతులయిన ఐదారుగురు రచయితలలో మీరొకరు. వ్యక్తిగానూ ఆలోచనాపరుడిగానూ రచయితగానూ మీ విస్తృతీ లోతూ సాధారణమైనవి కావు. కథ, నవల, వ్యాసం, వ్యంగ్య రచన, సంపాదకీయం వంటి అనేక ప్రక్రియలలో ముప్పై సంవత్సరాలకు పైగా అనన్య సాధ్యమైన కృషి చేసి వేలాది మంది అభిమానులను సంపాదించుకున్నారు. పత్రికారచయితగా, వైద్యుడిగా, స్నేహశీలిగా వేలాదిమందికి వ్యక్తిగతంగా సన్నిహితంగా మెలిగారు.

ఈ వేలాదిమంది అభిమానులలో ప్రతి ఒక్కరికీ తనకే ప్రత్యేకంగా వ్యక్తిగతంగా తెలిసిన పతంజలి ఉన్నారు. ప్రతిఒక్కరూ తమకు తెలిసిన పతంజలే అసలు పతంజలి అని అనుకుంటున్నారు. అంటున్నారు. ఇతర పతంజలుల గురించి వారికి తెలియకపోవచ్చు కూడ. కనుక ఏ ఒక్కరూ అబద్ధమూ కాదు. అట్లని ఏ ఒక్కరూ నిజంకూడ కాదు.

వ్యాసం

☆ అట్టాడ అప్పల్నాయుడు

# తెలుగు సాహిత్య పత్రమ్మీద - ఉత్తరాంధ్ర జన యావన్మంది నిశానీ - పతంజలి రచన!

ఔను ఆధునిక తెలుగుకథ, గురజాడ అప్పారావు గారు రాసి వుండొచ్చు. అప్పటినుంచీ వచ్చిన కథలు చదువుకున్న, బతుకు తెరువుబాగున్న, తీరబడిగ కూకొనో, తిరిగో,లోకమ్మీద కనబడే (వారికంటికి ఆనిన) మూర్ఖపు ఆచారాల, సంప్రదాయాల, నడవడికల అప సవ్యతల మీద - కంఠసించుకునే మధ్య తరగతి మనుషుల, మనసులగోస కథలవి! అక్కడ్నించి ఆరంభించి, నడిచొస్తే, చాసోదాకో, గురువని పతంజలి గౌరవించే రా.వి.శాస్త్రి దాకో వెలువడిన సాహిత్య పత్రిమ్మీద-పైన చెప్పిన భద్రజీవులు (సన్న జీవులుండినా), అక్షరాస్యులు సంతకాలు జేసారు. చాసో నాడారంభమై పతంజలితో ప్రబలి ఉత్తరాంధ్రా జన యావన్మంది నిరక్షరాశ్యుల నిశానీ- తెలుగు సాహిత్య పత్రిమ్మీద సాక్షాత్కరిస్తోంది.

కొందరు దేవున్ని సంతృప్తి (Please - అనువాదం సరియైనదో, కాదో.?) పర్చటానికీ, కొందరు రాజునీ, మరికొందరు సమాజాన్నీ ప్లీజ్ చెయ్యడానికి రాస్తారు. నేను నా అంతర్లోకాలను ప్లీజ్ చెయ్యటానికి రాస్తానంటాడు పతంజలి!

"ఆ, అంతర్లోకాలనేవి యేవో - అతగాను చెప్పలేదేటోయ్? లోకముక్కర్లేనోడి తాలూకా అంతర్లోకాలు మనకేవోయ్? అంతర్లోకాల కోసం రాసేడు, అంతర్లోకంలోని మనుసులే సదువుకోనీ! మనకేల? ఓయ్-రాసోరి బిడ్డగదా, బుద్దులెటుబోతాయి? ఆళ్లకెంతసేపూ -ఆళ్ల అంతరిపురాల గోలేనివోయ్. గోలెట్టుకోనీయివోయ్. మనకేల? మనం అటుకేసి, రాసోరి అక్షరమ్ముక్కకేసి, సూడొద్దుగాక సూడొద్దు, రాసుకోని, మనకేల...?"

అలాగ, అంత కచ్చితంగా తీర్మానం చేసుకున్నానో, లేదోగాని చాన్నాళ్లు, పతంజలి రచనల్ని చదవలేదు. తింటే గారెలే తినాలి. వింటే భారతమే వినాలి లాంటి రూల్సుగూడా మనలోకానున్నాయిగదా? అందిచేత గూడా పతంజలిని చదవలేదు.

ఒకానొక రోజు, విరసం సమావేశంలో, యెందుకో - సీ.వీ సుబ్బారావు "చూపున్న పాట" కథ గురించి ముచ్చటించేడు. అప్పటికప్పుడు, ఆ ఆంధ్రజ్యోతి వారపత్రిక కొనేసి, చదివేసి, రాసినోడి సంగతి, గొప్పగా చెప్పినోడి సంగతీ తేల్చేద్దామని ఉరుకులాటతోటి లెగిసానుగానీ, సమావేశం మధ్యలో లెగిసి, యెళిపోగూడదని రూల్సు గుర్తొచ్చి ఆగిపోయేను. ఏ రాత్రికో-కొని, చదివేను, మళ్లా చదివేను. మళ్లా, మళ్లా, మళ్లా.......!

ఓర్నాయినో - ఆటా, పాటా, మాటా, రచనా, కళా సాహిత్యాలు - అలా, రక్తపాడ సర్పమై - రాజ్జేనీ, దుర్మార్గాన్ని, అక్రమాన్ని, అన్యాయాన్ని వెంటదరమాలన్నమాట. అంత బాధ్యత సాహిత్యానికుందన్నమాట. అంతశక్తి గూడ వుందన్నమాట. అది కతకాదురోయి నాయినో, శక్తిరో - అనన్పించింది!

ఆ తర్వాత, పతంజలి రచనల్ని సంపాదించి (కొని కాదులెండి) చదివేను, సదివినవన్నీ బాగుంటేనే కొందామన్న రూల్సు నాది! (చదివిన తర్వాత, మరి కొనడమెందుకని అన్నించి కొనలేదుగాని లేకపోతే యెన్ని కొనీసుందునో....!) మొత్తానికి, అన్నీ అన్లేనుగాని, చాలామట్టుగు చదివేను. ఇప్పటికీ చదువుతున్నాను, యింకా యింకా చదువుతుంటుం..!

రాజులందరూ, వొకేలాగ పాలించుంటారు; రాజధాన్లు మార్చి వుంటారుగానీ, రాచరికపు విధానాలు మార్చివుండరు. అందుకే, అందరు రాజుల చరిత్రా యించుమించుగ వొకలాగే వుంటాది!గానీ పెళ్లాన్ని పోగొట్టుకున్న రాజో, పెళ్లాన్ని బాకీకింద అమ్మేసుకున్న రాజో, పెళ్లాన్ని జూదంల వోడిపోయిన రాజో- మనకి గుర్తుండిపోతారు, గుండెల్లోన కదల్తారు, ఎందుకూ.....? ఈ రాజుల చరిత్రలోన - కథలకి పనికొచ్చే 'సజ్జు' వుంది గనకా - అనేవాడు, మా ఊరి కంసాలి కనకాచారి. కనకాచారికి కొలిమి తాలూకా తిత్తి ఊది, సాయం చెయ్యాలేగానీ కథకుడికి కావలసిన 'సజ్జు, సరంజామా' చాలోటు నేర్పగలడు. ఉపాధికోసం, నేను ఊరొదిలి వలసొచ్చి -కనకాచారి పాఠాలు యెక్కువగా నేర్చుకోలేకపోయేనుగానీ, నేర్చుకున్న మట్టుకు, తెల్సుకున్నదేటంటే - కథకి అనేగాదు, కళా సాహిత్యాలన్నింటికీ వొక విలనూ, వొక హీరో వుండాలనీ చాతనయితే కమేడియన్నీ చూసి పెట్టుకోవాలనీ, సైడుకేరక్టర్లనీ సెట్ చెయ్యాలనీ, యిలాగ కొన్ని మచ్చులు (నమూనాలు) పెట్టుకుతీరాలని. అలాగే, కళాసాహిత్యాలకి సచ్చినట్టుగ - సామాజిక స్పృహ, ప్రయోజనం, కమిటుమింటూ గట్రా వుండాలనీ గ్రహించేను.

పతంజలికి -యిటువంటి పాఠాలు యే ఆచారీ నేర్పినట్టులేదు. ఇష్టమొచ్చినట్టు

---

మీ రచనలోనూ, జీవితంలోనూ అపారమైన లోతు, సువిశాలమైన విస్తృతి ఉన్నందువల్ల మీ అక్షరాల అంతస్సారాన్నిగాని, జీవిత దృక్పధాన్ని గాని తెలిసిన వర్గీకరణలలోకి విభజించి మీకు ఏకైక అస్తిత్వాన్ని ఆపాదించడం కుదరదు. రచనా వస్తువువల్ల, శైలివల్ల, అసాధారణమైన జీవితానుభవంతో, అధ్యయనంతో మీ రచనలోకి ప్రవహించిన ఎన్నెన్నో పొరల, స్థాయిల, కోణాల, రంగాల జీవిత విశ్లేషణల రసాయనిక మేళవింపు వల్ల మీ రచన చెప్పదలచినదేమిటో ఒక పరసంలో సంపూర్ణంగా అవగాహనకు వస్తుందని చెప్పడానికి వీలులేదు. చదివినప్పుడల్లా, చదివే సందర్భం మారినప్పుడల్లా ఒక కొత్త కోణం కనబడే రచనలు మీవి.

లోతు విస్తృతీ అంతు తెలియని మీ సాహిత్య వ్యక్తిత్వం లాగే మీ జీవితం. వ్యక్తిత్వం కూడ మనకు తెలిసిన సాధారణ సరళరేఖ సూత్రాలలోకి, నలుపు తెలుపులలోకి కుదించగలిగినవి కావు. మీరు ఏకకాలంలో మిమ్మల్ని మీరు ప్రగతిశీల వాదిగానూ గుర్తించుకున్నారు. హస్తసాముద్రికాన్నీ నమ్మారు. అత్యద్భుతమైన రచనలు చేసి వేలాదిమందిలో ప్రకంపనాలు సృష్టిస్తూనే, అసలు రచనకు సామాజిక ప్రయోజనం ఉంటుందా అనీ సందేహించారు. మీ రచనలను లోకం ఎలా స్వీకరిస్తుందో చూస్తూనే 'నేను నాకోసం మాత్రమే రాసుకుంటున్నాను' అన్నారు. 'నాకు ప్రజలంటే ఇష్టం' అంటూనే 'కాని నిస్సిగ్గయిన ఊరేగింపులంటే అసహ్యం' అన్నారు. రాజుగా బతుకుతూనే రాజుల బూజును కడిగేశారు. జర్నలిస్టుగా ఉంటూనే జర్నలిస్టులు పెంపుడు జంతువులుగా మారిన తీరును దుయ్యబట్టారు. బహుశా మన సమాజంలో విరుద్ధాంశాల మధ్య ఐక్యత - ఘర్షణ ఎలా ఉంటాయో మీరు జీవించీ రచించీ చూపారు. అది మామూలు దృష్టికి వైచిత్రిలాగ కనబడుతుంది. బహుశా ఈ వైచిత్రే మీరు మరణించిన తర్వాత వెలువడుతున్న వ్యాఖ్యానాలలో కనబడుతున్నట్టున్నది.

ఇంతకూ మీరు ఎవరివారో, ఎవరిని వ్యతిరేకించారో, మీ రచనలలో ఏది గొప్పదో ఏది అల్పమైనదో, వ్యక్తిగా మీ బలాలూ బలహీనతలూ ఏమిటో తేల్చే అలమండ తగువు ఏమవుతుందోగాని, ఇంత రాశాక మీ అక్షరాల అంతస్సారం ఆత్మవిమర్శ అని నాకనిపిస్తున్నది. మీరు ఎవరినో ఎదుటివారిని విమర్శించడానికే రాశారని, వ్యంగ్యం రాశారని పైకి చూడడానికి అనిపిస్తుందిగాని, నిజానికి మీరు విమర్శించిన అన్ని రంగాలూ మీలోనే ఉన్నాయి. మీరువాటిలో భాగంగానే ఆ ఎగతాళి చేశారు. అంటే మీ రచనంతా మీ ఆత్మవిమర్శ. మీరు మాలో ఒకరు గనుక, మా ప్రతి ఒక్కరిలోనూ మీరు విమర్శించినవన్నీ ఉన్నాయి గనుక మీ రచనలన్నీ మా ఆత్మవిమర్శలే. అందువల్లనే ఎక్కువమంది పాఠకులు మీ అక్షరాలతో మమేకమవుతారు. మీకన్న గొప్పగా విమర్శలు రాసినవాళ్లు, బైటినుంచి చూసినవాళ్లు ఉండవచ్చుగాని, మీలాగ ఆత్మవిమర్శ రాసినవాళ్లు, లోపలినుంచి చూసినవాళ్లు అరుదు. అందువల్లనే చాలమందికన్న మీరు ఎక్కువకాలం నిలుస్తారు.

పతంజలిగారూ, ఎప్పటికీ మీకు సెలవు చెప్పలేం.

*

రాసేడు. ఏ నమూనా రూల్సుకీ లొంగని పద్ధతిల, తన బుర్రల పుట్టిన రీతిల రాసేడు. పాత పడికట్టురాళ్లు మారిస్తేగాని పతంజల్ని తూకం వెయ్యిలేం. పాతకళ్లద్దాల్ని మారిస్తేగాని పతంజలి రచనల్ని చదవలేం. కొత్తవెలుగులోకి వొస్తేగాని పతంజలి సాహిత్యాన్ని బోధపర్చుకోలేం!

రాసిన తొలికథ యేదో, తొలినవల యేదోగాని - పతంజలి రచనలన్నీ మెరుగుపట్టిన బంగారు ఆభరణాల్లాగుంటాయి.వాక్యాలు పదునుబెట్టిన బాణాల్లా గుంటాయి. కథా వస్తువుతో బాటు - కళాత్మక శిల్పం పతంజలి స్వంతం!

బహుశా, గురజాడ రచనా శైలిలోని నాటకీయతా, చాసో క్లుప్తతా, రా.విశాస్త్రి వర్గ దృక్పథం కలగలిసి నాటుకున్న భావజాలానికి, ఉత్తరాంధ్ర వ్యంగ్యాన్ని తనదైన శైలిలో మేళవించి రచన సాగించేడు పతంజలి, అనొచ్చు.

సాహిత్యం - అతనికి వ్యక్తిగత కార్యకలాపమన్నాడుగానీ రాసిన వాక్యమేదీ సొంతానికి రాయలేదు. సమాజం కోసమే రాసేడు. చదవగా, చదవగా కమేనిస్టోడో, నక్సలైటోడో (కమ్యూనిస్టులిపుడెక్కడున్నారు? వుంటే గింటే నక్సలైట్లున్నారని - యేదో నవలలో రాసేడు) అన్పిస్తోంది. గానీ, 'ఆడేన్రో' అని తెలిసేట్టు పతంజలి పెన్ను, మెడలో దుమ్ములు వేలాడకట్టుకోడు. అదీ గొప్పదనం.

సీతాసాధ్విని రావణాబ్రెహ్మ (బ్రెహ్మ 'అనే అందుం, రాచ్చసి ముండా కొడుకు, రామచంద్రుడు దేవుడుగాబట్టి, దేశమంతా సాయింజేసింది, పెళ్లాన్ని తెచ్చుకోడానికి! మనకి, మన పొరుగింటోడే రాడు. రావణాబ్రెహ్మే అందాం) యెత్తుకెలిపోతే, రాముడికి కలిగిన దుఃఖం- కవి అన్నవోడ్ని కదిపి కుదిపేస్తది, కావ్యం రాయరోరె అని! లోకంలోని దుఃఖాన్ని చూసి రాయడం -కవులకీ, కథకులకీ రూలు!గాని పతంజలి 'తన లోపల దుఃఖం కలిగితే రాసేనంటాడు. అందుకని -లోకంలోని అనేక దుఃఖఘటనలకు, అనేక ఘర్షణలకు, అనేక మేఘ ఘర్జనలకు, వర్గాలకు, సంబంధించిన సాహిత్యాన్ని ఆయన రాయలేదు. అంత మాత్రాన - పతంజలి లోపలి దుఃఖాలు యీ సామాజిక దుఃఖాలకు అతీతమైనవో, అలీనమైనవో కావు! నిజానికి తను లోకపుదుఃఖాన్ని, తన లోపలి దుఃఖంగా రచనలు చేసేడు.

క్రిష్ణ శాస్త్రి బాధ-ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధఅంతా శ్రీశ్రీ బాధ - అని, చలం అన్నాడంటే, యిందుకేనేమో! 'చూపున్న పాట'కే వద్దాం. రచయిత చూపెంత నిశితమో తెలుస్తుంది. భిక్షగాడయినా -యేపాట పాడుకోవాలో, యేపాటలు పాడుకుంటే భత్యమొస్తాదో, భవంతులొస్తాయో, బహుమతులొస్తాయో- ఏలినవారు బూటుకాలుతోటీ, లాటీ చేతుల్తోటీ, తూటాల నోటితోటీ చెప్తారు. అలనాడు అన్నమయ్యకీ, పోతనకీ, బ్రెహ్మంగారికీ, ఆ మధ్యన గరిమెళ్లకీ, తర్వాత పాణిగ్రాహికీ చెప్పేరు. అయినా, జ్ఞానం రానందుకు యీ మధ్యన గద్దర్‌కే (కొంత జ్ఞానం ఇపుడొచ్చిందిలెండి గద్దర్‌కి) రుచి చూపేరు.

అయితే - పాట వొక పోరాటం, వొక నెత్తుటి ప్రవాహం, రక్తపాడ సర్పం, సర్పం కమ్ముకుపోయే వొక వెలుతురు సర్పం అని, గద్దర్ మీద దాడికి, దాదాపు పదేళ్లముందు 'చూపున్నపాట' కథ రాసేడు పతంజలి. బహుశా వొక పోరాట పాటకు ఇంత అద్భుత కల్పనతో అల్లిన కథ, మరే భాషలోనూ, మరొకటి వుండకపోవచ్చు. కళా సాహిత్యాల మీద పాలకుల పంజా వుంటుందని; అది పాలకుల కంటికీ, బంటికీ, బంటిమీద బిడ్డకీ, ఇంటికీ, ఇంటిమీది జెండాకీ జెకొట్టే కళా సాహిత్యాల్ని ఆదరిస్తుందని, కళాసాహిత్యాలు వర్గాతీతం కావని నేర్పే కథ యిది.

ఎక్కడయినా, యెప్పుడైనా సంపద యెవులి చేతిల వుంటాదో - ఆళ్ల చేతిలోనే, కోర్టులూ, పోలీస్టేషన్లూ, ఆఫీసులూ, బ్యాంకులూ, పేపర్లూ, పేపర్లోళ్లూ, పెద్ద పెద్ద స్వాములార్లూ, నీతికతలూ, నియమాలూ, నీతి శాస్త్రాలూ, శాసనాలూ వగైరాలన్నీ వుంటాయి. అవన్నీవారు - రెక్కలు తప్పా మరొక ఆస్తిలేని బతుకుల్ని - నొప్పి, బాధా, హింసా కన్పించకుండా, తెలియకుండా యే అవయవానికా అవయవం, యే కీలుకాకీలు విడదీస్సి, పచ్చడి జేస్సి, పచ్చగా బతికే వారి కాలం సాగుతోందనీ, న్యాయ బద్ధంగా, రాజ్యాంగ బద్ధంగా ఆమోదం పొందిన యీ దుర్మార్గం (ప్రజాస్వామికం పేరుతో) సాగుతోన్న క్రూరవిహారమని -హొంటికి వెలపరం పుట్టించినట్టు చెప్పేకథ -"పోయేకాలం".

"దెస్ట్రోయ్, డైద్రవోయ్" అంటూ ఒకానొక అభిప్రాయాన్నీ, అభిప్రాయం వెల్లడించిన వ్యక్తినీ యీసడిస్తూ, ఒక ఊరి రామకోవెలలో ఆరంభమయిన చర్చా, వివాదం-ముదిరి ముదిరి, ఆ ఊరిలోని యెన్నెన్ని కులాల, వృత్తుల జనావలి వుందో, అన్నన్నిట్లోకీ పాకి, అందరినీ కదిపి కుదపగా - యెన్నెన్ని మాయలు, మర్మాలు, యెత్తులు, కుయుక్తులు జనవాలిలోన వెలబారయాయో: యెన్ని గొడవలు జరుగుతాయో - చదువుతున్నంతసేపూ, ఒక గ్రామంలోని జనావాలి రాజులు, నాయుడ్లు, చాకళ్లు, మాలిలు తెలుకలోళ్లు సకల కులాలు, జట్ల, ప్రజల మధ్యన పాఠకుడు తెలుసుకుంటాడు. ఆ సకల జనుల హావ, భావాలు, సంభాషణలు వింటుంటాడు. తోడుగా ఒక కుక్క - బొబ్బిలి వుంటుంది. ఆ ఊరి వీధులూ, యిళ్లన్నిట్నీ తిరిగి తిరిగి చూస్తాడు పాఠకుడు. కొసకి, ఊరి సంత బయలుకి - యుద్ధ సన్నద్ధులైన ఊరి జనావలితో పాటు, పాఠకుడూ వెళిపోతాడు. యుద్ధభూమిలో, ఆలనాడు అర్జునుడు గీతాబోధ విన్నట్టుగా దొంగలి అమ్మన్న, ఒక గీతాబోధ వింటాడు. మహాభారత యుద్ధం ఆరంభమయి పోద్ది. పాఠకుడు తరించబోతుండగా, అర్ధాంతరంగా యుద్ధం ఆగిపోద్ది. (గోపాత్రుడు -కథ)

యుద్ధం - ఆ ఒకానొక ఊరిలో, అలమండలో ఆగిపోతాదిగానీ, మరొక్కాడకొనసాగుతాది. మరొక పద్ధతిలో కొనసాగుతాది. మరెవురెవురో యుద్ధాన్ని నడుపుతారు. మరెక్కడెక్కడో యుద్ధం జరుగుతుంది. మరెవురెవురో మధ్యన దూరతారు. వకీళ్లూ, వార్తా విలేకర్లూ, పోలీసు అధికార్లూ, న్యాయమూర్తులూ, యెవురెవురో, యెగబడతారు.

ఆ యొక్క ఊరు 'అలమండ' జనావలిలాగే, పాఠకుడికీ యేటవుతుందో, తెల్దు. ఎవులి వోదన కరెక్టో తెల్దు. ఎవులు నెగ్గినారో తెల్దు.యుద్ధానంతరం నిర్ధారించిన సత్యమేదో, ధర్మమేదో తెల్దు! ఎవులు తేలుస్తార్రా నాయినా, సత్యం, ధర్మం ధరణి మీద యెవులు నిలపతార్రా, పరమాత్ముడా, అని యీవత్తు అలమండ జనావలితో పాటూ, పాఠకుడూ ఆందోళనాందోళన పడిపోతుండగా పరమాత్మ స్వరూపుల్లాగా పోలీసువారు, న్యాయస్థానం సాక్షిగా, సత్యాన్ని, ధర్మాన్నీ నిలబెడతారు. న్యాయస్థానపువారికి గూడా, సత్యం, ధర్మం ధరణి మీద నిలబెట్టడానికి స్వాతంత్రమైన సత్తువ యేదీ వుండదనీ, తాము పోలీసు పరమాత్మ శక్తి చేతిలోని అస్త్రంగా వుండాలనీ బోధపడతాది. కథ పూర్తయ్యేసరికి, చాలా మందికి, చాలా విషయాలు బోధపడతాయి. ఎవులికీ యే విషయమ్మీదనూ, యేవిధమైన సంశయాలూ వుండవు. సంశయాలు పరిష్కరించబడతాయి, సమస్యలు పరిష్కరించబడవని గూడ బోధపడతాది. పిలకతిరుగుడు బుద్ధుల లోకాన్ని యేలినవారా విధంగా సరిదిద్దుతారని 'పిలక తిరుగుడుపూవు' లన్నీ తెలుసుకొని, వికసితమవుతాయి. (పిలక తిరుగుడు పువ్వు)

పతంజలి, ప్రతీకథనీ, నవలనీ వివరించే పని యీ వ్యాసంలో చెయ్యలేంగానీ, పైన చెప్పిన కథలుగానీ, ఖాకీవనం, పెంపుడు జంతువులు, అప్పన్న సర్దారం, నువ్వేకాదు-వంటి నవలలుగానీ 'వేటకథలు, రాజుగోరు, రాజులలోగిలి వగైరా తప్పా ఒక కాలానికీ, వొక ప్రాంతానికీ పరిమితమయినవి కావు. ఏకాలంలోనైనా, యే ప్రాంతంలోనయినా - యీ నవలల్లోని, కథల్లోని పాత్రలు కనిపించొచ్చు. సంఘటనలు సంభవించవొచ్చు. కాలాతీతమైన సాహిత్యమని అర్థం కాదుగానీ, సర్వకాలీన సాహిత్యం పతంజలిది.

ఒక కాలంలో, ఒక ప్రాంతంలో సాగే ఉద్యమాలూ, ఆందోళనలూ ప్రతిబింబించే సాహిత్యం వొస్తుంది. చదువుతున్నాం. ఈ సాహిత్యానికి గల ప్రయోజనాన్ని తప్పు పట్టడమో, తక్కువచేసి చూపటమో కాదుగానీ; యీ సాహిత్యానికి తక్షణత్వం తప్పా శాశ్వతత్వం ఉండదు. శాశ్వతత్వం గలిగేట్టు,

☆ కె.ఎన్.వై. పతంజలి

వ్యాసం

# ఆదర్శాలు మార్చుకోవద్దుగానీ ఫార్ములా మార్చరాదా?

విప్లవ రచయితల సంఘం పాతిక సంవత్సరాల పండుగచేసుకోబోతోంది. తెలుగుదేశాన్ని ఉక్కిరి బిక్కిరి చేసి, యువతరాన్ని తీవ్రంగా ప్రభావితం చేసి, ప్రభుత్వానికి కంపరం పుట్టించి, కవిత్వానికీ మామూలు ప్రజలకూ మైత్రీ బంధాన్ని కల్పించి కవిత్వమంటే విప్లవ కవిత్వం మాత్రమేననీ, సాహిత్యమంటే విప్లవ సాహిత్యం మాత్రమేననీ, విరసం దృక్పథాన్ని ఒప్పుకున్నవారే కవులనీ, రచయితలనీ, సాహిత్య విమర్శకులనీ, కడమవారు ఉండీలేని వారనీ, హోరుగాలి ప్రచారం చేయించి పాతికేళ్ల నుంచి తెలుగుదేశపు ప్రధాన సంస్కృతీ స్రవంతిగా కొనసాగుతున్న విరసం 10,12,13 తేదీల్లో పదిహేనవ మహాసభలు జరుపుకుంటోంది.

కమ్యూనిస్టు విప్లవం ప్రధాన లక్ష్యంగా, విప్లవ రాజకీయాలు ప్రధాన వస్తువుగా, అందులోనూ చారు మజుందార్ పంథా ప్రధాన ప్రేరణగా విరసం ఆవిర్భవించింది. విప్లవ రచయితల సంఘంతో ఏదో రకమైన సంబంధం లేని కవులుగానీ, రచయితలుగానీ, విమర్శకులుగానీ, కళాకారులుగానీ, మేధావులుగానీ, సాహిత్యాభిమానులుగానీ, పుస్తకాభిమానులుగానీ లేని దశ విరసం ఆవిర్భవించిన చాలాకాలంపాటు కొనసాగింది. ఆదిలో అన్ని రకాల విప్లవ రాజకీయ భావాలున్న వారు దీనిలో సభ్యులుగా ఉన్నప్పటికీ దాని ప్రాణప్రదమైన శక్తులు మాత్రం ఆదిలో చారు మజుందార్ వర్గం, తర్వాత తర్వాత పీపుల్స్‌వార్ వర్గం అభిప్రాయాలకు అనుకూలంగా ఉండేవి. అందువల్లనే నాగిరెడ్డి పంథాను అభిమానించేవారూ, చంద్ర పుల్లారెడ్డి వర్గాన్ని ఎంపిక చేసినవారూ, ఇంకా ఇతర రాజకీయాలను అభిమానించేవారూ విరసం నుంచి ఒక్కొక్కరూ నిష్క్రమించవలసి వచ్చింది. చూడ్డానికీ, వినిపించడానికీ అది విప్లవాభిమానుల ఐక్యవేదిక లాగే ఉండేది కాని వ్యవహరించడం మాత్రం విప్లవ రాజకీయ పార్టీ ప్రత్యక్ష పర్యవేక్షణలో, అందునా ఒక వర్గం ఆధిపత్యంలో నడుస్తున్నట్టు ఉండేది. అందువల్ల జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, నమ్ములాంటి వారు చాలామంది వివిధ దశల్లో విరసం నుంచి బైటపడి వేర్వేరు సాహిత్య సంస్థలను స్థాపించుకున్నారు.

## సాహిత్యంలో శక్తులు

విరసం రెండో మహాసభల సందర్భంగా విరసం కార్యదర్శి కె.వి.రమణారెడ్డి సమర్పించిన నివేదికలో కొన్ని భాగాల్ని పరిశీలిస్తే ఆసక్తికరమైన పరిణామాలు కొన్ని సవ్యంగా అర్థం అవటానికి అవకాశం ఉంటుంది.

'సామాజిక విప్లవానికి కృషి చేసే రాజకీయ శక్తులకు కళల ద్వారా సముచితమైన దోహదం చెయ్యడానికే విరసం ఆవిర్భవించింది. కళలకంటె రాజకీయమే ముఖ్యం కావచ్చుగాక. అలా భావించేవాళ్లకు విరసం లోపలి కంటే విరసం వెలుపలే విశాలమైన కార్యక్షేత్రం సిద్ధంగా ఉంది' అని ఆ రెండో మహాసభలో కార్యదర్శి నివేదికలో కె.వి.రమణారెడ్డి సూచించారు.

'స్నేహితులారా! మాది, పోనీ మనది, సాహిత్య ప్రధానమైన సంస్థ. రచయితలకు, సాహిత్య ప్రియులకు మట్టుకే ఇందులో ప్రవేశంగానీ, ప్రమేయంగాని ఉంది, ఉండాలి' '..కాబట్టి మీ అసలు పనేదో అది మీరు

---

ఆ కాలాన్నీ, కాలపు (ఉద్యమాలూ, ఆందోళనలూ) సంచలనాల్నీ, వాటి సారాంశాన్నీ రచయిత ఒక తాత్త్వాక స్థాయిలోకి గ్రహించుకునీ ఆ తాత్త్విక చింతననూ, చైతన్యాన్నీ అందించే స్పృహతో సాహిత్య సృజన చేయాలి. సరిగ్గా, యీ స్పృహ పుష్కలంగా వున్నవాడు పతంజలి. స్థల, కాల ఉద్యమాల్ని చిత్రీకరించిన సాహిత్యానికి, పతంజలి సాహిత్యాన్ని విశ్లేషించి, బేరీజువేసుకుంటే, పతంజలి సాహిత్యం యొక్క ప్రయోజనం మరింత బాగా అర్థమవుతుంది.

రచయిత ఒక గొప్ప కవిలాగా తాత్త్విక స్థాయిలో సాహిత్య సృజన చేయగలగటం, చాలా కష్టం. కథా, నవలల్లో, ఆ తాత్త్వికత ప్రతిఫలింపజెయ్యటం యే కొద్దిమందికో సాధ్యం. ఆ కొద్దిమందిలో పతంజలి అగ్రగణ్యుడు. పతంజలి భాష్యం, ఒక దెయ్యం ఆత్మకథ రచయిత తాత్త్వికతా బలాన్ని తెల్పుతాయి. తనదయిన భాష్యాన్నీ, తనదైన తాత్త్వకథనూ, నిర్భయంగా, నిలువెత్తు నిజంలాగా, ఆ రచనల్లో ప్రకటించేడు.

ఇప్పుడు, యీ మొత్తం పతంజలి రచనల్నీ - పతంజలి రచనా కాలపు సామాజిక చలనాల్నీ,(ప్రముఖమైనవి) విశ్లేషించుకోండి! ఒక నక్సల్బరి త్యాగాల జ్వాల, వొక లింపెన్ రాజకీయ రాబందుల చప్పుడు, వొక ఇనపడేగల కంపెనీల వామన పాదం, పల్లెల్ని, పట్నాల్ని, నగరాల్ని, దేశాల్ని మింగేసే వొక బహురూప సామ్రాజ్యవాద రక్కసి, ఎగసిన కంఠాలు, ఎగిరిన జెండాలు, వొరిగిన వీరులు, కాలిన స్వప్నాలు, కూలిన బతుకులు, అంతరంగాల నిండిన ఆగ్రహాలు, ఆవేశాలు, ఆవేదనలు, విశ్వాసాలు-విశ్వసనీయత కోల్పోవటాలు, సామూహిక సంక్షోభ వాతావరణం గదా - పతంజలి రచనా కాలం! పతంజలి రచనలు చదివితే, యిన్నిన్ని సమాజ సంచలనాలూ వేర్వేరు రూపాల్లో సారాంశాలుగా మనకు బోధపడుతాయి! అప్పుడు, పతంజలి యే అంతర్లోకాల గురించి రాసేడో, ఆ అంతర్లోకాలు అతనివి కావు, మనవనీ, మన సమాజానివనీ గ్రహిస్తాము.

పతంజలి రచనల్లో బలం-నాటకీయతా, సంభాషణా, వ్యంగ్యం అనంటారు. వస్తువుతోపాటు. నిజం, అతని రచనల్లో అవన్నీ కన్పిస్తాయి. అయితే, యింత శక్తిమంతమయిన రచయితా - దృశ్యకరణ పటిష్టంగా చేయలేదన్పిస్తోంది. గురువని చెప్పుకున్న రా.విశాస్త్రిగారి దృశ్యీకరణ, పతంజలి రచనల్లో కనపడదు. బహుశా దృశ్యీకరణ స్థల, కాలాల్ని వ్యక్తం చేస్తుంది. అది సర్వకాలీనతకు, సర్వజనీతకూ ఆటంకమవుతుందనుకున్నాడేమో? కాకపోతే, అంత సమర్థుడు దృశ్యీకరణ యెందుకు చెయ్యడు? 'గోపాత్రుడు'లోగాని, 'ఖాకీవనం'లో గాని, మరెందులోగానీ - దృశ్యం కనబడుతుందిగానీ, దృశ్యంకంటే యెక్కువగా పాత్రల సంభాషణ, సంఘటనలూ పాఠకుడికి గుర్తుంటాయి. ఇది, పతంజలి రచనా లోపమని అనటంలేదు, అదో బలమేమో అనుకోవాలని అన్పిస్తోంది.

పతంజలి మనకందించిన వ్యంగ్యబాణాలు యేరుకొని అమ్ముల పొదిలో పెట్టుకుందాం (మెడకి బెల్టుంటే కుక్క, నడుముకి బెల్టుంటే పోలీసట; తెలిసిన జబ్బు తగ్గటానికి, తెలిసిన ఔషధాలిస్తామా? లేదా? మారి అలాంటప్పుడు తెలీని జబ్బుకు తెలీని ఔషధం ఇవ్వాలా, లేదా? బోయినం ముఖ్యమా? విశ్వాసాలు ముఖ్యమా? కొడకా-సొంత కులానికీ, సొంతమనుషులుకీ అపకారం జెయ్యలేనోడు, పరాయి కులానికీ, పరాయోళ్లకీ యెలాగ జెయ్యగల్డు.? ఇలాంటి వెన్నో బాణాలు)

పతంజలి పలికించిన కొన్ని జీవిత సత్యాల్ని వెదుక్కొని, పదే పదే వల్లె వేద్దాం (ఎన్నికలైపోయేక - పతాకాలు విప్పేసాక, పట్టాభిషేక మహోత్సవం ముగిసిం తర్వాత తుపాకీ, మనకే గురిపెట్టి వుందని తెలుస్తుంది. పార్టీలే వేరు, పాములన్నీ వొకటే; చెరబడ్డదేశంలో మనిషి ఒక ఉపకరణం రుజా, జరాగ్రస్తమైన ఒక పరికరం:...యింకెన్నో యిలాటివి)

పతంజలి రాసిన ధైర్యవచనాల్ని, మన గుండెల్లో రాసుకుందాం (కత్తికి విజ్ఞప్తి కూడదు, కత్తికి ధర్మాలు బోధించకూడదు...దాన్ని ఆయుధాగారంలోకి నెట్టెయ్యాలి. నరకయాతన అనుభవించి, గాయాలతో విస్తరించి వజ్రకాయుడౌతాడు, ఖడ్గ సదృశమవుతాడు, వాడొక ఆయుధమవుతాడు; పిడికెడు బువ్వయినా, గుక్కెడు నీళ్లయినా, సూది మొనపాటి భూమి అయినా, యుద్ధంలో గెలిచిన వీరులకే దక్కుతాయి.....వంటివెన్నో...)

కొన్నేళ్లనాడు తెలుగు సాహిత్య పత్రమ్మీద- అప్పల్రాముడు వేసిన నిశానీ, వొక 'యజ్ఞా'న్ని యెరుక జేస్తే; యీనాడు ఉత్తరాంధ్ర జనయావన్మందీ వేసిన నిశానీ, మరో యజ్ఞాన్ని యెరుక జెయ్యగలదని ఆశిద్దాం.

పతంజలి సాహిత్య పాదముద్రలకు పరిపరిదండాలు! *

చూసుకోండి, అది చేసుకోండి. బయట ఉండి మీరు మాకు, లోపల ఉండి మేము మీకు పరస్పరం తోడు పడితే.....మీకూ మాకూ పరమాశయం అయినదాన్ని సులభంగా సాధించుకోగలం అంటూ మన సంస్థలో ఉన్న, ఉండగోరే సాహిత్యేతర వ్యక్తులకు మనం నచ్చచెప్పాలి' అని కూడా ఆయన ఆ నివేదికలో అన్నారు.

అయితే సాహిత్యేతర శక్తులు ఏవో, వ్యక్తులు ఎవరో, వారు విరసాన్ని వదిలి పెట్టిపోయినారో లేదో చెప్పలేముగానీ మహాకవి శ్రీశ్రీ, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు, శివసాగర్, నగ్నముని, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, తారకం, ఎం.వి.రమణారెడ్డి వంటి చాలామంది ప్రముఖులు, నమ్మ్రు, టంకశాల అశోక్, ఓల్గా , బి.టి. రామానుజం వంటి ప్రతిభావంతమైన సాహిత్యపరులూ అనేక దశల్లో, అనేక కారణాలతో విరసం నుంచి నిష్క్రమించారు. కారణాలు ఏమైనాప్పటికీ, బైటనుంచి వారు విరసం అభిప్రాయాలకు అనుగుణమైన రచనలే చేసినప్పటికీ వారు చాలామంది విప్లవ రచయితల సంఘంలో ఇమడలేక పోయారన్నది ఇక్కడ గమనించాలి. సాహిత్యేతర శక్తులను విరసం నుంచి బైటకు పంపాలని సంకల్పిస్తున్న విప్లవ రచయితల సంఘం సాహిత్యవేత్తలను వదులుకోరాదని ప్రయత్నించలేదని చెప్పడానికి ఇది దాఖలా అవుతుంది.

విప్లవ రచయితల సంఘంలో నుంచి బైటపడిన జ్వాలాముఖి వంటివారు చేసిన ఆరోపణలో ఎంతో కొంత వాస్తవం లేకపోతే ఇలా జరిగి ఉండదు. 'సాహిత్యానికీ - సమాజానికీ సంబంధం తల్లీ- బిడ్డల సంబంధమేగానీ పాలక-పాలితుల సంబంధం కాద'ని కె.వి.రమణారెడ్డి ఆ నివేదికలో అన్నారు. 'విరసం రాజకీయాలకు అతీతం కాదు, ఆధీనమూ కాదు' అని కూడా కె.వి.రమణారెడ్డి 1972 నాటి నివేదికలో అన్నారు. కాని 1975 వరకూ విరసం ఏకపక్షంగా వ్యవహరించిందనీ, వారు 'భిన్నాభిప్రాయాలున్నవారి'ని సింగిల్ ఔట్ చేశారనీ, అందువల్లనే వ్యక్తులుగా వారు, రాజకీయంగా కొందరు బైటకు వచ్చి సొంతకుంపటి పెట్టుకున్నారని జ్వాలాముఖి ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.

అత్యవసర పరిస్థితిలోనూ, అంటే 1977 తర్వాతా సమస్యను బట్టి విస్తృత ప్రాతిపదికపై విరసం వెలుపలి రచయితలతో, సంఘంతో వారు కలిసి పనిచేయాడానికి కృషి చేస్తున్నారని వరవరరావు కూడా 'సుప్రభాతం' పత్రికకు ఇచ్చిఇన ఇంటర్వ్యూలో అన్నారు. అంటే జ్వాలాముఖి అభియోగాల్ని ఆయన పరోక్షంగా నిరూపించినట్టే లెక్క.. 1989 నుంచీ కూడ మేం ఏ సభ నిర్వహించినా, జనసాహితినీ, అరుణోదయను, ప్రజా రసను పిలుస్తూనే ఉన్నాం అని కూడా వరవరరావు చెప్పారు. అంటే విరసం దృష్టిలో, వ్యవహార సరళిలో మార్పు వచ్చిందనీ, అంతకు ముందు పరిస్థితి మారిందనీ స్పష్టమవుతున్నది.

జ్వాలాముఖి 1975 నుంచీ విరసం ఏకపక్షంగా ఉన్నదని ఆరోపించారుగానీ 1971 నుంచే ఆ ధోరణి ఉన్నదని, తాము ఆ తప్పుడు ధోరణులపై అప్పటి నుంచే తాము దానిపై పోరాటం సాగించి 1985లో తప్పనిసరిగా బైటకు పోవాల్సి వచ్చిందనీ ప్రజారస సంస్థాపకుడు నమ్మ్రు చెబుతున్నారు. నమ్మ్రులాంటి వారిని పొమ్మనలేక పొగబెట్టినారట. ఇదంతా విప్లవ రచయితల సంఘం వ్యవహార సరళికి సంబంధించినది.

## విరసం సాహిత్యసేవ

అదే సమయంలో విప్లవ రచయితల సంఘం ద్వారా తెలుగు సాహిత్యానికి జరిగిన ఉపకారాన్ని గురించి ప్రస్తావించుకోవాలి. చెరబండరాజు, శివసాగర్, గద్దర్ మొదలైన వారు సుబ్బరావు పాణిగ్రహి స్ఫూర్తినీ, నాజర్ సేవలనూ దృష్టిలో పెట్టుకుని తెలుగు జానపద కళారూపాలకు పునఃప్రాణప్రతిష్ట చేశారు. సినిమా పాటలూ, భజనకీర్తనలూ తప్ప మరేమీ వినిపించకుండా పోయిన గ్రామ సీమల్లో, పట్టణాలలో, నగరాలలో జానపద గీతాలను విప్లవ ఛాయలతో గుబాళింపజేశారు. కమ్యూనిస్టులను ప్రథమ శత్రువులుగా పరిగణించే భారతీయ జనతాపార్టీ వారూ, పోలీసు వారూ, తుదకు అయ్యప్ప భక్తులూ కూడా గద్దర్ బాణీలను, వంగపండు పాటల బాణీలను రాయించి పాడించుకునే పరిస్థితి కలగడానికి విప్లవ రచయితల సంఘమే ప్రధాన కారణం. పల్లె పాటకు పెద్దపీట వేసిన విప్లవ రచయితల సంఘానికి తెలుగుజాతి రుణ పడిపోయిందనే భావించాలి.

అలాగే కొంతకాలంపాటు అల్లం రాజయ్య శ్రవ్య నవలలూ, వార్ అండ్ పీస్‌కి ధీటైన అంటే దానికి సమానమైన స్థాయిలో వచ్చినదని పెద్దవారు ప్రశంసించిన వసంతమేఘం వంటి నవలలూ కూడా విరసం ఉద్యమంలో భాగంగానే వచ్చాయికానీ అవి ఎందుకనో బహుళ ప్రశంసలు పొందలేదు. అది బహుశా విత్తనం తప్పుకాదు. సిమెంట్ గచ్చుమీద పడిన ఎలాంటి విత్తనమైనా మొలకెత్తడం సాధ్యంకాదు. కె.వి.రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, బాలగోపాల్, సి.వి.సుబ్బారావు, ఎన్.వేణుగోపాల్, కె.శ్రీనివాస్, తుమ్మల కృష్ణాబాయి, వల్లంపాటి వెంకట సుబ్బయ్య వంటి సుప్రసిద్ధ విప్లవ సాహిత్య విమర్శకులు కూడా విప్లవ రచయితల సంఘం ప్రేరణతోనే తెలుగునాట సాహిత్యపు మంచి చెడ్డలను బేరీజు వేయగలిగారు.

విరసం అందించిన ఉత్సాహంతోనే రాచకొండ విశ్వనాధ శాస్త్రి ఇల్లు, మూడు కథల బంగారం, రత్తాలు - రాంబాబు వంటి నవలలు, పిపీలికం, సోకుపిల్లి వంటి కథలు రాశారు. ఎన్.ఎస్. ప్రకాశరావు, బి.టి. రామానుజం అంగర కృష్ణారావు, మరువాడ రాజేశ్వరరావు బి.ఎస్. రాములు, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, అల్లం రాజయ్య, స్వామి, సొదా, నందిని సిద్దారెడ్డి, అల్లం శేషగిరి రావు, అర్నాద్, సాక్షి, వి.వి.న.మూర్తి, అప్పలనాయుడు, భూషణం, బమ్మిడి జగదీశ్వర రావువంటి ప్రతిభావంతులైన కథా రచయితలు ఎన్నో చక్కని కథలను రాశారు.

ఓల్గా, అక్కినేని కుటుంబరావు, అల్లం రాజయ్య, సాహు, భూషణం, వివినమూర్తి, రాజారామమోహనరావు, అర్నాద్ వంటి అనేక మంది మేలి నవలా రచయితలకు విరసం ఇచ్చిన ప్రేరణ అమూల్యమైనది. ఇక కవుల విషయానికి వస్తే చెప్పుకోదగిన ప్రతి కవీ విరసం వల్ల అంతో ఇంతో ప్రభావితుడైన వాడే. విరసంలో సభ్యత్వం లేకపోయినా, విరసం పత్రికలో రాయకపోయినా విరసం భావజాలాన్ని ప్రతిఫలిస్తూ కవితలు రాసిన, రాస్తున్న వారు అసంఖ్యాకం. వారి జాబితా మొత్తం రాయాలంటే చాట భారతం అవుతుంది. విప్లవ రచయితల సంఘంతో విసిగిపోయి, విప్లవ కవిత్వంతో మొగం మొత్తిపోయి దళిత కవుల్లోనూ, ఫెమినిస్టు కవుల్లోనూ చేరిపోయిన వారిని కూడా విరసంతో ప్రభావితులైన వారికిందకే పరిగణించాలి. ఆ లెక్కన చూస్తే విప్లవ రచయితల సంఘం ప్రభావం సోకని తెలుగు కవులు ఈనాడూ ఎవరూ లేరని చెప్పకతప్పదు.

## అభిమానులు శత్రువులు

విప్లవ రచయితల సంఘానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. ఈ సంఘానికి ఉన్నంత మంది అభిమానులూ, సానుభూతిపరులూ, భక్తులూ మరే సంఘానికీ లేరు. మామూలు సంసారాల్లో, మాజీ కమ్యూనిస్టుల్లోనూ, వ్యాపార, వాణిజ్య సాంకేతిక రంగాలలో నిమగ్నమైన వారిలోనూ, ఉద్యోగ వర్గాల్లోనూ ఈ సంఘానికి అసంఖ్యాకమైన అభిమానులున్నారు. ఇట్టి భాగ్యం ఆనాటి అ.ర.సా.నికి గానీ, మరో సాహిత్య సంస్థకు గానీ దక్కలేదు. ఒక స్పష్టమైన రాజకీయ దృక్పథాన్ని నిబ్బరంగా భరించడమే దీనికి ప్రధానకారణం. అదే విధంగా ఈ సంఘంలోని సభ్యులకు ఉన్నంత మంది శత్రువులు కూడా మరే రచయితల సంఘానికీ ఉండదు. భారతీయ జనతాపార్టీ వారికి, రాష్ట్రీయ స్వయం సేవకులకు, విద్యార్థి పరిషత్ వారికి, పోలీసులకు, రాజకీయ నాయకులకు, భూకామందులకు, పెట్టుబడిదార్లకు, సంప్రదాయ ఛాందసవాదులకూ విరసం వారు శత్రువులే.

సికింద్రాబాద్ కుట్ర కేసులో నిందితులైన కె.జి.సత్యమూర్తి అనే శివసాగర్, చెరబండరాజు, వరవరరావు, త్రిపురనేని మధుసూదనరావు, కె.వి. రమణారెడ్డి, ఎం. రంగనాథం వంటి ప్రముఖ సాహిత్యకారులు విప్లవ రచయితల సంఘంలో సభ్యులే. విరసం పుట్టిన దగ్గర నుంచి దాని సభ్యులు అనేకమంది అనేక సందర్భాల్లో కారాగారవాసం చేస్తూనే ఉన్నారు. జ్ఞానేశ్వర్ కీర్తిని, పరిటాల శ్రీరాముల్ని భూస్వాములూ సంఘ వ్యతిరేక శక్తులూ పాశవికంగా చంపేశారు. కోటగిరి వెంకటి అనే విరసం సభ్యుడ్ని 1972లో పోలీస్ ఎన్‌కౌంటర్ పేరుతో చంపేశారు. పోలీసు నిర్బంధంలో వారి హింసను తట్టుకోలేక చెరబండరాజుకు

వ్యాసం

☆ కె.వి.కూర్మనాథ్

# పతంజలి ఒక అపురూప జ్ఞాపకం

పతంజలిది ఎంత అసాధారణ వ్యక్తిత్వమో అంత సాధారణమైన వ్యక్తిత్వం. చిట్టచివరి వరకూ సాహిత్యానికీ జర్నలిజానికీ అంతకంటే ముఖ్యంగా మానవీయ విలువలకూ కట్టుబడి ఒక జీవన విధానంగా గడిపేరు. నమ్మిన సిద్ధాంతాలొకటి, రాసే రచనలొకటి బతికిన బతుకు మరొకటి కావు పతంజలికి. నమ్మిందే రాసి, రాసిన వాటిల్లోని విలువలను పాటించేరు.

పతంజలిగారికి చాలా యిష్టమయిన పద్యమొకటుంది. కాళహస్తీశ్వర శతకంలోని

జాతుల్సెప్పుట, సేవసేయుట, మృషల్ సంధించుట..

అన్న పద్యం ఆయనకు చాల యిష్టం.

ప్రపంచంలో డబ్బువల్ల, డబ్బుకోసం ఎన్నెన్ని హింసలు, అనర్థాలూ జరుగుతున్నాయో, ఏయే నంగిరితనాలకు అది కారణమో వివరించే ఈ పద్యం పతంజలి గారికి ఎంత యిష్టమంటే, తను 'మహానగర్'కు ఎడిటర్గా ఉన్న రోజుల్లో సంపాదకీయాలకు పైన మకుటంగా పెట్టుకున్నారు. ఆస్తికి సంబంధించిన అసలు స్వరూపాన్ని అంత బాగా అర్థం చేసుకున్నారు కాబట్టే ఆయనకు డబ్బు ఏనాడు గీటురాయి కాలేదు. డబ్బు చుట్టూ అల్లుకున్న ఏ ప్రలోభమూ ఆయనను ఆకర్షించలేకపోయింది-ఎన్ని అవసరాల్లో ఉన్నప్పటికీ.

పతంజలి జీవితం రచయితలకూ, జర్నలిస్టులకూ ఒక పాఠ్యపుస్తకం లాంటిది. ఆయన చేసిన ఏ రచనా చెడుకు ఉపకారం చెయ్యలేదు, మంచికి అపకారం చెయ్యలేదు. రచయిత అన్నవాడు ఎట్లాంటి మినహాయింపులూ, షరతులూ లేకుండా ప్రజల పక్షాన నిలబడాలని పతంజలి రచనలు ప్రకటిస్తాయి. ఎటువంటి రక్షణా లేని, వనరులూ లేని ప్రజల చేతిలో తిరుగులేని ఆయుధం రచన అని ఆయన రచనలు చదివితే బోధపడుతుంది.

ప్రజల్నించి గ్రహించిన సామెతల్ని, వ్యంగ్యాన్ని, లోకజ్ఞానాన్నీ వంటబట్టించుకొని తన రచనల్లో అవసరాన్ని బట్టి వాడుకున్నారు. అందుకే ఆయన రచనల్లోని పాత్రలు - గోపాత్రుడు, ఫకీర్రాజు, వీరబొబ్బిలి, పాకలపాటి రంగరాజు మాష్టారు, రొంగలి అమ్మన్న, అప్పన్నసర్దార్ - మన చుట్టూ సంచరిస్తున్నట్టనిపిస్తుంది మనకి. ఆయా పాత్రల అజ్ఞానమూ, తెలివిడీ, గొప్పదనమూ, లేకితనమూ, కపటత్వమూ, నిర్హేతుకత్వమూ మనకు కొత్తగా అనిపించదు. మనలోనో, మన చుట్టుపక్కల వాళ్లలోనో ఆయా ఛాయలు మనకి కనిపిస్తుంటాయి. మనరోజువారీ జీవితంలోని మనుషుల కపటత్వాన్ని అసహ్యించుకున్నాడు. నంగిరితనాన్ని, జుగుప్సాకర ప్రవర్తనను ఎగతాళి చేశాడు. అజ్ఞానాన్ని, మూర్ఖత్వాన్ని ఏవగించుకున్నాడు. దుర్నీతిని, దోచుకోవడాన్నీ కసితీరా తిట్టాడు.

గోపాత్రుడు నవలికలో మెజిస్ట్రేటు పాత్ర ద్వారా సమాజపు హిపోక్రసీ మీద పతంజలి తీవ్రంగా విరుచుకుపడతాడు. "మన జ్ఞానానికి సార్థకత లేదు. మన విశ్వాసాల మీద మనకు విశ్వాసం లేదు. మన విలువల మీద మనకు గౌరవం లేదు. మన దేవుడి మీద మనకి భక్తిలేదు. మన నాస్తికత్వం మీద మనకు నమ్మకం లేదు. మనమీద మనకు గౌరవం లేదు. మన తోటివాళ్ల మీద మనకు మమకారం లేదు. మన ప్రజాస్వామ్యం మీద మనకు అవగాహన కానీ, గురికానీ లేవు. మన జ్ఞానానికీ, విశ్వాసానికీ, ఆచరణకూ పొందికలేదు. భూమి బల్లపరుపుగా ఉన్నప్పుడు మాత్రమే ఇలాంటి జీవితం కళ్లబడుతుంది. మన భూమి

---

బ్రెయిన్ ట్యూమర్ వచ్చింది. ఎంతో అపురూపమైన కవీ, సాహసికుడూ, ప్రజల మనిషీ అయిన 'చెర' ఆ ట్యూమర్తోనే కన్ను మూశాడు. విప్లవ రాజకీయాల్లో తిరిగే వారి జీవితాలు ఎంత అనిశ్చితంగా ఉంటాయో విరసంలో సభ్యులుగా ఉండేవారి జీవితాలు కూడా ఒక్కొక్కప్పుడు అంతే అనిశ్చితంగా ఉన్న సందర్భాలు ఉన్నాయి. పిరికివాళ్లు, స్వార్థపరులూ, విప్లవ రచయితల సంఘం వంటి సంఘంలో సభ్యులుగా ఉండలేరు. విరసంలో కొన్నాళ్లపాటు సభ్యులుగా చేరి, కీర్తి ప్రతిష్టలు గడించి, పరిచయాలు పెంచుకుని, సమాజంలో ఒక గుర్తింపు సంపాదించుకొని తరువాత పై మెట్టు ఎక్కిపోయి విరసాన్నీ, కవిత్వాన్నీ కూడా మరిచిపోయిన వాళ్లు అనేకమంది ఉన్నారు. విరసం ప్రారంభం అయిన అనేక సంవత్సరాలపాటు విరసంలో చేరడాన్ని గొప్ప సాహసంగానూ, సామాజిక స్పృహకు, సామాజిక దృక్పథానికి గుర్తుగానూ భావించేవారు అనేక వేలమంది ఉండేవారు. విరసం పత్రికలు పోస్టులో తెప్పించుకున్నందుకే పోలీసులు వారిని పిలిపించి, లేదా ఇళ్లకే వెళ్లి పలుకరించి, ప్రశ్నించి, బెదిరించిన సంఘటనలు వేల కొద్దీ ఉన్నాయి.

తెలుగువారికి ఉద్యమ స్పృహ చాలా ఎక్కువ. పాట పాడినా, ముగ్గులు పెట్టినా, కథలు చెప్పినా, పూజలు చేసినా అవి ఉద్యమాల కింద పొంగి పొరలవలసిందే. ఏ రంగంలోనైనా ఏకకాలంలో రెండు సమాంతర ఉద్యమాలను తెలుగుదేశం ఎన్నడూ సమాదరించలేదు. ఏదో ఒక ఉద్యమాన్ని మాత్రమే అది ఆమోదిస్తుంది. మిగతావి కూడా ఉండవచ్చుగానీ అప్పటికీ అవి పెద్దదేవళంలోని చిన్న గొడుగులుగా సమాధాన పడాల్సిందే. రాజకీయాలలోనూ, కళా సామాజిక రంగాల్లో కూడా ఇది తెలుగువారి సంప్రదాయం.

విరసం పుట్టిననాటి నుంచి నేటివరకూ సాహిత్యరంగంలో అదే ప్రధాన స్రవంతి. కడమావి ఉన్నప్పటికీ ప్రజలు వాటికి దీనికిచ్చేటంత ప్రాధాన్యత ఇవ్వరు. పోలీసులు కూడా విరసాన్ని గుర్తించినంత ముఖ్యంగా మిగిలిన సాహిత్య ఉద్యమాలను గుర్తించరు. అంటే పోలీసులకు ఉద్యమ సాహిత్యాభిలాష ఉన్నదనీ, పోలీసులు గుర్తించినదే కవిత్వమనీ అర్థంకాదు.

విరసం పుట్టడానికి చాలాముందు, అరసం పుట్టి, దానికి ప్రౌఢ వయసు వచ్చిన దశలో ఇదే పరిస్థితి ఉండేది. కవిత్వమంటే అభ్యుదయ కవిత్వమే. కడమది కవిత్వం కాదు. తాడితులు, పీడితులు కవితా వస్తువు, కథా వస్తువు, నవలా వస్తువులే కాకపోతే ఆ రచనకు గుర్తింపూ పాడూ లేని దుర్దశ ఉండేది. కరుణశ్రీ, దేవులపల్లి వంటి గులాబీ గంధపు కవులు కూడా అభ్యుదయం ఓ రెండు గురివింద గింజల ఎత్తు అయినా కలిపితే గాని జరగదని భావించేవారు.

మొన్నటి వరకూ ప్రముఖ వర్తక రచయితగా వెలిగిన యండమూరి వీరేంద్రనాథ్ కూడా ఆరంభంలో అభ్యుదయ భావాలతో తొణికిసలాడే రచనలే చేయాలని ప్రయత్నించాడు. విరసం పుట్టిన కొత్తల్లోనూ, ఆ తర్వాత చాలాకాలంపాటు కూడా విరసం మార్కు కవిత్వం రాస్తేగానీ కీర్తి ప్రతిష్టలు దక్కవని చాలామంది అలాంటి కవిత్వమే రాయాలని ప్రయత్నించేవారు. ఉత్తరాంధ్రలోనూ, తెలంగాణలోనూ ఔత్సాహిక విప్లవ రచయితలూ, విప్లవ కవులూ కుప్పలుతెప్పలుగా ఉండేవారు.

సామాజిక రుగ్మతలను నయం చేయడం కోసం రాజకీయ విప్లవం, సాయుధ విప్లవం వగైరా జరగాలని తపిస్తూ విప్లవ రచయితల సంఘం చేసిన కృషి అమోఘమైనది. మరువరానిదీ, మరువలేనిదీ. అయితే ఆఫ్రికా కవులూ, ఆఫ్రికా రచయితలూ,ల్యాటిన్ అమెరికా కవులూ, రచయితలూ తమ రాతల్లో తమదేశం గురించీ, తమ ఊరి గురించీ రాస్తూనే తమ జాతి జనాల నాడిని ప్రతిధ్వనిస్తున్నట్టు మన విప్లవ రచయితలూ, కవులూ మన తెలుగు జీవితం గురించి రాయడంలేదు. మన విప్లవ రచనల్లో విప్లవం తొంభై శాతం,కవిత్వం అయిదుశాతం, కడమది అయిదు శాతం ఉంటున్నాయి. ఈ ఫార్ములాను మార్చమని ఎవరికి విజ్ఞప్తి చేయాలో? సార్ వరవరరావుగారూ ఎవర్ని అడగాలండీ? చెంచయ్యగారూ ఎవర్ని అడగాలి సార్? త్రిపురనేని మధుసూదనరావుగారూ ఎవర్ని అడగమంటారండీ? చలసాని ప్రసాద్ గారూ ఎవర్ని అడగమంటారండీ?

(విరసం ఇరవై ఐదేళ్ల మహాసభలకు - 1996 జనవరి 12-13, హైదరాబాద్ - ముందు మహానగర్ దినపత్రికలో 1996 జనవరి 8న ఈ వ్యాసం అచ్చయింది. వ్యాస రచయితగా కె.ఎన్.వై. పతంజలి పేరు అచ్చుకాకపోయినా అప్పుడు మహానగర్ సంపాదకులుగా ఈ రచన చేసినది ఆయనే.)

*

బల్లపరుపుగా ఉన్నది గనుకనే మన సమాజం ఇలా ఉంది" అని అంటాడు.

నా వరకు నాకు పతంజలి రచనల మొత్తం సారాంశం ఈ కొటేషన్‌లో ఉందనిపిస్తుంది. మత గ్రంథాల్లో, రాజ్యాంగంలో చెప్పుకునే గొప్పలు, నియమాలు, విలువలు, సామాజిక న్యాయం ఎక్కడా కనబడకుండా చేసిన పద్ధతిపై ప్రజాపక్షపాతి అయిన ఒక రచయిత వెళ్లగక్కిన ఆక్రోశం ఇది. కథను పండించడానికో, ఎవరి మెప్పుకోలుకో రాసిన వాక్యాలు కావివి. తను ఏది రాసినా, ఏది మాట్లాడినా వాటి సారంలో ఈ ఆగ్రహ ప్రకటన కనబడేది. మనుషుల స్వభావాల్లోని మరుగుజ్జుతనాన్ని అవహేళన చేసాడే తప్ప మనుషుల్ని ఏనాడూ దూరం పెట్టలేదు. మనుషుల మరుగుజ్జుతనానికి బాధ్యత సమాజపు సామూహిక కురచతనానిదేనని భావించాడు కాబట్టే మనుషుల్ని వారి స్వభావాలతో నిమిత్తం లేకుండా ప్రేమించగలిగేవాడు.

ఆస్తి స్వభావాన్నీ, మనుషుల స్వభావాన్నీ ఎంత లోతుగా అర్థం చేసుకున్నాడో వీటిని గవర్న్ చేసే రాజ్యమూ, వ్యవస్థలనీ కూడా అంత విస్తృతంగా అర్థం చేసుకున్నాడు. ఈ అర్థం చేసుకోవడం ఏ స్థాయిలో ఉంటుందంటే వ్యవస్థీకృతమైన దుర్మార్గాన్ని వడిశెల పట్టుకొని గురిచూసి కొట్టే గోలియత్ డేవిడ్ వలె కొట్టాలన్నట్టు ఉండేవి పతంజలి రచనలు.

పతంజలి చాలా చిన్న వయసులోనే రాయడం మొదలుపెట్టేడు. తను పుట్టి పెరిగిన రాజుల లోగిళ్లలోని అనవసర మర్యాదలూ, చాదస్తాలూ, భేషజాలూ, మనకి మించిన జ్ఞానులు లేరనుకునే అజ్ఞానాలూ- వీటన్నిటినీ గమనించేడు. కేవలం తమ ఇళ్లల్లోని వెనుకబాటుతనాల్నే కాక సమాజంలోని అంతరాలను కూడా చాలా నిశితంగా గమనించేడు. ఒకసారి అడిగాను - పేదవాళ్ల పట్ల అంత ప్రేమ ఎలా కలిగిందండీ అని. పేరు గుర్తుకు రావడం లేదు కాని, తక్కువగా చూడబడుతున్న కులానికి చెందిన ఒక మిత్రుడి గురించి చెప్పేడు. "వాళ్లింటికి వెళ్లినపుడల్లా, వాళ్లమ్మా నాన్నా కూడా నన్ను చూసి నిల్చునేవారు. అది నాకూ మా ఫ్రెండ్‌కు కూడా ఇబ్బందిగా ఉండేది. అలా లేచి నుంచోవద్దని ఇద్దరమూ చెప్పేం. మాకర్థమయిందేమిటంటే, నామీద గౌరవంకంటే ఊళ్లో పెద్దకులాల వాళ్లు ఏమనుకుంటారోననే భయమే వాళ్ల ప్రవర్తనకు కారణమనిపించింది" అని.

'ప్రేమ సమాజం'లో ఉండే పిల్లల దైన్యాన్ని, అనాథత్వాన్ని చూసి కూడా చలించిపోయానని చెప్పేరొకసారి. పతంజలి గారి చిన్నప్పటి పరిస్థితులే, మనుషులే ఆయన తర్వాతి రచనల ముడిపదార్థాలు. చాసో, రావిశాస్త్రి, శ్రీశ్రీ, కుటుంబరావుల రచనల ప్రభావంతో పాటు ప్రపంచ సాహిత్యంలో గొప్ప రచయితల రచనలన్నిటినీ చదివేరు. కేవలం చదవడం మాత్రమే కాకుండా కనిపించిన ప్రతివారికీ ఆ రచనల, రచయితల ఔన్నత్యాన్ని వివరించేవారు. అప్పుడే రాస్తున్న వాళ్లకైతే చదవాల్సిన అవసరం గురించి మరీ మరీ చెప్పేవారు.

చాల ప్రతిభావంతమైన రచయిత, గొప్ప జర్నలిస్టు, అన్నిటికీ మించిన మానవతావాది అయిన పతంజలి అకాల మరణం తెలుగు సాహిత్యానికి, నుడికారానికి తీరని లోటు. ప్రజాస్వామ్యవాదులకు, రాజ్యం దమనకాండకు గురయ్యేవారికి చాల పెద్ద నష్టం. తాగుడు వ్యసనం, తద్వారా ఆయన్ను భౌతికంగా ఇబ్బంది పెట్టిన లివర్ కేన్సర్ కబళించకుండా ఉంటే ఆయన కనీసం మరో రెండు దశాబ్దాలు ఉండి వుండేవారేమో!

He enriched our lives.

His writings, momories will enlighten us forever

*



వెల : 20/-

పాలమూరు ప్రచురణ

*కాళ్ల కింద భూమిని గుంజి*
*కత్తుల వంతెన నిర్మిస్తున్న చోట*
*తెరుకుమన్న మృత్యు వాకిలి దగ్గర*
*ఒక్కొక్కరే రాలిపోతుంటే*
*ప్రగతి పత్రం మీద పాలకులు*
*సంతకం చేస్తున్నచోట*
*మనుష్యులిక్కడ మనుష్యుల్లా లేరు*
*మండుతున్న అగ్నిగోళాల్లా ఉన్నారు....*

ప్రత్యేక ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా విరసం సభ్యులు ఉదయ మిత్ర, ఇక్బాల్ రాసిన రెండు కథలు, రెండు కవితల సంకలనమిది. మహబూబ్‌నగర్ జిల్లా పోలేపల్లి సెజ్ బాధితుల అంతరంగాన్ని, అనంత పోరాటాన్ని చిత్రించిన ఈ సృజన రూపాలు 'ఓడిపోలే... పల్లె" అని నినదిస్తున్నాయి.



వెల : 10/-

విరసం ప్రచురణ

*శిశిరం గడచి వసంతం వస్తుందా? తెలుగు నేల మీదనే తూర్పు పడమరల ఓడరేవులువచ్చి, కోస్టల్ కారిడార్‌లువచ్చి, క్రిష్ణపట్నాలు, ఇనుమ రజను తవ్వకాలు, గనులు వచ్చి మత్స్యకారుల బతుకులే కాదు, సముద్రము సముద్రంలో జీవరాసుల జీవితమే ప్రశ్నార్థకమయింది....*

ఇంత విషాద సన్నివేశంలో రచయితలు ఏం చేయాలి? తమ రచనను ఈ విధ్వంస క్రమాన్ని అడ్డుకునే పోరాట ప్రజల చేతికి డాలువలె అందివ్వాలి. పాలమూరు జిల్లా పోలేపల్లి సెజ్ బాధితుల పక్షాన ఈ చిన్నపుస్తకంలోని రెండు కథలు ఒక కవిత అలాంటి ఆయుధాలుగా నిలబడుతాయి. విరసం సభ్యురాలు గీతాంజలి రాసిన ఈ చిన్న పుస్తకం ఇటీవల తొలి విడత ఎన్నికల ముందురోజు పోలేపల్లిలో సెజ్ బాధితుల సమక్షంలో ఆవిష్కారమయ్యింది.

నాకీ రోజు పూలు కానుకగా వచ్చాయి
ఇవాళ మదర్స్‌డే కాదు మరే ప్రత్యేకతా లేదు
గత రాత్రి మళ్ళీ అతను నన్ను కొట్టాడు
మునపటి కంటే దుర్భరంగా
అతన్ని వొదిలేసి నేనేం చేయగలను
పిల్లల్ని నేనెలా పోషించుకోగలను
డబ్బు ఎక్కడి నుండి తేగలను
అతనికి భయపడ్డా వదిలిపెట్టలేకపోయాను
కానీ నాకు తెలుసు అతను క్షమాపణలు చెప్పి వుంటాడు...

నాకీ రోజు పూలు కానుకగా వచ్చాయి
ఇవ్వాళ మరీ ప్రత్యేకమైన రోజు
ఇవ్వాళ నా అంత్యక్రియలు
గతరాత్రి ఆఖరుసారి నన్ను చంపేసాడు
చచ్చేదాకా కొట్టాడు
అతన్ని వొదిలేయగల ధైర్యాన్ని నేను ముందే చేసి వుంటే
ఇవ్వాళ నాకు పూలు కానుకగా వచ్చేవి కావు.

ఆంగ్లమూలం : ఎవరో
అనుసృజన : సీతారాం

ఈ కవితని చదివినప్పుడు ఎవరికైనా వొళ్ళు జలదరిస్తుంది. నిత్యం హింసని భరిస్తూ చివరికి దెబ్బలకే ప్రాణం కోల్పోయిన ఓ స్త్రీ మూర్తి రూపం కళ్ళకు కడుతుంది. వేలాది లక్షలాది స్త్రీలకు ప్రతిరూపంగా నిలుస్తుంది. రోజా దెబ్బలను, తిట్లను, అవమానాలను మౌనంగా భరిస్తూ చివరకు మంటల్లో కాలిపోయే సగటు భారతీయ స్త్రీ ఈ కవితలో దర్శనమిస్తుంది! భార్యాభర్తల తగాదాలుగా, తేలికగా కొట్టిపారిసే గృహహింస స్త్రీల జీవితాలను ఎలా ఛిన్నాభిన్నం చేస్తుందో, వారి ప్రాణాలను సైతం ఎలా హరిస్తుందో ఈ కవితలో అద్భుతంగా ఆవిష్కృతమైంది.

మన సమాజంలో ప్రతీ స్త్రీ ఏదో ఒక హింసకు గురవుతూనే ఉంటుంది. నేను నా జీవితంలో ఎలాంటి హింసను అనుభవించలేదు అని ఎవరైనా అంటే అది అమాయకత్వమైనా అయ్యుంటుంది. లేదా అబద్ధమైనా అయ్యుంటుంది. ఎందుకంటే ఆడపిల్ల తల్లి గర్భంలో పడినప్పటి నుండే వివక్షతను ఎదుర్కొంటుంది. ఆడబిడ్డ అని తెలిస్తే వెంటనే అబార్షన్‌కి గురవుతుంది. ఒకవేళ పుట్టినా అడుగడుగునా చిన్న చూపునకు, చీదరింపులకు బలవుతుంటుంది. తిండి పెట్టడం దగ్గర నుండి, ఆరోగ్యం, ఆలనా పాలనా, చదువు, ఆట పాటలు అన్నింటా వివక్షే. పుట్టింట పరాయి పిల్లగానే చూడబడుతుంది. చిన్న వయస్సులోనే పెళ్ళి చేసేసి అత్తింటికి పంపించేసి తమ బాధ్యత తీరిపోయిందునుకుంటారు తల్లిదండ్రులు. నవనవలాడుతూ పెరుగుతున్న మొక్కను హఠాత్తుగా పీకేసి కొత్త చోట పాతినట్లు ఆడపిల్లను పరాయి ఇంట్లో వదిలేసి చచ్చినా బతికినా ఇదే నా ఇల్లు. ఈ రోజుతో మా బాధ్యత తీరిపోయింది. మీ అత్తిల్లే నీకు అన్నీ అంటూ నూరిపోసి చేతులు దులిపేసుకుంటారు. ఇక అక్కడి నుండి ఆమె కష్టాలు మొదలవుతాయి. అందరికీ కష్టాలే వుంటాయని నా ఉద్దేశ్యం కాదు. అయితే చాలా వరకు స్త్రీలకు అత్తింటి కాపురం కత్తిమొన మీద నడకలాగానే వుంటుంది.

కుటుంబ హింస ఫలానా వర్గాల స్త్రీలకే పరిమితం అనడానికి లేదు. సమాజంలోని అన్ని రకాలు కమ్యూనిటీలలో, ధనవంతులు, నిరుపేదలు, పట్టణవాసులు, గ్రామీణులు, చదువుకున్న వాళ్ళు, నిరక్షరాస్యులతో పాటు, అన్ని కులాలు, మతాలలో వ్యాపించి వుంది కుటుంబహింస. అంతేకాదు ఇది విశ్వవ్యాపితం. ప్రపంచంలోని స్త్రీలందరూ కుటుంబ హింసకు గురవుతున్నవారే. పితృస్వామ్య సమాజం పురుషుడికి బదలాయించిన పురుషాధిపత్యం స్త్రీల మీద అనేక రూపాల్లో వ్యక్తమవుతుంటుంది. వివక్షతో కూడిన కట్టుబాట్లు, ఆచారాలు,

☆ కె. సత్యవతి

వ్యాసం

# హింస రహిత కుటుంబం స్త్రీల హక్కు

స్త్రీల పట్ల వున్న మూసపాత్ర (స్టీరియో టిపికల్) అభిప్రాయాలు స్త్రీ పురుషుల మధ్య అసమానతలను, అసమ సంబంధాలను ఏర్పరచినాయి. ఈ అసమ సంబంధాలే స్త్రీల మీద హింసను ప్రేరేపిస్తున్నాయి. అందులో భాగమే కుటుంబ హింస.

కుటుంబ హింసను గుర్తించడానికి, దాని స్వభావాన్ని అర్థం చేసుకొని నిర్దిష్టమైన కార్యక్రమం రూపొందించుకోవడానికి స్త్రీల ఉద్యమానికి చాలా కాలం పట్టింది. 20వ శతాబ్ది మొదట్లో కుటుంబ హింసలో పురుషుల ప్రమేయం గురించి మాట్లాడే పరిస్థితి లేదు. భార్యల్ని కొట్టడం అనేది ఒక హింసాపూరితమైన చర్యగా ఎవరూ భావించలేదు. భర్తల్ని వేలెత్తి చూపే అవకాశమూ లేదు. అందువల్ల కుటుంబాల్లోని హింసను కుటుంబహింసగా కాక భార్యాభర్తల వ్యక్తిగత వ్యవహారంగానే భావించడం జరిగేది. తిట్టి, కొట్టి హింసించే భర్తలను, మౌనంగా భరిస్తున్న భార్యలను అర్థం చేసుకునే సమగ్రమైన దృష్టి కొరవడటంతో స్త్రీలకు సమాజం నుండి ఎలాంటి సహాయ సహకారాలు అందేవి కావు. కుటుంబ సభ్యుల నుండి గానీ, సమాజం నుండి గానీ ఎలాంటి తోడ్పాటు అందకపోయినా పిల్లల కోసం, తన జీవనభృతి కోసం ఆనాటి స్త్రీలు దారుణ హింసల్ని సైతం సహిస్తూ జీవితం గడిపేవారు.

స్త్రీల ఉద్యమపు తొలినాళ్ళలో కుటుంబహింస స్వభావాన్ని, స్వరూపాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడంతో పాటు కుటుంబాల్లో హింసకి పాల్పడే పురుషుల్ని సంస్కరించాలనే ధోరణి బాగా వుండేది. దీనిక్కారణం వివాహబంధం స్త్రీలకు రక్షణనిస్తుందని, ఆ బంధాన్ని తెగతెంపులు చేసుకుంటే పిల్లల భవిష్యత్తు నాశనమౌతుందని భావించడం. కుటుంబ హింస వెనుక వున్న పితృస్వామ్య భావజాలాన్ని అర్థం చేసుకోలేకపోవడం కూడా దీనిక్కారణంగా చెప్పొచ్చు. క్రమంగా స్త్రీల ఉద్యమం వ్యక్తిగతంలోని రాజకీయాలను వెలికితీయడం మొదలుపెట్టింది. "వ్యక్తిగతమంత రాజకీయమే" అనే నినాదాన్ని బయటకు తెచ్చింది. కుటుంబ హింసను అర్థం చేసుకోవడానికి ఒక దృక్కోణాన్ని అందించింది. కుటుంబ హింస అనేది వ్యక్తుల సమస్యగానో, ఆయా కుటుంబాల నిర్దిష్ట సమస్యగానో కాకుండా అదొక సామాజిక సమస్యగా ముందుకి తెచ్చి, పెద్ద ఎత్తున చర్చను ప్రారంభించడం జరిగింది. కుటుంబ హింస వ్యక్తిగత సమస్యకాదు. సామాజిక సమస్య అని గుర్తించడం వల్ల ఆ సమస్యను ఎదుర్కొంటున్న స్త్రీలకు అనేక రకాల, అనేక సంస్థల మద్దతు లభించే వెసులుబాటు ఏర్పడింది. కుటుంబహింసా బాధిత స్త్రీలు నాలుగ్గోడల మధ్య కుమిలిపోకుండా, ధైర్యంగా బయటికొచ్చి మాట్లాడటం మొదలుపెట్టారు. దానినొక రాజకీయ అంశంగా, బలమైన సైద్ధాంతిక అవగాహనతో బహిరంగ వేదికల మీద చర్చకు పెట్టారు. స్త్రీల ఉద్యమం ముందుకు తెచ్చిన ఈ అంశాలతో పాటు, చాలా అంశాలు అన్ని సంస్థలను ప్రభావితం చేయడంతో స్త్రీలకు ముఖ్యంగా హింసకు గురవుతున్న స్త్రీలకు కొంత సహాయం లభించే అవకాశం కల్గింది. కుటుంబ వ్యవస్థ, స్త్రీలు కుటుంబంలో పోషించే వివిధ పాత్రలు వాటి కారణంగా వారు ఎదుర్కొనే మానసిక, శారీరక ఉద్వేగాలు, హింస వంటి అంశాల మీద స్త్రీల ఉద్యమం దృష్టి పెట్టినప్పుడు కుటుంబ హింస విస్తృత రూపం, పితృస్వామ్య వ్యవస్థకు రక్షణ కవచంలా నిలుస్తున్న కుటుంబంలోని వివిధ కోణాలు స్పష్టంగా కన్పించడం మొదలుపెట్టాయి. క్రమంగా ఈ అంశంపై జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో విస్తృతమైన చర్చ మొదలైంది. బీజింగ్‌లో జరిగిన అంతర్జాతీయ సదస్సులో ఐక్యరాజ్యసమితి స్త్రీల పట్ల అన్ని రకాల వివక్షల నిర్మూలనా ఒప్పందంతో హింసకి ఒక సమగ్రమైన నిర్వచనం ఇవ్వడంతో

పాటు, సమాజంలో సగభాగమైన స్త్రీలపై అన్ని రకాల వివక్షలను నిర్మూలించాల్సిన బాధ్యతలను రాజ్యాలకు కట్టబెట్టింది.

స్త్రీల ఉద్యమం ఫలితంగానే స్త్రీల రక్షణ కోసం అనేక ప్రత్యేక చట్టాలు అమలులోకొచ్చాయి. వీటిల్లో ముఖ్యమైనది 498ఎ. వివాహిత స్త్రీ కుటుంబంలో భర్త లేదా అతని బంధువుల వల్ల క్రూరత్వానికి గురయితే ఆమెకు రక్షణ కల్పించాలనే ఉద్దేశ్యంతో వచ్చిందే ఈ చట్టం. అయితే గృహహింస నుండి రక్షణ కల్పించే అంశం ఈ చట్టంలో లేదు. గృహహింసంటే ఏమిటనే నిర్వచనం కూడా లేదు. దానితో కుటుంబహింస నుండి రక్షణ కల్పించే చట్టం కోసం దేశవ్యాప్తంగా స్త్రీల సంఘాలు పెద్ద ఎత్తున ఉద్యమం లేవనెత్తాయి. 'లాయర్స్ కలెక్టివ్' అనే సంస్థ ముందుకొచ్చి దేశవ్యాప్తంగా వున్న వివిధ స్వచ్ఛంద సంస్థల, స్త్రీల సంఘాల, స్త్రీవాదుల అభిప్రాయాలు సేకరించి కుటుంబహింసపై ఒక ముసాయిదా బిల్లు తయారుచేసి ప్రభుత్వానికివ్వడం జరిగింది. దానిపై చర్చలు, సవరణలు జరిగిన తర్వాత కుటుంబహింస నిర్మూలన కోసం "గృహహింస నుండి మహిళలకు రక్షణ 2005" అమలులోకి వచ్చింది. గృహహింసను ఈ చట్టం సమగ్రంగా నిర్వచించింది.

"గృహహింస నుండి మహిళలకు రక్షణ చట్టం 2005" వివరాల్లోకి పోయేముందు కుటుంబహింసా రూపాలేమిటో, అవి ఎన్ని విధాలుగా వుంటాయో చూద్దాం. శారీరక హింస, లైంగిక హింస, మాటలతో హింస, మానసిక భావోద్రేక హింస, ఆర్థిక హింస, ఆధ్యాత్మిక హింస, సాంఘిక హింస ఇలా స్త్రీల మీద రోజువారీ వివిధ రకాల హింసలు అమలవుతున్నాయి.

**శారీరక హింస :** ఈ శారీరక హింస అనేక రకాలుగా వుంటుంది. కొట్టడం, గుద్దడం, జుట్టుపట్టి లాగడం, చెంపమీద కొట్టడం, గుంజడం, కొరకడం, తన్నడం, ఎముకలు విరగ్గొట్టడం, కాల్చడం, చేతులు మెలిపెట్టడం, గోడకేసి కొట్టడం లాంటివి శారీరక హింస కిందకి వస్తాయి. వీటివల్ల తీవ్ర గాయాలేర్పడవచ్చు. ఒక్కసారి గాయాలు కన్పించకుండా కొట్టొచ్చు. ఈ శారీరక నిత్యహింసవల్ల చాలా మంది స్త్రీలకి చచ్చిపోతామన్న భయం పీడిస్తూ వుంటుంది. టైమ్ బాంబు పెట్టుకుని బతుకుతున్నట్టుగా వుంటుంది. రాత్రివేళ ఈ శారీరక హింస మరింత ఎక్కువగా స్త్రీల అనుభవంలోకి వస్తుంటుంది.

**లైంగిక హింస :** ఇంట్లో జరిగే లైంగిక హింస కుటుంబ హింసలో భాగమే. చాలా మంది పురుషులు తమ భార్యలతో హద్దుల్లేని లైంగిక సంపర్కం పెట్టుకునే హక్కు తమకుందని నమ్ముతారు. భార్యకిష్టం లేకుండా బలవంతంగా సాగే లైంగిక సంపర్కం కుటుంబ హింస కిందకే వస్తుంది. అలాగే వైవాహిక లైంగిక హింస నేరంగా కూడా గుర్తించబడింది.

**మాటలతో హింస :** అవమానకరంగా వ్యాఖ్యలు చెయ్యడం, నిందించడం, చిన్నబుచ్చడం, అందంగా లేవనీ, అసమర్థురాలనీ, ఏ పని రాదని, మంచి గృహిణి కాదని, మంచి తల్లి కాదని నిందించడం, పుట్టింటి వారిని దుమ్మెత్తి పోయ్యడం లాంటివన్నీ మాటలహింస కిందకు వస్తాయి. ఈ నిరంతర అవమానం స్త్రీలలో ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీసి, ఆత్మ న్యూనత వైపు ఆమెను నెట్టేస్తుంది. ఆమె ఆత్మవిశ్వాసాన్ని దారుణంగా దెబ్బతీసి తాను నిజంగానే ఎందుకూ పనికిరానిదానినని నమ్మడం మొదలుపెడుతుంది. మాటలతో హింసించడంలో బెదిరింపులు సర్వసామాన్యం. చంపేస్తానని, పిల్లల్ని చంపేస్తానని తీవ్రంగా మాటలతో బెదిరించడం మాటల హింసకిందకు వస్తుంది.

**మానసిక / భావోద్రేక హింస :** మనస్సును, భావాలను గాయపరచడం మానసిక హింస కిందకు వస్తుంది. ఇంట్లోని వస్తువుల్ని, ఆమెకిష్టమైన వస్తువుల్ని, ధ్వంసం చేయడం, మనసును మెలిపెట్టే మాటలతో బాధపెట్టడం, గాయపరచడం, మనిషికి ముఖ్యావసరమైన తిండి, నిద్ర, నిత్యకృత్యాలు లేకుండా నిర్బంధించడం అలాగే తమ సంబంధంలోని మానసిక, భావోద్వేగపూరిత అంశాలను పురుషుడు దుర్వినియోగ చెయ్యడం మానసిక హింసగానే అర్థం చేసుకోవాలి.

**ఆర్థిక హింస :** అన్ని వనరులపైనా పురుషుడి నియంత్రణ వుంటుంది కాబట్టి స్త్రీలపై ఈ ఆర్థిక హింస అమలవుతుంది. స్త్రీలని ఉద్యోగం చెయ్యొద్దనడం, ఒకవేళ చేస్తే జీతాన్ని లాక్కోవడం, తన అవసరాలకు సైతం భర్తని ప్రాధేయపడాల్సి రావడం వుంటుంది. ఆర్థిక హింసలో.. డబ్బుని వినియోగించడం పైనా, అది లభించడంపైనా నియంత్రణ వుంటుంది.

**సాంఘిక హింస :** పరాయివాళ్ళ ఎదుట మాటలతో హింసించడం, చిన్నబుచ్చటం, వేళాకోళం చెయ్యడం, బరువుగురించి, వేషం గురించి లైంగికత్వం గురించి, తెలివితేటల గురించి విమర్శించడం, చిన్నబుచ్చడం సాంఘిక హింసే. ఆమె బయటికి వెళ్ళినప్పుడు కాపలా కాయడం, స్నేహితులతో కలవనీయకపోవడం, భార్య స్నేహితుల్నీ, కుటుంబ సభ్యుల్ని ఇంటికి రానివ్వకపోవడం, ఆమెని ఇంట్లో బంధించడం లాంటివి. స్త్రీల కార్యకాలాపాలనీ, వాళ్లు బయటకు వెళ్ళడాన్నీ, వారి స్నేహాల్ని నియంత్రించడాన్నీ ఆమె గడిపే ప్రతీ క్షణానికి జవాబుదారీ కావాలనడం లాంటివి సాంఘికహింస కిందకు వస్తాయి. భార్యని సాంఘిక హింస పెట్టే పురుషుడు బయట నుంచి ఇంట్లోకి, ఇంట్లోంచి బయటకు సమాచార ప్రసరణ లేకుండా నియంత్రించి భార్యను బయటకు వెళ్ళకుండా చేస్తాడు.

ఇలా కుటుంబ హింస ఎన్నో రూపాల్లో స్త్రీల మీద అమలవుతూ వుంటుంది. చాలా సందర్భాల్లో ఈ రకరకాల కుటుంబ హింసలు పరస్పర సంబంధం కల్గి వుంటాయి. శారీరక హింసతో పాటు, మాటలతో హింసించడం, మానసికంగా కుంగిపోయేలా హింసించడం, సామాజిక హింసతో ఆమె కదలికల్ని కట్టడి చేయడంతోపాటు లైంగిక అత్యాచారం నిత్యకృత్యంగా వుంటుంది. ఈ నిత్యహింస స్త్రీల మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. తనను తాను తక్కువ చేసుకోవడం, మానసిక వ్యధ, ఒత్తిడి, భాగస్వామితో తిట్లు, తన్నులు పడినప్పటికీ వాటిని తక్కువ చేసి చూపించడం, పీడకలలు, నిద్రలేమి, భాగస్వామి ప్రవర్తనకు భయపడుతూ బతకడం జరుగుతుంటుంది.

ప్రతి స్త్రీ రోజువారీ జీవితంలో శారీరక హింసతోపాటు ఇన్ని రకాల హింసల్ని భరిస్తూ వుంటుందనేది ఒక నగ్నసత్యం. భర్త కొట్టడమనేది ఎరుగని స్త్రీ సైతం మానసిక, లైంగిక తదితర హింసల్ని అనుభవిస్తూ వుండి వుండొచ్చు. వీటిని కుటుంబ హింసగా అర్థం చేసుకోలేకపోవచ్చు. ఇండియన్ పీనల్ కోడ్ సెక్షన్ 498ఎ అమలులోకి వచ్చే వరకు భారతదేశంలో భార్యను కొట్టడం, హింసించడం లాంటి నేరాలకు శిక్షలుగానీ, బాధితురాలికి రక్షణ కల్పించే చట్టంగాని లేదు. అయితే వున్న కొన్ని చట్టాలను ఉపయోగించుకొని కంప్లయింట్ చేయొచ్చు. భర్త భార్యను కొట్టినా, తీవ్రంగా గాయపరిచినా పోలీసులకు క్రిమినల్ కంప్లయింట్ ఇవ్వొచ్చు. అలాగే హింసించడం, దౌర్జన్యానికి పాల్పడడం లాంటి వాటికి కూడా 498 కింద ఫిర్యాదు చేయ్యొచ్చు. అయితే సాధారణంగా పోలీసులు కుటుంబ తగాదాల్లో కలగచేసుకోరు. భర్త కొట్టాడని పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళిన స్త్రీని హేళన చేయడం, నిరుత్సాహపరచడం, మొగుడిగా కొట్టాడు సర్దుకుపొమ్మని సలహాలు ఇవ్వడం చేస్తారు. అంతే కాదు మేము శాంతిభద్రతల సమస్యలతో, బందోబస్తులతో తలముక్కలుగా వుంటే, భర్త కొట్టాడు లాంటి చిల్లర సమస్యలు మా దగ్గరకు తేవొద్దు అని హెచ్చరించే సందర్భాలూ వుంటాయి. పోలీసువ్యవస్థకీ జండర్ సెన్సెటివిటీ లేకపోవడం వల్ల రోజువారీ జీవితంలో స్త్రీలు ఎదుర్కొనే దారుణ హింసలు వారికి పట్టవు. పట్టినా పట్టించుకోనితనమే ఎక్కువగా వుంటుంది.

**ఐపిసి సెక్షన్ 498ఎ :** కుటుంబ హింసకు సంబంధించి చట్టంలో రెండు ముఖ్యమైన సవరణలు వచ్చాయి. ఒకటి ఐపిసి 498ఎ, రెండోది 304బి. వీటికి ముందు అంటే 1983 వరకు కుటుంబ హింసకు సంబంధించిన చట్టమేదీ లేదు. హత్య, ఆత్మహత్యకు ప్రేరేపించడం లాంటివన్నీ సాధారణ సెక్షన్ల కిందే భర్తల్ని విచారించేవారు. అయితే 498ఎ సెక్షన్ నిర్వచనానికి వాడిన భాష విస్తృతార్థానికి అవకాశమిచ్చింది. అంతకు ముందు హింసకు కారణం వరకట్నం మాత్రమేనని భావించడం వల్ల, 498 ఏ నిర్వచనం దీని విస్తృతిని పెంచింది. ఈ సెక్షన్ వరకట్న వేధింపులు, ఆత్మహత్యలకు ఉద్దేశించిందే అయినా క్రూరత్వాన్ని నిర్వచించడంలో వరకట్నం అనే పదం వాడలేదు. అయితే మానసిక వేధింపుల్ని కూడ పరిగణలోకి తీసుకుంది. పోలీసులు, న్యాయవ్యవస్థ ఈ సెక్షన్‌ని

సక్రమంగా అర్థం చేసుకుని, ఆచరించి వుంటే హింసించే భర్తలని కొంత వరకయినా అదుపు చేసి వుండేది. మొదట్లో పోలీసులు వరకట్న వేధింపులు జోడించి మాత్రమే ఈ సెక్షన్ కింద కేసు నమోదు చేసేవాళ్ళు. అందువల్ల వున్నవీ లేనివీ కల్పించి కేసుకి జోడించడం, అవసరమున్నా లేకపోయినా, హింస జరిగిన ప్రదేశంలో వున్నా లేకపోయినా కుటుంబ సభ్యులందరి మీద కేసులు పెట్టడం వల్ల కేసు బలహీనమై కోర్టులు కొట్టేయడం జరుగుతూ వచ్చింది. ఈ స్థితికి కారణం పోలీసులు, న్యాయవాదులేగాని బాధిత స్త్రీలు మాత్రం కాదు. తమ వద్దకు వచ్చిన బాధిత స్త్రీలకు సరైన సలహాలివ్వకుండా గుత్తగంపగా 498ఎ కింద కుటుంబ సభ్యులందరి మీదా కేసు పెట్టేలా తప్పుడు సలహాలు ఇవ్వడం వల్ల స్త్రీలు ఈ సెక్షన్‌ని దుర్వినియోగం చేస్తున్నరనే గగ్గోలు మొదలైంది. న్యాయపరిజ్ఞానలేమి వల్ల స్త్రీలు పోలీసులు, లాయర్లు చెప్పినట్టు వినాల్సుంటుంది. అంతేకాదు కేసును మధ్యలోనే ఉపసంహరించుకుంటారనే అపవాదు కూడా స్త్రీలు మోస్తున్నారు. కేసులు మధ్యలో ఉపసంహరించుకోవడానికి అనేక కారణాలుంటాయి. వాళ్ళ జీవితాల్లోని సంక్షిష్టతలు, నివాసహక్కు లేకపోవడం లాంటి అనేక కారణలుండొచ్చు స్త్రీలు 498ఎని దుర్వినియోగం చేస్తున్నారనడం నిజం కాదు. ఈప్రచారం చేసే వాళ్ళ హింసలోమగ్గుతున్న స్త్రీలకున్న చిరుదీపంలాంటి ఈ సెక్షన్‌ను రద్దు చేయించాలనే ఉద్దేశ్యంతోనే చేస్తున్నారు కానీ దీని వెనుక పోలీసులు, లాయర్ల స్వార్థపూరితమైన పాత్రని అర్థం చేసుకోలేకపోతున్నారు.

**గృహహింస లేక కుటుంబహింస నుండి మహిళలకు రక్షణ చట్టం - 2005**

గృహ హింసకు సంబంధించి 498ఎ తర్వాత వచ్చిన ప్రధానమైన చట్టం ఇది. ఈ కొత్త చట్టం అనేక ఉద్యమాల తర్వాత అక్టోబరు 26, 2002లో అమలులోకి వచ్చింది. మొట్టమొదటిసారి ఈ చట్టం "హింసలేని ఇళ్ళు స్త్రీల హక్కు" అని గుర్తించింది. అంతేకాదు కుటుంబ హింసకు సమగ్రమైన నిర్వచనం ఇవ్వడంతో బాటు తొలిసారిగా స్త్రీలకు నివాస హక్కును కూడా ధృవీకరించింది. అలాగే స్త్రీల మానవ హక్కుల్ని ఇంటిపరిధిలోకి తెచ్చిందికూడా ఈ చట్టమే. ఏ విధంగా చూసినా "గృహహింస నుండి మహిళలకు రక్షణ చట్టం 2005" ఎంతో విలువైంది, ఉపయోగమైంది. ఇంతవరకు స్త్రీల ఉద్యమం జండర్ పరమైన హింసను అంతమొందించడానికి క్రిమినల్ చట్టాలు కావాలని డిమాండ్ చేస్తూ వచ్చింది. అయితే ఈ క్రొత్త చట్టం సివిల్ చట్టంగా అవతరించింది. శిక్షలకు బదులు పరిహారం, వివిధ రిలీఫ్‌ల మీద దృష్టి పెట్టడం జరిగింది. అలాగని కుటుంబ హింసను ఎదుర్కోనడానికి క్రిమినల్ చట్టాల అవసరం లేదని కాదు. అందువల్లనే గృహహింసను తగ్గించడానికి సివిల్ చట్టం వచ్చినా 498ఎని రద్దుపరచకుండా వుంచడం జరిగింది. కొత్త చట్టంలో ఏముందో చూద్దాం.

ఈ చట్టంలో ఎన్నో విలువైన అంశాలున్నాయి. ముఖ్యంగా ఇది సివిల్ చట్టం. మొదటి స్టేజిలో పోలీసుల, న్యాయవాదుల పాత్ర అస్సలు లేదు. కోర్టు ఇచ్చిన రక్షణ ఉత్తర్వులు అమలుకాని పక్షంలోనే పోలీసుల రంగప్రవేశం ఉంటుంది. బాధిత మహిళే కాకుండా ఆమె పక్షాన ఎవరైనా రక్షణాధికారికి ఫిర్యాదు చేయవచ్చు. అన్నింటినీ మించి బాధితస్త్రీ నివాసహక్కుకు సంబంధించి ఈ చట్టం ఎంతో విలువైన ఉపశమనాన్ని కల్గించింది. నివాసహక్కు లేని కారణంగానే ఎక్కడికెళ్ళాలో దిక్కుతోచని స్థితిలోనే ఎంతోమంది స్త్రీలు కుటుంబ హింసను మౌనంగా భరిస్తుంటారు. నివాసహక్కు గురించి ఈ చట్టంలో ఏముందంటే "1. ప్రస్తుతం అమలులో వున్న మరే ఇతర చట్టంలోని ప్రమేయం లేకుండా, కుటుంబ సంబంధంలో ప్రతి మహిళకు, ఆ ఇంటిపై ఆమెకు హక్కు, టైటిల్, లబ్ధి, ప్రయోజనం ఉన్నా, లేకున్నా ఆ ఇంటిలో నివసించే హక్కు వుంది. 2. చట్టం నిర్దేశించిన ప్రకారం, బాధితురాలు ప్రతివాదిచే ఇంటి నుంచి, దానిలోని ఏ భాగం నుంచి కూడా గెంటివేయబడదు, మినహాయించబడకూడదు.

అలాగే ఈ చట్టం కుటుంబ హింస అంటే ఏమిటో చాలా విపులమైన విస్పష్టమైన నిర్వచనం ఇచ్చింది. ఈ చట్టం కింద ఈ కింది ఫలితాలను కలిగించే ప్రతివాది చర్యలేవైనా కుటుంబ హింస కిందకు వస్తాయి.

ఎ. బాధితురాలి ఆరోగ్యం, భద్రత, శరీరభాగం, సంక్షేమం, శారీరకంగా గానీ, మానసికంగా గానీ హాని లేదా గాయం కల్గించడం, లేదా అలా చేసేందుకు ఉద్యుక్తులు కావడం, భౌతిక, లైంగిక మాటలు, భావోద్వేగ, ఆర్థిక దుర్వినియోగం, లేదా

బి. చట్ట విరుద్ధంగా కట్నం, లేదా ఇతర ఆస్తి లేదా విలువైన వస్తువుల కోసం ఆమెను లేదా ఆమెకు సంబంధించిన వ్యక్తులను లొంగదీసుకోవడం కోసం ఆమెకు హాని చేయడం, వేధించడం, లేదా బెదిరించడం లేదా

సి. క్లాజ్ (ఎ) లేదా క్లాజ్ (బి) ఉదహరించిన ఏ విధంగానైనా భాధితురాలిని లేదా ఆమెకు సంబంధించిన వారిని బెదిరించడం లేదా

డి. బాధితురాలికి మరే ఇతర విధంగానైనా శారీరక, లేదా మానసిక గాయం లేదా హాని కలిగించడం -

ఇది ఈ చట్టం గృహ హింసకు ఇచ్చిన నిర్వచనం. మొట్టమొదటిసారిగా మానసిక హింసను కూడా హింసగా గుర్తించిన చట్టం ఇది. అలాగే శారీరక దుర్వినియోగం అంటే ఏమిటి? లైంగిక దుర్వినియోగం, మాటల, భావోద్రేక దుర్వినియోగం, ఆర్థిక దుర్వినియోగాల గురించి విస్తృతమైన నిర్వచనాలను ఇచ్చింది.

**ఈ చట్టం ఎలా పనిచేస్తుంది?**

ఇది సివిల్ చట్టం కాబట్టి పోలీసుల పాత్రలేదు. ఏదైనా ఒక కుటుంబంలో హింసా సంఘటనలు కొంతకాలంగా జరుగుతున్నా ప్రస్తుతం జరుగుతున్నా, జరిగే అవకాశాలున్నాయని భావించినా ఎవరైనా వ్యక్తి రక్షణాధికారికి సమాచారమందించవచ్చు. బాధిత స్త్రీ తనకు తానుగా ఫిర్యాదు చేయవచ్చు. ఫిర్యాదు అందుకున్న వారు చట్టంలోని వెసులుబాట్ల గురించి బాధిత స్త్రీకి వివరించాలి. తానున్న ఇంటి నుంచే ఫిర్యాదు ఇచ్చి నివాసహక్కు కోరవచ్చు. రక్షణ కోరవచ్చు. అక్కడుండడం ఇష్టం లేకపోతే షెల్టర్ హోమ్‌లో ఖచ్చితంగా ఆమెకు ఆశ్రయం కల్పించాలి. వైద్య సహాయం కోరితే విధిగా వైద్య సహాయం అందించాలి.

**రక్షణాధికారి విధులు :**

కుటుంబ హింస జరిగినట్లు ఫిర్యాదు అందగానే కుటుంబ సంఘటన నివేదిక తయారుచేసి మేజిస్ట్రేట్‌కి నివేదించాలి. బాధితురాలు కోరిన ఉపశమనాల ప్రకారం రక్షణ ఉత్తర్వుల జారీ కోసం మేజిస్ట్రేట్‌కి తగిన విధంగా దరఖాస్తు చెయ్యాలి. బాధితురాలు కోరితే సురక్షితమైన షెల్టర్ హోమ్‌లో ఆశ్రయం కల్పించడం, అవసరమైతే వైద్య సహాయమందించడం చెయ్యాలి.

**సేవలందించే సంస్థలు**

న్యాయ సహాయం, వైద్య, ఆర్థిక లేదా మరే ఇతరమైన చట్టబద్ధమైన మార్గాల ద్వారా మహిళల హక్కులు, ప్రయోజనాలను పరిరక్షించడం కోసం సొసైటీల రిజిస్ట్రేషన్ కింద రిజిష్టరైన స్వచ్ఛంద సంస్థలు సేవలందించేవారుగా రిజిష్టరు చేసుకోవచ్చు. బాధితురాలు కోరితే డి.ఐ.ఆర్ తయారు చేయడం, షెల్టర్ హోమ్‌లోఆశ్రయం కల్పించడం, వైద్య పరీక్షలు జరిపించడం లాంటివి సర్వీస్ పొవైడర్స్ చేయొచ్చు.

**న్యాయ సేవల అధికారి**

దరఖాస్తు కోర్టుకు అందిన మూడు రోజుల్లో మొదటివాదన వినాలి. 60 రోజుల్లో తీర్పు చెప్పాలి. గృహహింస జరిగినట్లుగా, ప్రాథమికంగా నమ్మిన తరువాత, మేజిస్ట్రేటు రక్షణ ఆదేశాలు జారీ చెయ్యాలి. ఈ ఆదేశాలలో ఆర్థిక, ఆరోగ్యపరమైన నష్టాల భర్తీ, పిల్లల పోషణ, ఇతర ఖర్చులు, ఏక మొత్తంగా కాని, లేక నెలనెలా చెల్లించినట్లుగానే మొదలైన అంశాలతో వుండవచ్చు. అలాగే కలిసి వుండే యింటిని బాధితురాలి నుండి లాగేసుకోకుండా, ఆమె స్వాధీనం నుండి, మరే ఇతర విధంగాను, బాధితురాలికి కలిసివున్న ఇంటిలో ఇబ్బందికి గురిచేయకుండా ప్రతివాదిని - ఆయనకు ఆ ఇంటిపై చట్టపరమైన, సమాన హక్కువున్నా లేకున్నా - నివారించాలి.

**పోలీసుల పాత్ర**

మేజిస్ట్రేట్ జారీ చేసిన రక్షణ ఉత్తర్వులను ప్రతివాది ఉల్లంఘిస్తే ఈ చట్టం కింద అది నేరం. అందుకు ఏడాది జైలు శిక్ష, ఇరవై వేల జరిమానా, లేదా రెండు

విధించవచ్చు. ఈ ఆదేశాలను అమలు చేయడంలో మాత్రమే పోలీసుల పాత్ర వుంటుంది.

మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే కుటుంబ / హింస నుండి మహిళలకు రక్షణ చట్టం ఎవరినీ శిక్షించదు. భాధిత మహిళకు రక్షణ కల్పించడానికి ఉద్దేశించిన చట్టమిది. నిందితులపై చర్యలు కావాలన్నా, చేసే ఆరోపణలు / అభియోగాలు కుటుంబంలోని మహిళపై అయితే, ఐపిసి సెక్షన్లు లేదా ఇతర చట్టాల కింద పోలీసులు కేసులు పెట్టాలి. ఈ చట్టంతో పాటుగా మరో చట్టం / ఐపిసి కింద ఒకేసారి కేసులు నడపొచ్చు. రక్షణ ఆదేశాలను ప్రతివాది ఉల్లంఘిస్తే క్రిమినల్ కేసు పెట్టి అరెస్టు చేస్తారు.

కుటుంబహింసనుండి మహిళలకు రక్షణ చట్టం క్రిమినల్ చట్టం కాకపోయినప్పటికీ, అరెస్టులు, జైళ్ళు లాంటివి మొదటి దశలో లేకపోయినప్పటికీ, ఈ చట్టం అమలులోకి రాగానే మగవాళ్ళ నుండి తీవ్ర నిరసన వ్యక్తమైంది. 498ఎతోనే చస్తున్నాం. మళ్ళీ ఇంకో చట్టమా అంటూ వ్యంగ్యాస్త్రాలు వేసిన వాళ్లు వున్నారు. స్త్రీ రక్షణ కోసం ప్రభుత్వం తెచ్చిన ప్రత్యేక చట్టాలను స్త్రీలు దుర్వినియోగం చేస్తున్నారని ఈ చట్టం పూర్తిస్థాయి వినియోగంలోకి రాకముందే గగ్గోలు మొదలైంది. వినియోగంలోకి రాని చట్టం దుర్వినియోగమెలా అవుతుందో వాళ్ళకే తెలియాలి. ఈ చట్టం పట్ల ఇంకా సరైన అవగాహన లేదు. ప్రభుత్వ ప్రచారం లేదు. రక్షణాధికారులంటే ఎవరో, వాళ్ళెక్కడుంటారో, దరఖాస్తు ఎలా పెట్టాలో కూడా చాలామందికి తెలియదు. ఎవరినీ శిక్షించే చట్టం కాకపోయినా పురుష సంఘాలంటూ ఏర్పడి ఈ ప్రత్యేక చట్టాలని రద్దు చేయాలని, స్త్రీలు తమని హింసిస్తున్నారని ఆందోళనలకు దిగుతున్నారు. వీళ్ళ ఒత్తిడికి తలొగ్గి, ఈ చట్టాన్ని సవరించాలనే ప్రయత్నం కూడా కేంద్ర స్త్రీ శిశు సంక్షేమ శాఖ ప్రయత్నించింది. అయితే దేశ వ్యాప్తంగా మహిళా సంఘాలు తీవ్ర నిరసనను వ్యక్తం చేయడంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు.

పురుష సంఘాల వాదన ప్రకారం స్త్రీలు భర్తల్ని హింసించే స్థాయికి చేరుకున్నారని ఓ క్షణం అనుకున్నా, మరోక్షణం విపరీతంగా పెరిగిన హింస, కుటుంబ హింసల గణాంకాలు చెంపపెట్టులా తగులుతాయి. ఏ పత్రిక తిప్పినా స్త్రీల అసహజ మరణాలు, వరకట్న హత్యలు, ఆత్మహత్యలు, గృహహింసకు పాల్పడే భర్తలు ఇవన్నీ అబద్ధమనుకోవాలా? నేషనల్ క్రైమ్స్ బ్యూరో రికార్డుల ప్రకారం వరకట్న మరణాలు పెరుగుతున్నాయి. నేషనల్ ఫ్యామిలీ హెల్త్ సర్వేలో, ఇంటిలోపల స్త్రీల మీద హింస ఎక్కువ అవుతోందని ప్రకటించారు. ఇన్నీ అధికారిక ప్రభుత్వ లెక్కలు. స్త్రీల ఉద్యమం ముందుకు తెచ్చిన లెక్కలు కాదు. ఒకవైపు స్త్రీల మీద రకరకాల హింసలు పెరిగిపోతుంటే చెదురుమదురుగా కొందరు వ్యక్తులకు జరిగే సంఘటనలను జనరలైజ్ చేసి స్త్రీలు గృహహింసకు పాల్పడుతున్నారనీ విష ప్రచారం చేయడం ఎంత వరకు సబబు? జూలై 25న ఢిల్లీలో జరిగిందిదే. స్త్రీల అంశాల పట్ల నిబద్ధతతో, స్త్రీల పట్ల హింస తగ్గాలని నిజాయితీగా నమ్మే కొందరు పురుషులను కలుపుకోవాలని, గృహహింస నిరోధక చట్టం అమలులో వీరి భాగస్వామ్యాన్ని తీసుకోవాలని రేణుకాచౌదరి ఏర్పాటు చేసిన సమావేశం మగ సంఘాల వారి అనవసర ఆందోళనలతో రసాబాస అయ్యింది. 498ఎ గృహహింస నిరోధక చట్టాన్ని రద్దు చేయాలనే డిమాండ్ చేసిన ఈ పురుషపుంగవులు ఈ సమాజంలోనే బతుకుతున్నారా అని ఆశ్చర్యం హిస్తుంది. ఇంత దుర్మార్గంగా వీళ్ళెలా వాదిస్తున్నారో అర్థం కాకుండా వుంది.

ఈ చట్టం అమలులోకి వచ్చి సంవత్సరం దాటిపోయింది. ఆంధ్రరాష్ట్రంలో ఎన్ని కేసులు నమోదు అయ్యాయో ఒకసారి చూద్దాం. 2006 అక్టోబరు నుండి 2007 ఆగష్టు వరకు వివిధ జిల్లాల్లో నమోదైన కేసులు. శ్రీకాకుళం10, విజయనగరం9, వైజాగ్ 32, పశ్చిమ గోదావరి జిల్లా34, తూర్పుగోదావరి జిల్లా 31, కృష్ణాజిల్లా 346, గుంటూరు 86, నెల్లూరు 34, చిత్తూరు 14, కడప 69, కర్నూలు 123, అనంతపూర్ 30, ప్రకాశం 52, ఆదిలాబాదు 21, నిజామాబాదు 27, కరీమ్‌నగర్ 42, ఖమ్మం 65, వరంగల్ 75, మహబూబ్‌నగర్ 19, నల్గొండ 15, మెదక్ 28, హైదరాబాద్ 130, రంగారెడ్డి 250.

అక్టోబరు 2007 నాటికి దేశవ్యాప్తంగా 10000 కేసులు ఈ చట్టం కింద నమోదయితే అత్యధికంగా నమోదైన రాష్ట్రం రాజస్తాన్ 3440కేసులతో ప్రథమ స్థానంలో వుంటే 1028 కేసులతో కేరళ రెండో స్థానంలో వుంది. 731 కేసులతో ఆంధ్రప్రదేశ్ మూడవస్థానంలో వుంది. మిగతా రాష్ట్రాలలో చాలా తక్కువ సంఖ్యలో గృహహింసకు సంబంధించిన కేసులు నమోదయ్యాయి. అంటే ఆయా రాష్ట్రాల్లో స్త్రీలు కుటుంబ హింసను ఎదుర్కోవడం లేదని దీని అర్థం కాదు. చాలా రాష్ట్రాల్లో ఈ చట్టం పూర్తిస్థాయిలో అమలులోకే రాలేదు. రక్షణాధికారుల నియమాకం జరగకపోవడం, కొత్త చట్టం మీద అవగాహన లేకపోవడం, ప్రభుత్వం ప్రచారం లేకపోవడం దీనికి కారణాలుగా చెప్పుకోవాలి.

వందకోట్ల జనాభావున్న దేశంలో సగమో, సగానికి తక్కువో స్త్రీలున్న దేశంలో, ప్రతి నిత్యం కుటుంబ హింసనెదుర్కొంటున్న నేపథ్యంలో సంవత్సరం కాలంలో పదివేల కేసులు, గృహహింస చట్టం కింద నమోదైతే, స్త్రీలు ఈ చట్టాన్ని దుర్వినియోగం చేస్తున్నారంటూ విషప్రచారం చేయడం ఎంత దారుణమో అందరూ గుర్తించాలి. ఇంకో ముఖ్య విషయం ఏమంటే ఇది నమోదు మాత్రమే. ఎన్ని కేసుల్లో న్యాయం దొరుకుతుందో ఎప్పటికి పరిష్కారమౌతాయో ఎవరికీ తెలియదు. మన సమాజంలో, మన కుటుంబాల్లో స్త్రీల మీద అమలవుతున్న హింస వాస్తవం. అభూత కల్పన కాదు. హింసలో మగ్గుతున్న స్త్రీలకి అపన్నహస్తం అందాంచాల్సిన బాధ్యత అందరిదీ. ముఖ్యంగా ప్రభుత్వానిది. స్త్రీల రక్షణ కోసం వచ్చిన కొత్త చట్టాన్ని పకడ్బందీగా అమలు చేస్తూ, స్త్రీలకు కావలసిన సపోర్ట్ సిస్టమ్స్‌ను అభివృద్ధి పరచాలి. ఈ పని చేయాల్సింది ప్రభుత్వమే.

**భూమిక హెల్ప్‌లైన్ :** సమస్యలో వున్న స్త్రీలకు సహాయ సహకారాలందించాలనే వుద్దేశ్యంతో 2006లో భూమిక హెల్ప్‌లైన్‌ను ప్రారంభించడం జరిగింది. ప్రభుత్వం నిర్వహించే హెల్ప్‌లైన్‌లు, కుటుంబ సలహా కేంద్రాలు వున్నాగానీ అవి సక్రమంగా పనిచేస్తున్న దాఖలాలు లేవు. 2006 మార్చి 8, అంతర్జాతీయ మహిళా దినం రోజున భూమిక హెల్ప్‌లైన్ ప్రారంభమైంది. సమస్యలనెదుర్కొనే స్త్రీలకు ఫోన్‌ద్వారా సమాచారమందించడం, సలహానివ్వడం, కౌన్సిలింగ్ ఇవ్వడం హెల్ప్‌లైన్ లక్ష్యాలుగా మేము పని చెయ్యడం మొదలుపెట్టాం. ఫోన్ ద్వారా ఏం సహాయం చేస్తారు? ఏం కష్టాలు తీరుస్తారనే హేళనని కూడా మేము మొదట్లో ఎదుర్కొన్నాం. అయితే ఈ రోజు భూమిక హెల్ప్‌లైన్ రాష్ట్రవ్యాప్తంగా కాకా ఇతర రాష్ట్రాల్లో, విదేశాల్లో సైతం బహుళ ప్రాచుర్యం పొందింది. వందలాది మహిళలు దీనిద్వారా తమ సమస్యలు పరిష్కరించుకున్నారు. రెండున్నర సంవత్సరాలలో దాదాపు 3000 కేసులు పరిష్కారమయ్యాయి. అంటే పరిష్కారాలు చేసుకునే దిశగా మేము ఆయా మహిళలకి సలహాలు, సమాచారం ఇవ్వగలిగాము.

**హెల్ప్‌లైన్ ఎలా పనిచేస్తుంది.**

ఉదయం 8గంటల నుండి రాత్రి 11గంటల వరకు హెల్ప్‌లైన్ పనిచేస్తుంది. ఉ॥8 గం॥ల నుండి మ॥2గం॥ల ఒక కౌన్సిలర్, మ2గం॥ల నుండి సా 8గం॥ల ఒక కౌన్సిలర్ ఫోన్ దగ్గర కూర్చుంటారు. సా8గం॥ నుండి రా 11గం॥ వరకు పార్ట్‌టైమ్ కౌన్సిలర్ వుంటారు. ఫోన్ చేసిన వారి అవసరాన్ని బట్టి వారికి సలహా ఇవ్వడం, సమాచారం అందించడం, ధైర్యం చెప్పడం వుంటుంది. హెల్ప్‌లైన్‌లో అవసరమైన సమాచారం, ముఖ్యమైన ఫోన్ నెంబర్లు సేకరించి పెట్టాము. ఆంధ్రదేశంలోని మారుమూల పోలీస్ స్టేషన్‌కి కూడా మాట్లాడి, అక్కడి స్త్రీలకి సహాయం అందేలా చెయ్యగలం. కలెక్టర్లు, ఎస్.పిలు, పోలీస్ స్టేషన్లు, ఎమ్ఆర్‌వో, ఎమ్.డి.వో, మేజిస్ట్రేటు ఫోన్‌నెంబర్లతో సహా ఆ సమాచారమంతా హెల్ప్‌లైన్‌లో వుంది. రక్షణాధికారులు, షెల్టర్ హోమ్‌లు, సర్వీస్ ప్రొవైడర్లు, మాజీ స్త్రీట్లు, లీగల్ సర్వీసెస్ అథారిటీ సెక్రటరీలు, పారాలీగల్ వాలంటీర్లు వీళ్ళందరితో ప్రత్యక్ష సంబంధాలున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా లాయర్ల నెట్‌వర్క్ వుంది. హెల్ప్‌లైన్‌తో కలిసి పనిచేయడానికి ముందుకొచ్చిన వందమంది పైనే వాలంటీర్ల రాష్ట్రమంతా వున్నారు. అవసరమైతే ఆయాప్రాంతాల్లోని స్త్రీలకు అత్యవసర

☆ మానం పద్మజ

వ్యాసం

# అసమ సమాజంలో స్త్రీ సాధికారత సాధ్యమేనా?

అక్షర జ్ఞానంతో నిమిత్తం లేకుండా అన్ని వర్గాల వారిని ప్రభావితం చేయగల అంశాల్లో రాజకీయాలతో పాటు మీడియాకు కూడా ప్రత్యేకమైన స్థానం ఉంది. అటువంటి మీడియా స్త్రీల సమస్యల పట్ల కొన్ని సందర్భాల్లో సానుకూలంగా స్పందించినప్పటికీ అత్యధిక విషయాల్లో స్త్రీల స్థితిగతులు, సమస్యల పట్ల వ్యతిరేక సంకేతాల్ని అందచేస్తోంది.

నిరంతర వార్తా ప్రసారాల పేరుతో జరుగుతున్న హంగామా అంతా ఇంతా కాదు. వార్తలు చూస్తూ వుండగా హఠాత్తుగా రాష్ట్ర రాజధానిలో ఏదో ఒక పబ్‌లో జరిగిన ప్రైవేటు పార్టీని ప్రసారం చేయడం జరుగుతుంది. కెమెరాని అక్కడ స్త్రీల వస్త్రధారణ మీద, చేతిలో వున్న వైన్‌గ్లాసుల మీద 'జూమ్' చేసి చూపించటం జరుగుతుంది. ఈ మొత్తాన్ని సామాజిక విశ్లేషణతో మనకు అందచేయాలనుకుంటున్నారా అంటే ఆ లక్ష్యమేదో వున్నట్లు కనపడదు. ఏ ప్రముఖ దినపత్రికను తిరగేసినా వారివారి ప్రాధాన్యతల రీత్యా ప్రాంతీయ విభాగంలోనో ప్రధాన వార్తల్లోనో ఈ తరహా పార్టీల్నీ మరీ ముఖ్యంగా స్త్రీల చిత్రాల్ని ప్రముఖంగా ప్రచురించటం చూస్తూ వున్నాం.

దినపత్రికల్లో స్త్రీలతో రాయిస్తున్న సందర్భాల్లో కేవలం భావుకతకే పరిమితమై స్త్రీల మౌలిక సమస్యల జోలికి వెళ్ళని వాళ్ళను అత్యంత జాగ్రత్తతో ఎంపిక చేసుకోవడం జరుగుతుంది. మద్యపాన వ్యతిరేకత, మహిళా రిజర్వేషన్లు వంటి సమకాలీన సందర్భాల్లో తప్ప స్త్రీ సమస్యలకు, వ్యాసకర్తలకు ఎడిటోరియల్ పేజీల్లో స్థానమే వుండదు. బాధ్యతగా, సున్నితంగా స్పందించడం కంటే సంచలనాత్మకంగా వుండే ధోరణే దానికి కారణం.

విషయసేకరణకి, విజ్ఞానవికాసానికి తమ చుట్టూ వున్న సమాజం మీద కంటే మీడియా మీద ఆధారపడుతున్న మధ్యతరగతి మేధావుల సంఖ్య ఎక్కువగానే వుంటుంది. దాని వలన స్త్రీ పురుష అసమానత, లింగవివక్ష-వాటి భిన్న రూపాల మీద జరగాల్సిన చర్చ వినిమయ సంస్కృతిలో వస్తువుగా మారిన, అలాగే పాశ్చాత్యీకరణ చెందిన అతి కొద్దిమంది స్త్రీల వస్త్రధారణను పరిగణనలోకి తీసుకుని ప్రస్తుత సమాజంలోని స్త్రీల స్థితిగతుల్ని అంచనావేసే ఒక భావవాతావరణం నెలకొనివుంది. అది కనపడకుండా స్త్రీల మీద మానసిక ఒత్తిడిని కలుగచేస్తుంది.

సంస్కృతి సంప్రదాయాల బరువు బాధ్యతల్ని స్త్రీలే మోయాల్సిన పరిస్థితులు మన దేశంలోనే కాదు, అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాల్లోను మనం చూస్తున్నాం. ఇటీవల నైజీరియా ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ అక్కడి స్త్రీల వస్త్రధారణ మీద ఒక బిల్లు ప్రవేశపెట్టడం దానికొక ఉదాహరణ.

---

సర్వీసులందించడానికి వీరు తయారుగా వుంటారు. మరో ముఖ్యమైన అంశమేమిటంటే 108 ఇ.మ్.ఆర్.ఐ నుండి హెల్ప్‌లైన్‌కి కేసుల్ని అనుసంధానించడం. వీరికున్న టెలీకాన్ఫరెన్స్ సౌకర్యం ద్వారా ఎంతోమంది స్త్రీలను ప్రాణాపాయస్థితి నుండి కాపాడిన సందర్భాలు కూడా వున్నాయి. ఆ కేసులన్నీవివరంగా రాయడం ఇక్కడకు కుదరదు. అంతేకాదు మేము ఏ ఒక్కకేసు వివరాలను బయటకుచెప్పలేదు. ఒకవేళ కొన్ని ఉదాహరణలిచ్చినా పేర్లు, ప్రాంతాలు మార్చియిచ్చాం. బాధిత స్త్రీల వివరాలు గోప్యంగా వుంచడం మా ముఖ్య బాధ్యతగా మేము ప్రకటించుకున్నాం.

నా ఉద్దేశ్యంలో ఇలాంటి హెల్ప్‌లైన్‌ల అవసరం ఎంతో వుంది. దుఃఖంలో వున్న వాళ్ళని వినడం వల్లనే చాలావరకు వాళ్ళ బాధ తగ్గుతుంది. మనం ఇచ్చే సమాచారం, సలహా వారి జీవిత గమనాన్నే మార్చవచ్చు. హెల్ప్‌లైన్‌కి వచ్చే కేసుల్లో 80% కుటుంబ హింసకు సంబంధించినవే వుంటాయి. కుటుంబహింస విపరీతంగా పెరిగిపోయిన నేపథ్యంలో ఇలాంటి హెల్ప్‌లైన్‌లు మరిన్ని నెలకొల్పితే బావుంటుంది.

ఇక గృహహింస నుండి స్త్రీలకు రక్షణ కల్పించే చట్టం స్త్రీలకు ఎంతో మేలు చేసేదిగా వుంది. ప్రభుత్వం ఈ చట్టాన్ని పకడ్బందీగా అమలుచేయాలి. అందుకోసం రక్షణాధికార్ల నియామకం పూర్తిస్థాయిలో జరగాలి. అలాగే స్త్రీల హక్కుల పట్ల అవగాహన వున్న వాళ్ళను, సామాజిక విషయాల్లో ప్రవేశం వున్నవాళ్ళను నియమిస్తే ఉపయోగంగా వుంటుంది. అలాగే స్త్రీలను రక్షణాధికారులుగా నియమించాలి. అలాగే తగినన్ని కోర్టులు, మేజిస్ట్రేట్‌లు నియామకం జరగాలి. కోర్టుల్లో ఎన్నో కేసులు పెండింగ్‌లో వుంటాయి. స్త్రీలకు న్యాయం చేకూర్చేలా ప్రయత్నాలు జరగాలంటే కోర్టులు, మేజిస్ట్రేట్‌ల సంఖ్య పెంచాలి. ముఖ్యంగా మహిళా మేజిస్ట్రేట్ల సంఖ్య పెరగాలి. షెల్టర్ హోమ్‌ల సంఖ్య పెంచడం అవసరం. వీటిల్లో సదుపాయాలి కల్పన, నియంత్రణ బాధ్యతల్ని మండల మహిళా సమాఖ్యకు, జిల్లా మహిళా సమాఖ్యాలకు అప్పగించాలి. అలాగే సర్వీస్ ప్రొవైడర్స్‌ని కూడా రిజిష్టర్ చేసుకొనేలా ప్రోత్సహించాలి. ఈ చట్టం అమలుకోసం కావలసిన వనరులు, బడ్జెట్ కేటాయింపులు చిత్తశుద్ధితో చేయాలి. అంతే కాదు ఈ చట్టం అమలు కోసం పనిచేసేవారందరికి జండర్ సెన్సిటివిటీకి సంబంధించిన, చట్టాలకు సంబంధించిన శిక్షణ ఇవ్వాలి.

అన్నింటినీ మించి ఈ చట్టం గురించి పెద్ద ఎత్తున ప్రచార కార్యక్రమం చేపట్టాలి. హెచ్ఐవి ఎయిడ్స్‌తో చనిపోయే వారికన్నా గృహహింసలో చనిపోతున్న స్త్రీల సంఖ్య ఎన్నో రెట్లు ఎక్కువ. మరి దానికంత ప్రచారం నిర్వహించే ప్రభుత్వం కుటుంబ హింసకు వ్యతిరేకంగా ఎందుకు ప్రచారం నిర్వహించదు. ఒక గ్రామీణ కార్యకర్త చెప్పినట్లు ఇక్కడ కూడా స్త్రీల పట్ల వివక్షేనా? ఆమె ఏమందంటే "ఎయిడ్స్ వచ్చి చస్తున్నది మగాళ్ళు కదా! గృహహింసలో చస్తున్నది ఆడోళ్ళం కదా! అందుకే ప్రభుత్వం ఎయిడ్స్ ప్రచారానికి కోట్లు ఖర్చుపెడ్తది. మనం చస్తే వాళ్ళకెందుకు పడ్తది?" ఎంతటి నగ్న సత్యమిది. చదువురాని గ్రామీణ స్త్రీ నోటి వెంబడి ఎంత విశ్లేషణాత్మకమైన విమర్శ వచ్చిందో చూస్తే ప్రభుత్వానికి అర్థమైతే బాగుండు.

ఇంతవరకు కుటుంబహింస నిర్మూలన కోసం వున్న చట్టాలు, సహాయాలు గురించి చాలా విపులమైన చర్చే చేసాము. అయితే చట్టాల వల్లనే ఈ హింస తగ్గుతుందని నేను అనుకోవడం లేదు. చట్టాల పని చట్టాలది, హింస దారి హింసదే. సమాజంలో ఎన్నో మార్పులొస్తున్నాయి. శాస్త్ర, సాంకేతిక, ఐటి రంగాల్లో విప్లవాత్మక మార్పులొస్తున్నాయి. స్త్రీలు బాగా చదువుకుని, పెద్ద పెద్దహోదాల్లో రాణిస్తున్నారు. పురుషులకేమీ తీసిపోకుండా ఆర్జనాపరులవుతున్నారు. అపరిమితమైన తెలివి తేటల్ని ప్రదర్శిస్తున్నారు. స్త్రీలు మారుతున్నారు. మారనిది పురుషుల మనస్తత్వమే. స్త్రీల పట్ల వారి దృక్పథంలో కావలసినంత మార్పు రావడం లేదు. భార్యంటే సహచరిలా కాకుండా అమ్మకి కోడలు, ఇంటికి ఇల్లాలు, పిల్లలకి తల్లి లాగా ఆలోచిస్తున్నారు. తనతో సమానంగా పుట్టి, తనంత చదివి, తనంత సంపాదిస్తున్న స్త్రీని కూడా తనతో సమానురాలుగా చూసే విశాలదృష్టి కొరవడడమే కుటుంబ హింసకి దారితీస్తున్నది. మీడియా కూడా జెండర్ సెన్సిటివిటి లేకుండా ప్రవర్తించడం అగ్నికి ఆజ్యం పోస్తున్నట్లుగా వుంది.

చివరగా, కుటుంబహింసలో మగ్గుతున్న స్త్రీలకు అసరాగా వచ్చిన చట్టాన్ని చిత్తశుద్ధితో నిజాయితీగా అమలు చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ, మహిళలు కూడా తమని తాము సంస్కరించుకునే బాధ్యతను పురుషులు తమ భుజస్కంధాల మీద వేసుకోవాల్సిందిగా కోరుతున్నాను. పూర్తి వినియోగంలోకి రాని చట్టాన్ని దుర్వినియోగం చేస్తున్నారని స్త్రీలు కుటుంబహింసకి పాల్పడుతున్నారని అనవసరపు, అసంబద్ధ రగడలకు దిగకుండా హింసలేని సమాజం కోసం, పురుషులు పాటుపడాలని, హింస తమ జీవితాలను ప్రభావితం చేస్తుందనే ఎరుకతో ప్రవర్తించాలని పురుషుల్ని కోరుతూ హింసలేని కుటుంబం, సమాజం స్త్రీల హక్కుని నినదిస్తూ ముగిస్తున్నాను.

*

దినపత్రికల్లో అంతగా ప్రాధాన్యమివ్వకుండా విశేషణాలు తప్పితే విశ్లేషణలే మాత్రం లేకుండా ప్రచురించే నేరవార్తలు చదివితే ఈరోజుకి ఇంకా స్త్రీలు ఎదుర్కోంటున్న సమస్యలు మనకు అవగతమౌతాయి. చిన్న పిల్లల మానభంగాలు, లింగనిర్ధారణ పరీక్షలు, కట్నపు చావులు, అనుమానంతో హత్యలు, ప్రేమోన్మాదుల దాడులు వంటివి తగ్గుముఖం పట్టకపోగా పెరగటం గమనార్హం.

సామాజికవసరాలలో భాగంగా విద్యా ఉద్యోగ రంగాల్లో స్త్రీల సంఖ్య పెరిగింది. కానీ ఆ స్థాయి మార్పు స్త్రీల వ్యక్తిగత విషయంగా భావించబడుతున్న కుటుంబంధాలలో, పని విభజనలో, సంప్రదాయాలలో మతాచారాలలో అంతగా మనకు కనపడదు. చదువుల్లో బాలికల ఉత్తీర్ణత శాతం ఎక్కువగా వుంటుంది. కీలకమైన పదవుల్ని మినహాయిస్తే పూర్వంతో పోల్చుకుంటే ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య పెరిగింది. ఇదొక పార్శ్వం అయితే ఈరోజుకి గ్రామాలలో వుండే పరిమిత వనరులు, సాంఘిక ఆచారాలు, కట్టుబాట్లు కుటుంబ ఆర్థిక పరిస్థితి అవేవి బాలురతో పోల్చుకుంటే బాలికల విద్యను ప్రతికూలంగా ప్రభావితం చేసే అంశాలే! 2005 - 2006 సంవత్సరంలో పదోతరగతి లోపు బడిని మానేసే బాలికలశాతం 65.20 గా వుంది. అలాగే 2001 జనాభా లెక్కల ప్రకారం గ్రామీణ ప్రాంతాల్లో డిగ్రీ వరకు చదివిన పురుషులు, స్త్రీల నిష్పత్తి 80-20 గా వుంది. అదే పట్టణ ప్రాంతాల్లో తీసుకుంటే ఇది 68-32 గా వుంది. అలాగా పాఠశాల్లో నమోదవుతున్న బాలికల సంఖ్య కూడా తక్కువగానే వుంటుంది.

ఈ మధ్య పెళ్ళిసంబంధాలు కుదిర్చే సమయంలో మనం తరుచుగా వింటున్నమాట 'ఆడపిల్లకి కోరికలు ఎక్కువయిపోయాయి - మగపిల్లలకి సంబంధాలు వెతకటం కష్టంగా వుంటుంది' అన్నమాట. విద్య,ఉద్యోగాలు ఇచ్చే ఆత్మవిశ్వాసం కొద్దిగా సడలిన స్త్రీని అణచివుంచే భావజాలం, సమాజంలో మారుతున్న వస్తువిలువలు, సుఖవాదం దీనిలో పార్శ్వంగా అర్థం చేసుకోవచ్చు. అలాగే మనకు అందుబాటులోకి వచ్చిన శాస్త్రసాంకేతిక పరిజ్ఞానంతో లింగనిర్ధారణలు ఆడశిశు మరణాల రేటులో మాత్రం బాగానే అభివృద్ధి సాధించామని చెప్పుకోవచ్చు. 1961వ సంవత్సరములో ప్రతి వెయ్యిమంది పురుషులకి 981గా వున్న స్త్రీల సంఖ్య తగ్గుతూ వచ్చి 2001వ సంవత్సరానికి 978గా వుంది. అవసరానికంటే తక్కువ ఉత్పత్తి వున్నప్పుడు సహజంగా విలువ పెరుగుతుంది కదా!

ఇక చదువు కోసమో, ఉద్యోగం కోసమో గడపదాటి కాలు బయటకు పెడితే మనకు ఎదురయ్యేదంతా పురుష ప్రపంచమే? పల్లెటూళ్లే కాదు, ప్రధాననగరాల్లో సైతం స్త్రీలకు భద్రత లేదన్నది సామాజిక సర్వేల్లో బయటపడేతున్న అంశమే!.

మానభంగాలు, అశ్లీలత, హింసాత్మకప్రేమలు మగవారి అధికార స్వభావానికి వ్యక్తీరణలు. ప్రేమ, సహచర్యం, పరస్పరాంగీకారం, ఎంచుకునే స్వేచ్ఛ, సున్నితత్వం అనేవి వాటిల్లో కాగడా వేసి వెతికినా కనపడవు. ఎంచుకునే స్వేచ్ఛ అనేవి పురుషుడి గుత్తాధిపత్యం. అతడు మనుసుపడితే ఆ స్త్రీకి వేరే ఆలోచన, అవకాశం లేని అనివార్యతలోని నెట్టివేయటం జరుగుతుంది. అందుకు భిన్నంగా జరిగితే మాత్రం దెబ్బతిన్న అహం తన ఆధిపత్యాన్ని నిరూపంచుకోవటానికి హింసను ఆయుధంగా మలుచుకుంటుంది.

ఐనా మానభంగాల విషయానికొస్తే వాటిమీద చర్చ అనివార్యంగా స్త్రీల వస్త్రధారణతో ముగుస్తుంది. స్త్రీ పురుషులెవరైనా అసభ్యతను తావులేని వస్త్రధారణ కలిగివుండటమనేవి అందరూ ఆమోదించే విషయమే అయినప్పటికీ మానభంగాల మీద చర్చల్లో వ్యూహాత్మాకంగా దాన్ని ముందుకు తీసుకురావటం జరుగుతుంది. అయితే గమనించాల్సిన విషయం ఏమిటంటే ఎక్కువగా మానభంగాలకి గురయ్యేది గ్రామీణప్రాంత సాధారణస్త్రీలే! ఇందులో ముక్కుపచ్చలారని బాలికల నుంచి ముదుసలి వరకు వుంటారు.

కొద్ది రోజుల క్రితం ఒక జాతీయ వార్తా ఛానల్‌లో స్త్రీల లైంగికత మీద కొద్దిమంది స్త్రీవాద మేధావులతో చర్చాగోష్టి నిర్వహించటం జరిగింది. దానికి ఒక పాశ్చాత్య నృత్యకళాకారిణిని కూడా ఆహ్వానించటం జరిగింది. అర్ధనగ్ననృత్యాలపై ప్రశ్నించినప్పుడు ఆమె అది తన లైంగికతను వ్యక్తం చేసే స్వేచ్ఛగా సమాధానం ఇచ్చారు. అక్కడున్న మేధావుల్లో ఎక్కువమంది దాన్ని ఆమోదించటం జరిగింది.ఆమె చేసే అశ్లీలనృత్యాలు వ్యక్తగతం లైంగిక స్వేచ్ఛ లేక వినిమయ వస్తువైన స్త్రీ లైంగికతా! అనే అంశం పక్కనపెడితే ఈరోజుకి అక్రమ సంబంధాల అనుమానంతో భార్యను కడతేర్చే భర్తల నేరవార్తలు లేని దినపత్రిక కనపడదు. వివిధ సామాజిక సాంస్కృతిక నేపథ్యాల నుంచి వచ్చిన కుటుంబాల్లో వుండే వ్యక్తీకరణ తేడాలు మినహా స్త్రీ లైంగికత అనేవి పూర్తిగా పురుషుడి కనుసన్నల్లో వుంటుందనేవి ఈనాటి సామాజిక వాస్తవం.

సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఇటీవల ఒక కేసులో తీర్పు ఇస్తూ హిందూ వివాహ చట్టం చాలా లోపభూయిష్టంగా వుందని అభిప్రాయ పడటం జరిగింది ఎందుకంటే భర్త అనివార్య కారణంగా భార్యకు విడాకులు తీసుకునే అవకాశం కల్పించటం ద్వారా వివాహాలు విచ్ఛిన్నమయి విడాకులు పెరిగిపోతున్నాయనేది వారి అలవి కాని బాధ. ఆ అవకాశం కూడా లేకుండా పకడ్బందీగా చట్టాలు రూపొందాలి అనేది వారి అభిప్రాయం. ఐ.పి.సి.494 ప్రకారం వివాహ బంధంలో వున్న ఒక స్త్రీతో పర పురుషుడు లైంగిక సంబంధం కలిగివుండటమనేది నేరం. కానీ అందుకు ఆమె భర్త కనుక అంగీకరిస్తే మాత్రం అది నేరం కాదు. ఇక్కడ భార్య భర్త వ్యక్తిగత ఆస్తి అనేదే కాకుండా వ్యక్తిగా ఒక స్త్రీ జ్ఞానం, విచక్షణ, వ్యక్తిత్వం వంటి వాటిమీద చట్టాలు చేసేవారికి గానీ వాటికి భాష్యం చెప్పేవారికి గానీ ఏమాత్రం విలువ లేదన్నది స్పష్టం అవుతుంది. పరస్పర నమ్మకం, విశ్వాసం మీదే ఏ బంధమైనా నిలుస్తుంది. ఆ బంధానికి చట్టబద్ధమైన రక్షణలు కూడా మనం ఏర్పరుచుకోవచ్చు. కానీ స్త్రీని ఒక స్వతంత్ర్య వ్యక్తిగానే పరిగణించని శాసనాలు మనకు ఏమేరకు ఉపయోగపడతాయన్నది ఆలోచించాల్సిన విషయం! వివాహం, విడాకులు, వైవాహికేతర సంబంధాలు వంటి విషయాలు ఆయా మతాల ప్రభావం నుంచి బయటపడి స్త్రీ పురుష సమానత్వం ప్రాతిపదికగా నిర్ణయించేకాలం ఎప్పటికి వస్తుందో!

మతాన్ని ఇప్పటి సమాజం అంతే వినమ్రంగా శిరసావహిస్తుందా అంటే అదెక్కడా కనపడదు. మతం నిర్దేశించే ధర్మ ప్రవర్తనా జీవన సరళి ఈరోజు ఎక్కడా కనపడదు. చేసే పాపాలన్నీ చేస్తూ వాటిని ప్రక్షాళన చేసే కర్మకాండగా రాజకీయ వ్యూహంగా మాత్రమే మతం మనం ముందు మిగిలున్నది. సమాజంలో స్త్రీ శ్రమను దోచుకోవటానికి సడలించిన మత నియమాలు ఆమె మీద ఆధిపత్యం చెలాయించకలిగి వ్యక్తిగత విషయాల్లో మాత్రం బహు అనుసరణీయమూ శిరోధార్యమూ అవుతున్నాయి.

ఇక ఇంటిపని అనేది ఈ రోజుకీ స్త్రీలను పీల్చి పిప్పి చేస్తున్న మరొక ప్రధాన అంశం. స్త్రీ శక్తి సామర్థ్యాలు, సృజనాత్మకత, ప్రతిభాపాటవాలన్నీ ఇంటిపనిలోనే లుప్తమైపోతున్నాయి. పూర్వకాలంతో పోలిస్తే అందుబాటులోకి వచ్చిన గృహోపకరణాలు, పట్టణీకరణవల్ల, తగ్గిన పిల్లల సంఖ్య, ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నతతో స్త్రీల పనిభారం తగ్గిందనే మధ్య తరగతి మేధావులు చాలమంది వున్నారు. కనిపడేస్తే పెరిగే గంపెడు పిల్లలు ఇప్పుడు లేకపోయినప్పటికీ వున్న ఒకళ్ళిద్దరు పిల్లలకే పూర్తి సమయం వెచ్చించాల్సిన మానసిక సామాజికవసరాలు ప్రస్తుతం నెలకొనివున్నాయి. ఇంటి బయటి విషయాలన్నింటికి పూర్తిగా పురుషుడి మీదే ఆధారపడే పరిస్థితులు ఈరోజు వారికి కూడా ఇబ్బందిగా పరిణమించిన నేపథ్యంలో కుటుంబానికవసరమైన కొనుగోళ్ళు, కట్టవలసిన బిల్లులు, వైద్య సేవలు, పిల్లల చదువుసంధ్యలు, వారి సాంస్కృతిక వికాసం, వచ్చిపోయే బంధువులు, శుచిశుభ్రత, పోషక విలువలున్న రుచికరమైన ఆహారం సమకూర్చిపెట్టడంలో సాయానికి మరోమనిషి కూడా లేక స్త్రీ సతమత మౌతుందనేది వాస్తవం. కుటుంబ ఆర్థిక అవసరాల కోసం సామాజిక మార్పులకనుగుణంగా స్త్రీ శక్తిని వినియోగించుకోటానికి సిద్ధపడిన పురుషుడు ఇంటి పనిని పంచుకోవటమనేది తన కర్తవ్యంగా భావించటం లేదు. కుటుంబమనేది స్త్రీ పురుషులిరువురికీ ఆర్థిక, సామాజిక, మానసికావసం. కనుక

వ్యాసం ☆ కాత్యాయని

# స్త్రీవాద సాహిత్యం - దృక్పథ చర్చ

దాదాపుగా 1980లనించీ తెలుగుసాహిత్యంలో స్త్రీవాదం మొదలయిందనీ, 1990లనించీ అది స్పష్టమైన రూపం తీసుకుందనీ భావిస్తున్నాం. అంతర్జాతీయ మహిళా దశాబ్దం సందర్భంగా జరిగిన చర్చలూ, ఆంధ్రప్రదేశ్‌లో, స్త్రీశక్తి సంఘటన, ఫెమినిస్ట్ సర్కిల్‌లు కొంత ఫెమినిస్టు సాహిత్యాన్ని ప్రచురించటమూ జరిగిన తర్వాతి తెలుగు సాహిత్య చర్చల్లో ఫెమినిజం అనేమాట విస్తృతంగా చోటుచేసుకోసాగింది. ఆ తర్వాత ఫెమినిజానికి సమానార్థకంగా స్త్రీవాదం అనే మాటను వాడుతూ వచ్చారు. స్త్రీవాద సాహిత్యాన్ని గురించి చెలరేగిన వాగ్వివాదాలు తెలిసినవే.

తెలుగు స్త్రీవాద సాహిత్యాన్ని గురించి ఇప్పటికీ చాలా విస్తృతమైన చర్చలయితే జరిగాయి కాని స్త్రీవాద మంటే ఇదీ అని తెలుగు సాహిత్యం ఆధారంగా స్పష్టమైన నిర్వచనాన్ని ఇవ్వగల అవకాశాలు ఎంతవరకు వున్నాయనేది ఇంకా పరిశీలించాల్సిన అంశమే. 90లనుంచీ కొందరు రచయిత్రులు రాసిన సాహిత్యం ముఖ్యంగా కవిత్వంలో గతంలో కన్నా భిన్నమైన వస్తువులు ప్రవేశించాయి. అవేవస్తువులమీద గతంలో కూడా సాహిత్యం వచ్చివుండినా, దానికీ 90ల తర్వాతి కవిత్వంలోని వ్యక్తీకరణకూ స్పష్టమైన భేదాలున్నాయి. ఈ దశలో ఎంతోమంది రచయిత్రులు స్త్రీల శారీరక సమస్యలనూ, అనుభూతులనూ; స్త్రీ - పురుష సంబంధాల్లోని అంతరాలనూ, కుటుంబంలోని వాతావరణాన్నీ ఎలాంటి ఇన్‌హిబిషన్స్ లేకుండా స్వేచ్ఛగా మాట్లాడటం మొదలుపెట్టారు. స్థూలంగా ఈ సాహిత్యాన్నంతటినీ కలిపి 'స్త్రీవాద' సాహిత్యంగా పిలుస్తున్నారు.

ఐతే, తెలుగు స్త్రీవాద సాహిత్యంలో పాశ్చాత్యదేశాల ఫెమినిజంలోని వివిధ సైద్ధాంతిక దృక్పథాలనూ, రాజకీయ లక్ష్యాలను విడివిడిగా గుర్తించడం కష్టమే. స్థూల దృష్టిలో చూసినప్పుడు మార్క్సిస్టు, సోషలిస్టు, రాడికల్ స్త్రీవాద దృక్పథాలు తెలుగు స్త్రీవాద సాహిత్యంలో తరచుగా కనబడుతుంటాయి. ఆ రచయిత్రులందరూ ఆ దృక్పథాలను అధ్యయనం చేసి యీ రచనలు చేశారని కూడా చెప్పలేం. ఫలానా రచయిత్రులు నిర్దిష్టంగా ఫలానా ఫెమినిస్టు ధోరణికి చెందిన వాళ్ళనో, ఒక రచయిత్రి సాహిత్యంలో పూర్తిగా ఫలానా ధోరణి కనబడుతుందనో చూపించటమూ కష్టమే. ఇందుకు కారణం వివిధ సామాజిక, రాజకీయ ఉద్యమాల్లో స్త్రీలు పనిచెయ్యడమూ, వాటికి అనుబంధంగా మహిళా సంఘాలు ఏర్పడటమూ జరిగినట్టుగా ప్రత్యేకమైన ఫెమినిస్టు ఉద్యమాల చరిత్ర మనకు లేకపోవటమే. స్త్రీవాదాన్ని ఒక సైద్ధాంతిక దృక్పథంగా పరిచయం చేస్తూ కొందరు రచయిత్రులు రాసిన వ్యాసాలూ, స్త్రీవాద దృక్పథంతో గత వర్తమాన సాహిత్యాన్ని విశ్లేషిస్తూ కాత్యాయనీ విద్మహే, ఓల్గా వంటి వాళ్ళు రాసిన విమర్శలూ వచ్చాయి. కానీ సృజనాత్మక సాహిత్యంలోనికి నిర్దిష్టంగా ఫెమినిస్టు దృక్పథాన్ని అనువదించిన సందర్భాలు తక్కువనే చెప్పాలి. 'నీలిమేఘాలు' వంటి కవిత్వ సంకలనాల్లో జెండర్ విధానం, లైంగికత్వం, పునరుత్పత్తి, ఇంటి పని వంటి ఎన్నో విషయాలను స్త్రీల దృక్కోణం నుంచి నిర్వచించిన అద్భుతమైన కవితలున్నాయి. కానీ, ఆ కవిత్వాన్ని చూపించి తెలుగుసమాజంలో ఆ నిర్దిష్ట సందర్భంలో స్త్రీవాదపు స్వరూప స్వభావాలేమిటి? రాజకీయ లక్ష్యాలేమిటి? అని చెప్పగలగటం కష్టం. ఎందుకంటే ఒకే సమస్యను గురించి 'స్త్రీవాద' రచయిత్రుల్లో పరస్పర భిన్నమైన అభిప్రాయాలుండటమూ, ఒకే రచయిత్రి వేర్వేరు రచనల్లో వేర్వేరు అభిప్రాయాలను ప్రకటించటమూ కూడా తెలుగు సాహిత్యంలో కనబడుతుంది. స్త్రీలు ఏం రాసినా అది స్త్రీవాద సాహిత్యమేననే లేబుల్ అంటించడం ఆ ప్రచురణ కర్తలకు ఉపయోగపడిందేమో కానీ, సాహిత్య రంగంలో ఓ గందరగోళానికి దారితీసింది. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకూ స్త్రీవాద సాహిత్యమనే మాటకన్నా చేకూరి రామారావు అభిప్రాయపడినట్టు 'స్త్రీ చైతన్య' సాహిత్యమనే నిర్వచనమే విస్తృతార్థాన్ని ఇస్తుందనిపిస్తుంది.

స్త్రీవాద సాహిత్యం పేరిట కొంత సాహిత్యాన్ని అందరూ అంగీకరించటమంటూ జరిగాక దానిమీద వచ్చిన అనుకూల ప్రతికూల స్పందనలు కూడా కాస్త విచిత్రంగానే కనబడతాయి. పాశ్చాత్యదేశాల అనుకరణ సంస్కృతి ప్రభావంతోనే ఈ సాహిత్యం వచ్చిందని కొందరు విమర్శకులు భావిస్తే - స్త్రీవాద సాహిత్యాన్ని విప్లవ సాహిత్యంలో ఓ పాయగానే పరిగణించాలని కొందరు విప్లవ రచయితలు అప్పట్లో అభిప్రాయపడ్డారు. ఈ రెండు

---

ఇప్పుడున్న కుటుంబ రూపంలో ఇంటిపని విషయంలో మరొకసారి శ్రమవిభజన జరగాల్సిన అవసరం వుంది.

సారా ఉద్యమమైనా, నిత్యావసర వస్తువుల పంపిణీ సక్రమంగా జరుగకపోయినా, మౌలికవసరాలపైనా జరిగే పోరాటాల్లో ఈ రోజు స్త్రీలే ముందుంటున్నారు. ఇది వారిలో పెరిగిన చైతన్యం కంటే ఏ సామాజిక రుగ్మతకైనా స్త్రీలే సమిధలు కావటమనేది అసలైన అంశం. ఉదాహరణకి మద్యపానం గురించే తీసుకుంటే ఆరోగ్య సమస్యను అటుంచితే ఉన్నత వర్గాల్లో ఇది విలువలకి సంబంధించిన అంశమయితే దిగువస్థాయి వర్గాల్లో ఇది కుటుంబాన్ని కొల్లగొడుతున్న ఆర్థిక అంశం. ఈ కుటుంబాల్లో మూడొంతుల మంది మగవారి సంపాదన వారి వ్యసనాలకి ఖర్చు చేస్తుండగా స్త్రీ సంపాదన మీదే ఆ కుటుంబావసరాలు తీరుతుంటాయి. అందుకనే నిత్యావసరాలు కొరత మీదగానీ, నీటికోసం గానీ రాజకీయనాయకుల్ని నిలదీయటంలోగాని స్త్రీలు ముందుంటున్నారు. త్రాగునీటికోసం నెత్తిమీద దొంతర్లతో యోజనాల కొద్దీ జలయజ్ఞాలు చేస్తున్న స్త్రీలు మనకళ్ళముందు కనిపించే గ్రామీణచిత్రం.

లింగవివక్షతకు తావు లేకుండా ఇంతకు మునుపు స్థానంలేని సంస్థల్లో కూడా స్త్రీలకు అవకాశాలు కల్పించటం ఈ దశాబ్దపు పరిణామం. ఇది ఆహ్వానించదగినదే! అయితే అసమానతలున్న సమాజంలో సమానావకాశాలు కల్పిస్తే సరిపోతుందా అనేది మనం ఇక్కడ చూడాల్సి విషయం. ఉదాహరణకి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో మహిళలను కండక్టర్లుగా నియమించటం జరిగింది. ఉద్యోగ విధుల్లో భాగంగా ఆమె కనీసం ఎనిమిది గంటలు బయటే గడపాల్సి వస్తుంది. సమయం కాని సమయంలో విధులకు హాజరుకావటానికి సరి అయిన రక్షణ, రవాణాలేని సమాజంలో ఆమె ఇంటిలోని మగవారిపై ఆధారపడాల్సి వస్తుంది. ఇక ఆమె కాలకృత్యాలు నెలవారీ ఇబ్బందులు, గర్భధారణ, చిన్నపిల్లల సంరక్షణ వంటి సమస్యల్ని గుర్తించి సంస్థాగతమైన ఏర్పాట్లు వుంటాయా అంటే వుండవనే చెప్పాలి. స్త్రీ శ్రమ సామాజికావసరమై పునరుత్పత్తిని వ్యక్తిగత విషయంగా అర్థం చేసుకునే వాతావరణంలో మనం వున్నాం. కాబట్టే సమానావకాశాలు కల్పించటమే మహోద్భాగ్యంగా భావించటం జరుగుతుంది. ఎన్నో అసమానతలున్న సమాజంలో సమానావకాశాల కల్పన మాత్రమే సరిపోదు. సమస్యల్ని గుర్తించి ప్రత్యేక ఏర్పాట్లు జరిగినప్పుడే సమానవకాశాలు కల్పించిన వాళ్ళమవుతాం.

స్త్రీలు విద్య ఉద్యోగరంగాల్లో కొంత పురోగతి సాధించినా ప్రధానంగా అది పెట్టుబడిదారీ సమాజ అవసరంగా మాత్రమే అర్థంచేసుకోగలం. స్త్రీ శ్రమను సమాజానికి అవసరమైన సందర్భంలో మాత్రమే కుటుంబ పరిధిని దాటి ఉపయోగించుకోవడం జరుగుతుంది. అలాగే ఆర్థికంగా భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ విధానంలోకి మారుతున్న క్రమంలో అన్ని రంగాల వలెనే సంస్కృతీ, సంబంధాలు కూడా వాని ప్రభావానికి లోనవుతున్నాయి.

అయితే ఈ పరిణామం పూర్తయిందా? స్త్రీ సాధికారత సాధించినట్లేనా! సమస్యలు గుర్తింపులో ఈ పరిణామ క్రమంలోని వివిధ దశల్ని, భిన్న పార్శ్వాల్ని, అంతరాల్ని మనం గుర్తించగలుగుతున్నామా?

స్త్రీల స్థితిగతుల పట్ల సమస్యల పట్ల ఏకవాక్య తీర్మానాలు చేయగలమా? అంతర్జాతీయ ప్రమాణాన్ని చేరిన సూత్రీకరణలు అట్టడుగు స్థాయి స్త్రీ సమస్యని స్పృశించగలుగుతున్నాయా! అనేది బేరీజు వేసుకోవాల్సిన అవసరం ఉంది.*

ఇంటర్వ్యూ

# ప్రజాయుద్ధం దండకారణ్యంలో మహిళల్లోని సంకోచాన్ని పటాపంచలు చేసింది!

*కా. అనురాధ గాంధీ దండకారణ్య ఆదివాసీ మహిళా ఉద్యమాన్ని లోతుగా అధ్యయనం చేశారు. దాని కోసం ఆమె ఆ ప్రాంతాల్లో విస్తృత పర్యటనలు చేశారు. వర్గపోరాటంలో స్త్రీ విముక్తి అవగాహన వెలుగులో అక్కడ సాగుతున్న మహిళల పోరాటంపై 'పోరుమహిళ' పత్రిక ఆమెతో ముచ్చటించింది. ఆమె అభిప్రాయాలను ఇంటర్వ్యూగా అచ్చేసింది. 'పోరుమహిళ'కు పోరాట ప్రాంతాల్లో విస్తృత ఆదరణ ఉన్నప్పటికీ మైదాన ప్రాంతాల పాఠకులకు పెద్దగా అందుబాటులో లేదు. ఈ దృష్ట్యా కా.అనూరాధ గాంధీ (జానకి) ఇంటర్వ్యూను యథాతథంగా పాఠకులకు అందిస్తున్నాం - సం.*

(పట్టణోద్యమంలో పని చేస్తూ, ఆదివాసీ రైతాంగ ఉద్యమాన్ని పరిశీలించడం కోసం, స్వయంగా పాలుపంచుకోవడం కోసం దండకారణ్యానికి వచ్చిన కా. జానకిని ఈసారి పోరు మహిళ పాఠకులకు పరిచయం చేస్తున్నాం. కా.జానకి 1997 నుండి 2000 వరకు పార్టీ దక్షిణ బస్తర్ డివిజనల్ కమిటీ సభ్యురాలిగా గెరిల్లా దళాలకు ప్రత్యక్షంగా నాయకత్వం వహించింది. పట్టణోద్యమంలోనూ, ఆదివాసీ రైతాంగ ఉద్యమంలోనూ ఆమె అనుభవాల గురించి పోరుమహిళ యిటీవలే కా.జానకితో ముచ్చటించింది. ఆమెతో జరిపిన సంభాషణలోని ముఖ్యాంశాలు పాఠకులకందిస్తున్నాం. (సంపాదకులు)

**పోరుమహిళ : కామ్రేడ్ జానకీ, ముందుగా పట్టణాల్లో మహిళలు ఎదుర్కొంటున్న అణచివేత గురించి వివరిస్తారా?**

**కా. జానకి :** సాధారణంగా భారతీయ మహిళల పైన భూస్వామ్య, సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ, పితృస్వామిక అణచివేత అమలవుతున్నప్పటికీ, ఇది దేశంలోని వేర్వేరు ప్రాంతాల్లో గ్రామసీమల్లో, పట్టణాల్లో భిన్నమైన రూపాల్లో కన్పిస్తుంది. పట్టణాల్లో ఉండే కార్మిక వర్గ, మధ్య తరగతి మహిళలకు ప్రత్యేకమైన సమస్యలున్నాయి.

ముందుగా మనం కుటుంబం లోపలి సమస్యల్ని గనుక చూసినట్లయితే, పట్టణాల్లో కూడా మహిళలు భూస్వామ్య సంస్కృతిచే పీడనకు గురవుతున్నారు. ఈ సంస్కృతి పీడన కొంచెం తక్కువ తీవ్రంగా ఉన్నా కూడా అత్యధిక యువతులకు, మహిళలకు తమ జీవితానికి సంబంధించిన ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునే హక్కు కుటుంబం నుండి లభించదు. తమ కుటుంబం చేసే నిర్ణయానికి కట్టుబడి తమ మతానికి, కులానికి చెందిన వారినే పెళ్లాడాలనే వత్తిడి అవివాహిత యువతులపై ఉంటుంది. ఒకవేళ ఏ యువతయినా తన యిష్టప్రకారం వేరే కులానికి లేదా వేరే మతానికి చెందిన పురుషున్ని పెళ్లి చేసుకోవాలని కోరుకున్నట్లయితే ఆ యువతిపై తీవ్రమైన ఒత్తిడి అమలవుతుంది. కుటుంబ సభ్యుల నుండి తీవ్రమైన



వ్యతిరేకతను ఎదుర్కోవల్సి వస్తుంది. ఏ యువతైనా గడప దాటి ఉద్యోగం చేయాలన్నా తండ్రి, అన్న లేదా భర్త అనుమతి తీసుకోవాల్సి ఉంటుంది. కొన్ని కులాలు, మతాలకు చెందిన వాళ్లు (ఉదాహరణకు క్షత్రియులు, ముస్లింలు) తమ స్త్రీలు ఉద్యోగాలు చేయడాన్ని ఇష్టపడరు. అందుకే ఆర్థికపరమైన స్వాతంత్ర్యం కోసం కూడా మహిళలకు పోరాడడం అనివార్యమవుతుంది. పైగా పెట్టుబడిదారీ విలువలు బాగా వ్యాపించడంతో స్త్రీ-పురుష సంబంధాలు కూడా వ్యాపారమైపోయి మహిళలు తీవ్రమైన సమస్యల నెదుర్కొంటున్నారు. వివాహానికి ముందుగా, వివాహం తర్వాతా కట్నకానుకల రూపంలో భర్త కుటుంబానికి చెల్లించాల్సిన డబ్బూ, వస్తువులూ ఆడపిల్లలను కన్న కుటుంబాలకు పెద్ద సమస్యగా ఉంది. పైగా కట్నం కోసం శారీరకంగా, మానసికంగా యాతనలకు

---

అభిప్రాయాలనూ ఆధారాలలో రుజువు చెయ్యటం కష్టమే. ఎంతోకాలంగా సాహిత్యయోగ్యం కానివిగా భావించబడుతుండిన సమస్యలనూ, అనుభూతులనూ సాహిత్యంలోకి తీసుకురావటానికి ఫెమినిస్టు సిద్ధాంతం అందుబాటులోకి రావటమనేది ఒక ప్రేరణగా స్త్రీలకు ఉపయోగపడి వుండొచ్చు. కానీ ఇంటిపనిలో గుర్తింపులేని చాకిరినీ, శరీరధర్మాల పట్ల సమాజపు హీనదృష్టినీ, ప్రత్యుత్పత్తిలో స్త్రీ తీసుకోవాల్సిన రిస్కును గమనించని దృష్టిలోపాన్నీ వీటన్నింటినీ చెప్పటానికి పాశ్చాత్య వ్యామోహమనేది ఎందుకు అవసరమో విమర్శకులు పట్టించుకోరు. 'పైటను తగలెయ్యాలి' వంటి స్త్రీవాద కవితలు పూర్తిగా స్థానీయతకు లోబడినవే.

ఇక స్త్రీలపై సమాజంలో అమలవుతున్న వివక్షనూ, కుటుంబాల్లో జరుగుతున్న ప్రత్యక్షరూపంలోని భౌతికహింసనూ గుర్తించి ఎదిరించే చైతన్యాన్ని విప్లవోద్యమాలూ, హక్కుల ఉద్యమాలూ అందించాయన్నది వాస్తవమే. కానీ కుటుంబాల్లోని కనబడని హింసను గుర్తించడానికీ విప్లవరాజకీయ సంస్థల్లోనూ, రాజ్యవ్యతిరేక పోరాటాలు చెయ్యగల పురుషుల్లో కూడా పురుషాధిపత్యం వుండగలదని గుర్తించటానికీ గతంలోని విప్లవ సాహిత్యంలో చోటున్నదా? అనే ప్రశ్నకు జవాబు దొరకదు. ఈ ప్రశ్నను 1990ల తర్వాతి స్త్రీల సాహిత్యం బలంగా ముందుకు తెచ్చింది. ఒక దశలో విప్లవ సంస్థలపై తీవ్ర విమర్శలు చెయ్యటం స్త్రీవాద సాహిత్యంలో ఒక ప్రధాన ధోరణిగా రావటం కూడా కాకతాళీయం కాదు. విప్లవ సాహిత్యంలోని భాషలో, వ్యక్తీకరణల్లో పురుషాధిక్య ధోరణులున్న సందర్భాలను కూడా రచయిత్రులు ఎత్తి చూపారు. ఈ విమర్శ విప్లవ సాహిత్య విస్తృతికి దోహదం చేసిందని కూడా అంగీకరించాల్సి వుంటుంది. ఈ దృష్ట్యా స్త్రీవాద సాహిత్యాన్ని విప్లవ సాహిత్యంలో ఒక భాగంగాకన్నా ఒక అదనపు చేర్పుగా పరిగణించటం సమంజసంగా వుంటుంది. అలాగే మధ్యతరగతి, అగ్రవర్ణ స్త్రీలు ఎక్కువగా ప్రాతినిధ్యం వహించిన జనరల్ స్త్రీ వాద సాహిత్యంపై పరిమితులను విమర్శిస్తూ దళిత, ముస్లిం స్త్రీలురాసిన సాహిత్యం కూడా స్త్రీల సాహిత్య రంగాన్ని విస్తృతం చేసింది.

తెలుగు స్త్రీవాద సాహిత్యం నిర్దిష్టంగా ఫెమినిస్టు సిద్ధాంతాలను ప్రతి ఫలిస్తుందా, లేదా అనే విషయాన్ని అలావుంచితే కుటుంబాల నుండి, ఉద్యమాలదాకా అనేక నిర్మాణాల్లో వున్న వాతావరణాన్ని తమదైన దృష్టితో పునర్నిర్వచించే అవకాశాన్ని కోరుకుంటున్న స్త్రీలకు ఈ సందర్భం గొంతుకనిచ్చింది. తద్వారా తెలుగు సాహిత్యానికి ఒక కొత్త దృక్పథం లభించింది.

*

గురిచేయడమనేది దాదాపు అన్ని సముదాయాల్లోనూ సాధారణ విషయమైంది. భార్య జీవితాన్ని కేవలం డబ్బు, బంగారంతో తూకం వేయగల్గినపుడు ఆమెను వాటికోసం హత్య చేయడం ఏమంత కష్టమైంది కాదు. నేడు పట్టణాల్లోని అనేక యిళ్లల్లో ఇలాంటి భయంకరమైన పరిస్థితి కనిపిస్తుంది. ప్రత్యేకించి గడిచిన 25-30 ఏళ్ల నుండి, కోడళ్ళి కాలబెట్టి చంపడమనే ఒక కొత్త రకమైన నేరం వునికిలోకి వచ్చిన దేశం, మొత్తం ప్రపంచంలో బహుశా భారతదేశం ఒక్కటే కావచ్చు.

గమనించాల్సిన మరో విషయమేమిటంటే, పట్టణాల్లో మధ్య తరగతి, కార్మికవర్గానికి చెందిన మహిళల్లో ఒక భాగానికి గడపదాటి ఉద్యోగం చేసే అవకాశం దొరుకదు. వాళ్ల సమయమంతా కుటుంబ పనుల్లో, ఇంటి పనుల్లో గడచిపోతుంటుంది. దీని ఫలితంగా వాళ్లు ఇతరులపై ఆధారపడుతూ జీవిస్తుంటారు. సామాజికంగా వాళ్లు భర్తలపైన్నే ఆధారపడుతారు. అందుకే వాళ్లు స్వతంత్రించి ఏదయినా చేయడానికి పూనుకోరు. బయట తిరగాలన్నా, గడప దాటాలన్నా వారిపై ఎన్నో ఆంక్షలుంటాయి. ఇక ఈ మహిళల్లో తమ పిల్లల చదువుపై శ్రద్ధ తీసుకునే వాళ్ల దినచర్యయితే యంత్రం లాగానే వుంటుంది. ఆమె పనంతా భర్త ఉద్యోగం, పిల్లల చదువు, ట్యూషన్లకు పంపడం మొదలయిన వాటి చుట్టే తిరుగుతుంది.

పట్టణాల్లోని కార్మిక వర్గం జీవితాలు చాలా దయనీయమైన స్థితిలో ఉంటాయి. ఉండడానికి ఇండ్లు దొరక్కపోవడమనే సమస్య చాలా తీవ్రంగా వుండడం ఇందుకు ప్రధాన కారణం. పేదలకు ఖాళీ స్థలాల్లో చట్టవ్యతిరేకంగా ఇండ్లు వేసుకోవాల్సి ఉంటుంది. అనేకులు రోడ్ల పక్కన, రైల్వే లైన్ల పక్కన, మురికి కాల్వల పక్కన (కాల్వలపైన కూడా) గుడిసెలు వేసుకుంటారు. ఇరుకైన స్థలాల్లో, రోడ్ల పక్కన వందలాది కుటుంబాలు గుడిసెలు వేసుకొని ఉంటాయి. స్నానం చేయడానికి ప్రత్యేకంగా బాత్రూం కట్టుకోవడం కోసం కొద్దిగా స్థలంగానీ, వాకిలి అని పిలువగల ఒక అంగుళం జాగగానీ విడిగా వుండదు. పట్టణాలు పెద్దవయిన కొద్దీ పట్టణాల్లోని రోడ్ల పక్కనా, చిన్న చిన్న గుట్టలపైనా, రాళ్లతో కూడిన స్థలాల్లోనూ మురికివాడలు పెరిగిపోతుంటాయి. వాటిల్లో నీటి సౌకర్యం గానీ, మరుగుదొడ్లు గానీ వుండవు. కిక్కిరిసిన జనాలు, కలుషిత వాతావరణం, సౌకర్యాల లేమి - ఈ సమస్యలన్నింటినీ ఎదుర్కొంటూ మహిళలు తమ పనుల్ని నిర్వర్తిస్తూ వుంటారు. నీళ్లకోసం తన్నులాట అనేది ఒక సర్వసాధారణ దృశ్యం. ఇలాంటి బస్తీల్లో గూండాయిజం, గూండాల వేధింపులు మరో సమస్య. ఈ బస్తీల్ని చట్టవ్యతిరేకమయినవని పేర్కొంటూ మునిసిపాలిటి అధికారులు, ప్రభుత్వం మాటిమాటికి కూలగొట్టడం అన్నది వీటన్నింటినీ మించిన సమస్య. ఈ కూల్చివేత దాడుల్ని ఎదిరించడం సాధారణంగా మహిళల వంతే అవుతూ వుంటుంది. ఎందుకంటే పగలు అకస్మాత్తుగా బుల్డోజర్లను, పోలీసుల్ని వెంట తీసుకొని అధికారులు వచ్చేసరికి ఇంట్లో వుండేది స్త్రీలు, పిల్లలే. పెట్టుబడిదారీ ఆర్థిక జీవితంలో ఇంటిని కల్గివుండే హక్కును ప్రజల మౌలిక హక్కుల్లో ఒకటిగా గుర్తించలేదు.

పట్టణాల్లో మహిళలు గడపదాటి పని చేయడానికి అనేక అవకాశాలున్నాయి. కార్ఖానాల్లో, ఆఫీసుల్లో, స్కూళ్లలో, ఆసుపత్రుల్లో, దుకాణాల్లో పనులు దొరుకుతాయి. కానీ చాలా పనుల్లో మహిళలకు పురుషులతో సమానంగా వేతనాలివ్వరు, లేదా వేతనాలు ఎంత తక్కువగా వుంటాయంటే వాటితో ఇంటిని నడపడం వీలుకాదు. కార్మికవర్గ మహిళలు చాలా మంది నిర్మాణ పనుల్లో, సంతల్లో కాంట్రాక్టర్ల చేతి కింద పని చేస్తుంటారు. చాలా మంది మహిళలు ఇళ్లల్లో కూడా పని చేస్తారు. ఈ పనులన్నీ అసంఘటిత రంగం కిందకు వస్తాయి. పైగా వీటిని వేతనం గ్యారంటీ గాని ఉపాధి గ్యారంటీ గాని వుండదు. కాంట్రాక్టర్ల నుండి, ఏ పురుషుల కిందనయితే పని చేయాల్సి వుంటుందో వాళ్ల నుండి వేధింపులను కూడా ఎదుర్కోవల్సి వస్తుంది. ఇది రకరకాల రూపాల్లో అమలవుతుంది. కార్మికవర్గ మహిళలే కాకుండా, చదువుకున్న మధ్యతరగతి మహిళలు కూడా ఇలా వేధింపులనెదుర్కోవలసి వుంటుంది. వాళ్ల ఇష్ట ప్రకారం నడుచుకోకపోతే పని నుండి తొలగిస్తామని బెదిరించడం, పని ఇవ్వకపోవడం, ట్రాన్స్‌ఫర్ చేయడం, రికార్డులో చెడ్డ రిమార్కు రాయడం లాంటి వత్తిడులతో మహిళలను బాధిస్తారు. చాలా తక్కువ మంది మహిళలే ఇలాంటి సమస్యల్ని ఇతరులకు చెప్పుకోగల్గుతారు.

ఇటీవల పెద్ద నగరాల్లో సామ్రాజ్యవాదులు నడిపే ఎలెక్ట్రానిక్ పరిశ్రమలు బాగా పెంపొందాయి. వీటిలో చాలా వాటిల్లో అమ్మాయిలకు ఉద్యోగాలిస్తున్నారు. అయితే ఈ కంపెనీల్లో పని ఎక్కువ, వేతనం తక్కువ, సంఘటితపడడంపై నిషేధం వంటి సమస్యలున్నాయి. అందుకే యూనియన్ ఏర్పాటు చేసుకునే మౌలిక హక్కు కోసం కూడా పోరాడవల్సి వస్తున్నది.

ఇంతకు మునుపు బీడీలు తయారుచేయడం, అగరవత్తులు తయారుచేయడం వంటి కొన్ని పరిశ్రమలు ఇంటింటా నడిచేవి. ఇప్పుడు కొత్త పరిశ్రమలు కూడా తమ చాలా పనుల్ని ఇళ్లలోనే చేయిస్తున్నాయి. ఇంట్లో వుంటూనే ఎంతో కొంత సంపాదించవచ్చనే ఆలోచనతో పేద గృహిణులు ఇలాంటి పనుల్ని చేస్తున్నారు. ఇలాంటి పనుల్లో చాలా ఎక్కువ దోపిడీ జరుగుతోంది. ఇంట్లోని ఇతర సభ్యుల సహకారంతో పొద్దంతా పనిచేస్తే కూడా ఇరవై రూపాయలు సంపాదించడం కూడా కనాకష్టం. పేద మహిళల శ్రమశక్తికి అతి తక్కువ విలువ కట్టడం జరుగుతున్నది. తీవ్రమైన దోపిడీ అమలవుతున్నది అనేదే నేను చెప్పదలుచుకున్న విషయం.

చివరగా మరో విషయం. పట్టణ మహిళలపై సామ్రాజ్యవాద సంస్కృతి ప్రభావం చాలా ఎక్కువ. వాళ్ళ వస్తు వినిమయవాదానికి Consumerism ప్రభావితులవడమే కాదు, అది వాళ్లను పట్టి పీడిస్తున్నది. ఇది రోజురోజుకూ పెరిగిపోతున్నది. స్త్రీల పని సామర్థ్యం, జ్ఞానం, మానవీయ గుణాలను కాకుండా వాళ్ల అలంకరణలకు, అందానికి మాత్రమే ప్రాధాన్యతనివ్వడం జరుగుతున్నది. ఈ కారణంగా అత్యాచారాలు, వేధింపులు వంటి సమస్యలు పట్టణాల్లో అభద్రతా వాతావరణాన్ని సృష్టించాయి. దీని ఫలితంగా యువతులు, మహిళలు ఇల్లు దాటి బయటికి వెళ్లాలంటే అభద్రతా భావానికి లోనవుతున్నారు. పట్టణ జీవితంలో మహిళలు ఇలాంటి ఎన్నో సమస్యలతో సతమతమవుతూ వుంటారు. అయితే ఈ సమస్యలకు వ్యతిరేకంగా పోరాడే సంఘాలు ప్రస్తుతం చాలా తక్కువగా వున్నాయి.

**పోరుమహిళ:- మహిళా ఉద్యమంలో వేరువేరు ధోరణుల గురించి చెప్పండి.**

**కా. జానకి:** 1980కి కాస్త ముందూ, వెనకా దేశంలో, ప్రత్యేకించి నగరాల్లో స్పాంటేనియస్‌గా మహిళా ఉద్యమం పెల్లుబికింది. ఈ ఉద్యమం మహిళల్లో పెరుగుతున్న ప్రజాస్వామిక చైతన్యానికీ, పితృస్వామ్యానికి వ్యతిరేకంగా వికసిస్తున్న చైతన్యానికి ప్రతిబింబం. 1960 దశకం ఆఖరులో నక్సల్బరీ ఉద్యమం భారత అర్ధ భూస్వామ్య, అర్ధ వలస వ్యవస్థపై దెబ్బ వేసిన తర్వాత పెల్లుబికిన విద్యార్థి, కార్మిక ఉద్యమాలు, ఎమర్జెన్సీ, పాలకవర్గాల రాజకీయ, ఆర్థిక, సాంఘిక సంక్షోభం - వీటన్నింటి నేపధ్యంలోనే మహిళా ఉద్యమాలు పెల్లుబికాయి. అంతర్జాతీయంగా కూడా విద్యార్థి, మహిళా ఉద్యమాల ప్రభావం వుండింది. ఈ ఉద్యమాల్లో ఎక్కువగా విద్యార్థినులు, మధ్య తరగతి, ప్రొఫెషనల్ మహిళలు క్రియాశీలకంగా పాల్గొన్నారు. స్పాంటేనియస్‌గా లేచిన ఈ ప్రజాస్వామిక ఉద్యమం నుండే చిన్నవీ, పెద్దవీ అయిన సంఘాలు కూడా పుట్టాయి. కానీ గడచిన 20 ఏళ్లలో ఈ సంఘాల్లోనూ, వాటి రాజకీయ స్వరూపంలోనూ, మహిళా ఉద్యమంలోనూ అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. ఆ తర్వాత పట్టణ మధ్యతరగతి మహిళలపై ఆధారపడిన మహిళా విముక్తి ఉద్యమం వివిధ రాజకీయ, సైద్ధాంతిక స్రవంతులుగా విడిపోయింది. జాతుల పోరాటాలలో, ప్రత్యేకించి కాశ్మీర్‌లో తమ జాతి స్వయం నిర్ణయాధికారం కోసం సాగుతున్న పోరాటంలో మహిళల క్రియాశీల భాగస్వామ్యం గణనీయంగా పెరిగింది. పోలీసు, సైనిక బలగాలు అమలు చేస్తున్న అమానవీయమైన అత్యాచారాలను

వెలుగులోకి తేవడంలో మహిళలు ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నారు. మన పార్టీ నాయకత్వంలో గ్రామీణ ప్రాంతంలో, ప్రత్యేకించి దండకారణ్యం, ఉత్తర తెలంగాణాల్లో విప్లవకర మహిళా ఉద్యమం బాగా వృద్ధి చెందింది. ఆఖరుకు రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్, బిజెపిలు కూడా మహిళల శక్తిని గుర్తించి వారిలో తమ విషపూరిత రాజకీయాల్ని, కుళ్లిన సామాజిక విలువల్ని వ్యాపింపజేయడంపై శ్రద్ధ తీసుకుంటున్నాయి.

80వ దశకం ప్రారంభంలో స్పాంటేనియస్‌గా ఉద్యమిస్తూ బలాత్కారాలు, సతీ సహగమనం, వరకట్నపు హత్యలు వంటి సమస్యలపైకి మొత్తం దేశం దృష్టిని మళ్లించిన మధ్య తరగతి మహిళల్లో చాలా మంది ఉద్యమం నుండి వైదొలిగారు. అయితే వారిలో అనేకులు మహిళా సమస్యపై సిద్ధాంతవేత్తలు, అధ్యయనకర్తలుగా దేశంలోనూ, అంతర్జాతీయ స్థాయిలోనూ ఖ్యాతినార్జించారు. వారిలో చాలా మంది స్వచ్ఛంద సంస్థ (ఎన్.జి.వో) లను స్థాపించారు. మహిళా సమస్యలపై అధ్యయనానికి, మహిళల ఉద్ధరణ కార్యక్రమానికి వారికి అంతర్జాతీయ సంస్థల నుండి ఫండ్స్ దొరుకుతున్నాయి. అయితే వాళ్లది ఫెమినిస్టు దృక్పథం, ఫెమినిస్టు సిద్ధాంతం. ఇప్పుడు వాళ్లు ఫెమినిస్టు సిద్ధాంత ప్రచారకులయ్యారు - అంటే మహిళల ముఖ్యమైన సమస్య పితృస్వామ్యమే, కేవలం పితృస్వామ్యానికి వ్యతిరేకంగానే పోరాడాలి. అయితే, పితృస్వామ్యపు వేళ్లు వర్గ సమాజంలో వున్నాయి. అన్ని సామాజిక వ్యవస్థలోనూ దోపిడీదారులే దాని పోషకులు. అంటే భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం. అందువల్ల పితృస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడడమంటే ఈ దోపిడీ శక్తులకు వ్యతిరేకంగా పోరాడడమేననే విషయాన్ని గుర్తించడానికి వీళ్లు వ్యతిరేకులు. రాజకీయంగా ప్రభుత్వం పైన వత్తిడి తేవడం (lobbying) ద్వారా, కేవలం ప్రచారం ద్వారానే సమాజంలో మహిళల పరిస్థితిలో మార్పు తేగలమని వీళ్లు విశ్వసిస్తారు. శ్రామికవర్గ మహిళల క్రియాశీలత, వారిని సంఘటితం చేయడాన్ని వీరు అంత ముఖ్యమైనవిగా భావించరు. వాస్తవానికి నేడు ఈ ఫెమినిస్టు ప్రవాహం దేశంలోని బూర్జువా, ఉన్నత మధ్య తరగతి మహిళల వర్గ దృక్పథాన్ని, వర్గ ప్రయోజనాల్ని ప్రతిబింబిస్తోంది.

సిపిఐ, సిపిఎం, లిబరేషన్ వంటి రివిజనిస్టు పార్టీల మహిళా సంఘాలు కూడా కొన్ని పట్టణాల్లో క్రియాశీలంగా పని చేస్తున్నాయి. అవి సామాజిక, రాజకీయ సమస్యలపై మహిళా ఉద్యమాలను నడుపుతాయి. మహిళల పీడనతో పాటుగా అధిక ధరలు వంటి సమస్యలపై మహిళల ఊరేగింపులు, ధర్నాలు నిర్వహిస్తాయి. ఇవి ఫెమినిస్టు ప్రవాహానికి భిన్నమైనవి. ఎందుకంటే అవి కేవలం పితృస్వామ్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటానికి ప్రాధాన్యతనివ్వవు. అయితే ఇవి పూర్తిగా సంస్కరణవాద సంఘాలే. ఎందుకంటే ఇవి తమ రివిజనిస్టు రాజకీయాల కారణంగా మహిళా విముక్తి సమస్యను విప్లవంతో జోడించకుండా, ఇదే సామాజిక వ్యవస్థ చట్రంలో ప్రభుత్వాన్ని మార్చి పరిస్థితిని మెరుగు పర్చగలమని నమ్ముతూ పని చేస్తున్నాయి. ఫలితంగా వీళ్ల డిమాండ్లు, వీళ్ల కార్యక్రమాలు ప్రస్తుతం ఉనికిలోనున్న వ్యవస్థ పరిధిలోనే కుదించబడతాయి. ఉదాహరణకు గత 2,3 సంవత్సరాలుగా వీళ్లు తమ కార్యక్రమాలన్నింటినీ పార్లమెంటులో మహిళలకు 33 శాతం రిజర్వేషన్ హక్కును సాధించడం పైన్నే కేంద్రీకరించారు. నిజానికి ఈ అవినీతిమయమైన పార్లమెంటరీ వ్యవస్థ పైన సాధారణ ప్రజానీకానికి ఏనాడో నమ్మకం పోయింది. పార్లమెంటుకు ఎవరు ఎన్నికయినా దోపిడీ పాలక వర్గాలకే సేవ చేస్తారే తప్ప మహిళల హక్కుల కోసం లేదా పేద ప్రజల హక్కుల కోసం కాదన్న విషయం కూడా తేలిపోయింది.

మార్క్సిస్టు విశ్లేషణపై ఆధారపడి, మహిళలపై అమలవుతున్న దోపిడీ, పీడనలకు మూలాల్ని వర్గ సమాజంలో చూస్తూ, మహిళా విముక్తికీ, సామాజిక విప్లవానికీ గల సంబంధాన్ని గుర్తించిన మహిళా సంఘాలు దేశంలోని కొన్ని పట్టణాల్లో క్రియాశీలంగా పని చేస్తున్నాయి. గత దశాబ్ద కాలంగా ఇలాంటి సంఘాలు విద్యార్థినుల్లో, ఉద్యోగినుల్లో, శ్రామిక మహిళల్లో పని చేస్తున్నాయి. ప్రత్యేకించి కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో ఇవి బాగా పని చేస్తున్నాయి. ఇవి మహిళల అణచివేత పైనా, ఇతర సమస్యలపైనా ఉద్యమాలు నడపడమే గాకుండా, మహిళల్లో తమ హక్కుల గురించి, తమపై సాగుతున్న దోపిడీ, పీడనల గురించి విస్తృతమైన ప్రచారం చేస్తున్నాయి.

హిందూ మతతత్వ శక్తులు కూడా మహిళల్లో పని చేయడమనేది ప్రజాస్వామిక, విప్లవ మహిళా సంఘాలకు ఆందోళన కల్గించే విషయం. వాళ్లు పాశ్చాత్య సంస్కృతిని వ్యతిరేకించే పేరుతో పురాతన భూస్వామ్య విలువల్ని పునఃస్థాపిస్తున్నారు. హిందూ సాంప్రదాయాలు, భారత మాత పేరుతో మహిళల్లో పెరుగుతున్న చైతన్యాన్ని అణచివేస్తున్నారు. అంతేకాదు, మతపరమైన మైనారిటీలకు వ్యతిరేకంగా వాళ్లలో విషపూరిత దుష్ప్రచారం కావిస్తున్నారు. నారీశక్తి పేరిట వాళ్లకు సైనిక శిక్షణను కూడా ఇస్తున్నారు.

సంక్షిప్తంగా చెప్పాలంటే, దేశ వ్యాపితంగా మహిళా ఉద్యమం వేర్వేరు సైద్ధాంతిక ప్రవాహాలుగా విడిపోయి వుంది. మనం వాటిని అధ్యయనం చేస్తూ, వాటిలోని తప్పుడు సైద్ధాంతిక ధోరణులకు వ్యతిరేకంగా పోరాడుతూ బలమైన మహిళా ఉద్యమాన్ని నిర్మించాలి.

**పోరుమహిళ: విప్లవకర మహిళా ఉద్యమం గురించి బయట ఏ మేరకు తెలుసు? దాని ప్రభావం ఎంత?**

**కా.జానకి:** దండకారణ్యంలో గత దశాబ్ద కాలంగా పెల్లుబుకుతున్న ఆదివాసి మహిళా ఉద్యమానికి సమకాలీన భారత మహిళా ఉద్యమ చరిత్రలో చాల ప్రాముఖ్యత ఉంది. దేశంలో కాశ్మీర్ మహిళల క్రియాశీలత, చొరవ మిగతా అన్ని ప్రాంతాల మహిళలకన్నా చాలా ఎక్కువ. సైన్యం అమలు చేస్తున్న క్రూరమైన నిర్బంధాన్ని ఎదిరిస్తూ, అన్ని రకాల అత్యాచారాలను వ్యతిరేకిస్తూ వేలాది సంఖ్యలో మహిళలు వీధుల్లోకి వస్తున్నారు. కాశ్మీర్ మహిళల రాజకీయ క్రియాశీలత తర్వాత దండకారణ్య ఆదివాసీ రైతాంగ మహిళలే రాజకీయంగా, సామాజికంగా క్రియాశీల పాత్ర పోషిస్తున్నారు. వాళ్లు గ్రామ గ్రామాన విస్తృతంగా సంఘటితమై వున్నారు. వాళ్లు గోండు ఆదివాసీ సమాజం లోపల గల పురాతన పితృస్వామిక ఆచారాలను వ్యతిరేకిస్తున్నారు. వాళ్లు దోపిడీ ప్రభుత్వానికి, దాని సైన్యానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటంలో, రాజకీయ క్యాంపెయిన్లలో పాల్గొంటున్నారు. ఇది క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన సాధించిన ఒక పెద్ద విజయం.

కానీ చింతించాల్సిన విషయమేమిటంటే, కెఎఎంఎస్ విస్తృతి, దాని కార్యకలాపాల గురించి చాలా తక్కువ సమాచారమే బయట అందుబాటులో వుంది. మిగతా రాష్ట్రాల్లోని భాకపా (మా -లె)(పీపుల్స్‌వార్) సభ్యులకూ, సానుభూతిపరులకూ తెల్సింది చాలా తక్కువ. పార్టీ వైపు నుండి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. పాట్నా సెమినార్ కోసం రాసిన పేపర్ (ఇది హిందీలోనూ, తెలుగులోనూ అచ్చయింది). మహిళా అమరులపై ప్రచురించిన పుస్తకం, కొన్ని కథలు - కథానికలు ప్రచారానికి తోడ్పడినాయి. కానీ ఈ విప్లవ మహిళా ఉద్యమం గురించిన సమాచారం రెగ్యులర్‌గా బయటికి వెళ్లడం లేదు. మీ పత్రిక 'పోరు మహిళ' కూడా బయట అరుదుగానే కనిపిస్తుంది. పోరాట ప్రాంతానికి బయట కూడా ఈ పత్రికను పంపిణీ చేయడం కోసం ప్లాన్ చేయాల్సిన అవసరం వుంది.

అయినప్పటికీ, బయటి ప్రజాస్వామిక, విప్లవ సంఘాలకు చెందినవాళ్లకు ఎంత తక్కువ సమాచారమే ఉన్నప్పటికీ వాళ్లు బాగా ఉత్సాహపడుతున్నారు. ఆదివాసీ మహిళలు ప్రదర్శిస్తున్న ధైర్యసాహసాలకు, పట్టుదలకు వాళ్లు ప్రభావితులవుతున్నారు. కెఎఎంఎస్ గురించీ, దాని కార్యకలాపాల గురించీ విస్తృతమైన ప్రచారం చాలా అవసరం. తద్వారా మహిళా సమస్యపై విప్లవ పార్టీల వైఖరి గురించి ప్రభుత్వ సంస్థలు చేస్తున్న దుష్ప్రచారానికి తగిన జవాబివ్వగలం.

**పోరుమహిళ: డికెలో మీ అనుభవం గురించి చెబుతారా?**

**కా.జానకి:** డికెకు రావడానికి ముందర నేను ఇక్కడి మహిళా ఉద్యమం గురించిన

వ్యాసాలు, రిపోర్టులు చదివాను. అయినా ఈ ఉద్యమం ఇంత విస్తృతమయిందన్న అంచనా నాకు లేకుండె. అందుకే ఈ ఉద్యమ విస్తృతిని చూసి నేను చాలా సంతోషించా. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. కాలేజీల్లో తెగ సమాజాల గురించి చెప్పే పాఠాల్లో గోండు సమాజం చాలా ఉదారమైందని అంటుంటారు. కానీ ఇక్కడ మురియా, మాడియా, దొర్ల ప్రజలను దగ్గరగా పరిశీలించాక తెగ సమాజం కూడా ఎంత పితృస్వామికమైందో అర్థమైంది. మహిళల అణిచివేత సమస్యపై పితృస్వామికమైందో అర్థమైంది. మహిళల అణిచివేత సమస్యపై ఎంత లోతైన అధ్యయనం చేయడం అవసరమో అర్థమైంది. ఉత్పత్తి ప్రక్రియలో ఆదివాసీ రైతాంగ మహిళల భాగస్వామ్యం చాలా ఎక్కువైనప్పటికీ పితృస్వామ్యం వాళ్ల హక్కుల్ని హరించి వేసింది.

చైనాలో నూతన ప్రజాస్వామిక విప్లవ యుద్ధ కాలంలో మహిళా ఉద్యమం గురించి రాస్తూ అమెరికన్ రచయిత, విలేఖరి జాక్ బెల్డన్, "చైనా కమ్యూనిస్టు పార్టీకి విప్లవ విజయపు తాళంచెవి దొరికింది-వాళ్లు చైనా సమాజపు అత్యంత అణచివేతకు గురవుతున్న వర్గాన్ని గెల్చుకున్నారు" అని అన్నాడు. డికెలో మహిళా ఉద్యమాన్ని చూశాక నాకు బెల్డన్ మాటలే గుర్తుకొచ్చాయి. వాస్తవానికి చైనా విప్లవం తర్వాత, ఎక్కడయితే ప్రజాయుద్ధం సాగుతుందో, ఎక్కడయితే నూతన ప్రజాస్వామిక విప్లవం కోసం భూస్వామ్య, దళారీ పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా సాయుధ పోరాటం నడుస్తుందో అక్కడే శ్రామిక వర్గ మహిళలు చాలా అధిక సంఖ్యలో - సమాజ విముక్తితో పాటుగా తమ స్వంత విముక్తి కోసం కూడా -క్రియాశీలంగా కదులుతారన్న విషయాన్ని నిరూపించింది డికెలోని విప్లవ పోరాటం. ప్రజాయుద్ధం మహిళల సంకోచాన్ని పటాపంచలు చేసింది. వాళ్ల శక్తిని ద్విగుణీకృతం చేసింది. మహిళా విముక్తికి బాటను చూపింది. మహిళల అణచివేతకూ, అర్ధభూస్వామ్య - అర్ధవలస వ్యవస్థకు సంబంధం వుంది; ఈ వ్యవస్థను అంతం చేసే పోరాటంతో పాటుగానే పితృస్వామ్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని ముందుకు తీసుకుపోగలమన్న మార్క్సిస్టు సిద్ధాంతం, డికెలో పార్టీ సాధించిన ఈ విజయం ద్వారా మరోసారి రుజువయింది.

ఎక్కడయితే పార్టీ ఒక క్రమ పద్ధతిలో మహిళల్లో పనిచేస్తున్నదో అక్కడ ప్రతి రాజకీయ కార్యక్రమంలో, ప్రతి ఉద్యమంలో మహిళల భాగస్వామ్యం కూడా ఎక్కువగా వుంది. 1998లో దక్షిణబస్తర్‌లో నెలకొన్న తీవ్రమైన కరువు కారణంగా చాలామంది - వీరిలో కెఎఎంఎస్ రేంజ్ కమిటీ సభ్యులు కూడా వున్నారు - కూలీ పనులకోసం ఆంధ్రకు వలస పోయినప్పటికీ, మేం మార్చ్ 8 సందర్భంగా మీటింగులు నిర్వహించినప్పుడు ఒక్క కబురు పంపగానే 700మంది మహిళలు ఒక చోట, 450 మంది మహిళలు మరోచోట జమయినారు. దీనికి ముందు కరువు సమస్యపై నిర్వహించిన ఊరేగింపులో వేలాది మహిళలు పాల్గొన్నారు. నేనున్న రోజుల్లో పిజిఎలో యువతులు పెద్దగా రిక్రూట్ అయ్యారు. కొన్ని సందర్భాల్లో యువకులకన్నా యువతులే ఎక్కువ సంఖ్యలో రిక్రూటయ్యారు. నన్ను బాగా ప్రభావితం చేసిన విషయమేమిటంటే దళాల్లో రిక్రూటయిన వివాహితులైన పురుషుల భార్యలు కూడా దళాల్లో చేరుతున్నారు. వారిలో ఎంతో మంది తమ చిన్నారి బిడ్డలను కూడా బంధువులకు అప్పజెప్పి సమాజ మార్పుకోసం సాగుతున్న ఈ గొప్ప ప్రజాయుద్ధంలో చేరిపోయి గెరిల్లా యోధులుగా మారుతున్నారు. ఇంకా, కొద్ది నెలల తర్వాతే భర్త పోలీసులతో జరిగిన పోరాటంలోనో, మరే ప్రమాదంలోనో అమరుడయినప్పటికీ, వెనుదిరుగకుండా ప్రజాయుద్ధాన్ని అంటిపెట్టుకొని దృఢంగా నిలబడ్డ మహిళా కామ్రేడ్లను నేను చాలా మందినే చూశాను. సాంప్రదాయ బద్ధమైన, విసుగు పుట్టించే, సంకుచితమైన కుటుంబ జీవితం నుండి బయటపడి, ప్రమాదాలతో నిండినదయినప్పటికీ ఈ కొత్త జీవితాన్నే వాళ్లు ఇష్టపడుతున్నారు. ఆ విధంగా వాళ్ల జీవితానికి, వాళ్ల ఉనికికి సార్థకత లభిస్తున్నది. శిక్షణ పొందుతూ కొత్త కొత్త బాధ్యతల్ని స్వీకరిస్తున్న చాలా మందినే నేను చూశాను.

గ్రామగ్రామాన కెఎఎంఎస్ యూనిట్లు నిర్మాణం కావడం, వాటి కమిటీలు ఎన్నికవడం, రేంజ్ కాన్ఫరెన్సులలో రేంజ్ కమిటీలు ఎన్నికవడం, యూనిట్‌ని సభ్యురాళ్లను ప్రచార క్యాంపెయిన్ల కోసం ఊరూరు పంపించడం, బంద్ లేదా ఇతర నిరసన చర్యల్లో వాళ్లు పాలుపంచుకోవడం, వారికి సైనిక శిక్షణనివ్వడం-ఇవన్నీ ఈ ఉద్యమం సాధించిన విజయాలే. అయితే నా అనుభవంలో నేను గమనించిన విషయమేమిటంటే ఎస్.ఎ.సి/ఎ.సి. సభ్యులు వివిధ బాధ్యతల్లో తీరికలేకుండా కూరుకుపోవడం వల్లా, కొంత రొటీన్ పనివిధానం వల్లా కెఎఎంఎస్ పని నిర్లక్ష్యానికి గురవుతుంది. గ్రామాల్లోని ప్రౌఢ మహిళల పాత్రను పెంచడానికి కొత్త కొత్త పద్ధతులు ఆలోచించాల్సి వుంది. మహిళలు, వారి పిల్లలు లెక్కలేనన్ని ఆరోగ్య సంబంధమైన సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఈ విషయంలో వాళ్ల అవగాహన పెంచడం ద్వారా, వాళ్ల సంక్షేమాన్ని ప్రత్యేకంగా పట్టించుకోవడం ద్వారా వాళ్ల క్రియాశీలతను పెంచవచ్చు. గ్రామ స్థాయి మీటింగుల్లో వాళ్ల భాగస్వామ్యాన్ని పెంచాలి. చాలామంది కెఎఎంఎస్ అంటే యువతుల సంఘమని అంటుంటారు. వాళ్లకున్న పరిమితమైన సామాజిక పరిజ్ఞానాన్ని విశాలం చేయడం కూడా మన ముందున్న సవాళ్లలో ఒకటి.

అట్లాగే, దళాల్లోని / ప్లాటూన్లలోని మహిళా సభ్యురాళ్లకు ప్రత్యేకంగా సాంఘిక, రాజకీయ శిక్షణనివ్వాల్సిన అవసరం ఉంది. వాళ్లకు ఆరోగ్య సంబంధమైన శాస్త్రీయ విజ్ఞానాన్ని కూడా రెగ్యులర్‌గా అందించడానికి ప్లాన్ చేయాల్సిన అవసరం వుంది. ఈ విషయాలపైన చర్చలు జరుగుతుంటాయి. కానీ సమయాభావం వల్లా, ఇతర పనుల్లో తీరిక లేకుండా వుండడం వల్లా అవి వాయిదా పడుతూపోతుంటాయి. శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించడం ద్వారా, విస్తృతమైన సామాజిక చింతనను అలవర్చడం ద్వారా వాళ్లలోని ఆత్మన్యూనతా భావాన్ని తొలగించవచ్చు.

**పోరుమహిళ: దండకారణ్యంలో గెరిల్లా దళాల్లో, కెఎఎంఎస్‌లో పనిచేస్తున్న మహిళలకు మీరిచ్చే సందేశం......**

**కా.జానకి:** ఈరోజున దండకారణ్యంలో మన ఆదివాసీ మహిళా కామ్రేడ్స్ కొత్త చరిత్రను నిర్మిస్తున్నారు. దేశంలోనే వెనుకబడిన ప్రాంతమయి వుండి కూడా దేశంలో సాగుతున్న మహిళా ఉద్యమంలో వాళ్లదే మొదటి స్థానం. వాళ్లు మొత్తం దేశాన్ని సామ్రాజ్యవాదం, భూస్వామ్యం, దళారీ పెట్టుబడీదారీ విధానపు కబంధ హస్తాలనుండి విముక్తి చేయడానికై సాగుతున్న సాయుధ పోరాటంలో పురుషులకు ధీటుగా పోరాడుతూ పోలీసుల తుపాకులకు జవాబిస్తున్నారు. గ్రామగ్రామాన వాళ్లు పెద్ద మనుషుల వత్తిళ్లను, బెదిరింపులను ఎదుర్కొంటూ తమ హక్కుల కోసం దృఢంగా నిలిచారు. గోండుల ఆదివాసీ సంస్కృతిలోని పితృస్వామ్యాన్ని బలహీన పరుస్తున్నారు.

ఇంత పెద్ద శత్రువులనూ, శక్తులనూ ఎదుర్కొంటూ ఉన్నప్పటికీ వాళ్లలో మిగిలి ఉన్న సిగ్గు, ఆధీనతా భావం కూడా వాళ్ల అభివృద్ధిని అడ్డుకుంటున్న పెద్ద శత్రువులే. వీటినుండే ఆత్మన్యూనతా భావం జనిస్తుంది. దీని మూలాలు చాలా లోతుల్లో వున్నాయి. కెఎఎంఎస్ సహచరిణులకు నేను చెప్పే విషయమేమిటంటే వాళ్లు తమపై తాము విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. తమలోనే వున్న సవాళ్లనే ఎదుర్కోవల్సి వుంది. ప్రభుత్వ నిర్బంధం వుండనే వుంది. దానితో పాటుగా పాలక పార్టీలు కూడా ఆదివాసీ నాయకుల ద్వారా, పెద్ద మనుషుల మద్దతుతో ఆదివాసీ సమాజాన్నీ, సంస్కృతినీ వెనుకబాటుతనంలోనే వుంచాలని ప్రయత్నిస్తాయి. వాటిని రాజకీయంగా ఎదుర్కోవడం కెఎఎంఎస్‌కు తప్పనిసరి అవుతుంది. అట్లాగే దేశంలో వేరువేరు ప్రవాహాలుగా సాగుతున్న మహిళా ఉద్యమంలో జోక్యం చేసుకుంటూ, సరియైన మహిళా విముక్తి మార్గంపై తన అవగాహనను ముందుంచడానికై కెఎఎంఎస్ సైద్ధాంతికంగా తయారుగా వుండాల్సిన అవసరముంది. ఈ సవాళ్లన్నింటినీ ఎదుర్కోవడానికై మన మహిళా కామ్రేడ్లు ఆత్మవిశ్వాసం కల్గివుండి సైద్ధాంతికంగా, రాజకీయంగా పరిపక్వత సాధించాలి. *

# కామ్రేడ్ జానకి దీదీ ఆదర్శం, ఆచరణ విప్లవోత్సాహాన్నిస్తుంది

☆ లహర్

అవి నా విప్లవ తొలి రోజులు. రాడికల్ విద్యార్థి సంఘంలో కార్యకర్తగా పనిచేస్తున్న కాలం. రాడికల్ విద్యార్థి సంఘ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మహాసభలు 1981లో గుంటూరులో జరిగాయి. ఈ సభకు హాజరు కావడానికి ప్రతినిధిగా హాజరైన విద్యార్థులలో నేను ఒక్కడ్ని. ఆ సభలలో ముంబయి నుంచి వచ్చిన విపిఎస్ ప్రతినిధులకు కా. అనురాధా గాంధీ నాయకత్వం వహించింది. ఆ సభలలో తను వర్తమాన పరిస్థితి గురించి, ముఖ్యంగా బొంబాయికి కేంద్రంగా ఉన్న విద్యార్థి ఉద్యమాన్ని గురించి, మిరమిట్లు గొలిపే ఆ చురుకైన కళ్లతో, భావాలను సూటిగా, దృఢంగా వ్యక్తం చేస్తూ, మాట్లాడిన ఆ ఉపన్యాసం ఎంతగానో ప్రభావితం చేసింది. విప్లవోద్యమంలో మంచి నాయకత్వ లక్షణాలు గల మహిళగా, ఆ రోజే నా మనసులో మంచి ముద్ర వేసింది.

ఆ రోజుల్లో వి.పి.ఎస్. విద్యార్థుల పత్రికగా వెలువడుతున్న Kalam పత్రికను నేను ఎంతగానో శ్రద్ధగా చదివేవాన్ని. కా. అనురాధ గాంధీ ఆర్టికల్స్‌లో ఉన్న విషయ పరిజ్ఞానం, లోతు, చెప్పే తీరు నన్ను ఎంతగానో ఆకట్టుకునేవి. నా చైతన్యాన్ని పదును పెట్టుకోవడానికి ఉపయోగపడేవి. ఈ 'కలం' పత్రిక తీయడం వెనుక కా.జానకి దీదీ పట్టుదల, శ్రమ, భూమిక ఎంతో ఉన్నదని వేరే చెప్పవలసిన అవసరం లేదు.

ఆమె కళ్లలోనే ఉట్టిపడే అభిమానం, చిరునవ్వుతో సహచరులను ఆహ్వానించే వినయం స్పష్టంగా కనపడేవి. 16సంవత్సరాల క్రితం గుంటూరు సభలలో మైకు ముందు నిలబడి ఇచ్చిన ఉపన్యాసకురాలిగా నా మనసులో ఉన్న ఆ చిత్రం నేడు నడి వయస్సులో ఎలా ఉంటుంది? గుర్తు పడతానా లేదా? అనే సందేహం. 1997 డిసెంబర్‌లో జరిగిన డికె ప్లీనంకు హాజరుపరచాలనే పార్టీ నిర్ణయం అమలు కోసం- బయట నుండి కా. జానకీ దీదీని రిసీవ్‌చేసుకొని తీసుకురావాలనే పార్టీ పనిని నాకు అప్పగించారు. 16 సంవత్సరాల తర్వాత కలిసి, బస్తర్ అడవుల్లోకి అడుగు పెట్టినప్పుడు -కామ్రేడ్ మన ఉద్యమ ప్రాంతం ప్రారంభమైందా అంటూ రాత్రికి రాత్రే నాలుగున్నర గంటలు - రాత్రి నడవటం- రాత్రుల్లో అంత నడక దీదీకి అలవాటు లేనప్పటికి, ఎంతో ఓపిగ్గా, శక్తిని తెచ్చుకొని నడిచింది. శత్రువు పహారా నుండి గస్తీ నుండి తప్పించుకొని మేం కొండలు, గుట్టలు దాటి ఉదయం దళంతో కలిశాము. అప్పుడప్పుడూ మీకు అలవాటు లేదు గదా- నాకు ఇవ్వండని అడిగితే - తన బ్యాగ్ తానే మోస్తూ దీదీ రాత్రి మూడుసార్లు కింద పడినప్పటికీ, కళ్లజోడు సవరించుకుంటూ వెనకబడకుండా నడుచుకుంటూ వచ్చిన ఆ స్పిరిట్, ఎదుటివారిని ఎంతో కదిలిస్తూ జీవిత ఆచరణే గొప్ప ఆదర్శమంటూ గొప్ప కమ్యూనిస్టు ఉద్యమకారిణిగా మన మనస్సుల్లో నిలిచి ఉంటుంది.

1997లో డికె ప్లీనంకు హాజరైన పిదప పార్టీ నిర్ణయం అనుసరించి డికెలోని దక్షిణ బస్తర్ డివిసి సమావేశానికి తాను డిసెంబర్ 1997లో హాజరయ్యి, డివిజన్ ఉద్యమాన్ని అర్థం చేసుకోవడం కోసం, పార్టీ, మిలీషియా, ప్రజా సంఘాలు, జనతన సర్కార్‌ల నిర్మాణం గురించి అనేక ప్రశ్నలు, సందేహాలు అడిగి గ్రామీణ, అడవి ఉద్యమాన్ని అర్థం చేసుకోవడానికి తన శ్రద్ధ, ఓపిక కనబర్చింది. ఓ గొప్ప మేధావి మా కమిటీలో వున్నందుకు - ఆనందం నన్ను ఎంతగానో కదలించి మనస్సులో ముద్రవేసింది. ఈ సమావేశంలోనే కా. మర్కాం డివిసి కార్యదర్శి నుండి రిలీవ్ కావడటం, అమరుడు కా. అశోక్ డివిజన్ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరిండం, తన తోటి వారందరూ చాలా జూనియర్స్ అయినప్పటికి ఎంతో ఆనందంగా, ఉత్సాహంగా, ఈ సమావేశంలో పాల్గొని 'మీ అభిమానం ఎంతగానో కదిలించింది, మీ అనుభవం నుండి నేర్చుకున్నందుకు ఎంతో ఉపయోగపడిందని' మాట్లాడింది.

ఆ తదుపరి 1998 సంవత్సరం అంతా కా. సుజాతక్క (మైనక్క)తో కలిసి దీదీ బాసగూడెం గైడ్ చేసే బాధ్యతలు నెరవేర్చింది. డివిజన్‌కు వచ్చిన మూడు, నాలుగు నెలల్లోనే, అంటే, 1998 మార్చి 13న తార్లగూడెం రెయిడ్ ఫెయిల్ కావడం, డివిజన్ కార్యదర్శి కా. అశోక్‌తో పాటు, డివిసిఎం కా. జోగన్న, ఏసిఎంలు కా. కమలక్క, బాబూరావు, రాంమూర్తిలు అసువులు బాయడంతో డివిజన్ ఉద్యమానికి పెద్దనష్టం జరిగింది.

"తార్లగూడెం అమరులు మనకు గొప్ప పాఠాన్నీ, అనుభవాన్నీ, త్యాగ సాంప్రదాయాన్నీ ఇచ్చి వెళ్లారు. గెరిల్లా యుద్ధంలో మనం ప్రదర్శించవలసిన దృఢసంకల్పం, సాహసం, చొరవ ఎంత ఉండాలో ఎత్తిపట్టి చూపారు - వారి త్యాగాలు వృథా కావద్దు- రేపు మనం మరిన్ని గొప్ప దాడులు చేసి దండకారణ్యాన్ని విముక్తి లక్ష్యం వైపు పురోగమింప చేయవలసిన కర్తవ్యం మన భుజస్కంధాల పైనే ఉంద"ని తార్లగూడెం అమరుల స్మృతిలో జానకి దీదీ మాట్లాడిన ఆ మాటలు ఇప్పటికి నేను మరువలేను.

1997లో బైరంగఢ్ ఏరియాతో పాటు బాసగూడెం ప్రాంతంలో కూడా జనజాగరణ్ అభియాన్‌ను శత్రువు కొనసాగించాడు. బాసగూడెం చుట్టు ప్రక్కల దోపిడి ప్రభుత్వం, పోలీసు అధికారుల పరోక్ష ప్రోత్సాహంతో స్థానిక పెత్తందార్ల ప్రత్యక్ష ప్రోద్బలంతో ఏడు గ్రామాల ప్రజలు, కొందరు సంఘ నాయకులు లొంగిపోయారు. శత్రువు ప్రోద్బలంతో ప్రజలు భయాందోళనకు గురై కొన్ని గ్రామాలలో ఆనాడు జనతన సర్కార్‌ల (ఆరోజు గ్రామ రాజ్య కమిటీలు- జీఆర్‌సి పేరున ఉన్నవి) నాయకత్వంలో పోసిన చెరువులను, తవ్వడం, నాటిన పళ్ల మొక్కలను పీకివేయడం, కొన్ని స్తూపాలను ధ్వంసం చేయడంలో ఉన్న కారణాలను -ఆ గ్రామాలలో తిరుగుతూ స్థానిక పార్టీ, ప్రజాసంఘాల, ప్రజల అభిప్రాయాలను, ఆలోచనలను సేకరించి అధ్యయనం చేసింది. వెనకబడిన గ్రామీణ ప్రాంతంలో గ్రామస్థాయిలో ఉన్న భూస్వామ్య వ్యవస్థ, పెత్తందార్ల, ఆదివాసి సియాన్ల ఆధిపత్యం, దోపిడి రాజ్య వ్యవస్థ పునాదులను లోతుగా అధ్యయనం చేస్తూ, స్థానిక నిర్మాణాలలో ఉన్న వర్గపొందికలో ఉన్న లోపాలను, పునాది వర్గాలలో పార్టీ ప్రధానంగా ఆధారపడవలసిన విషయాలను, ఏరియా కమిటిలో, డివిసిలో తన పరిశీలనను స్పష్టంగా మాట్లాడేది. కమిటీలలో కా.జానకీ దీదీ పాల్గొనడం, చర్చలు భిన్న కోణంలో జరగడం, తెలువని అనేక విషయాలను తెలుసుకోవడానికి ఎంతో దోహదపడేది. సమావేశంలో తన భావాలు కల్మషం లేకుండా, నటన, కపటత్వం, అహంభావం దరిచేరనీయకుండా మాట్లాడేటప్పుడు భావోద్వేగాలు ప్రకటించే ఓ చంటిపిల్ల ముఖంలా- ఆమె చిత్రం కనిపించేది. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్లలో కదులాడుతూ నా ఆలోచనలకు ప్రేరణ ఇస్తున్నాయి.

అది వేసవి కాలం. మండే ఎండలు. దక్షిణ బస్తర్‌లో వేసవి ఎండ తీవ్రంగానే వుంటుంది. 1998 మే 5న గెరిల్లా దళం- బాసగూడెం పోలీసు రానాకు (ఇది ప్రస్తుతం బీజాపూర్ జిల్లా, ఊసూర్ బ్లాక్‌లో ఉంటుంది) నాలుగు కిలోమీటర్ల దూరంలో సార్కిన్ గూడెం అనే గ్రామం వద్ద ఆగింది. వేసవి ఎండలు అలసిపోవడం మూలంగా ముఖం కడుక్కొని టీ త్రాగి, కొంచెం సేపు రెస్టు తీసుకుంది. తోటి సహచరులతో మాట్లాడి, దళం దగ్గరికి వచ్చిన సంఘ సభ్యులతో, ప్రజలతో మాట్లాడుతున్న స్థానిక దళ కమాండర్‌తో కలిసి గ్రామ విషయాలు, శత్రు కదలికల గురించి తెలుసుకొంది. మిట్ట మధ్యాహ్నం. సమయం 12-30 గంటలవుతుంది. కొందరు కామ్రేడ్స్ అన్నం తింటున్నారు. మరికొందరు తినడానికి ఉపక్రమిస్తున్నారు. దీదీ తన ప్లేట్‌ను అన్నం తినడానికి చేతిలో తీసుకొని రెండడుగులు వేసింది. అంతలో పోలీసులు డేరా చుట్టుముట్టడం, కాల్పులు ప్రారంభం కావడం జరిగింది. వెంటనే దీదీ, తనకు అప్పటివరకు గెరిల్లా జీవితంలో ఎన్‌కౌంటర్లో, దాడుల్లో పాల్గొన్న అనుభవం లేనప్పటికి వెంటనే కవర్ తీసుకొంది. తుపాకీని శత్రువుకు ఎక్కుపెట్టింది. తను ధైర్యంగా ఉండి శత్రువుపై ఫైరింగ్ చేస్తూ క్షేమంగా రిట్రీట్ అయ్యింది. మండే ఎండల్లో శత్రువుతో జరిగిన ఈ ఎదురుకాల్పుల ఘటనను- దీదీ తన గెరిల్లా జీవితంలో మరువలేని ఘటనగా ఎల్లప్పుడూ చెప్పేది. గెరిల్లా యుద్ధ స్కిల్స్ నేర్చుకోవడానికి యువతను

ప్రోత్సహించేది.

1999లో డివిసిలో కా. జానకి దీదిలో నేషనల్ పార్క్ ఏరియా కమిటి (ప్రస్తుతం పశ్చిమ బస్తర్ డివిజన్ పరిధిలో ఉంది) ని గైడ్ చేసే బాధ్యత ఇవ్వబడ్డది. అప్పుడు ఏసి కార్యదర్శిగా కా. నిర్మలక్క ఉండేది. (ప్రస్తుతం కా. నిర్మలక్క -2007లో అరెస్టయి జగదల్‌పూర్ సెంట్రల్ జైల్లో ఉంది). ఆ రోజు ఆ ఏసిలో అధిక సంఖ్యలో మహిళా కామ్రేడ్స్ ఉండేవారు. కా. జానకి దీది ఎస్‌పి ఏసి బాధ్యురాలుగా వచ్చినందుకు ఆ కామ్రేడ్స్ ఎంతో సంతోషించారు. అడవి ఉద్యమంలో గెరిల్లా దళాలకు గైడెన్స్ ఇవ్వడం, ప్రజా పోరాటాలు నిర్మించడం తనకు కొత్త అయినప్పటికీ - తోటి కామ్రేడ్స్ నుండి నేర్చుకుంటూ - తన సిద్ధాంత, రాజకీయ అవగాహనతో విషయాలను గ్రహిస్తూ ఉద్యమాన్ని గైడ్ చేయడంలో నేర్పు సాధించేది. తను నడి వయస్కురాలైనప్పటికి దళంలో ఎక్సర్‌సైజులు చేయడానికి ఎంతో ఇష్టపడేది. అడవి ప్రాంతంలో తినే ఆహారపు అలవాట్లు తొందరగానే అలవర్చుకొని తోటి కామ్రేడ్స్‌తో, ప్రజలతో మమేకమై పోయేది.

జానకీ దీది తరచుగా మలేరియా జ్వరం బారిన పడేది. జావ తాగి టాబ్లెట్లు వేసుకొనేది. పట్టణ ప్రాంత జీవితం గడిపినప్పటికీ తన సొంతానికి సౌకర్యాలు కావాలని కోరుకొనేది కాదు. ఎదుటివారి కష్టాలను, బాధలను తన బాధలుగానే, దోపిడి సమాజాన్ని శస్త్ర చికిత్స చేయాలనే ఓ సామాజిక సైంటిస్టుగా అనునిత్యం ఆలోచించేది,ఆచరించేది. మావోయిస్టు సిద్ధాంతం వెలుగులో తోటి వారికి విడమర్చి చెప్పి ఉద్యమ అభివృద్ధికి నిరంతరం తపన చెందేది.

తరచుగా సోకే తీవ్రమైన మలేరియా, ఎండ తీవ్రత జానకి దీది ఆరోగ్యాన్ని క్షీణింపజేసేవి. అయినప్పటికీ, అనారోగ్యాన్ని లెక్క చేయక ప్రతి పనిలో సాధ్యమైన మేరకు చురుగ్గా పాల్గొనడానికి ప్రయత్నించేది.

1999లో వేసవి కాలంలో జరిగిన ఓ ఘటన ఇప్పటికీ నేను మరువలేను. నేషనల్ పార్క్‌లోని గుర్‌గుట్ట, నెల్లమడుగు గ్రామాల నడుమ దాదాపు మూడున్నర గంటలు ప్రయాణం చేయాలి. అది మే నెల. మండే ఎండలు అయినప్పటికీ భుజానికి తుపాకి, కిట్ వేసుకొని మాతో పోటిపడి నడిచింది. కాని, అప్పటికే మలేరియా సోకింది. ఆరోగ్యం అంతగా కోలుకోలేదు. ఎండలో మూడు గంటలు నడిచిన తర్వాత మేం అందర అలసి పొయాం. నెత్తురు మడుగు అనే నీళ్లతావు వద్ద వాగు ఒడ్డున డేరా వేసి ఆగాం. అక్కడ చెట్టు నీడ లేదు. తను ఆ రోజు ఎండకు అలసిపోయి, తుపాకిని చెట్టుకు ఆనించి, కిట్టు కూడా దించుకోలేక అలాగే నడమువాల్చి పడిపోయింది. కళ్లలో ప్రాణం కనపడింది. మాట్లాడలేని అపస్మార స్థితి అన్నట్లుగా పడిపోయింది. వెంటనే నీళ్లలో గ్లూకోజ్ కలిపి త్రాగించాము. ముఖం కడిగాం. అరగంటసేపు అలాగే పడిపోయి లేచి, అమాయకపు అమ్మాయిలా, నవ్వుతూ లేచి మమ్మల్ని పలకరించింది. ఓ అరగంటసేపు మేం చాలా ఉత్కంఠతో గడిపాము. "నాకేమి గాలేదు, ఎండదెబ్బకు సొమ్మసిల్లాను, అంతే" అంటూ జావ తాగి సేద తీరింది. వెంటనే సాయంత్రం మాతో పాటు నడిచింది. కిట్ ఇతర కామ్రేడ్స్‌కు ఇవ్వడానికి నిరాకరించిన ఆదర్శం తనది.

గ్రామాలలో ఆదివాసీ ప్రజానీకంతో చాలా కలగలుపుగా ఉండేది. చిన్నపిల్లలను ఎత్తుకుని వచ్చిన తల్లులను పలకరిస్తూ, పిల్లలను చేతిలోకి తీసుకొని ముద్దాడి వారి మంచి చెడులు తెలుసుకునేది. ఇంట్లో కుటుంబ సమస్యలు తెలుసుకునేది. పితృస్వామ్యం ఏయే రూపాల్లో ఆదివాసీ మహిళలను అణచివేస్తుంది, ఉత్పత్తి నుండి, ఆస్తిహక్కు నుండి దూరం చేసే రూపాలు ఏమిటి? 'తెత్త ముత్తిని పార్వత నెయ్యిని పూడాట్' (తెచ్చిన భార్య, పెంచిన కుక్కలాంటిది - వెళ్లగొట్టండి) అనే పితృస్వామిక భావాలు ఆదివాసి సమాజంలో ఉండటాన్ని లోతుగా పరిశీలించి అధ్యయనం చేసి, వాటికి వ్యతిరేకంగా పార్టీ, క్రాంతికారి ఆదివాసి మహిళా సంగాలు (కెఎఎంఎస్) పితృస్వామికానికి వ్యతిరేకపోరాటం ఏ మేరకు మన ప్రజా పునాదిని దృష్టిలో ఉంచుకొని చేయగల్గుతామనే విషయాలను ఏసి సమావేశంలో, ప్రజా సంగాల సమావేశాలలో చర్చించి, గైడెన్స్ ఇచ్చేది. పార్టీ, పిఎల్‌జిఏలో మహిళలు నాయకత్వం - సంఖ్యకు తగిన నాయకత్వం లేనందుకు -చింతిస్తూ ఇందులో నుండి బయట పడటానికి కావలసిన కేంద్రీకరణ, పార్టీలో ఉన్న పితృస్వామిక భావాలు, ఎలా ఉన్నాయో తోటి కామ్రేడ్స్‌తో చర్చించేది. అనేక విషయాలు కొత్త కోణంలో తెలుసుకోవడానికి జానకి దీది మాకు ఎన్నో విషయాలు అలుపెరుగని గురువుగా చెప్పేది. క్యాడర్‌కు ప్రతి చిన్న విషయం, దళ సభ్యులకు ప్రాథమిక స్కూల్, అక్షరమాల కూడా చెప్పి వారి ఎదుగుదలకు తపనపడేది.

తను డివిసిలో కొనసాగుతున్నప్పుడే డివిజన్‌లో జరుగుతున్న సహకార ఉద్యమం స్పష్టత కోసం స్టడీ క్యాంపు నిర్వహించడం జరిగింది. ఈ రోజు దండకారణ్యాన్ని విముక్తి ప్రాంత లక్ష్యంతో పోరాటాన్ని కొనసాగిస్తున్నాం. నేటి ఉద్యమ పరిస్థితి, ఏర్పడిన గ్రామ రాజ్య కమిటీల పరిస్థితి, ఆర్థికవ్యవస్థ, ప్రజల అవసరాలు, సహకార ఉద్యమాన్ని, వర్గపోరాటం తీవ్రం చేయడానికి, ప్రజా పునాదిని పెంచడానికి ఎలా తోడ్పడుతుందో, స్టడీ క్యాంపులో లోతైన చర్చ జరిగింది. అప్పటి వరకు మేం 'పొత్తంకామ్' (సమిష్టి పని) చేయండని, టీంలుగా దున్నడం, సమిష్టిగా వ్యవసాయం చేయడం, పెట్టులు పోయడం (పొలాలకు గట్లు పోయడం) మొదలగునవి. 14రకాల పనులు డివిజన్‌లో అమలులో ఉన్నాయి. వీటిలో నేటి ఉద్యమస్థాయి, ముందు సహకార ఉద్యమం ముఖ్యంగా Mutual aid teams (సహకార టీంల) గురించి సమిష్టి పనులకు సహకార పనుల విషయంలో స్పష్టతకు రావడం జరిగింది. వర్షాధార వ్యవసాయం, తక్కువ పంట దిగుబడి ఉన్న, వెనకబడిన వ్యవసాయంలో, అధిక ఉత్పత్తికి, ప్రజల ఆర్థిక జీవనం మెరుగుపరచడానికి సహకార టీంలు నిర్వహించవలసిన పాత్ర, దీంట్లో వర్గ పంథా, ప్రజాపంథా అమలు గురించి లోతైన అవగాహనకు రావటం, కా. జానకి దీది మాకు చాలా విషయాలు సైద్ధాంతిక వెలుగులో ఆచరణకు జోడించి మాట్లాడటం, పొత్తం కామ్‌లో (సమిష్టి, సహకార పనులు ఈ పేరుతో సాగుతున్నాయి) జరుగుతున్న లోపాలను సవరించుకొని పనిచేయడానికి ఉపయోగపడింది. అలాగే 1999 నవంబర్‌లో డివిజన్ పిఓఆర్ రాయడానికి సమీక్షా సమావేశం జరిగింది. ఇందులో డివిజన్‌లోని డివిసి, ఏసి, దళాల పనివిధానం, పార్టీ నిర్మాణం, మిలీషియా, గ్రామ రాజ్య కమిటీల (జనతన సర్కార్ల) ప్రజా సంఘాల, ప్రజా పోరాటాల గురించి లోతైన చర్చల సమీక్ష జరగడంతో కా. జానకి దీది భూమిక, సైద్ధాంతిక అవగాహన మా అందరికీ ఎంతో తోడ్పడింది. ఈ సమావేశం మా అందరికీ ఓ కార్యశాలగా పనిచేసింది.

ఇదే సమావేశంలో చైనా విప్లవం 50వ వార్షికోత్సవం సందర్భంగా వాన్‌గార్డు ప్రచురణలుగా వెలువడిన పుస్తకాన్ని సమిష్టిగా అధ్యయనం చేయడం జరిగింది. ఆ అధ్యయనంలో చైనా విప్లవం వివిధ దశల గుండా ఎలా సాగింది, చైనా కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన వ్యూహం- ఎత్తుగడలు, ముఖ్యంగా దీర్ఘకాలిక ప్రజాయుద్ధం గురించి అవగాహన చేసుకోవడానికి ఉపయోగపడింది. అలాగే, పార్టీలో జరిగిన రెండు పంథాల మధ్యన పోరాటం, గొప్ప శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం GPCR జరిగిన నేపథ్యం, పచ్చగడ్డిలో పాములాగా పార్టీలో వచ్చే రివిజనిజం గురించి అర్థం చేసుకోవడానికి, మా సైద్ధాంతిక, రాజకీయ అవగాహనకు పదును పెట్టుకోవడానికి ఈ అధ్యయనంలో కా. జానకి దీది ఓ టీచర్‌గా ఓపిగ్గా, మా అనేక సందేహాలను నివృత్తి చేస్తూ భూమికను పోషించింది.

బస్తర్‌లో రెండు సంవత్సరాలు ఉద్యమంలో మాతో పాలుపంచుకుంటూ ప్రజలే నిజమైన వీరులు, ప్రజల పట్ల విశ్వాసం ఉంచుతూ, ప్రజలలో క్యాడర్‌లో మమేకం అవుతూ, తోటి కమిటి సభ్యులతో అనుభవాలను, అవగాహనను పంచుకుంటూ ప్రజల, క్యాడర్ విశ్వాసం పొందింది కా. జానకి దీది. పట్టణ నేపథ్యంలో నుంచి వచ్చినప్పటికీ, మేధో అహంకారాన్ని ప్రదర్శించటంగానీ, చులకనగా కామెంట్ చేయటంగానీ మచ్చుకైనా కానరావు దీదీలో. ఓమంచి కమ్యూనిస్టుగా కల్మషంలేని హృదయంతో, ప్రతి క్షణం విప్లవం కోసం ఆలోచించే, తపించే కా. జానకి దీది మాతో కలిసి 2000 జనవరిలో గ్రూపు ఫోటో తీసుకొని, తన రెండు సంవత్సరాల గెరిల్లా ఉద్యమ జీవితాన్ని పదిలంగా దాచుకుంటూ మా మనస్సుల్లో చెదరని ముద్రవేసి వీడ్కోలు తీసుకుంది.

ఆ తర్వాత 2000డిసెంబర్‌లో జరిగిన డికె మూడవ కాన్ఫరెన్స్‌లో దీదితో కలిసి కాన్ఫరెన్స్‌లో పాల్గొన్నాం. అదే దీదితో కలిసిన నా ఆఖరి కలయిక అవుతుందనుకోలేదు. ఆ తర్వాత ఏప్రిల్ 12, 2008లో ఫాల్సిఫారం మలేరియాతో అమరురాలయిందనే ఆ చెడు వార్త నా మనస్సు నమ్మలేకపోయింది.

*

 సంస్మరణ

✩ అమన్

## అరుదైన విప్లవ మేధావి

# కా. అనురాధ గాంధి

దీదీని నేను కల్సింది రెండే రెండు సందర్భాల్లో. (ఆమెకు విప్లవోద్యమ ప్రాంతాల్లో వివిధ పేర్లున్నా తనను చాలా మంది సాధారణంగా అలానే పిలుస్తారు కాబట్టి నేను 'దీదీ' అనే రాస్తున్నా.) మొదటిసారి 2001లో జరిగిన మునుపటి పీపుల్స్ వార్ పార్టీ కాంగ్రెస్‌లో కాగా, మరో సందర్భం 2007లో జరిగిన సీపీఐ (మావోయిస్టు) ఐక్యతా కాంగ్రెస్‌లో. కలిసింది రెండు సందర్భాల్లోనే అయినా జీవితాంతం గుర్తుండిపోయేలా నాపై చెరగని ముద్ర వేసిన తనను గురించి నేను ప్రత్యేకంగా ఎవరికీ పరిచయం చేయాల్సిన అవసరం లేదు. ఒక మార్క్సిస్టు మేధావిగా, విప్లవ మహిళా ఉద్యమకారిణిగా, మావోయిస్టు పార్టీ అగ్రశ్రేణి నాయకురాలిగా ఆమె చాలా మందికి సుపరిచితం. అయితే నేను నా దృష్టితో పరిశీలించి, నా మనోఫలకంపై చిత్రించుకున్న దీదీని పాఠకుల ముందు ఆవిష్కరింపజెయ్యడం కోసమే ఈ ప్రయత్నం.

2001లో కలిసే నాటికి నేను తనను గురించి చాలానే విని ఉన్నా కాబట్టి మొదటి పరిచయం అయ్యే వరకూ బాగా కుతూహలంగా ఉండేది. పరిచయమైన తర్వాత అప్పటిదాకా ఉండిన ఒక లాంటి జంకుపోయి తనతో చాలా కలివిడిగా మెలగొచ్చనే అంచనాకు వచ్చేసి ఎంతో హాయిగా ఫీలయ్యా. అప్పటికే ఆమె పట్టణోద్యమం నుండి దండకారణ్యంలోకొచ్చి రెండేళ్ల పాటు గడిపి వెళ్లిన కాలంలో తను మా 'ప్రభాత్' పత్రికకు రాసి పంపిన రిపోర్టుల గురించీ, అనువాదం చేసి పంపిన ఇతర ఆర్టికల్స్ గురించీ చర్చిస్తున్న క్రమంలో మా మధ్యన 'దోస్తీ' దాదాపు కుదిరిపోయింది. అంత పెద్ద మేధావితో ఫ్రీగా మాట్లాడగలనో, లేదోనని అప్పటి దాకా నన్ను ముసురుకొని ఉన్న సందేహాలు పూర్తిగా తొలగిపోయాయి. ఆమె తనకన్నా జూనియర్స్‌తోనూ, తక్కువ మేధాస్థాయి గలవాళ్లతోనూ, అన్ని వయస్సుల వాళ్లతోనూ ఈజీగా కలగల్సిపోయే స్వభావం గలదని తెల్సుకోవడానికి ఎక్కువ సమయం పట్టలేదు. ఇకపోతే, తనకు(అప్పటికి) తెలియనిదీ, నాకు తెల్సిందీ అయిన ఒక అంశం ఉంది కాబట్టి ఆ నెలా, నెలన్నర రోజుల్లో మేం కల్సిపని చేయాల్సిన సందర్భాలు చాలా వచ్చాయి. అప్పటికి దీదీకి కంప్యూటర్‌పై పనిచెయ్యడం రాదు. అయితే manual పై (రెండువేళ్లతో) type చెయ్యడం ముందే తెలుసు కాబట్టి laptop పై చెయ్యడమైతే చేసేది కానీ File ను Save చెయ్యడం, Open చెయ్యడం వగైరా తెలిసేది కాదు. కాబట్టి నా సహాయం తనకు తరచుగా అవసరమయ్యేది. (గమ్మత్తేంటంటే, తన జీవిత భాగస్వామికి మిగతావి తెలుసుకానీ తనలా స్పీడుగా టైప్ చెయ్యడం వచ్చేది కాదు. దాంతో ఈ విషయంలో అప్పుడప్పుడు వాళ్లిద్దరూ దాదాపు నిజంగానే అని ఇతరులకనిపించేంత సీరియస్ సరదాగా పడే గొడవకు నేను సాక్షిగా, ఒక్కోసారి మధ్యవర్తిగా ఉండాల్సి రావడం ఇప్పటికీ గుర్తొస్తే మనసారా నవ్వుకోగలిగే ఒక అరుదైన చిలిపి జ్ఞాపకం) అట్లా దీదీతో సన్నిహితంగా, ఎక్కువసార్లు మెలిగే అవకాశం నాకు దొరికింది. చాలా పాక్షికంగానే అయినా సరే, అలా తన వ్యక్తిత్వాన్ని ఓ మేరకు తెల్సుకోగలిగా. అప్పటికి దీదీ గురించి అర్థమైందేమిటంటే, తను ప్రతి విషయాన్ని లోతుల్లోకి వెళ్లి అర్థం చేసుకుంటుంది. ప్రతి విషయానికీ చాలా త్వరగా స్పందిస్తుంది. ఆమె నడకలో కనిపించే వేగమే తన మాటల్లోనూ, ఆలోచనల్లోనూ, బహుశా నాకు తెలియని ఇంకా అనేక పార్శ్వాల్లోనూ ప్రతిఫలిస్తుందేమో అనిపిస్తుంది. క్యాంపులో అటు ఇటూ తిరిగేటప్పుడు చూస్తే తనొక నడీడు మహిళ అని అనుకోవడం కష్టం. ఆమె ప్రతి కదలికలో యవ్వనతేజమే ఉట్టిపడేదంటే అతిశయోక్తేమీ లేదు. శారీరకంగా, అప్పటికే తనకు మోకాళ్ల నొప్పులు తీవ్రంగా ఉన్నాయన్న విషయం తెల్సినపుడు బాధనిపించింది. ఆ నొప్పులే లేకుంటే మరెలా ఉండి ఉండేదోనన్న ఊహే హాయిగా ఉండేది నాకు. ఆమెకు అనేక భాషలపై మంచి పట్టు ఉన్నవిషయం ఇతరులు చెప్పగా విన్నాగానీ నాకు ప్రత్యక్షంగా గమనించే అవకాశం అప్పుడు కలగలేదు. అయితే గోండీ భాషను చాలా వరకు పట్టుకుందనే విషయం మాత్రం అర్థమైంది.

2001 కాంగ్రెస్‌లో తను కేంద్రకమిటీలోకి ప్రత్యామ్నాయ సభ్యురాలిగా ఎన్నికైనప్పటికీ ప్రతినిధులం కాని మాఅందరికీ అది రహస్యం. కాబట్టి బహుశా ఆ క్యాంపులో ఉన్న అనేక మంది సహచర మహిళా కామ్రేడ్లకు ,తనను అభినందించే వీలు కలుగలేదు. కానీ ఏదో విధంగా అర్థంచేసుకున్న నాలాంటి వాళ్లు మనస్సులోనే తనను అభినందించి ఉంటారు. అయితే నాకు అంతకన్నా ఎక్కువగా సంతోషం కలిగించింది ఇంకొకటుంది - తను కాంగ్రెస్ నుండి బైటికి నాకు వెళ్లే ముందర 'పోరు మహిళ' పత్రికకు హిందీలో (రాతలో) ఇచ్చిన ఇంటర్వ్యూను తెనుగీకరించే అవకాశం నాకు దొరకడం. నా దృష్టిలో చాలా మంచి ఇంటర్వ్యూలలో అదొకటి. ఇవ్వాళ దీదీ జ్ఞాపకాల్నీ, రచనల్నీ కంపైల్ చేస్తున్న కామ్రేడ్లు ఆ ఇంటర్వ్యూను కూడా కలపడాన్ని చూస్తే ఒకవైపు దాన్ని నేనే అనువదించినందుకు కించిత్తు గర్వంగానూ, అప్పుడే అది తన స్మృతి శకలాలల్లో భాగం కావల్సి వచ్చినందుకు మరోవైపు బాధగానూ అనిపిస్తుంది.

సమైక్య పార్టీ ఐక్యతా కాంగ్రెస్ (2007)లో తనను తిరిగి కలవడానికి చాలా ముందే ఆమెకు సోకిన నయంకాని కీళ్ల జబ్బు గురించి తెలిసి 'ఈవ్యక్తికా ఇలాంటి జబ్బు రావడం' అని బాధపడ్డా. అప్పటికే తన శరీరం చాలా దెబ్బతిందనే విషయం ప్రత్యక్షంగా చూసాకే అర్థమైంది. చేతివేళ్లు బిగదీసుకుపోయి వంగకుండా అయ్యాయి. 'ఇప్పుడు టైప్ చెయ్యగలుగుతున్నారా?' అని అడిగితే ఈజీగా నవ్వేసి ఫరవాలేదంది. నడవడం, కూర్చోవడం చాలా ఇబ్బందిగా మారిన స్థితి తనది. కానీ వీటినేవీ లెక్కచేయని తనదైన శైలిలో అందరితో గలగలా మాట్లాడడం, ఇతరులకు అసూయపడేంత ఆశ్చర్యంగా ఉండేది. ఈ కాంగ్రెస్‌లో తనూ, నేనూ వేదికపై రెండు వేరు వేరు బాధ్యతల రీత్యా ఒక దగ్గరే కూర్చోవడం వల్ల తనతో ఎక్కువసార్లే మాట్లాడే అవకాశం దొరికింది. తను అధ్యక్షవర్గం సభ్యురాలిగా, నేను అనువాదకుల్లో (హిందీ-తెలుగు) ఒకడిగా దాదాపు కలిసే పనిచేసాం. మన స్వంత అభిప్రాయలేమున్నప్పటికీ దానితో ఏ మాత్రం నిమిత్తం లేకుండా అనేక వాదప్రతివాదాలను పొల్లుపోకుండా మరో భాషలోకి వెంటవెంటనే అనువదించడం, కేవలం చెప్పడమే కాదు, మాట్లాడిన వ్యక్తి toneను కూడా పలికించడం కత్తిమీద సాములాంటి ఎక్సర్‌సైజ్. ఇక ఈసారి నన్ను అమితంగా ఆశ్చర్యపర్చింది దీదీకి తెలుగుపై ఉన్న పట్టు!? తెలుగు ప్రజల్తో, తెలుగు ప్రాంతాలతో తనకు ఏమేరకు పరిచయం/ అనుబంధం ఉందో నాకైతే తెలియదు కానీ, ఎవరైనా హిందీలో చెప్పినదాన్ని నేను తెలుగులోకి చేసేటప్పుడు గానీ, లేదా తెలుగులో చెప్పిందాన్ని హిందీలోకి చేసినపుడు గానీ తను రెంటినీ శ్రద్ధగా వినేది. వినడమే కాదు, నా నుండి ఎక్కడ ఏ చిన్న పదం మిస్సయినా, సరిగా చెప్పలేకపోయినా, లేదా తప్పుగా చెప్పినా తను వెంటనే గుర్తుచేసేది. అసలు హిందీబాగా తెల్సిన తెలుగు కామ్రేడ్లకన్నా తనేముందుగా నా అనువాద లోపాల్ని పట్టెయ్యడం నాకు ఆశ్చర్యంగా, భయంగా కూడా ఉండేది. నా వంతుగా నేనెప్పుడు అనువాదం చేసినా నేను అలవాటుగానే మధ్యమధ్యన ఇద్దరు వ్యక్తుల వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ ఉండేవాణ్ని. ఒకరు దీదీ కాగా, రెండవ వ్యక్తి పార్టీ సీనియర్ నేతల్లో ఒకరైన కామ్రేడు. ఈ ఇద్దరు కామ్రేడ్ల సునిశిత, సూక్ష్మ పరిశీలన నా అనువాదం సరిగా ఉండడానికి తోడ్పడడమే కాదు, నేను నేర్చుకోవడానికి కూడా ఎంతో ఉపయోగపడింది. ప్రతిసారీ అనువాదం పూర్తి కాగానే దీదీ కూర్చుండే వైపుగా వెళ్లేవాడిని. తను ఏ కామెంటూ చేయలేదంటే నేను సఫలమయినట్టుగా రిలీఫ్ ఫీలయ్యేవాణ్ని.

ఆ కాంగ్రెస్ సందర్భంగా, ఖాళీ సమయాల్లో దళిత సమస్యపైనా, అతివాద/ మితవాదాల సమస్య మీదా, పట్టణోద్యమ పరిస్థితుల/అవకాశాల పైనా తన భావాలను తెలుసుకోగలిగే, తద్వారా నేర్చుకోగలిగే, నాఅభిప్రాయాలను మెరుగుపర్చుకోగలిగే అవకాశం కలిగింది. ఇంకా ఆ మధ్యన హిట్టయిన 'రంగ్ దే బసంతీ' సినిమా నుండీ కొత్తగా వచ్చిన పుస్తకాల దాకా, సల్వాజుడుం గురించీ, దానిపై మేధావుల స్పందనల గురించీ మా మధ్యన ముచ్చట్లు సాగాయి. డీకేలో తను పని చేసినపుడు పరియమైన చాలా మంది కామ్రేడ్ల గురించి అడిగి తెల్సుకుంది. ముఖ్యంగా, అప్పటికి అందరికీ షాకింగ్ న్యూస్ లాంటి బీకే అమరత్వం గురించి తను బాధపడ్డ తీరు, మొత్తంగా పార్టీలోని యువ నాయకత్వం పట్ల తను చూపిన కన్‌సర్న్ నన్ను ఆకట్టుకుంది.

**సంస్మరణ**

☆ మైనా

# దీదీ జ్ఞాపకాలు

కా. అనురాధ గాంధీ మన పార్టీ ప్రియతమ నేత. ఈ కామ్రేడ్ కమ్యూనిస్టు పార్టీ కుటుంబంలో పుట్టి, ఎమర్జెన్సీ నిర్బంధంలో రాటుదేలి రాజకీయంగా ఎదుగుతూ, సామాజిక సమస్యలను, వర్గపోరాటాల చరిత్రలను అధ్యయనం చేస్తూ క్రియాశీల కార్యకర్తగా ఎదుగుతూ, ఒక వ్యక్తిత్వం ఉన్న మహిళగా తనతోపాటు ఉన్న వారినందర్నీ కలుపుకొని పోవడంలో, సహకరించడంలో, చైతన్యపర్చడంలో చాలా కృషి చేసేది. రాష్ట్రాలు, భాషలు ఆమెకేమీ అడ్డులేవు. తను నమ్మిన విప్లవ రాజకీయాలపై పట్టుపెంచుకొని క్యాడర్‌ను, ప్రజల్ని ఆ విధంగా మలిచేందుకు చాలా కృషి చేసింది. కార్మికరంగంలో, మేధావుల్లో, దండకారణ్య ఆదివాసి ప్రజల్లోనూ కల్సిపోయి కష్టపడడం, నేర్పించడం అనే కమ్యూనిస్టు సుగుణాల దీదీతో నా అనుభవాలు ఇలా.....

అది 1999 సంవత్సరంలో కా. జానకి దక్షిణ బస్తర్ డివిజన్‌కి వచ్చింది. అప్పటివరకు పట్టణాల్లో కార్మిక వర్గం, మేధావుల్లో పనిచేసిన అనుభవంతో డి.కె. ఉద్యమాన్ని నిర్మాణాలను తను నేర్చుకోడానికి అనుభవం కోసం ఇక్కడే ఉంటుందనే విషయం తెల్సి చాలా సంతోషించాను. నాకు కమిటీలో ఒక మహిళ తోడు అనేది ఒకటైతే నేను హిందీ కూడా నేర్చుకోవచ్చు అనుకున్న. అదే సమయంలో అబ్బో.... బుద్ధి జీవులంటే కొంత భయం కూడా వేసింది. వాళ్లలాగా మనం రాజకీయాలు చర్చించలేం కదా! ఎలా? ఏది ఏమైనా నేర్చుకుందాము మనం విద్యార్థులం కదా! అనుకున్నా.

నేను దీదీని 1985లో హైద్రాబాద్‌లో ఆర్.ఎస్.యు. సభల సందర్భంగా ఒకేసారి చూశాను. అది దూరం నుండే చూశాను. పరిచయం లేదు. ఐతే కా.సలీమ్‌తో పరిచయం ఉంది కానీ దీదీతో లేదు. బయట ఏ పేరుతో పనిచేసిందో తెలియదు కానీ ఇక్కడ డివిజన్‌కు వచ్చాక దీదీ పేరును మేము అంతా కల్సి ఏం పేరు పెట్టుదాము అని చర్చించి జానకీ అని పెట్టాము.

కా.జానకి దీదీ ఇక్కడికి వచ్చాక చాలా త్వరగానే భాషను నేర్చుకుంది. ఐతే జానకి దీదీని చూసిన ప్రజలు మనల్ని గుచ్చి గుచ్చి అడిగేవారు. దీదీ ఈ దేశంది కాదు, ఎక్కడి నుండి వచ్చింది, మన భాషరాదు కదా అనేవాళ్లు. వాళ్ల దగ్గరికి దీదీ నవ్వుతూ వెళ్లేది. ఆ.... మీరు ఏం అడుగుతున్నారో నాకు తెల్సు. మీరే నాకు భాష నేర్పించాలి. నేను మీ దగ్గర అన్నీ నేర్చుకుంటాను అనేది. అప్పుడు అక్కడ జమ అయిన ప్రజలు, సభ్యులు గొల్లున నవ్వేవారు.

గ్రామాల్లో మహిళలు ఐతే దీదీని చూసేందుకు ప్రత్యేకంగా వచ్చేవారు. "అది దుసురా దేశంతదు పక్కా వేడుత ఆంగ్రేజి ముత్తి" (వేరే ప్రాంతం, బాగా తెల్లగా ఉండే ఇంగ్లీషు మహిళ) అంటూ వచ్చి దీదీని భాష రాకున్నా పలకరించేవాళ్లు. ఆమె నవ్వుతూ లాల్‌సలాం చేసి సైగలతోనే వాళ్లందర్నీ పరిచయం చేసుకునేది.

దీదీ వయస్సు మహిళలు, ఇంకా పెద్ద వయస్సు మహిళలు దీదీని ప్రత్యేకంగా చూసేందుకు వచ్చేవాళ్లు. దీదీకి భాష రాదు కదా అని వాళ్లు వెనకా ముందు అవుతుంటే దీదీ పరిస్థితిని అర్థం చేసుకొని తనే వెళ్లి వాళ్లతో వచ్చిన భాషతో మాట్లాడేది. నీ వయస్సు అంత వాళ్లు కూడా పార్టీలో ఎలా పనిచేస్తారు? పోలీసులు వస్తే ఎలా? ఫైరింగ్ జరిగితే ఎలా? అని అడిగితే, మన పార్టీ ప్రజల పార్టీ, ప్రజలకోసం ప్రాణాలు ఇవ్వడానికి వచ్చాము. వయస్సుతో నిమిత్తం లేదు, నా వయస్సు ఉన్న మీరంతా కూడా పార్టీలో పనిచేయగలరు. మీరు రావాలి అంటూ వారిని ప్రోత్సహిస్తూ.... వారితో మంచి దోస్తాన్ చేసేది.

ఎక్సర్‌సైజులు చేయడంలోగానీ, నడకలోగానీ ఎప్పుడూ వెనుకబడలేదు. ఐతే ఒకటే అద్దాలతో ఇబ్బంది పడేది. రిక్కలు తగిలి ముళ్లు గీరుకుపోవడం చేసేవి. వర్షంలో కండ్ల అద్దాలు, జిల్లీ కప్పుకోను రాక, బురదలో ఎన్నోసార్లు పడి లేచేది. అయినా నవ్వుతూ అందరితో వచ్చేది. కిట్టు ఇవ్వమన్నా ఇచ్చేది కాదు. పర్వాలేదు మోస్తాను అనేది. తను మాతో ఉన్నా ఏదో ఒక టాపిక్ మీద మమ్మల్ని

ఆమె భారత విప్లవ భవిష్యత్తును ఎలాంటి వాళ్లలో చూస్తుందో అర్థమై సంతోషించా. ఆమె చాలా దూరంగా, చాలా ముందుకు చూస్తుండడం ముచ్చటేసింది. అట్లని సీనియర్ నాయకత్వం పట్ల లేశమాత్రం చిన్నచూపు వంటిది కూడా తనలో కనిపించేది కాదు. మహిళా ఉద్యమనేత కామ్రేడ్ షీలాదీ జైలులో మగ్గుతుండడం పట్ల పలుమార్లు తను విచారంగా మాట్లాడింది.

అనారోగ్యం తనను ఎంతగా తినేసినా తనలో చురుకుదనం ఏమీ తగ్గలేదనడానికి నిదర్శనం కాంగ్రెస్ ప్రారంభ, ముగింపు కార్యక్రమాల్లో తను కనబర్చిన ఉత్సాహమే. 2001లో లాగానే ఈసారి కూడా తనూ, నేనూ, ఇంకా 'మాలాంటి' వాళ్లం కొందరం అనేక భాషల్లో పాటలు పాడాం. నినాదాలు చేశాం. 'ఇంకిలాబ్', 'మేరా రంగ్ దే బసంతీ', 'క్రాంతి తుర్ఖిలా లాల్‌సలాం'...ఇంకా ఎన్నెన్నో పాటలు. ముగింపు సభలో దీదీ ప్రసంగం మరో ప్రత్యేక ఆకర్షణ. ఆ సందర్భంగా మాట్లాడిన వక్తల్లో దీదీ ఉపన్యాసమే నాతో పాటు చాలా మందిని అమితంగా ఉత్సాహపర్చింది. తను మాట్లాడి పక్కకు రాగానే చేయికలిపి బాగా మాట్లాడారని అభినందించిన చాలా మందిలో నేనూ ఒకడిని.

కాంగ్రెస్ ముగింపుకు వస్తుండగా ఓసారి దొరికిన తీరిక సమయంలో దీదీతో నేను ఇంటర్నెట్ గురించి ఏదో చర్చ రాగా blogging గురించి ప్రస్తావించా. భారత విప్లవ మహిళా ఉద్యమ గొంతుకగా ఒక blog ఏర్పాటు చేస్తే, దానికోసమే కనీసం ఒకరిని కేటాయించగలిగితే, ఫలానా ఫలానా కామ్రేడ్లు దానికి రెగ్యులర్‌గా కాంట్రిబ్యూట్ చెయ్యగలిగితే...'ఎలా ఉంటుందో ఆలోచించండి దీదీ' అని నేను కొంత వివరంగా తన ముందు మాట్లాడినపుడు ఆమె మొఖంలో ఎంతవెలుగు చూశానో నేనిపుడు వర్ణించలేను. ఆమె వెంటనే నాతో గట్టిగా కరచాలనం చేసి ఇది'ఉచిత' సలహా ఏమీకాదు, విలువైన సలహానే అని అంది. ఎందుకంటే ఈ ప్రస్తావన తెచ్చేముందు నేను మా తెలుగులో 'ఉచిత' సలహా అనే వాడుక ఒకటుందనీ, అవసరమైతే స్వీకరించొచ్చు లేదంటే వినేసి ఊరుకోవచ్చు అని హిందీలో ఉపోద్ఘాతం మాట్లాడాను కనుక. ఆ తర్వాత దీదీ ఈ దిశలో ఏమేరకు కృషి చేసిందో, మార్గదర్శకత్వం వహించిందో నాకు రిపోర్టయితే లేదు కానీ ఆమె దాన్ని సీరియస్‌గా పరిగణలోకి తీసుకుందనేది స్పష్టం.

ఇవ్వాళ దీదీ అమరత్వంతో మనం సీపీఐ (మావోయిస్టు)లోని ఏకైక కేంద్ర మహిళా నేతను కూడా పోగొట్టుకున్నామని గుర్తొచ్చినప్పుడు తను లేని లోటు ఇంకా కలచివేస్తుంది. ముఖ్యంగా కాంగ్రెస్ సందర్భంగా, సావనీర్ డ్రాఫ్టింగ్ పని మొదలవుతున్నప్పుడు ఒక సీనియర్ మహిళా కామ్రేడ్ మమ్మల్ని "కామ్రేడ్స్ ప్లీజ్ ఈ కాంగ్రెస్‌లో ఎంతమంది మహిళా డెలిగేట్లు పాల్గొన్నారో రాయకండి" అని కోరడాన్ని దీదీ అమరత్వంపై స్పందిస్తూ ఇటీవలే మరో మహిళా కామ్రేడ్ "ఎలాగోలా కేంద్రకమిటీలోకి వచ్చిన ఏకైక మహిళా కామ్రేడ్‌ను ఇలా అర్ధాంతరంగా కోల్పోవడం దురదృష్టకరం" అని రాయడాన్నీ గుర్తు చేసుకుంటే దీదీ లేని లోటుఇంకా లోతుగా బోధపడుతుంది. తనను కోల్పోయినందుకు ముఖ్యంగా పార్టీలోని మహిళా కామ్రేడ్లు మరెంతగా బాధపడుతూ ఉంటారో అర్థమవుతుంది.

మే మధ్యలో అనుకుంటా....ఏదో పేపర్లో, ఏదో సందర్భానికి జతచేసి దీదీ మలేరియా బారినపడి కనుమూసినట్టు వార్తొకటి వచ్చినట్టు ఒక సీనియర్ కామ్రేడ్ చెప్పినప్పుడు ఇది నిజం కాకుంటే బాగుండునని మనసెంతగా పరితపించిందో! తర్వాత కొద్ది రోజుల్లోనే నా భయాన్ని నిజం చేస్తూ ఆంధ్రజ్యోతి డైలీ, సాహితీ పేజీలో దీదీ అమరత్వంపై వీవీ రాసిన కవిత చూశాను. ఇక ఇది అబద్ధం కాదు, దీదీ ఇక లేదనేది మెదడు మొద్దుబారేంత కఠోర సత్యం. తనతో పాటు కమిటీలో చాలాకాలంపాటు కలిసి పనిచేసిన ఒక సీనియర్ కామ్రేడ్ నా వెంటే ఉన్నాడారోజు. పేపర్లో వీవీ కవిత వచ్చిందని చెబితే దాని సారాంశం హిందీలోకి అనువదించి చెప్పమని కోరాడున్నన్ను. ఎలాగోలా కొన్ని పదాలైతే కూడగట్టుకొని చెప్పే ప్రయత్నం చేసాగానీ, మళ్లీ 'భయం'తో ఆగిపోయా. సరిగ్గా ఐక్యతా కాంగ్రెస్‌లో అనువాదం పనిచేసినప్పుడు కలిగిన 'భయమే' అది! దీదీ ఎక్కడ నా తప్పును దొరకబడుతుందోననే చిత్రమైన 'భయం'! బహుశా ఇకముందు కూడా నేనేది అనువదించబూనుకున్నా ఈ 'భయం' నన్ను వెంటాడుతూనే ఉంటుందేమో... తన అమరత్వాన్నీ, తన త్యాగాన్నీ, తన ప్రజ్ఞాపాటవాల్నీ గుర్తుచేస్తూ. ✻

చర్చల్లోకి దింపి విషయాలు వివరంగా అర్థం అయ్యేలా సహకరించేది. లోతుగా చర్చల్లోకి దించేది.

చాలాసార్లు ప్రకృతి గురించి ఇలా అనేది - పట్నంలో సైకిల్ ప్రయాణం ఎక్కువ చేసేదాన్ని, ఇక్కడ నడక పెద్ద సమస్య ఏం లేదు. ఇక్కడికి వచ్చాక పొల్యూషన్ లేని స్వచ్ఛమైన వాతావరణం. మందులులేని బియ్యం తినడంతో నాకు రెసిస్టెన్స్ పవర్ పెరిగింది. రెండు మూడు గంటలు నడక ఐనా ఇబ్బంది లేదు అనేది. ఇక్కడ పర్యావరణాన్ని కాపాడే బాధ్యత కూడా మనం తప్పక చేయాలనేది. అలాగే పర్యావరణంపై ప్రజలకు, సభ్యులకు ఒక క్లాసు తీసుకొని ఎడ్యుకేషన్‌గా ఉదాహరణలతో సహా బోధించేది.

మేము పనిచేస్తున్న ఏ.సి.లో ఒక దళంలో దీదీ వయసున్న కా. ఎస్.ఆర్. డిసిగా ఉండేవాడు. ఆ కామ్రేడ్‌తో పోటీపడి రన్నింగ్, క్రావెలింగ్, ఐ.ఏ.డి.లు, పులప్స్ చేసేది. అందరిలో ఉత్సాహాన్ని నింపేది. నిరంతరం ఏదో ఒక పనిలో పాల్గొనేది. 1999లో దీదీ, మేమంతా సార్కిన్ గూడెంలో అంటే బాసగూడెంకు ఒకటిన్నర కిలోమీటర్ దూరంగల గ్రామంలో డేరా వేశాము. పోలీసులు వచ్చారు. మన కామ్రేడ్స్ పోలీసుల్ని చూసి ఫైర్ చేశారు. నేను, దీదీ ఒకరి తర్వాత ఒకరం కవర్ టు కవర్ వస్తుండగా కమాండర్ ఇటు ఇటు అంటూ మమ్మల్ని రమ్మనగా దీదీ చేయి పట్టుకొని మేం అవతలికి చేర్చాక కానీ దీదీని క్షేమంగా చేర్చగలిగాం అనుకున్నాం. దీదీకి ఇదే మొదటిసారి ఫైరింగ్. సంఘ నాయకులు, ప్రజలు దీదీ చనిపోయింది కావచ్చు అని దళం ఎక్కడ ఉంది అని ఆరా తీస్తూ వచ్చి కల్సి వెళ్లారు. మేం అందరం కల్వగానే పాపం! ఆ దీదీ ఎక్కడుంది? క్షేమంగా ఉందా? దీదీ ఫైరింగ్ నుండి బయట పడిందా? లేదా? అని మేము ఆలోచించాము అంటూ దీదీకి ఆప్యాయంగా చేతులందించి లాల్‌సలాములు చేసేవారు. దీదీకి ఈ ఫైరింగ్ కూడా కొత్త అనుభవాన్ని, ధైర్యాన్ని ఇచ్చింది. "మన ప్రతిఘటన ద్వారానే మనం రక్షించబడతాము. ప్రజల సహకారంతోనే ప్రతి విజయాన్ని సాధిస్తాము" అంటూ చెప్పేది.

బాసగూడెం దగ్గర 'కోట చెరువు' అనేది ఉంది. ఆ చెరువు కట్టను కడితే 9 గ్రామాలకు రెండవ పంటకు నీళ్లు అందుతాయి. అయితే ప్రభుత్వం ఆ పని చేయలేదు. మన పార్టీ ఆ పని చేసేందుకు ఒక ఐదుగురితో చెరువు కట్టించేందుకు ఒక చెరువు కమిటీని నిర్మాణం చేసింది. ఒక లక్షా 95 వేలతోనే ఆ కట్టను సమిష్టి పనిలో భాగంగా 30 గ్రామాల ప్రజలు పోశారు. పార్టీ నాయకత్వంలో మన ప్రజలు పోసుకుంటున్నది ప్రభుత్వం (సర్పంచులు) చూసి దానికి పది లక్షల రూపాయలను మంజూరు చేసింది. అయితే ప్రజలతో చర్చించి డబ్బు తీసుకోవద్దు అనుకున్నాము. ఆ చెరువును రెండు, మూడు నెలల్లోనే పూర్తి చేయడం జరిగింది. ఈ చెరువు పోయించేందుకు, ప్లానింగ్‌లోనూ, కమిటీని నడిపించి గైడెన్స్ ఇచ్చే దాంట్లోనూ కా.జానకి దీదీ ఉంది. ప్రజల సమిష్టి పనులను వారి ఐక్యతను దీదీ కళ్లారా చూసి, జరిగిన ఫైరింగ్‌నూ దృష్టిలో పెట్టుకొని ఈ వాక్యాలు అప్పుడప్పుడు గుర్తు చేస్తూ చెప్పేది.

అలాగే చెరువులు ఎలా తవ్వాలి. పానీక బండార్ వాటి పద్ధతి, నీటి నిలువ, అడవి రక్షించే విధంగా ఎలా చేద్దామనేది డివిసిలో చర్చ జరిగింది. ఎస్.జడ్‌సి అన్ని రకాల చర్చలను దృష్టిలో ఉంచుకొని పుస్తకాన్ని అచ్చు వేశారు. దాన్ని హిందీలోకి దీదీ అనువాదం చేశారు. ఇలా కా. జానకి దీదీ ఏ పనిలో పాల్గొన్నా దాన్ని పూర్తిగా విశ్లేషించేది. స్పష్టంగా, సూటిగా, ప్రేమగా విషయాలను చెప్పేది.

నేను కొంత ఎక్కువ టీ తాగేదాన్ని. దీదీ బయటి నుండి వచ్చేటప్పుడు ఒక చిన్న గ్లాసు తెచ్చుకుంది. తన గ్లాసు చూయిస్తూ ఇంతే టీ తాగాలి. ఎక్కువ తాగితే అల్సర్ వస్తుంది. ఆరోగ్యానికి మంచిది కాదు అనేది. దీదీ మీరు కొత్తగా వచ్చారు కదా. కొద్దికాలం ఐతే అది సరిపోదు. మళ్లీ కొంత కావాలి అంటారు అంటే అదేంలేదు అనేది. ఇలా ఒకటి రెండు నెలలు గడిచాక కబుర్లు చెబుతూ.... టీ తాగుతూ కొద్దిగా ఛాయ్ మిగిలిందా అంటూ చిన్నగా అనేది. తప్పకుండా ఉంది దీదీ అంటే "అబ్బో..... నీకు మోక దొరికింది. ఏం చేస్తాం ఇది అడవి కదా, అలాగే నాకు అడవిలోకి వచ్చాక అల్సర్ తగ్గిందిలే" అంటూ నవ్వుతూ తన చిన్న గ్లాసులో టీని మరోసారి నింపేది.... ఆ తర్వాత ఆ చిన్న గ్లాసును మేము తీసేయించి మొహమాటం లేకుండా సరిపడే గ్లాసు ఇచ్చాము. నన్ను మొత్తానికి మీ తాగుడులో కలిపారు కదా అంటూ చిరునవ్వు నవ్వేది.

దక్షిణ్ బస్తర్‌లో 98-99 తీవ్ర కరువుకాలం కొనసాగింది. ఆ టైంలో ప్రజలకు కరువు. నూకలు కొని తెచ్చుకొనే వాళ్లు. అవి రాళ్లు, మట్టి పెళ్లలతో కల్సి ఉండేవి. అన్నంలోకి కూరగా చింతపండు పులుసు, పులుసు అంటే చింతపండుకు పండునే వేసి (గుజ్జును పడవేయకుండా) మిరపకాయల ముద్దనూరి కొంత ఉప్పువేసి బాగా ఉడికించి తెచ్చేవాళ్లు (పళ్ల నొప్పులున్న వారికి చెప్పతరంలేని బాధ). నార్త్ ఇండియాలో పులుసు తినే అలవాటు తక్కువ. అయినా ఆ అన్నాన్ని నిజంగా ఒక సవాల్‌గానే తీసుకొని దీదీ తినేది. ఒక్కొక్క ముద్ద తింటూ కొన్ని నీళ్లు తాగి మళ్లీ ఒక ముద్ద తినేది. ఒక గంటసేపు చాలా కష్టపడి కడుపు నింపుకునేది.

మళ్లీ ఇలా అనేది మనం ఉండాలి, పనిచేయాలి అనుకుంటే తప్పక తినాలి కదా. కొద్దిగా లేటు అయినా పర్వాలేదు. తినాల్సిందే. కడుపు కాలితే పనిచేయలేం అని నచ్చ చెప్పేది. ఏమీ అనేది కాదు. ఆ కామ్రేడ్ పట్టుదలను ఆచరణను చూసి నిజంగానే నేను చాలా చాలా ఇన్‌స్పైర్ అయ్యాను. శ్రమజీవుల బుద్ధిజీవులంటే ఇలాంటి వారే కదా! ఒక శ్రామిక మేధావితో కలిసి పనిచేస్తూ నేర్చుకునే అవకాశం దొరికింది.

99లో ప్రజాసంఘాల కాన్ఫరెన్స్‌లు జరుపుతున్నాము. డివిజన్‌లో గ్రామస్థాయి నుండి రేంజీ డివిజన్ వరకు ఆ టైంలో దీదీకి భాష రాకపోయినా ప్రజాసంఘాలకు "జాతీయ, అంతర్జాతీయ" పరిస్థితులపై ఒకరోజు క్లాసు చెప్పింది. ఆ సందర్భంగా దీదీ చదువురాని ఇక్కడి ప్రజలకు రాజకీయాలు బోధించేందుకు, పేపర్స్‌లో, పత్రికల్లో రాజకీయనాయకుల ఫోటోలు, మహోపాధ్యాయుల ఫోటోలు వగైరా చార్టులుగా తయారు చేసుకొని అన్నింటిని అతికించి అమెరికా యుద్ధోన్మాదాన్ని, పరిణామాలను చేయి సైగలతో, యాక్షన్‌తో విషయాలను చాలా సులభంగా అర్థం చేయించేది.

ఇంకోసారి రాజకీయ బోధకురాలు, డాక్టర్‌గా మాత్రమే కాదు, గాయకురాలు కూడా (కళాకారిణి).... మా తుజా లాల్ సలాం అనే మరాఠీ పాటను చాలా లీనమై పాడేది. ఈ పాట దీదీ పాడితేనే బాగుండేది. ఆ గొంతులో ఎంతో ఆత్మవిశ్వాసంతో పాట ప్రతిధ్వనించేది.

ఇప్పటికీ దీదీ దక్షిణ్ బస్తర్ నుండి 6-7 సంవత్సరాలు దూరంగా ఉన్నా తాను తిరిగిన గ్రామాల ప్రజలు, ముఖ్యంగా మహిళలు, దీదీ ఇప్పుడు ఎక్కడ ఉంది. బాగుందా, చాలా బాగా మాకు రాజకీయాలు, విషయాలు చెప్పేది. కలిస్తే లాల్‌సలాం చెప్పు దీదీ అని అంటారు. కాంగ్రెస్‌లో కల్సిన తర్వాత ఏరియాలోని, ఇక్కడి కామ్రేడ్స్‌కు దీదీ నాకు ఒక దగ్గర కల్సింది బాగుంది. మీకందరికి లాల్‌సలాంలు చెప్పింది అంటే చాలా సంతోషించారు. కా.ఇడుమాల్ కంపెనీ-3 కమాండర్ దీది బాగుందా అని ప్రత్యేకంగా అడిగి నాకు హిందీ నేర్పించింది దీదీయే, దీదీ నేర్పడంతో నా భాష మెరుగయ్యింది అంటూ గుర్తు చేసుకున్నాడు. ఇలా ఎందరితోనో తను తిరిగినంత అడవి, ప్రజలు ఆమెను ఇప్పటికీ మరువలేరు.

తనకు ఎండాకాలం అల్సర్ మంట పెరిగేది. ఏమైనా తినేందుకు తెప్పిద్దాం అన్నా వద్దు పర్వాలేదు అనేది. రెండు, మూడు బిస్కెట్లు తిని నీళ్లు తాగి సరిపెట్టుకునేది. కానీ తన కోసం ప్రత్యేకంగా (అనారోగ్యం ఉన్నా) ఏమీ వద్దు అనేది. ప్రజలు తెచ్చే జావ (అంబలి) అన్నంతోనే తనకు ఇబ్బందిగా ఉన్నా అందరికీ ఆదర్శంగా నిలిచిన కమ్యూనిస్టు నారి ఆమె.

ఆ కామ్రేడ్‌తో కలిసి పనిచేసినన్ని రోజులు ఎలాంటి సమస్యలు లేకుండా కామ్రేడ్లీ వాతావరణంలోనే ఉన్నాం. చిన్నవాళ్లతోనైనా తన తోటి వారితోనైనా పెద్ద వయస్సు గలవారితోనూ దీదీ కల్సి ఉండే తీరు ప్రతి పార్టీ కార్యకర్త తప్పక నేర్చుకొని ఆచరించదగినవి. ఈ సందర్భంగా మరోసారి దీదీ ఆచరణ జ్ఞాపకాలను కర్తవ్యంగా తీసుకునేందుకు ఉపయోగపడతాయని నమ్ముతున్నా.

బుద్ధిజీవి, శ్రామిక మహిళా కమ్యూనిస్టు నేత ఆమె. ఐక్యతా కాంగ్రెస్-9వ కాంగ్రెస్‌లో ఉన్నత కమిటీలోకి ఎన్నికైన అనంతరం అతి తక్కువ కాలంలోనే కా.దీదీని మన పార్టీ కోల్పోవడం ఉద్యమానికి ఎనలేని లోటు. కాని నేడు ఆమె ఆచరణను, రాజకీయ లక్ష్యాలను, కర్తవ్యాలను, కలలను, ఆశయాలను ముందుకు తీసుకుపోయేందుకు, తుదకంటా ఆమె పోరాట ఆచరణ స్ఫూర్తితో ముందుకెళ్లుదామని శపథం చేస్తూ ఆమె స్మరణలో.... కన్నీటి జోహార్లు.... అర్పిస్తూ....

*

సంస్మరణ

☆ నర్మద

# మరపురాని స్మృతులు

కామ్రేడ్ అనురాధ గాంధీ (దీది)తో 1984 నుండి పరోక్షంగా పరిచయం ఉన్నది. కాని 1997 డిసెంబర్‌లో బైలడిల్లా కొండల పాదాల వద్ద మేం మొదటిసారి కలుసుకున్నాం. అక్కడ దండకారణ్యం పార్టీ ప్లీనరీ సమావేశ సన్నాహాలు జరుగుతున్నాయి. విడత విడతలుగా ప్రతినిధులు వస్తున్నారు. అతిథుల ఆహ్వానం కోసం బారులు తీరి నిలుచున్న మాకు కొంత దూరం నుండి వస్తున్న కామ్రేడ్స్ కనిపించారు. అలా వస్తున్న వారిలో ఓ మెరుపుతీగ కనిపించింది. ఆ మెరుపుతీగను ఉద్దేశిస్తూ వరుసలో నా ప్రక్కనే నిలబడ్డ సహచరుడు, 'ఆమె ఎవరో తెలుసా?" గుసగుసలాడాడు. అయితే తర్వాత తను పేరు చెప్పకుండానే నాకు అర్థం అయింది. అలా మొదలయింది దీదితో పరిచయం. 'నీ గురించి చాలా విన్నాను. నిన్ను చూడాలన్న కోరిక ఇలా తీరింది' అంటే ఆమె నా భుజం మీద చిన్నగా తట్టింది. ఆ సందర్భంగానే దీదిని, 'సంఘర్ష రత్ మహిళ' కోసం వ్యాసం రాయమని కోరగా తర్వాత గుర్తు పెట్టుకుని మరీ రాసి పంపింది. ప్లీనం ముగిసింది. ఎవరి గమ్యానికి వాళ్ళు తిరుగుప్రయాణం, అందరం విడిపోయినం.

తర్వాత కాలంలో నేను 'ప్రభాత్' స్టాఫ్ నుండి గడ్‌చిరోలికి మారాను. గ్రామీణ ప్రాంతాలలో ఉద్యమాన్ని అధ్యయనం చేయడానికి దీది ముంబాయి నుండి బస్తర్‌కి వచ్చింది. దీది దండకారణ్యంలోనే ఉన్నదని తెలిసినంక మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచినాయి. ఆ కాలంలో గడచిరోలిలో నిర్బంధం ఎక్కువ అనే భావన పార్టీ శ్రేణుల్లో ఉండేది. అందుకేనేమో, 'ఉద్యమంలో ఎదురవుతున్న సవాళ్ళను ధైర్యంగా ఎదుర్కొంటున్నావు' అంటూ నా భుజం తట్టేది.

డిసెంబరు 2000 సంవత్సరంలో దండకారణ్య జోనల్ పార్టీ 2వ మహాసభ సందర్భంగా మరోసారి కలుసుకున్నాం. అప్పటికి ఫీల్డ్‌లో ప్రొబేషన్ పూర్తి చేసుకొని మళ్ళీ మహారాష్ట్రకు వెళ్ళిపోయింది. రాష్ట్ర కమిటీకి ఎన్నికయిన మొదటి మహిళగా దీదికి అభినందనలు తెలియజేసినం. కాన్ఫరెన్స్‌కు దీది పర్యవేక్షకురాలిగా వచ్చింది. కాన్ఫరెన్సు హాలులోకి దీది రావటం చూసిన నేను, 'మనం మహారాష్ట్ర వాళ్ళం ఒక దగ్గర కూర్చుందాం' నవ్వుతూ దీదిని ఆహ్వానించాను. దీది తన సహజమైన శైలిలో తలపక్కకి వాలేసి నవ్వుకుంటూ నా ప్రక్కకు వచ్చి కూర్చుంది.

మహా సభ కార్యక్రమాలు ప్రారంభం అయినాయి. డికె పార్టీ సెక్రటరీ మహాసభల నిర్వహణ కోసం ప్రవేశపెట్టిన అధ్యక్ష వర్గపు పానల్‌లో నా పేరు విని నాకు బోల్డంత నిరాశ కల్గింది. దీదితో ఎన్నో అనుభూతులను కలబోసుకోవాలనీ, ఆమె మేధో ప్రవాహంలో జలకాలాడుకోవాలనే నా ఆకాంక్షకు బ్రేకు వేసినట్లయింది. నేను అధ్యక్ష వర్గంలో, మా ఎదుటి వరుసలో పర్యవేక్షకుల మూడు వరుసలో దీది కూర్చున్నాం.

అధ్యక్ష వర్గంలో ఉంటూ తడబడినప్పుడు, 'మంచిగా నడిపిస్తున్నావు' అంటూ ప్రోత్సహించేది. డి.కె రాజకీయ నిర్మాణ సమీక్షలో మహిళారంగం పార్ట్‌పై మేం చర్చ పెట్టినప్పుడు మాకు మంచి సహకారం, గైడన్సు అందించింది. అదే క్యాంపుకు వీడియో ఫిల్మ్ తీసే మిత్రులు వచ్చారు. మా త్రయం (మైన, సుజాత, నేను)లో నుండి మైనతో, నాతో ఇంటర్వ్యూలు ఇప్పించారు. అప్పుడే మొదలైన 'మొబైల్ ఎకడమిక్ స్కూలు'కు హిందీ టీచరుగా హాజరయిన ఒక టీచరుగా నాతో ఇంటర్వ్యూ తీసుకున్నారు. దీది తను దగ్గర ఉండి ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో చెప్పింది. కెమెరా ముందు టెన్షనుగా కూర్చోవద్దని చెప్పింది. అదే క్యాంపులో పీపుల్స్ గెరిల్లా ఆర్మీ స్థాపన జరిగింది. ఆ సందర్భంగా ప్రజా గెరిల్లా సైన్యపు విన్యాసాలను చిత్రీకరించటం కోసం గెరిల్లాలలో పాటు బుడి బుడి అడుగులతో అటు ఇటు పరుగులు తీసే దీది ముద్దు రూపం నా కనుపాపలలో కదలాడే సజీవ చిత్రం.

దండకారణ్య మహాసభ మూడు భాషా ప్రవాహాల సంగమం. తెలుగు నుండి హిందీ, కోయ భాషలలోకి అనువాదం తడబడినప్పుడు సరయిన పదాలు, భావాలు అందించే ఆమె భాషా ప్రావీణ్యపు ప్రతిభను చూసి ముందు ఆశ్చర్యపోయాను, తరువాత ముచ్చట పడ్డాను. మాండలికంలో ఎన్ని వైవిధ్యాలున్నా కోయ భాషలో సాహిత్య ప్రచురణను బలంగా సమర్థించిన వాళ్ళలో దీది, నేను ఉన్నాం.

ఆ తరువాత 2001 మార్చిలో జరిగిన పీపుల్స్‌వార్ పార్టీ 9వ కాంగ్రెసుకు హాజరయిందనీ, అందులో తాను ప్రత్యామ్నాయ సభ్యురాలిగా ఎన్నుకోబడిన విషయం 2007 నుండే కేంద్ర మహిళా సబ్ కమిటి సభ్యురాలిగా కూడా ఉంటూ పరోక్షంగా మమ్మల్ని అంటే దండకారణ్య మహిళా సబ్ కమిటీని గైడ్ చేస్తున్న విషయం కా. షీలాదీ అరెస్టు తర్వాత అనుకుంటా తెలిసింది.

దీదితో చివరి కలయిక జనవరి 2007 ఐక్యత కాంగ్రెసు సందర్భం. దేశం నలుమూలల నుండీ విడతలుగా ప్రతినిధులు చేరుకుంటున్నారు. సాయం సంధ్య శీతగాలుల మసక చీకట్లలో మేం విడిదికి చేరాం. ఆ చీకట్లో ఆమె నన్ను స్పష్టంగా గుర్తు పట్టింది. 'నర్మద వచ్చిందా' అనుకుంటూ కరచాలనం కోసం చాపిన చేతులు గట్టిగా కౌగిలించుకున్నాయి. ఈసారి మా ఇద్దరిదీ ఒకటే విడిది. రోగి కోరుకున్నదీ, వైద్యుడు ఇచ్చిందీ ఒకటే అన్నట్లుగా కలిసొచ్చింది. దీదితో గడపాలనే బలమైన కోరిక ఈ రూపంలో తీరింది. అప్పటి నుండి విడిపోయే వరకు ఆమె నీడలో నీడగా ఒదిగిపోయాను. అది ఏ మోతాదుకు పోయిందంటే మా డికె ప్రతినిధులతో వేరు పడిపోయేంతగా సాగింది. మా శ్రీకాంత్ ఆఖరికి అనేశాడు. 'మా నర్మద పొద్దంతా పోడియం వెనుక మాయం అయిపోతుంది. మిగిలిన సమయం నీ నీడలో కలిసి పోతుంది' అంటే దీది హాయిగా నవ్వేస్తూ, 'పద నర్మదా! పోదాం' అంటూ ముందుకు కదిలింది.

కాంగ్రెసు ప్రెసీడియంలో ఉంటూ ఒకరి భావాలు మరొకరు సన్నిహితంగా, సూక్ష్మంగా పంచుకునే అవకాశం దొరికింది. ఆంధ్ర రాష్ట్రంలో చర్చల ఎత్తుగడపై కాంగ్రెసు హాలులో వేడి వేడి చర్చలు జరిగి విషయం ఓటింగుకు వచ్చింది. చర్చల ఎత్తుగడను వ్యతిరేకిస్తూ ఓటు వేస్తూ చేయి లేపిన నన్ను చూసి, 'నువ్వు కరడుగట్టిన మావోయిస్టువి కదూ!' దీది నవ్వుతూ అన్నది. సామ్రాజ్యవాదం దోపిడీకి ప్రధానం వాహకంపై ఓటింగు సందర్భంగా కూడా మా ఇద్దరి అభిప్రాయాలు వేరయ్యాయి.

డాక్యుమెంట్లపై ఆమె ప్రవేశపెట్టిన సవరణలు కొన్ని అయినా, అన్నీ ఆమోదించబడినాయి. 'మహిళలపై రాజ్యహింస' కాంగ్రెసు తీర్మానం చేస్తే బాగుంటుందని మాలతి చేసిన ప్రతిపాదనను స్టీరింగు కమిటీ ఆమోదిస్తూ తీర్మానం రాసే పని మాకే అప్పగించింది. స్కోలోరసిస్ వ్యాధితో చేతి వ్రేళ్ళన్నీ గట్టిగా బిగుసుకుపోగా మిగిలిన రెండువేళ్ళతో కంప్యూటర్ కీ బోర్డ్‌ని సునాయసంగా మీటుతూ టైపు చేస్తుంటే ప్రక్కనే కూర్చుని తీర్మానం రాసుకుంటున్న అమన్ అబ్బురమైన ప్రశంసతో దీదిని చూడటం నేను గమనించాను. మనం పది వేళ్ళతో చేసే వేగానికీ ఆమె రెండు వేళ్ళతో చేసే వేగానికి నాకయితే ఏం తేడా కనిపించలేదు.

*(మిగతా 96వ పేజిలో....)*

కవిత్వం

## [illegible] కవితలు రెండు, ఒక పాట

### రాత్రుల్లో సెంద్రుడు

ఒత్తుండ పోతుండ రాత్రుల్లో సెంద్రుడు
నా ముద్దు సెంద్రుడు - ఎన్నెల్లకాంతుడు
ఎదురు చూసి కండ్లు కాయలు గాసేనురో
నేనేట్ల జూస్తునో - నేజీవితఖైదినో
పున్నమిరోజేనాకు పండుగనుకుంటను
సూపదయ్య వార్దరు - ఎన్నెల్ల ఎలుగులు॥బత్తు॥

నాగుడిసె సందుల్లో దోబూచులాడిందు
వాకిట్లోకొచ్చి సూస్తే పిండారబోసిందు
మంచెక్కినా తోటే కావలిగాసిందు
నా మోటబాయిలోనే జలకాలాడిందు
జైల్లోన సెంద్రుడా- నీజాడ లేదయ్య
నీతోనె ఎడబాటు - ఎన్నేల్ల బాదయ్య ॥బత్తు॥

గోరుకొయ్యలెక్కి మాఉరుసిస్తివా
మూలసుక్కను గల్సి ముద్దాడిపోతివా
ఇప్పపువ్వు లెక్క ఇలనిండ రాల్తివా
కోడిపుంజు నోట దాగి కొక్కొరకో అంటూ
నీపూతలేవయ్యా - ఆ కూత లేవయ్యా
ఎర్రని లైటయ్యా - గంటకో కూతయ్యా ॥బత్తు॥

ఈ జైలు గోడెక్కి నువ్వెప్పుడోస్తవని
మాపల్లె ముచ్చట్లు సల్లంగ జెప్తనని
ఆలుపిల్లల గోడు అర్సుకుని వస్తవని
నడిజాము దాక నేను మేలుకునే ఉంటిని
కలలోన వస్తవా - కన్నీల్లు దుద్తవా
గుండె ధైర్యమిచ్చి - గుర్తుండి పోతవా ॥బత్తు॥

ఆకలితో అన్నలు అర్ధరాత్రిచ్చిరని
సద్దిబువ్వెత్తుకుని సర్ర సర్రనే బోతె
సుద్దులంటు కూసుంటె తెల్లారిపోతదని
కొండెక్కి అన్నలతో మాయమైపోతివి
నిన్నెట్ల సూస్తూను సద్దెట్ల మోస్తునూ
పొద్దన్నగుంక ముందే - బ్యాట్నే తింటుంటె ॥బత్తు॥

వెన్నెల పొదుపుకు కన్నుల్లో వెలుగొచ్చు
నుల్క మంచామెక్కి రాగాలు దీయొచ్చు
కష్టాలు కడగండ్లు కొంతైన మరువొచ్చు
సూద్దామంటె నేడు సూపయిన అందదు
నిన్నెట్ల జుస్తూనో పల్లెట్ల మర్తునో
ఆ జన్మఖైదిగా - అరిఘోసపడ్తునో ॥బత్తు॥

కాముని పున్నానికి కలిసేటి దారుందా
రంజాన్ నెలవంకను సూసేటి తొవ్వుందా
లాకప్పులోపటికి తొంగన్న సూడయ్య
బొర్డుకు దయ ఉంటె రోజునీవెంటయ్య
సెప్పయ్య జవాను - సెంద్రయ్య ఊసులు
నాముద్దు సెంద్రుడా -ఎన్నెల్లకాంతుడు ॥బత్తు॥

కలువరేకులకేమో కనువిప్పుజేస్తివంట
మొగిలిరేకులపైన గందాలుజల్తివంట
కన్నీరో పన్నీరో మాకండ్లు జూడయ్యా
కరుణించి ఈ చెరను నువ్వన్న బాపయ్యా
గుండెల్లో సెంద్రుడా గుడినేగట్టిస్తమూ
బతుకంత సలువని బాసలేజేస్తము ॥బత్తు॥

తప్పులు ఒప్పులు జరగంది యాడయ్యా
పేదోని తప్పులకే పెద్ద పెద్ద శిక్షలయ్యా
అడ్డిగాసి నెన్నెలని ఆడిపోసుకుంటారు
ఆడనే న్యాయంకై పోరాటముందిగదా
న్యాయాన్ని పంచయ్యా - మా శిక్షలు దెంచయ్యా
జీవించె హక్కులపై - ఎన్నెల సారించయ్యా ॥బత్తు॥

### పసివాడా మన్నించరా

పసివాడ కసిరేగకు
నీముసి ముసినవ్వుల
బిత్తర చూపుల
ముసిరే విషాదపు
ఉసురే ఈ జైలని ॥పసి॥
అమ్మే నీలోకం - ఆటి నీలోకం
అ,ఆలు అంకెలు - అవునా నీలోకం
నీ చూపులకు - తెలియని
కన్నీళ్లే ఈలోకం ॥పసి॥

అమ్మొక చోట - నాయినొకచోట
నడుమన రాజ్యపు లక్ష్మణ రేఖ
ఇల్లో బడో కాదిది
కల్లోలపు కడలిరా ॥పసి॥

ఆటాడె పక్షుల్ని - వేటాడే రోజులు
పెరుగు బువ్వపై - పేరిన నులుగులు
కపట మెరుగనట్టి
బాలునికి సంకెళ్ళు ॥పసి॥

ఉయ్యాల జంపాల - ఊగరాదీ నేల
కలియుగ కృష్ణులు - కాదెవ్వరీనేల
కంసుని కత్తయితే
కాసుకుని ఉంటుంది ॥పసి॥

నేడేమో చీకటి - రేపటికి వెలుగులు
ఆశగ మీ బాల్యం - మణి దీపమగును

ఎదిగే నీతరము కిది
బడియవునో బడేయవునో ॥పసి॥

పసి వాడమన్నించరా
నీ నవ్వుల పువ్వులురాలే
చూపుల కద్దులు గీసె
బందీఖానను నీకు
అందించినందుకు
"పసివాడమన్నించరా"
*(లింగయ్యతో పాటు 4 ఏండ్ల మణీష్ జైలు పాలయినందుకు పిల్లవాడికి వేడుకోలుగా...)*

## అనురాధ గాంధీ

భూమ్యాకాశాలను సయవాటాలేసి
నిటారుగా నిలబడ్డప్పుడల్లా
సావిత్రి బాయినుండి అనురాధాగాంధీదాకా
ఫాతిమా బేగం నుండి రంగవల్లి దాకా
పితృస్వామ్యానికి తలవంచని
సమాంతర రేఖలు పరావర్తనం చెందుతాయి
ఝాన్సీరాణి స్వాతంత్ర్య సంగ్రామపు
కలలకోన లేనా ఈ మయసభలు?

పాండవుల కొలువులోనే పాచికలాడ్తూ
మహిళా బిల్లును బేరమాడ్తున్నాయి
ప్రతిఘటన అనివార్యమైనప్పుడు
గణతంత్ర రూపమై గర్భం దాల్చిన దండకారణ్యపు ప్రసవవేదనల్నీ
లోకానికి చాటింది అనురాధగాంధీ
దళిత పులుల్ని సత్యశోధనల్నీ ఆకళింపు జేసుకుని
భారత విప్లవాన్నీ రచించినప్పుడల్లా
చాకలి అయిలమ్మాలా - నిర్మలక్క త్యాగంలా
ఒక అనురాధ సాక్షాత్కరిస్తుంది
రెండు గేట్ల బొంబాయి టాటా మిల్లులో
డాంగీ- అంబేద్కర్‌లై వీడిపోయి ఓడినప్పుడు
షోలాపూర్ కమ్యూన్ గుణపాఠాలు ధారబోసిందీ అమరాధ

డాక్టర్ కోట్నీస్ బృందాన్నీ చైనా విప్లవాని కందించి
ప్రజల డాక్టరు వినాయక్ సేన్‌ను బంధించిన
భారత పాలక వర్గాల నీతిని చండాడుతూ
అనురాధ ప్రశ్నల కొడవలెత్తింది
హక్కుల సమరమై అంది వచ్చింది
రాహువు కేతువులతో పోరాడుతూ
నిత్యం విద్యాలయాల్లో వీధినాటకాల్లో
అంటరాని వాడల్లో అరణ్యంలో
నిలువెత్తు నిజంగా ప్రజ్వలనమయ్యే
ప్రతి ఆనవాలు అనురాధ గాంధీ
ప్రతి ఆత్మీయతా అనురాధగాంధీ
అనురాధా......
ఎప్పుడూ భూమ్యాకాశాల్ని
వంగి వంగి సలాం చేయించుకునే పురుషాధిక్యతపై
పూసిన సమాంతర రేఖవు నీవు
విప్లవ కమ్యూనిస్టు కాంతివి నీవు

ఫాతిమా బేగం - మొట్టమొదటి ముస్లిం
ప్రధానోపాధ్యాయురాలు
డాక్టరు వినాయాక్ సేన్- చత్తీస్‌గడ్ ప్రభుత్వం
జైల్లో బందించింది మానవహక్కుల నేత
డాక్టరు కోట్నీస్ - భారతదేశంనుండి
వెళ్లి చైనా విప్లవంలో సేవలందించి
అమరుడైనాడు.

## అరసవిల్లి కృష్ణ కవితలు రెండు

### దారి చూపిన అడుగు

ఆమెలాంటి
ఎవరయినా కనబడవచ్చు.
నీటిజల ఆమెలో ఉండవచ్చు.
పోలికలు అనేకం
ఆకాశాన్ని చూచి ఆకాశమంటాం.
నదిని చూచి నది అంటాం.
ఆమె కూడా అంతే.
నడుస్తూ, నడుస్తూ
నా నుండయినా, నీనుండయినా.
నిష్క్రమిస్తుంది.

ఓ పాఠంవినో
ఓ అనుభవం వినో
ఆమె వెళ్ళిఉండదు.
కాళ్ళకింద భూమి చీలుతున్న
చప్పుడు విని ఉంటుంది
నువ్వయినా, నేనయినా వెళ్ళడానికి
ముళ్ళకంచెలను ఏరి
నేలను, చదును చేసింద్ధి
స్త్రీలు, నడిచినదారి
వెన్నెల కాలవలా ఉంటుంది.
మానసిక చిత్రహింసల మధ్య
కెరటాలై పొంగే సముద్రాలు.
అయినా.
నిలబడే నీళ్ళుతాగాలన్నా
నీడపై నమ్మకాన్ని వదులుకున్నవారు. -
ఆమె కనబడవచ్చు.
ఆమెలోపల గర్భసంచి ఉంటుంది.
ఆ సంచిలో రక్తనదులుంటాయి.
ధ్వంసం చేయాల్సినవన్నీ చేశాం
ముఖాలపై పతాకాన్ని ముద్రించాం.
దీపాన్ని వెలిగించడం నేర్వలేదు

ఆమె ఎవరికయినా కనబడవచ్చు.
మనం శ్వాస పీలుస్తున్న చప్పుడు
వినిపించేందుకయినా ఆమె ముందు నిలబడాలి

మననుండి మనం విడిపోతున్నదశ
మనల్ని మనమే పోల్చుకోని దశ.
ఓ జీవన విధ్వంసంనుండి
ఆమెను వినాలి.
వినడమంటే
ఆకలి వేయనంత ఆశగా వినాలి.
చలనం లేని దేహంపై
పుష్పగుచ్ఛాలు కాదు
దీప స్తంభం కావాలి.

దోసిలిలో ఇవ్వడానికి ఏదీలేకున్నా
చివరిసారి కన్నులలో దాచుకోవాలి
ఆమెలాంటి అందరికీ
ఆమె తెలియకపో వచ్చు
వెన్నెల జలతారులాంటి పాము
కాటు వేసే సర్పంకాదు.
దారి చూపే అడుగు
రక్తతిలకం లాంటి ఆమె మాత్రమే నిజం.

## ముగ్గురు బాలికలు

**మొదటిబాలిక :**

జరీ అంచులాంటి భూమిపైన
నలిగిన పాత వస్త్రంలా
పునుగుల బండిముందు నిలబడింది
కన్నుల్లో హృదయ దీపం వెలగడానికి
కాగిన నూనెలో సూర్యుల్ని వేస్తుంది
ఒక్కోసూర్యుడు ఆహారదినుసై
ఆకలి కడుపులకు అతుక్కుంటాడు
ఆకల్ని చల్లార్చే ఆ బాలిక
చానాళ్ళుగా, పునుగుల బండిదగ్గరే ఉంది
బతకడం ఎట్లనో తెలుసుకుంది

**రెండవ బాలిక :**

పూలను అమ్మేచోట
పూలనే అమ్ముతుంది
పూలను కొనేవారంతా
పువ్వులాంటి బాలిక ముఖాన్ని చూస్తారు
ఆ బాలిక చిర్నవ్వులో
ఓ కుటుంబం కన్పిస్తుంది
వాడిన పూలలో దిగులు కన్పించినట్లు
బాలిక ముఖంలో దిగులు, కనబడదు
రోజూ పూల పరిమళంతోనే ఉంటుంది
జీవించడం ఎట్లానో తెలుసుకుంది.

**మూడవ బాలిక :**

చొక్కాకు కాజాలు ఎలా కుట్టాలో తెలిసిన తర్వాత
దీపం వెలుగుతూనే ఉంటుంది
ఇనుము, యంత్రం ముందు కూర్చుంది
మొత్తం శరీరమంతా యంత్రమయితేనే
జీవన మార్గం తెలిసేది.

ముగ్గురు బాలికలు
శ్రమ సౌందర్యంపై సంతకం చేస్తున్నారు.

## పచ్చల కిరణ్ కుమార్ కవిత

## నిరంతరం

నెలవంకలో నల్లటిమచ్చల్లా
నెత్తుటి జెండాపై కంకి నక్షత్రం

ఎవరి అలంకారం కోసమో
విరబూసిన మందారాలను తుంచె వాడి కళ్ళలో
కన్నీరుంటుందనుకోవడం అమాయకత్వం

చిరుజల్లుకాదు
హోరుగాలుల జడివానకాదు
వేలతల్లుల వేదనల ప్రళయం

ప్రశ్నించే గొంతులను నులిమేయడం
ఇప్పుడు
నిరంతరం కొనసాగుతున్న ప్రక్రియ

వాడెప్పుడు అంతే
సమస్యను విస్మరించి
భౌతికంగా నిర్మూలించాలనుకుంటాడు

## ఎస్. శీను కవితలు మూడు

## ఎర్రక్షరాలవి

మరో ప్రపంచం కోసం
భూమ్యాకాశాలు పిక్కటిల్లేలా
అక్షరాలను ఆయుధాలుగా చేసి
రోగగ్రస్థ సమాజాన్ని
శస్త్ర చికిత్స చేయ
విప్లవాన్ని చేతపట్టి
రాసిన నీ అక్షరాలు
నిద్రించే వాళ్ళనూ మేల్కొలిపేలా
ఉగ్రూతలూగిస్తూ
రాసిన నీ పాటలు కవితలు
శ్రామికవర్గ సమరానికి
ఓటానిక్
పెట్టుబడిదారి వర్గానికి

నీవొక పిడిబాకువు
పారిస్ వర్గ సంఘర్షణల
మార్క్సిజాన్ని
బోల్షివిక్ స్ఫూర్తిలో
అక్టోబర్ విప్లవానికి జేజేలు పలికి
జనతంత్ర క్రాంతి
చైనాను ఆవిష్కరించి
నక్సల్‌బరి శ్రీకాకుళా వారసత్వంగా
పదును పెట్టిన నీకలం పొలికేకలు
తెలుగునేలను విస్ఫోటనం చెందించాయి
దగాపడిన చెల్లెమ్మల తమ్ముళ్లకు
పతితులకు భ్రష్టులకు
మహాప్రస్థానాన్ని అందించావు
నీవు నిరంతర సమరోత్సాహానివి
పావన నవజీవ
బృందావన నిర్మాతవు
ముందు యుగం దూతవు
నీకివే మా రెడ్ సల్యూట్స్
నీకివే మారెడ్ సల్యూట్స్
నీవు చిరంజీవిని
అజరామరుడవు
చరిత్రపుటల్లో లిఖించబడిన
ఎర్రక్షరాలవి
భూమివి.... ఆకాశానివి
సముద్రుడవు
గాలివి..... వెలుతురివి
చలన శీల మానవుడవు
వ్యవస్థకు చికిత్స చేయ
తరుణోపాయానివి
*(25వ శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా బ్యాంక్‌లో జరిగిన మీటింగ్‌లో స్మరించుకుంటూ)*

## నేర్పిన జీవన పాఠాలు

ప్రకృతిలో.. అమ్మతో
పుట్టకతో చేసిన పోరాటం
అస్థిత్వాన్ని సాధించుకున్నాను
నా ఏడుపే
నా పోరాటం, నిరసన, ప్రదర్శన
జీవించడానికి
పోరాటాన్ని నేర్పింది మా అమ్మ
మమతలు మమకారాలు
మంచితనం
మనుషులమధ్య అనుబంధం కోసం
కొవ్వత్తిలా కాలుతూ
నేర్పిన జీవన పాఠాలు
సమతను పంచుతూ
సమానత్వం కోసం
ఆయుధాన్ని పట్టించి
పోరాడమని చెప్పింది
యుద్ధ విన్యాసాలు
దాడి - ప్రతిదాడి
గెలుపు ఓటములు
నేటి నా పోరాటాలుగా మారి
ప్రసూతి వేదనలతో
విప్లవ శిశువును ముద్దాడ
బందీనైనాను........
అమ్మ నేర్పిన పోరాటం
స్వేచ్ఛకోసం హక్కులకోసం
ఆమరణ దీక్షను బూనాను
ఓడినా...విజయాన్ని వరించేవరకు
పోరాడుతునే ఉంటాను
పోరాటమే నా ఊపిరి
పోరాడకుండా గెలుపే లేదు
తాత్కాలికంగా ఓడినా
అంతిమ విజయం మనదే
అమ్మా........
అంతిమ విజయం మనదే
జనతంత్ర గణతంత్ర
శ్రమైక్య జీవన సౌందర్యం మనది.

## నెత్తురొడుస్తూనే నూతన సమాజానికి జన్మనిస్తుంది

అమరుల నెత్తురులో నేల ఎరుపెక్కింది
పుప్పొడి పుష్పం విడిపోవడమే చూసినవాడు
ఫలదీకరణం చెందుతుందని మరిచాడు
వాడికర్థమయ్యింది.....
కాయగా మారి విస్ఫోటనం చెందినప్పుడు
ఇప్పుడు....
వెదికివెదికి వ్యర్థమయ్యాడు
రాళ్ళల్లో పడ్డవిత్తు యుద్ధానికి సిద్ధమంటుంటే
మట్టికప్పుకున్న విత్తు మందుపాతరలా పేలింది
యుద్ధం అనివార్యం
గెలుపుకు త్యాగం అనివార్యం
రక్తంతో తడిసిన నేల రమణీయం
నేల ఈనకుండా చేయడం ఎవడితరం?
కాదు విస్ఫోటనం చెందడం ప్రకృతి సిద్ధం
వెదజల్లిన విత్తనాలు
పుష్పించి ఫలిస్తూనే ఉన్నాయి
సూర్యుడున్నంత వరకు
భూమి సారవంతం అవుతూనే ఉంటుంది
తనను కాపాడే బిడ్డలనుకంటూనే ఉంది
విముక్తి యుద్ధానికి సిద్ధం చేస్తూనే ఉంది
అమరుల నెత్తురుతో నేల ఎరుపెక్కింది
విత్తనం మొలకెత్తి నేల పొక్కిలయ్యింది
పుష్పించింది....పులకించింది
నెత్తురొడుస్తూనే
నూతన సమాజానికి జన్మనిస్తుంది

# వెంకట కృష్ణ కవితలు నాలుగు

## సెంట్రీ

నీవిపుడు వీరుడవు
వురినిమెడలో ధరించి
మృత్యువును ధిక్కరించి
ఏకశిలా ప్రపంచ విగ్రహం ముందు
ప్రాణాన్ని నైవేద్యంగా అర్పించినవాడవు.
నా చిన్ననాటి కట్టుకథలో
రాక్షసుడినెదిరించిపోరాడిన
జానపద వీరుడవు
ఇరాక్‌లో టైగ్రిస్ వొడ్డునో
నల్లమలలో కృష్ణవొడ్డునో
రాయలసీమ పంటపొలంలో
నమ్మకాన్ని ముంచిన కయ్యపక్కనో
పారేసుకున్న ప్రాయానివో
విషం పెట్టించుకున్న త్యాగానివో
వురితీయించుకున్న ఆత్మాభిమానివో
నీవు రేపటికి
నిన్నటి నీవులా కావొద్దని
పోరాలు నేర్చుకున్న
జీవితానివి
భావిపోరాటంలో గస్తీకాసే
మెలుకువ పహారావి.

## ఆత్మవిశ్వాసం

తలొంచే లోనికదుగేయాల
లేదంటే తగిలేను ఎదురుదెబ్బ
జీవితమే
తొలిగుమ్మం

ఆకాంక్షల చరమ మలుపు
తాకాలని ఆశ
విశ్వాసమే ఆచరణకు
తొలిఅడుగు

విషాదసాగరం మధ్య
ఆనందం ఒకదీవి
సాధనమా చిల్లులు పడ్డపడవ
సాహస నావికుడా
స్వప్న విశ్వాసాలకు నేపథ్యమిదే.

గతమొక ఎండిన నది
మేటలు పడ్డ స్మృతులూ
గోతులు పడ్డ త్యాగాలూ
అన్నింటి మధ్యా
మొగ్గతొడుగుతున్నవి
కొన్ని గడ్డిపువ్వులు.

శిలలుండాల
శిల్పించడానికి
పించాన్ని చెక్కితే
పురి విప్పడానికి
ఆత్మవిశ్వాసమే
కవిత్వం.

## అనగనగా ఒక కథ

అక్కమ్మగార్ల కొండమీద
ఏడుగురు అక్కాచెల్లెళ్ళు
మోదుగు కొమ్మకు
ఎర్రెర్రని పూలైపూచారు.

పూలు పూసాయి
కత్తుల కేసరాలతో
పూలు విరిసాయి
కమ్మని సుగంధాలతో
పూలగుండెలు నిండాయి
పేద జనుల ఆకాంక్షలతో
పూలు వీడ్కోలిచ్చాయి కొమ్మకు
ఆకాంక్షలను చేరే లక్ష్యాలతో
పూలు నడిచాయి
భుజాన విల్లంబులతో
పూలు తిరిగాయి
దివారాత్రులు పహారాతో
పూలు నేర్చాయి బుద్ధులు
క్షయంకాని అనుభవాలతో
పూలు పలికాయి పదాలు
వీరోచిత సందర్భాలతో
పూలు దాటాయి నదీనదాలు
విస్తరణ విజయప్రయాణాలతో
పూలు చేరవేసాయి
తమ వార్తలు ఆచరణతో
పూలు రాలాయి నేలను
దొంగచాటు ఘాతకాలతో
పూలు విడిచాయి తమ శ్వాసలు
అమర విశ్వాసాలతో
పునరుత్థానం పొందే ప్రమాణాలతో

మోదుగ చెట్టుకింద
రాలిన ఎర్రెర్రని పూలు
క్షతగాత్రాలై విరిగిన తూళ్ళు
మోదుగ చెట్టుకింద
రాలిన ఎర్రరెని పూలు
నేలతల్లి వొడిలో
వాలిన పోరాట వేణువులు
రాలిన వేణువుల మీద
గాలి పాటలు పాడింది
రాలిన వేణువుల చుట్టూ
అడవి నాట్యం చేసింది
రాలిన వేణువుల స్మృతి
స్థూపాలై మెరిసింది
రాలిన వేణువుల శృతి
దళ నినాదమయ్యింది
గూధూళి వేళనో
రాయీ రాయీ రాజుకునే
నిర్నిద్ర వేళనో
గుస గుసలాడే కథయ్యింది

అక్కమ్మగార్ల కొండమీద
ఏడుగురు అక్కా చెల్లెళ్ళు
ఏడుగురికీ వెలిసాయి
ఏడేడు గుళ్ళు.

## మా పల్లెబూవమ్మ

మా పల్లె చేలో రైతుకూలీ బూవమ్మ
ఏనాడూ బుర్కాతో పనికి రాలేదు.
నడుము వంచి కలుపులో
పసిమి పైరును
బిడ్డలా ముద్దాడుతున్నపుడు
ఏ దిష్టిబొమ్మ కళ్ళూ తనను తాకినట్లు
ఫిర్యాదు చేయలేదు
పొట్టకూటికోసం మదరాసాలో చేరిన
అద్దాల నాటి బిడ్డ
యిప్పుడు కొత్తగా గడ్డాలు మొలిచినాక
"మా!! నువ్వు బుర్కాతో పనికిపో"మ్మంటే
"ముడ్డి కడిగించుకున్న నాబట్టా
యిపుడే కొత్త చదువు నా కెందుకురా"!
అనీ అడగలేదు.
శాంతంగా, నిశ్శబ్దంగా
విశ్వాసంగా
బండలు పగిలే ఎండలో
ధారలు కదుకున్న శ్రమలో
చెమటనూ కన్నీళ్ళనూ
కలిపి తుడిచేసుకుందిగానీ
ప్రవక్త చెప్పింది నిజమే
మేలు చేస్తుంది

కామాంధుల కళ్ళకు
పొరలా కప్పుకుంది
అమ్మవాళ్ళు సరే
నాన్నా కళ్ళను
ఎలా కప్పుతావనీ అడగలేదు
ప్రశ్నించనంతవరకే
ఎవడి ప్రేమైనా
అధికారమైనా.

బూవమ్మంటే
బీబీనాంచామ్మనో
సాయిబయ్యను
ముల్కాభిరాముడనో
ప్రేమిస్తుంది పల్లె
ఖాదర్ లింగాస్వామి
కొతాళం పురుసులో
ఫతేహాలు చదివించే
మా అక్క పార్వతీబాయి
అర్ధనారీశ్వర స్వామినే
కొలుస్తున్నాననుకుంటుంది.
అలాయిగుండం మీద
జారిపడ్డ పక్కీరన్నకు
పక్కింటి బూవమ్మ
"అయ్యా అన్నో" అని
బూర్కతోనే బూడిద దులుపుతుంది
ప్రేమించడానికి
బుర్కా అడ్డంకాదు
విశ్వసించడానికి
మూర్ఖత్వం
మారుపేరు కాదు.

## కె. క్యాబ్ వర్మ కవిత

# బూట్ స్కడ్

ఆహ్హా ఆహ్హా ఆహ్హా ఆహ్హా ఆహ్హా
సద్దాం నవ్వుతున్నాడు
ఇరాకీ పౌరుడి శరీరమంతా
సాయుధంగా మార్చగలవాడినని
నిరూపించిన క్షణం
వాడి మెటల్ డిటెక్టర్లు కనుగొనలేని
ఆయుధం ఓ ఇరాకీ కాలిబూటు
మరో స్కడ్ క్షిపణిగా మారి
ఆ నరరూప రాక్షసుడి
తుప్పుమొఖం పైకి దూసుకు పోయిన క్షణం
సద్దాం విజయట్టాహాసం
చేస్తున్నాడు
హృదయమున్న ప్రతి మానవుడి
వెన్నెముక నిటారుగా నిలబడిన క్షణం
ఆయుధ అధికార ధనమధాందుడు
ఒరిగి కూలిన క్షణం
కోట్లాది మంది ఇరాకీలు, పాలస్తీనీయులు
విజయ దరహాసంతో కీర్తి మాటలాడిన క్షణం

ముంతజార్ ఆల్ జైదీ నువ్వు మా అందరి
ధైర్యానికి ఊపిరైనవాడివి
నీకు మా అలైబలాయ్
నీకు మా సలాం అలేకుమ్ బాయ్
తుజె హమే దిల్‌మే బసాలియే.

## ఒటోరనెక్యాస్టిలో కవిత

# సంతృప్తి

తెలుగు : వివి

జీవితమంతా పోరాడిన వాళ్ళు
ఆఖర్న చెప్పే అందమైన విషయమేమిటంటే
మేం ప్రజల్ని జీవితాల్ని ప్రేమించాం
జీవితము ప్రజలు
మమ్మల్నెప్పుడూ వంచించలేదు.

ప్రజల కోసం జీవితం కోసం
దినమూ రాత్రీ పోరాడడం వల్లనే
పురుషులు పురుషులవుతారు
మహిళలు మహిళలవుతారు

వీళ్ల జీవితాలు ముగింపుకు వచ్చినపుడు
ప్రజలు తమలోలోతుల నదుల్ని తెరచి
ఆ ప్రవాహంలో శాశ్వతంగా కలుపుకుంటారు.
అట్లావాళ్లు సుదూర జ్వాలలవుతారు
సజీవంగా ఉంటారు
ఆదర్శానికి పరాకాష్ఠ అవుతారు

జీవితమంతా పోరాడిన వాళ్లు
ఆఖర్న చెప్పే అందమైన విషయమేమిటంటే
మేం జీవితంపై, ప్రజలపై విశ్వాసం ఉంచాం
ప్రజలు, జీవితం ఆ విశ్వాసాన్ని ఎప్పుడూ
తుంచేయలేదు.

విరాజకీయ మేధావులారా (ఎపొలిటికల్ ఇంటలెక్చువల్స్) కవితతో తెలుగు పాఠకులకు కూడ చిరపరచితుడయిన క్యాస్టిలో 1936లో పుట్టిన గౌటెమెలా విప్లవకారుడు, గెరిల్లా పోరాటయోధుడు, కవి గౌటిమెలాలో ఏర్పడిన ఆర్బెంజ్ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని సిఐఏ కుట్రతో అమెరికా 1954లో కూల్చివేసినపుడు ఆయన ఎల్‌సాల్వాడార్‌కు ప్రవాసం పోయాడు. క్యాస్టిలో 1964లో గౌటిమెలాకు వచ్చి వర్కర్ పార్టీలో క్రియాశీలంగా పాల్గొంటూ ప్రయోగాత్మక రంగస్థలాన్ని నెలకొల్పాడు. అసంఖ్యాకంగా కవితలు రాసాడు. అదే సంవత్సరం మళ్లీ అరెస్టయి, తప్పించుకుని ప్రవాసంలోకి పోయాడు. యూరపు ప్రవాసం నుంచి మళ్లీ గౌటెమెలాలోకి రహస్యంగా ప్రవేశించి జకపా పర్వతాల్లో ఏర్పడిన సాయుధ గెరిల్లా ఉద్యమంలో చేరాడు. 1967లో క్యాస్టిలోను, ఇతర విప్లవ యోధులను అరెస్టు చేసి చిత్రహింసలు పెట్టి శత్రువు సజీవ దహనం చేసాడు.

## తంగెళ్ళ సుదర్శన్ పాటలు రెండు

# నేతన్న గాయాల గాథ

చటక్ పటక్ సప్పుళ్ళ మిషన్లల్లా
సిరిసిల్ల నేతన్న చిక్కిపోతివా ॥చటక్॥
కోముల దారం తీసి ఊసకుజుట్టీ
కండెను తయారుజేసి జోటకు బెట్టీ
సాంచాలో జోటవలె తిరుగుతుంటివా
అన్నా నువ్ బతుకుపోరు నడుపుతుంటివా
॥చటక్॥
రాత్రనక పగలనక పనిజేసితివా
యంత్రములో యంత్రమోలె కలిసిపోతివా
కాళ్ళూ రెక్కలు గుంజి గోసపడితివా
కల్తికల్లు కడుపులేసి కరాబైతివా ॥చటక్॥
మాలు బీము ఇస్తే కోము ఇవ్వదూ
కోము బీమూలిస్తే మాలు ఇవ్వదూ
కోము బీము మాలు అన్ని ఇచ్చిండ్లంటే
పవర్‌బోయి సాంచె ఆగి శ్వాస ఆగెనే ॥చటక్॥
అగ్గిపెట్టెలో పట్టె చీరె నేసినా
పనితనము నీ చేతిలో దాగివున్ననూ
పస్తుల బతుకె నీకు దాపురించెరా
సానానికి నూలుతో ఉరిబోసుకుంటివా
॥చటక్॥
స్వయంకృషి స్పందన షీర్ముల పేర
మైక్రోఫైనాన్స్ వాళ్ళు అప్పులు బెట్టి
వడ్డీమీదనె వడ్డీ గుంజిండ్లురా

నేతన్నల రక్తాన్ని పీల్చిండ్లురా
ఎనిమిదేండ్ల కింద ఐదుకోట్లతో వచ్చి
ఎనబై కోట్లకు పడుగలెత్తిండ్లురా ॥చటక్॥
ఆలుబిడ్డలు జబ్బుపడితె బాధపడుతవూ
బిడ్డ పెండ్లి యాదికొచ్చి బీరిపోతవూ
పెండ్లికి జేసిన అప్పు భారమాయెరా
కిడ్నీలు అమ్మి అప్పు కడుతనంటివా ॥చటక్॥
అప్పులున్న పస్తులున్న చూడలేదురా
బాధలున్న బందీలున్న కానలేదురా
ఓటుకొచ్చి నీ కడుపుల తలనుబెట్టిరా
ఓటేస్తె వాడే నీ నెత్తికెక్కిరా ॥చటక్॥
ఏ ఇంటి తలుపు తట్టిన ఆకలి కేకే
ఏ తనువును కదిలించిన తండ్లాటలె
సిరిసిల్ల వాడలల్ల తిరుగుతుంటిరా
పోగుతెగిన గాయాలా గాథలేనురా ॥చటక్॥
బాధలను బాపేది చావుకాదన్నా
ఆత్మహత్య ఆలోచన మానుకోవన్నా
సాహసంతో సమస్యల ఎదురించన్నా
జీవించే హక్కు కొరకు పోరాడన్నా ॥చటక్॥

## మనసులేద్చినయా... ఆ మమతలేద్చినయా

మనసులేద్చినయా... ఆ మమతలేద్చినయా...
మతాల మందిరాలను దాటి మానవత్వమే మదిలొనిలిపి "మనసు"
నవ్వులొలికె ముద్దుమోముల
పాలుకారె పసిమొగ్గల
పానమెందుకు దీసినారని
మంటలల్లో మాడ్చినారని "మనసు"
ఉప్పు పప్పుగావాలంటె
చక్కెర చాపత్తలంటె
ఉద్దెర సద్దెర ఇస్తెమాకు
పంటమీద మేమిస్తమాని మనసు
కడుపునొస్తె కాలునొస్తె
జ్వరమువస్తె దగ్గువస్తె
మందులిచ్చి ఆదుకొనెడి
మంచి మనసుల చంపినారని "మనసు"
ముస్లిమనక హిందువనక
ఎవరితోని వైరమనక
పేయింటింగునె నమ్ముకోని
అందరితో కలిసుండేటోడని
దుర్గమాత యాత్రకెళ్ళితె
కడుపునే చీల్చేసినారని "మనసు"
వెహికిల్ స్టాండ్‌లో కొలువుజేస్తూ
పూరికొంపలో నెలవు జేస్తూ
అరటిపండ్లు అమ్ముకుంటు
బతుకు బండిని ఈడ్చుకుంటు
జుమ్మా రోజున సమాజంటు
పోయినోళ్ళ జాడలేదని "మనసు"
ప్రమాదమును పసిగట్టి
ప్రాణాలను అడ్డుపెట్టి
మతమే ఉన్మాదమయ్యి
మంటలే రాజేసినా
ముసల్మాను తల్లి పిల్లల
స్వంత పిల్లలుగా తలచి
తన రెక్కలల్లో దాచివుంచిన
తుల్జాబయిని తలచుకుంటు "మనసు"
హిందువులను రెచ్చగొట్టె
ముస్లిములను ఉసిగొల్పె
రాజకీయ కీచులాటలో
పేదలె బలియైయ్యినారనీ "మనసు"
(భైంసా, వటోలీ ఘటనల మీద....)

*

పత్రికా ప్రకటన మే 10, 2008

## విప్లవగాయకుడు గద్దర్ మీద అక్రమ కేసులు ఎత్తివేయాలి

విప్లవ గాయకుడు గద్దర్‌ను పలు అక్రమకేసుల్లో రాష్ట్రప్రభుత్వం వేధిస్తోంది. ప్రభుత్వానికి సిపిఐ మావోయిస్టు పార్టీకి మధ్య జరిగిన శాంతి చర్చల్లో కళాకారుడిగా గద్దర్ విప్లవోద్యమం తరపున ప్రతినిధిగా వ్యవహరించారు. కుట్రపూరితంగా ప్రభుత్వం చర్చలను విఫలం చేసి ప్రతినిధులుగా పాల్గొన్న గద్దర్, విరసం నేతలు కళ్యాణరావు, వరవరరావు మీద అనేక తప్పుడు కేసులు బనాయించింది. చర్చల తర్వాత ప్రభుత్వ దాడిని ప్రతిఘటించడంలో భాగంగా విప్లవకారులు చేపట్టిన చర్యల్లో చర్చల ప్రతినిధులను నేరస్తులుగా చూపుతూ గద్దర్, కళ్యాణరావు, వరవరరావుల మీద అక్రమ కేసులు పెట్టింది. ఈకేసులు ఎత్తివేయాలని విరసం మాత్రమే గాక ఇతర ప్రజాస్వామిక వాదులు అనేకసార్లు డిమాండ్ చేసినప్పటికీ ప్రభుత్వం పెడచెవిన పెట్టివారిని వేధిస్తూనే ఉన్నది. గద్దర్ తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నారు. ఇప్పుడాయన్ను అరెస్టు చేయాలని ప్రభుత్వం చూస్తోంది. విరసం దీన్ని ఖండిస్తోంది. గద్దర్ మీద కేసులు ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తోంది. గద్దర్‌తోపాటు కళ్యాణరావు , వరవరరావులమీద, చర్చల తర్వాత విరసం సభ్యులు మరికొందరి మీద, ఇతర ప్రజాసంఘాల సభ్యులమీద బనాయించిన కేసులు ఎత్తివేయాలని డిమాండ్ చేస్తోంది. కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చినప్పటి నుండి నలుగుతూ ఉన్న రాజకీయ ఖైదీల విడుదల కార్యరూపం దాల్చకుండానే ప్రభుత్వం కాలం పూర్తయి పోయింది. రాజకీయ ఖైదీలను విడుదలచేయాలని విరసం డిమాండ్ చేస్తోంది.

వరవరరావు వి. చెంచయ్య రత్నమాల పాణి గీతాంజలి.

హైదరాబాద్‌లో (జనవరి 242 52009) జరిగిన ఆంధ్రప్రదేశ్ చైతన్య మహిళా సమాఖ్య మహాసభలకు విరసం సందేశం

# మీ ఆరాట పోరాటాలకు మద్దతుగా ఉంటాం

"అందమైన దోపిడికి
పవిత్రమైన హింసలకూ
బలైపోతున్న నేను
మనిషిని కాదు
అష్టమ భోగాన్ని...." అని ప్రముఖ తెలుగు కవి చెప్పిన మాటలను గుర్తు చేసుకుంటే వర్తమాన చరిత్రలో స్త్రీ బాధలు. గాథలు అర్థమవుతాయి. రాజులేలిన కాలంలో స్త్రీని భోగవస్తువుగా చూశారు.
ప్రబంధ కవులు నఖశిఖ పర్యంతం (కాలిగోటి నుంచి తల వెంట్రుకల వరకు) శృంగార వర్ణన చేశారు.
భూస్వామ్య వర్గం లొట్టలేసుకుంటూ చదివింది.
ఇపుడో?
రాజులు కులారు. రాజ్యాలు పోయాయి.
కాని
పురుషాధిక్య భావాలు జీవిస్తున్నాయి.
ప్రజాస్వామ్యం ముసుగులో పెట్టుబడి రాజ్యమేలుతుంది.
బహుళజాతి కంపెనీల కాళ్ల ముందు సాగిలపడుతున్నారు.
మనిషి కూడా మార్కెట్‌లో మారకం వస్తువయ్యాడు.
అమెరికా సంస్కృతిని ప్రపంచ మంతా విస్తరించాలని ఆరాటపడుతుంది.
అగ్రవర్ణం తనదే అసలు సంస్కృతని అంటుంది.
పాతని బతికించటానికి కొత్త కత్తులు నూరుతున్నారు.
పితృస్వామ్యం ఇంటి గుమ్మానికి వేలాడుతుంది.
సంస్కృతి విధ్వంసం మొదలయింది.
శ్రమైక జీవన సంస్కృతి రచ్చ కట్టమీద బోరునా విలపిస్తుంది.

ఆనాడు రాముడు శూర్పణఖను, ముక్కు చెవులు కోశాడు.
తాటకిని చంపాడు.
ఈనాడు గ్రేహౌండ్స్ పోలీసులు వాకపల్లి ఆదివాసి స్త్రీలపై అత్యాచారం చేశారు.
నాటి రాముడి వారసులే నేటి గ్రౌ హౌండ్స్ పోలీసులు.
రాముడిది, పోలీసులది పాలక వర్గమే మరి
శూర్పణఖ, తాటకి, వాకపల్లి స్త్రీలది రాజ్యంపై
ఎక్కుపెట్టిన విల్లంబుల కులమే.
కాలమేదైనా, పాలకులు ఎవరైనా
చరిత్ర నిండా పారిన కన్నీళ్ళు, నెత్తురు స్త్రీలదీ, శ్రమ జీవులది.
ఆనాడు ముక్కు చెవులు కోశారు.
ఈనాడు యాసిడ్ దాడి చేస్తున్నారు.
ఆ కర్త రాముడు రాజయ్యాడు.
ఈ కర్తలు ఎన్‌కౌంటర్ అయ్యారు.
కాని
అప్పుడూ, ఇప్పుడూ దోషి మాత్రం రాజ్యమే. పితృస్వామ్య భావజాలమే.
చదువుల్లో, సినిమాల్లో, సాహిత్యంలో పురుషాధిక్యతను పెంచుతున్నారు.
మగవాడు ధరించే అండర్ వేర్‌కు కూడా
స్త్రీ బొమ్మను పెట్టి అమ్ముకుంటున్నారు.
ఇట్లా
విలువలు ధ్వంసమవుతున్న కాలంలో
రాజ్యం మరింత క్రూరంగా మారుతున్న సమయంలో
ప్రజాస్వామ్యం పచ్చి బూటకమని తేల్చుతున్న చరిత్ర ఒక వైపు
మరోవైపు
నూతన ప్రజాస్వామిక విప్లవంలోనే స్త్రీ విముక్తి అవుతుందని
నమ్మే ఆంధ్రప్రదేశ్ చైతన్య మహిళ సమాఖ్య
తన నాలుగవ మహాసభలను జరుపుకోవటం సంతోషం.
నడుస్తున్న పోరాటాల చరిత్రకొక వాగ్దానం.
అంటరాని పూరి గుడిసెలో ఒంటరి శోకాన్ని
మధ్యతరగతి మూగ రోదనను
మా కలంలోకి ఒంపి రాస్తూ....
మీ ఆరాట, పోరాటాలకు మద్దతుగా ఉంటాం.

– కాశీం,
విరసం కార్యవర్గం తరపున

*

## విరసం విశేషాలు

తెనాలిలో విరసం సాహిత్య పాఠశాల (జనవరి 3,4 - 2009) సందర్భంగా విడుదల చేసిన పుస్తకాల పరిచయ సభ విశాఖలో జరిగింది (25-1-2009). ప్రసాద వర్మ అధ్యక్షత వహించిన ఈ సభలో కుటుంబరావుగారి మొదటి కథా సంపుటిని గురించి ప్రొఫెసర్ చందు సుబ్బారావు మాట్లాడారు. "కొకు సాధారణ పాఠకుల కథకుడు కాదు, కథకుల కథకుడు. చదువుకున్న జ్ఞానంగల పాఠకులకే అర్థమయ్యే రచయిత".

వరవరరావు కవితా సంపుటిని రామతీర్థ పరిచయం చేశారు. "50 సంవత్సరాల వివి కవిత్వం సోషల్ డాక్యుమెంట్‌లా వుంది. మన తెలుగు కవి, మన మధ్య జైల్లో వుండిన కవి వి.వి. ఫైజ్, నెరూడాల కవితలతో సమాన ధర్మం నెరిపారు. ఉత్తమకవి".

భూమి- చరిత్ర - సంస్కృతి వ్యాస సంకలనాన్నికళ్యాణ రామారావు పరిచయం చేశారు. "ఎన్నో రోజులపాటు ఆలోచించవలసిన లోతైన విషయాల మీద పరి పరి ఆలోచనలు రేపే విశ్లేషణాత్మకవ్యాస సంపుటి ఇది. పీడిత ప్రజల సంస్కృతే అసలైన సంస్కృతి" అని నిరూపించాయి ఈ వ్యాసాలన్నీ".

మండుతున్న గాయాలు వాస్తవ జీవిత అనుభవాల సంపుటిని అరుణ పరిచయం చేశారు. ఛత్తీస్‌ఘడ్‌లో బిజెపి. కాంగ్రెస్ ప్రభుత్వాల వత్తాసుతో 10 గ్రామాల్లో మహిళల మీద చేసిన దౌర్జన్యాలనీ, వారి అనుభవాల్ని వారి మాటల్లోనే సంపుటీకరించిన పుస్తకం ఇది. "ప్రభుత్వమే చట్ట వ్యతిరేక మార్గాల్లో ప్రజలమీద ఎందుకు హింస అమలు చేయాల్సి వస్తోందో అర్థం కావాలంటే ప్రపంచ ఆర్థిక విధానాలు తెలుసుకోవాలి. ప్రజలకి ప్రధానమైన భూమి మీద, అటవీ సంపద మీద హక్కు లేకుండా చేసి నిరాధారుల్ని చేసిఅణిచిపెడుతున్నారు. స్త్రీల మీద ప్రత్యేకించి హింసని ప్రయోగిస్తున్నారు. దీనిద్వారా రాజ్యానికున్న పితృస్వామిక స్వభావాన్ని అర్థం చేసుకోవచ్చు అన్నారు.

'కథల పంట' కథా సంపుటిని మల్లీశ్వరి పరిచయం చేశారు. సృజనకి వర్క్‌షాపులెందుకు అని అనుమానం వస్తుందిగాని, ఈ సంపుటికి ముందుమాట రాసిన తుమ్మేటి రఘోత్తం రెడ్డి అవి ఎందుకు అవసరమా వివరించారు. కథకులు ఎదుర్కొనే సమస్యలు తెలుసుకుని సలహా సహకారాలతో మరింత తీర్చిదిద్దే అవకాశాన్ని వర్క్‌షాపులు కల్పిస్తాయి అన్నారు.

పరిచయాలు - ఎన్.వేణుగోపాల్ పుస్తకాన్ని పి.వి.రమణ పరిచయం చేశారు. ఎడ్గార్‌స్నో అనే రచయిత చైనాలో ప్రజల్ని ఇంటర్వ్యూ చేసి 'అందరూ, 'నేను' అనే మాట మర్చిపోయి 'మేము అలా చేశాం, మేము ఇలా చేశాం' అనే మాటే వాడారు అన్నాడు. సమాజం మారాలనే కోరిక ఉన్నవాళ్ళు అలాగే ఉంటారు. అలాంటి నిబద్ధత గల వ్యక్తుల్ని గురించి పరిచయం చేశారు వేణుగోపాల్ అన్నారు.

*

నివాళి

# శారదాంబ

(1930-2009)

## మా అక్కగారు

### చలసాని ప్రసాద్

అన్నింటితో పాటు మానవ సంబంధాలు కూడా వ్యాపార వలయాల్లో కొట్టుమిట్టాడుతున్న సంధియుగంలో పుట్టింది విరసం, తెలుగునాట సాహిత్య, సాంస్కృతిక, సామాజిక రంగాల్లో కీలకమయిన మలుపు విరసం. ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమం వన్నెతగ్గడం మొదలయింది. చెట్టుకొకరు పుట్టకొకరు చెల్లాచెదురైపోయారు. పొట్టకూటికి, జీవనోపాధికి తిరుగాడుతూ పడ్డచోట నిలవకుండా బంతుల్లా గెంతారందరూ. వీళ్ళల్లో చేవ తరగని వారిని కలుపుకుంటూ, కొత్తనెత్తురుని ఆహ్వానిస్తూ మన రాష్ట్ర సామాజిక రంగంలో నక్సల్బరీతరం దూసుకువచ్చింది. కొత్త పాతల మేలుకలయిక లాగా తన ఉనికిని చాటుకుంది.

పాత తరంలోంచీ శ్రీశ్రీ, కొకు, కెవిఆర్, రావిశాస్త్రి వగైరాలు, కొత్తతరం నుంచి దిగంబరులు, వరవరరావు, ఉత్తర తెలంగాణా, ఉత్తరాంధ్ర యువతరం గోదాలోకి దిగారు. తెలుగునాటి ఉజ్వల ప్రవాహం అది. ముఖ్యంగా సాంస్కృతిక రంగంలో విరసం తనదంటూ ఒక ముద్ర వేయగలిగింది. దీనికి అటు పాతతరం, ఇటు కొత్తతరం కూడా ప్రాణం పోశారని చెప్పవచ్చు. విరసం సజావుగా సాగడానికి పెద్దతరం ఎనలేని కృషి చేసింది. విరసం వ్యవస్థాపక కార్యదర్శి కెవిఆర్ (1928-1998) అని అందరికీ తెలిసిన సంగతే. సంస్థపట్ల, అందులోని సభ్యులందరి పట్ల కెవిఆర్ ఎంత మక్కువతో ఉండేవారో! మన ఆశయం విప్లవం అనీ, కార్యక్షేత్రం రచన అని, నిర్మాణం సంఘం అని పదేపదే ప్రతివారికి గుర్తింపచేసేవారు. సభ్యుల కష్టసుఖాలు, ఆరోగ్యం, ఆర్థికం అన్నింటిని ఎంతగానో పట్టించుకునేవారు. ఎందరికి ఎన్నిరకాల గుప్తసాయంచేశారో కొందరికయినా తెలుసు.

ఇలాంటి కెవిఆర్‌గారి సహచరి శారదాంబ నాకు పరమ ఆపురాలైన అక్కగారు. అన్నింటిలో కెవిఆర్‌కి ఆమెకి వెన్నుదన్నుగా నిలబడేవారు శారదాంబ లేకుంటే కెవిఆర్ ఇన్ని పనులు చేయగలిగే వారు కాదు. రోజువారీ విషయాలో ఆయనకి పసితనం, ఇంచుక చేతకానితనం ఉండేవి. వాటన్నింటిని ఆమె చాలా ఒడుపుగా సంబాళించుకుని ఆయనకి చేదోడువాదోడుగా ఉండేది. వారికి ఒక కూతురు, ఇద్దరు కొడుకులు. ఆముగ్గురితో కెవిఆర్ తన జీవితకాలంలో చనువుగా గడిపిన కాలం దాదాపు లేదనే చెప్పవచ్చు. పిల్లలకీ ఆయనకి శారదాంబ గారే వారధి.

మా అక్కగారు తెలుగు బాగా చదివేవారు. మాటల్లో, ఉత్తరాల్లో మంచి తెలుగు వాడేవారు. ఆమెలో హాస్య ప్రవృత్తి తొణికిసలాడేది. ఆమెకి శాస్త్రీయ సంగీతం అంటే చాలా ఇష్టం. దానిలో మంచి పరిజ్ఞానం ఉండేది.

ఆమెకి ఒక అక్క ఉందిగాని అన్నదమ్ముల్లేరు. 'నా తోడ బుట్టిన వాడివి నువ్వే' నంటూండే వారు. మేమిద్దరం కలిసి కెవిఆర్‌ని ఆట పట్టిస్తూండేవాళ్ళం, ఆయనకి 'బిబి' గారని పేరెట్టాం - అంటే బొండాం బావగారని! యేమిలా పేరు పెట్టామని మురిపెంగా చెప్పుకునేవారు. ఆయనా, నేను మీటింగుకు వెళ్ళి తిరిగి రాగానే "ఇవాళ మీ బిబిగారు బాగా మాట్లాడారా?" అని ఆమె అడిగేవారు. చాలా బాగా మాట్లాడారని చెబితే " ఎందుకో తెలుసా? టైంలేక ఏమీ ప్రిపేర్ కాలా. అందుకని బాగా మాట్లాడి ఉంటారు. అందుకే నేనెప్పుడూ మొత్తుకుంటుంటా మీరు చాలా చదివారు. చదివింది చాలిక. వేరే ప్రిపేర్ కావద్దు అని!" అనేవారు చిరునవ్వుతో!

ఆమె చక్కటి ఉత్తరాలు రాసేవారు. మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితి గురించి అప్పట్లో మనవాళ్ళు చాలా పుస్తకాలు రాశారు. వాటిని దృష్టిలో పెట్టుకుని 'మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితి లాగే ఉంది నా ఆరోగ్య పరిస్థితి' అని చమత్కరించారు. ఆమెకి కాన్సర్ వస్తే ఒక రొమ్ము తీసేశారు. పరామర్శించడానికి వెళ్లితే 'రొమిలా థాపర్‌కి రెండూ తీసేశారని అలవోకగా' చెప్పి నవ్వేశారు.

చిట్ట చివరికి కీళ్ళనొప్పులతో మంచం పట్టారు. కూతురు అల్లుడు డాక్టర్లుగా కూడా ఆమెకి చాలా సపర్యలు చేసేవారు. దాదాపు రోజూ ఫోనులో పలకరించేవాడిని. ఓపిక, స్పృహ ఉన్నంతకాలం ఆమె చమత్కారం అలాగే అలరించేది.

విరసం యువసభ్యుడు ప్రశాంత్‌కి కెవిఆర్ కృషి గురించీ, ఆయన సాహిత్యం గురించీ తెలుసుగాని ఆయన్ని ఎరగడు. ఓసారి అతన్ని విజయవాడలో అక్కగారి దగ్గరకి తీసుకెళ్ళాను. రెండుగంటల్లో కెవిఆర్ చిత్రాన్ని అతని కళ్ళముందుంచిందామె. ఆశ్చర్యపోయాడు ప్రశాంత్. ఆమె గ్రహణశక్తికీ, చెప్పిన తీరుకీను మంచాన పడ్డాక కూడా కెవిఆర్ గురించి ఆమె వేసిన చతురోక్తులకి పాణి ఆశ్చర్యపోయాడు.

విరసం తెనాలి మీటింగుల తర్వాత జనవరి మొదటివారంలో వరవరరావుతో కలిసి వెళ్ళాను. కన్ను విప్పి చూసింది, గుర్తించింది. కాని గుండె గొంతుకలోన కొట్లాడింది, అంతే.....

## శారదాంబగారి ముచ్చట్లు

### కృష్ణాబాయి

ఉద్యమాల్లోగానీ ప్రజాసంఘాల్లోగాని పూర్తిగామమేకమై కృషి చేయాలంటే చుట్టూ అనుకూల వాతావరణం ఉండడం చాలా అవసరం. విరసం మొదటితరం నాయకులలో కొడవటిగంటి, కెవిఆర్ చేసిన కృషికి అలా సహకరించిన వరూధిని, శారదాంబల పాత్ర చెప్పుకోదగింది.

తన 80వ ఏటా (18-3-2009) కన్నుమూసిన శారదాంబ కెవిఆర్‌ని కడదాకా (15-1-1998) ఎంతో శ్రద్ధగా సాకింది. ఆమెకి ఆధునిక సాహిత్యం కన్నా ప్రాచీన సాహిత్యం అంటే మక్కువ ఎక్కువ. ఒక్కోసారి కెవిఆర్‌కి పద్యాల్లో సమాధానం చెప్పేదామె! ఏ సందర్భానికి తగిన పాటలు ఆ సందర్భంలో ఆలపించేవారు. మనుషుల్ని, పరిస్థితుల్ని చక్కగా అంచనా వేసేవారు. వ్యవహార జ్ఞానం జాస్తి. చెరబండరాజు అనారోగ్య స్థితిలో ఉన్నప్పుడు, విరసం తరపున కెవిఆర్ చేసిన విజ్ఞప్తికి ఆంధ్రదేశమంతటి నుంచీ విరాళాలు ముమ్మరంగా అందేవి. అందులో ప్రతి పైసా జాగ్రత్తచేసి, పంపకం చేయడంలో కెవిఆర్‌కి ఆమె ఇచ్చిన సహకారం ఇంతింతకాదు.

రాతపనిలో మునిగివుండే కెవిఆర్ సమయానికి ఒక పెన్నో, కవరో, కాగితాలో కనిపించకపోతే వేసే ధూంధాంలు ఇంతింతకాదు. ఆయనకా అవకాశం ఇవ్వకుండా రకరకాల కాగితాలు, కవర్లు పొందికగా సర్ది, పెన్నుల్లో సిరాపోసి సిద్ధంగా ఉంచేవారు. ఆయన కృషికి ప్రేమగా ఆమె అందించే కానుక అది. మంచి ధీమాగల మనిషి. తొణకడం, బెదరడం ఆమెలో లేదు. కెవిఆర్ జైల్లో

**సమీక్ష** ☆ వి.ప్రతిమ

# మోరీతో జీవిత పాఠాలు

చదువు అంటే కేవలం పాఠాలు వల్లె వేసి పరీక్షలు వ్రాయడం మార్కులు సంపాదించడం..... ర్యాంకుల కోసం... ఆపైన కెరీర్ల కోసం తపన పడ్డం కాదు. చదువు అంటే మనం మనుషులుగా ఎదగడం.

జీవితం అంటే డబ్బు సంపాదించేసి, బంగళాలు కట్టేసుకొని, వస్తువులు పోగేసుకోవడం కాదు..మనం చేసే ఏ పనిలోనయినా సరే ప్రశాంతతను వెదుక్కోవడం

ఎందరో ఉపాధ్యాయులు..మరెందరో విద్యార్థులు ..ఎక్కడయినా ఒకచోట తమ టీచర్లతో , లెక్చరర్లతో లేదా ప్రొఫెసర్లతో అనుబంధమున్న విద్యార్థులు కూడ వుండే వుండొచ్చు...అయితే వారి నడుమ జరిగే జీవిత పాఠాల్ని నలుపు, తెలుపు చేసేవారెందరు?

అమెరికలోని బ్రాండెస్ యూనివర్సిటీలో సోషియాలజీ ప్రొఫెసర్‌గా పనిచేసిన మోరీ, అతడి ప్రియమైన విద్యార్థి మిచ్ ఆల్బమ్ ఈ పుస్తకంలోని కథానాయకులు.

తమ తొలి పరిచయంలోనే నిన్ను 'మిచ్' అని పిలుస్తాను అన్న ప్రొఫెసర్ మోరీతో తన అనుబంధాన్ని.... కాలేజీ వదిలిన పిదప పదహారేళ్ళ ఎడబాటు కలిగినప్పటికీ ఆ తర్వాత అతడితో తన కలయికల్ని అక్షర బద్ధం చేసిన మిచ్ ఆల్బమ్ నిజంగా అభినందనీయుడు.

మనుషులుగా వుండదలుచుకున్న ప్రతి ఒక్కరూ చదివి తీరాల్సిన పుస్తకం యిది "మోరీతో మంగళవారాలు"... మరి ఈ మంగళవారాలు ప్రొఫెసర్ మోరీ, మిచ్ ఆల్బమ్ కలుసుకుని ఏం మాట్లాడుకునేవాళ్ళు?

వాళ్ళు జీవితాన్ని గురించి మాట్లాడుకునేవాళ్ళు

వాళ్ళు ప్రేమని గురించి మాట్లాడుకునేవాళ్ళు

వాళ్ళు మోరీకి బాగా యిష్టమైన విషయం అనురాగం గురించి మాట్లాడుకునేవాళ్ళు.

అప్పుడప్పుడూ మోరీని కబళించడానికి సిద్ధంగావున్న మరణాన్ని గురించి మాట్లాడుకునేవాళ్ళు.

మొత్తం మీద మృత్యువు ముంచుకొస్తున్నప్పటికీ మనిషి ఎంత మేరకు ప్రశాంతంగా జీవించవచ్చో చెప్తుందీ పుస్తకం.

"మనం చనిపోయేవరకూ కూడ చావు గురించి ఆలోచించడానికి ఈ సంస్కృతి మనల్ని ప్రోత్సహించదు. మనం చాలా వాటిల్లో మునిగిపోయి వున్నాం.. జీవనోపాధి, కుటుంబం, సరిపడినంత డబ్బూ, తనఖా వ్యవహారాలు చూడ్డం..కొత్త కారు సంపాదించుకోవడం... దాంట్లో రేడియేటరు పాడయితే కొత్తది అమర్చుకోవడం లాంటి లక్షలాది చిన్నచిన్న పనుల్లో మనం కూరుకుపోయి వున్నాం..ఇదేనా జీవితమంటే?..ఇదేనా మనం కోరుకునేది? ఏమన్నా కోల్పోతున్నామా అని ఆగి ఆలోచించే అలవాటు మనకి వుండడం లేదు"

ఇటువంటి ఎన్నో జీవిత పాఠాలు..నిజానికి అటువంటి మార్గంలోకి మనని నడిపించగలిగే గొప్ప పాఠాలు మోరీ మిచ్ ఆల్బమ్‌కి చెప్తాడు. ఈ పుస్తకం చదువుతుంటే చాలాసార్లు మోరీ మనకి కూడ గురువేమో అన్పిస్తుంది..జీవితంలో ఉపాధ్యాయుల అవసరం మనందరికీ వుందన్న విషయాన్ని విదశపరుస్తుంది.

అంతస్తులు కాదు విశాల హృదయ మొక్కటే ప్రతి ఒక్కరి మధ్యా సమానంగా మసలడానికి అనుమతిస్తుంది.. మన సమస్యలూ, మన కష్టాలూ మనకి వుండనే వుంటాయి. కానీ యితరులకి సాయపడ్డం వల్ల మనం సజీవంగా వున్నామనే భావన కల్గుతుంది.

'చనిపోవడం సహజం..మనుషులంతా ఒకర్నొకరు ప్రేమించుకున్నంత కాలం మనకున్న ప్రేమానుభూతిని గుర్తుంచుకున్నంతకాలం చచ్చిపోయినా మనం యిక్కడ వున్నట్లే... నువు సృష్టించిన ప్రేమంతా యిక్కడే వుంటుంది.. నువు చేసిన పనుల ద్వారా ప్రేమను పొందిన ప్రతి ఒక్కరి హృదయంలోనూ నువ్వు జీవించే వుంటావు" అంటాడు మోరీ...

ఈ ప్రపంచంలో బిజినెస్ కోర్సులు, డాక్టరు కోర్సులు, ఇంజనీరింగులూ లా చదువులూ అన్నీ చదివేవాళ్ళు కాంపస్ వదిలిపెట్టి వెళ్ళిన తరువాత ఎంత మంది తమ టీచర్లని లేదా ప్రొఫెసర్లని మళ్ళీ కలుసుకుంటారు?

ప్రొఫెసర్ మోరీ విద్యార్థులు మాత్రం ఆయన్ని ఎప్పుడూ కలుస్తూనే వుంటారు. ఆయనకి ఫోన్లు చేస్తారు.. ఉత్తరాలు వ్రాస్తారు... ఆయన్ని చూట్టానికి వంద ల మైళ్ళ నుండీ డ్రైవ్ చేసుకుని వస్తారు... ఆయన ఆఖరి క్షణాల్లో బోస్టన్ న్యూయార్క్, కాలిఫోర్నియా, లండన్, స్విట్జర్లాండ్ నుంచి కార్పోరేట్ ఆఫీసుల్లో సిటీ స్కూల్ కార్యక్రమాల్లో పని చేసేవారి వరకూ ఆయన దగ్గరకు వస్తూ వుంటారు.

ఒక మాటకోసం... ఒకేఒక్క నవ్వు కోసం

అంతెందుకూ ఈ పుస్తక రచయిత మిచ్ ఆల్బమ్ మోరీకి ఆత్మీయ విద్యార్థి జర్నలిస్టుగా, క్రీడా రచయితగా అమెరికాలో పేరు, ప్రఖ్యాతులున్న మిచ్ ఆల్బమ్ తన అనేకానేక పనుల ఒత్తిడులలో నుండి ప్రతీ మంగళవారం ఏడువందలమైళ్ళు ప్రయాణం చేసి తన ప్రొఫెసర్‌ని, తను ముద్దుగా 'కోచ్' అని పిలుచుకునే మోరీని కలవడానికి వస్తాడు.

మిచ్ అలా ప్రతీవారం మోరీని కలవడమే ఈ పుస్తకం "మోరీతో మంగళవారాలు"

ఈ పుస్తకం నిజంగా మనిషికి ఒక కానుక, మానవుడికి ఓ బహుమతి. ఇంత మంచి పుస్తకమొకటి ఆంగ్లంలో వుందనీ... దానిని అద్భుతంగా అనువదించి తెలుగు పాఠకులకు అందించిన తుమ్మల పద్మిని, అత్తలూరి నరసింహారావు గార్లకు, అలకనంద ప్రచురణలకు తెలుగు పాఠకులందరి తరపునా ధన్యవాదాలు. *

---

ఉన్నప్పుడు (ఎమర్జన్సీలో) ఆయన ఒకటే పురమాయింపులు - 'ఆ పుస్తకాలు తీసుకురా', 'ఫలానా వాళ్ళు ఇబ్బంది పడుతున్నట్టున్నారు, సాయం చెయ్యి' అంటూ. " మా తమ్ముడి వేవేళ్ళ కోరికల్లాంటి పుస్తకాల్ని వెదికి పంపడానికే కాలం సరిపోవడంలేదు" అని ఉత్తరాల్లో రాసేది.

'డిటెన్యూ డైరీ' చదివి "ఆ దాన్లో ఏముంది - శారద వచ్చింది, శారద వెళ్ళింది అని తప్ప?" అని ఎవరో ఎగతాళిచేస్తే "అవును, షి యీజ్ మై వైఫ్, షియీజ్ మై లైఫ్" అన్నారు కెవిఆర్ ఆప్యాయంగా.

ఆమెకి కాన్సర్ అని తెలిసి కెవిఆర్ బాగా కుంగిపోయారు. "ఆమెకేమైనా అయితే నేను పతీసహగమనం చెయ్యాల్సిందే" అన్నారు.

శారదాంబగారు మాటల ఊట. మంచి రిపార్టీ ఇచ్చేవారు. "ఆడది తిరిగితే చెడిపోతుందమ్మాయ్" అని ఎవరో బంధువు అంటే "చెడకుండా తిరిగితే ఫర్వాలేదా?" అని ఎదురుప్రశ్న.

'మా అమ్మాయి బంగారం' అంటే

'అల్లుడు అపరంజి కదండీ'

వృద్ధాప్యంలో కుటుంబంలో వచ్చే ఇబ్బందుల గురించి ఎవరో ఏకరువు పెడుతూంటే, 'పిల్లలు చెప్పింది వినాలి, పెట్టింది తినాలి, ఇది మనం ఆచరిస్తే అందరికీ సుఖం' అని సలహా ఇచ్చారు.

చెరబండరాజు, శ్యామల కష్టాల కడలిలో ఈదులాడుతున్నందుకు చాలా బాధపడేవారు. చెరకి అన్ని విధాలా చేదోడు వాదోడుగా ఉండడమేకాక, అతనికి ప్రభుత్వం ఇచ్చిన అవార్డుని తిరస్కరించినందుకు శ్యామల అంటే ఎంతో అభిమానం. కెవిఆర్‌నీ, ఆయన పనిని మనసారా ఇష్టపడిన సహచరి శారదాంబ. *

సమీక్ష

# 'ఎగిలివారంగ' పేగు కాలిన వాసన

☆ ఉదయ్, కాశీం

పొన్నాల బాలయ్య తాను కవిని కానన్నాడు. తనది కవిత్వం కాదన్నాడు. నిజమే! అది కవిత్వంకాదు, పేగుకాలుతున్న కమురు వాసన. ఒలుకుతున్న కన్నీళ్ళను పట్టుకున్న అక్షరాల దోసిలి. శ్రమలో చిందిన నెత్తురు, చెమట. అదొక బతుకు కథ "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అని సాహిత్యమంతా సౌందర్యాలాపన చేస్తుంటే దాని మెడలు వంచి పూరిగుడిసెకి తెచ్చిన కవుల్లో పొన్నాల బాలయ్య భాగమయ్యాడు. వాస్తవిక జీవితాన్ని అతి దగ్గరనుండి పరిచయం చేస్తున్నాడితడు. ఇతని కవిత్వంలో గొప్ప ఆలంకారికత లేకపోవచ్చు, ప్రతీకలు లేకపోవచ్చు. కానీ సగటు పేదవాని గుండె ఆక్రోదన, ఆవేశం ఉన్నాయి.

నేటి సాహిత్య చిత్రపటం మారిపోయింది. కులం, వర్గం సమస్యలతో పాటు అస్థిత్వవాదాల సమస్యకూడా వేదికపై ఉంది. ఈ క్రమంలోనే సాహిత్యంలో వస్తువులు మారాయి, శిల్పం మారింది. సమాజ పరిణామం వేగంగా జరుగుతున్నది. కుర్చీలాటలాగే పాలకులు మారుతున్నారు. అనేక మార్పులు సంభవిస్తున్నాయి. కానీ పొక్కిలైన నేల పొత్తిల్లు మాత్రం అలాగే ఉన్నాయి. చెక్కిల్లపై కన్నీళ్లు కారుతూనే ఉన్నాయి. అరచేతులు కడుపును నిమురుతూనే ఉన్నాయి. జీవితాలు బతుకును గంపలవెట్టుకోని వలసపోతున్నాయి. అసలే భారతదేశం, అందునా ఆంధ్రప్రదేశ్, అందునా తెలంగాణ, పైగా మాదిగకులం, వెంటకొంత చైతన్యం. ఇక కాగితం ఎందుకు తడవదు? కవిత్వమై ఎందుకు పుష్పించదు?

పొన్నాల బాలయ్య కవితా సంపుటిపేరు 'ఎగిలి వారంగ'. ఇందులో ముప్పైయ్యారు కవితలున్నాయి. ప్రతిదానిలో ఆవేదనంతా మూటకట్టిపెట్టాడు. ఆక్రోశాన్నంతా వెళ్ళగ్రక్కాడు. వినగలిగిన నెనరున్నోళ్లకు గుండెతట్టి వినిపించాడు. భారమైన నిట్టూర్పులు కురిపించాడు.

బాలయ్య తన పుస్తకానికి పేరుపెట్టడంలోనే విలక్షణతను పాటించాడు. కవిత్వమంతా జీవిద్భాషలో రాసినట్లే పుస్తకం శీర్షికలో కూడా జీవం ఉంది. పుస్తకంలోని మొదటి కవితపేరు 'ఎగిలి వారంగ'. అదే పుస్తకానికి శీర్షిక అయింది. శిరసువంచని ద్వారము ఉండదు. అట్లాని ప్రతిదానిముందు శిరస్సు వంచటం సరయిందికాదు. కవితకు శీర్షిక ద్వారంలాంటిది. పుస్తకానికీ అంతే. మంచి ఇంటికి చక్కటి ద్వారం ఎంత ముఖ్యమో, కవితా వస్తువుకు, అభివ్యక్తికి శీర్షిక అంతే ముఖ్యం. "కవితను అర్థంచేసుకోవడానికి, అన్వయించుకోవడానికి, కవి చెప్పదలచినదానికి, చెప్పిన దానికి మధ్యనున్న సామ్యవైషమ్యాలను గ్రహించడానికి శీర్షిక ఒక ప్రధాన ఆధారం. మనిషికి ముఖంలాంటిది. (పెన్నా శివరామక్రిష్ణ-ఆదివారం -వార్త-22.08) ఆ ముఖంలోకి తొంగిచూస్తే మనిషి ఆనందం, దుఃఖం, జీవిత ఘర్షణ కనిపిస్తాయి. తెల్లవారితే (ఎగిలివారంగ) చీకటి పోతుంది. సమాజం కనిపిస్తుంది. అట్లా బాలయ్య మేల్కొని తన కవిత్వంలోకి ఆహ్వానించాడు.

"ఎర్రటెండ
ఎండిన డొక్కా
తంగెడు చెక్క
రాలె చెట్టు ప్రేమ
..........
చితికిన వేళ్లు చిందిన నెత్తురు" (పుట.15)ను కవిత్వం చేసి మన కళ్లముందు దృశ్యమానం చేశాడు. ఈనాడు కవిత్వమంటే నిక్కచ్చిగా కవి జీవితమే. అని ముందుమాటలో జూలూరి గౌరీశంకర్ చెప్పినట్లు, బాలయ్య ఎరుపెక్కిన కళ్లను, ఎండిన పెదవులను తన జీవిత సారంగా చెప్పాడు. కోడికూయగానే నిద్రలేసి ఎరువు బండికడితే ఒంటరిమనిషికి పాట తోడవుతుంది. పెంట గడ్డనుండి పడమటి దుక్కివరకు కంచుకంరాన రాగాలు తీస్తుంటే ఆకాసాన పోయే కాకి చెవి పెట్టివింటుంది. ఇది తెలంగాణలో ప్రతి వ్యవసాయదారుడి జీవితం. బాలయ్య దీనికి మినహాయింపు కాదు. అందుకే 'ఎగిలి వారంగ పాటలు నా అయ్యవ్వ నాకిచ్చిన ఆస్తుల"ని చెప్పాడు.



బాలయ్య కవిత్వంలో తెలంగాణ, ప్రపంచీకరణ, మాదిగ జీవితం, అంటరానితనం, పత్తిరైతుల ఆత్మహత్యలు, కరువు మొదలైనవి కవితా వస్తువులయ్యాయి. "బతుకు బతుకమ్మ పాటే"లో తన జీవితాన్ని తన్నుకుపోయినదాని మర్మం తెలిసిపోయిందంటున్నాడు. బతుకమ్మను మింగేసిన ప్రపంచీకరణ బతుకునూ స్వాహా చేసిందంటున్నాడు.

"అందరు పండుగ మోజుల
వుంటే నేను పశులగాస్తుంటిని
దప్పుల చప్పళ్లతో బతుకమ్మను
దెచ్చి ఆడుతావుంటే
ఆవలుండి చూసుడేతప్ప
పండుగ జరుపుకున్న పాపాన పోలేదు" అంటున్నాడు. తల్లి ఒడిలో కూర్చొని నెలవంకను చూస్తు గోరుముద్దలు తినాల్సిన బాల్యం కన్నీళ్లతో మునిగిపోయిన తీరు వివరించిన విధానం హృద్యంగా ఉంది. అనేకమంది చిన్నారుల బాల్యం ఇంకా అట్లానే ఉంది. ప్రపంచీకరణ దుర్మార్గాన్ని చెప్పినట్లే తనలోనివాడే దుర్మార్గుడిగా మారితే ఈ కవి సహించలేడు. రిజర్వేషన్ అందించిన ఫలాలతో మంచి స్థాయికి వచ్చి గతాన్ని మరచి ఆవులిస్తున్నవాన్ని

"ఉమ్మిముంతల ఉమ్మిన ఉమ్మి
చెవులు బైర్లు కమ్మింది నా పూర్వీకులకే గదా!
..............
నాకేమిటని ఎవడన్నా
నాలుకలు కోయబడతాయ్" అని హెచ్చరిస్తున్నాడు. ఒక మనిషిని మరొక మనిషి దోపిడీ చేసినట్లే ఒక ప్రాంతాన్ని మరో ప్రాంతం దోపిడీ చేస్తోంది. ఆ ప్రాంతం

"కూలిన మోట బొజారు
కలేబరాల కంపు......!
తెగిపడిన పానాదుల..
ఎగిరిపడ్డ బండి
బోకెబాయిల పాతపెంకులు
మొగుల మీద చెలిమి
మొండాలు...
పేగులెండిన సింగరేణి
నరాలు తేలిన నదులు...." ఈ పాదాల్లో శిల్పాన్ని గురించి బూతద్దం పెట్టుకు వెతకాల్సిన పనిలేదు. మూలుగుతున్న నక్క తెలంగాణ. దానిపై గోబలైజేషన్ తాటికాయ పడింది. బతుకు పగిలిపోయి నెత్తురు గడ్డకట్టింది. రేపటి పౌరులకు 'తెలంగాణ' సాలార్జంగ్ మ్యూజియంలో వస్తువవడానికి సిద్ధంగా ఉన్న స్థితిని కవిత్వంచేశాడు. పాలకులు ఎవరైనా కావచ్చు. ధరాధిపతులై ప్రజలను పీల్చుకుతింటారు. సామ్రాజ్యవాది కాళ్లముందు మోకరిల్లుతారు.

"సాములవారి కాళ్ళకాడ
పాదసేవకుడు కాదు
పాలకుడు........." అని నేటి పాలకులు మూతినాకుడు వ్యవహారాన్ని చిత్రిస్తున్నాడు కవి". "పుట్టేది చచ్చేది ఒకేసారి/కళ్లు కదులుతున్నాయ్" అని

రగులుతున్న కుంపటిని ఎత్తిచూపాడు. ఆ చైతన్యం ఏం కోరుకుంటుందో తెల్పాడు. మనిషి పుట్టినప్పటినుంచి చారెడు భూమికోసం పోరాడుతున్నాడు, కానీ భూమి దక్కలేదు. ప్రాణం మాత్రం పోయింది.

"ఎత్తైన బిల్డింగ్‌ల పొంటి ఏడుకమ్మల గుడిసెలు

బంగ్లాల పక్కన బతుకు జీవుల డేరాలు" ఈపాదాలు చదువుతుంటే చెరబండరాజురాసిన "కొండలు పగిలేసినం" పాట గుర్తుకొస్తుంది. "శ్రమ ఎవడిదిరో, సిరి ఎవడిదిరా?" అని ప్రశ్నించాడా కవి. ఈరోజు హైదరాబాదు నగరంలో ఎత్తైన అందమైన మేడల పక్కన డేరా తీసుకుని జీవిస్తున్న బతుకులనేకం. బంజారాహిల్స్ లాంటి ప్రాంతాల్లో ఇది బాగా కన్పిస్తుంది. మేడ కట్టినవాడు గుడిసెలో ఉంటాడు, కట్టించుకున్నవాడు మాత్రం మేడలో ఉంటాడు.

'మమ్మల్ని బతకనివ్వండి' కవితలో మత ఛాందసవాదుల చర్యలకు బలైపోతున్న అమాయక జీవుల దయనీయ పరిస్థితి చిత్రణ ఉన్నది.

"కాలే శవాల కమురువాసన

నరమేధం నడుస్తున్నది

యజ్ఞానికి........

గోవులబలా........" అంటూ తాము సమిధులయ్యామని వాపోతున్నాడు.

"మేము మీరక్తమే...

మమ్మల్ని బతకనివ్వండి...." అని ఈ దేశవాసులైన ముస్లింల గురించి రాశాడు. ఈ దేశంలో వేల సంవత్సరాలుగా మతం కులం జమిలిగా నడుస్తున్నాయి. అందుకే బాలయ్య

"చచ్చిన శవం మీద చెల్లని చిల్లర పైసలు

మారాతంటూ నొసటితో అందుకుంటాం" అంటూ మాదిగల జీవితాన్ని చెప్పాడు. మాదిగోడు చెప్పుకుడితే వేసుకుంటాడు, పెండ్లి చేస్తే చేసుకుంటాడు, మెతుకులందిస్తే తింటాడు కానీ

"ఆరు బయటుంచింద్రు

అంటరానోన్ని జేసింద్రు" అంటూ ఈ సమాజాన్ని నిలదీస్తున్నాడు. మాదిగ వాడి శరీరంలో డప్పు అంతర్భాగం 32 కళలను పలికించగల వాయిద్యం.

"డప్పా నీ శక్తి బహుగొప్ప

ఢంఢం మోగావంటే నిప్పే

చిలుక్కొయ్యకు తగిలివుంటే

చిన్న ఎలుకతో ముప్పే" అంటూ మాదిగ కులాన్ని డప్పుతో పోల్చాడు. ఆ జాతి మేధస్సును డప్పు మోగుతుంటే ఎలుక దగ్గరికైనా రాగలదా? చైతన్యధిక్కారం వినిపిస్తుంటే శత్రువైనా దగ్గరికి రాగలడా? అని అప్రమత్తం చేస్తున్నాడు. వేమన కూడా తన పద్యాలలో చాలా సరళమైన పదాలు, పాదాలు వాడి విశాలమైన అర్థాన్ని స్ఫురింపజేశాడు. అటువంటి లక్షణం బాలయ్య కవిత్వంలో కన్పిస్తుంది. కవులు చాలామంది తమ తల్లిపై కవిత్వం రాస్తారు. ఎందుకంటే కవిత్వం కూడా తల్లిలాంటిది కావటం వలన. "అవ్వజాపిన-బాట" గా తన తల్లిని పాఠకుల ముందు దృశ్యమానం చేశాడు.

"ఆమె కాళ్లు కంది పుల్లలు

తాటిపీచు జుట్టు

ఆమె అంతా అస్థిపంజరం" ఈ కవితా పాదాలు చదువుతుంటే ఆమె రూపం కళ్ళముందు కదలాడుతుంది. అంతలోనే కన్నీటి తెరలవెనక్కి ఆమెని జరిపేసి తనకు వివిధ రకాల పదార్థాలు అనిపించడం కోసం ఆమె పడే పాట్లను చెప్పాడు. అగ్రకులాల్లో ఉండే సంస్కృతికి, దళితుల్లో ఉండే సంస్కృతికి చాలా తేడా ఉంది. అట్లే దానికి సంబంధించిన సాహిత్యంలో కూడా. అన్నంలో నెయ్యేసి, ఆకాశంలో చందమామను చూపుతూ గోరుముద్దలు తినిపించే స్థితి ఒక దళిత తల్లికి ఉండదు. ఒక విభిన్నమైన జీవితం వీరికుంటుంది. గోరుముద్దలకు బదులు గొడ్డుమాంసం ముక్కలు, ముడుసులో మూలుగు ఇవన్ని శ్రమ సంస్కృతిలో వారివే. పుస్తకం ప్రారంభంలో కవి తన కన్నీటి జీవిత గాథను తెలిపాడు. తన చిన్నతనంలోనే బొంబాయికి బతుకుదెరువుకని వెళ్ళిన అయ్య అక్కడనే చనిపోయాడని అన్నాడు. అప్పట్నుంచి తల్లే తనను చూసుకున్న తీరును తీపి జ్ఞాపకాలుగా చెప్తూనే, తాను నిద్రలోకి జారాక తన తల్లిపడే వేదననూ చిత్రించాడు. అయ్య జ్ఞాపకాలను, తన భవిష్యత్తును తన కళ్ళలో నీళ్ళు చేసుకున్న తల్లిని గురించి చెప్తూ "అవ్వముఖంలోనే అయ్యను జూసిన" అన్న మాటలు చదివిన ప్రతి గుండెనూ చెరువు చేస్తాయి.

"కన్నీటి ధారలే కట్టలు తెగిన సెలయేరులా

ముడిపడిన అవ్వ ముద్దుబుగ్గల మీద

ముత్యంపు మెరుపులు మెరిసె

కారు చీకటే అవ్వ ఎర్రని కండ్ల దాటికి ఎరుపెక్కి" ఇక్కడ కారు చీకటి కూడా తన తల్లి ఎర్రని కండ్లధాటికి ఎరుపెక్కుతుందన్నాడు. ఆ కళ్లు నిద్రకు దూరమై ఎన్నాళ్లయి ఉంటుందో! కన్నీళ్ళను ఒలికి ఒలికి అవశేషాల్లా మిగిలిపోయిన రెండు మాసపుముద్దల స్థితిని వర్ణించిన తీరు హృద్యం. ఆ తల్లి మరణిస్తే బొందపెట్టడానికి గజం భూమి కూడా తన దేశంలో దళితుల జీవితం బాలయ్యకు కవితా వస్తువయింది.

"సచ్చినంక బొందపెట్టడానికి

సొంత జాగలేదు" అని వాపోతున్నాడో కవితలో. నేడు తెలుగుదేశాన ఉన్న దళితులకు సగటున కుటుంబానికి గజం జాగ కూడా లేదు. ప్రభుత్వం చేతిలో ఉన్న ఒక లక్షా ఇరవై అయిదువేల ఎకరాల మిగులు భూమిని పంచితే దళితులకు కొంతైనా న్యాయం జరుగుతుంది. ప్రభుత్వాలు భూమి మాట ఎత్తకుండా భూయజ్ఞం నిర్వహిస్తాయి. బహుళజాతి కంపెనీలకు మాత్రం సెజ్‌లపేరిట ప్రజల భూమిని ఇస్తాయి. అందుకే ఈ సమాజం గురించి రాస్తూ

"కాంక్రీటు జంగల్ల

కరువు కన్నీళ్లు" అన్నాడు. సబ్బండ కులాలు తమ చెమట, కన్నీళ్లు, రక్తం ధారపోసి ఈ సమాజాన్ని ముందుకు నడిపిస్తున్న తీరును 'కొత్తదారిగా' చెప్పాడు.

"కత్తివట్టిన చర్మం ఒలిసిన

శాస్త్రవేత్తలెక్కసావ్ జేసిన" అన్నాడు. సమాజాన్ని శుభ్రంగా ఉంచడంకోసం మంగలి, చాకలి, మాదిగ మొదలైన కులాలన్ని జీవితాన్ని ధారపోశాయి, పోస్తున్నాయి. నిజానికి మొదటి శాస్త్రవేత్తలూ వారే. కానీ వారిని దళితులంటూ వేరుచేసి చూస్తున్నదీ సమాజం. అటువంటి చీకట్లనుండి బయటపడడానికి "అక్షరాన్ని ఎక్కుపెట్టిన..." అంటూ అక్షర పరిష్కారాన్ని చూపుతున్నాడు. ఆ అక్షరం కోసం బతుకువేటలో ఛిద్రమైపోతున్న బాల్యం గురించి బాలయ్య ఆవేదన చెందాడు.

"బల్లె ఆడుక్కొని తొడుక్కున్న అంగి

పిర్రలమీద చిరిగిన చెడ్డి

పగిలిపోయిన పలక" మొదలైన పాదాలు చెప్తున్నది గతం గురించేకాదు వర్తమానం గురించి కూడా. ఇట్లాంటి ఒక వాతావరణం గ్రామీణ ప్రాంతాల్లో ప్రాథమిక పాఠశాలల్లో తరచుగా కనిపిస్తుంది. వారి జీవితాలలా గడిచిపోతుంటాయి. అందుకే కవి చివర్లో

"బతుకువేటలో

తెల్లారుతంది పొద్దూకుతంది" అంటున్నాడు. 'గ్లోబలైజేషన్ కవితలో వస్తువు శీర్షికనే. ప్రపంచీకరణను 'గొర్రెలమందలపైన చిరుతల దాడి"గా వర్ణిస్తున్నాడు. నిజమే కదా! గొర్రెల మందలమీద ఇంతకుముందు నక్కలు, తోడేళ్లు దాడి చేసేది. ఇప్పుడు ఏకంగా చిరుతలే దాడి చేస్తున్నాయి. ఇదే కవితలో మరో ప్రతీకను తీసుకొస్తూ

"కొండ చిలువలా చుట్టుతంది

కొంపలన్ని ముంచుతుంది" అంటున్నాడు. ఆ కొండ చిలువ చుట్టలో చిక్కుకున్న పల్లె జీవితాల్ని వివరిస్తున్నాడు. "ఊరు" కవితలో అసహాయత అని వార్యతవైపు నడిపించే స్థితి ఉంది.

సమీక్ష ☆ ప్రశాంత్

# తుమ్మేటి రఘోత్తం రెడ్డి

## రెండు కథలు - కొన్ని అభిప్రాయాలు




"Some times I feel like a motherless child" అని పాల్ రాబ్సన్ పాటవుంది. రాబ్సన్ పాట వింటున్నప్పుడు మనలో తీవ్ర ఆందోళన మొదలవుతుంది. నిత్య జ్వరపీడితులమై అగమ్యంగా తిరుగుతున్నప్పుడు రాబ్సన్ మరింత వేదనకు గురి చేస్తాడు. సరిగ్గా రాబ్సన్ పాటలు విన్నపుడు కలిగే ఆందోళన, ఆవేదనలు ముప్పిరిగొన్నాయి, తుమ్మేటి రఘోత్తమ రెడ్డిగారి మౌఖిక కథలు విన్నప్పుడు, చూసినప్పుడు. తెలుగు కథా సాహిత్య చరిత్రలో బహుశా మొదటి ప్రయత్నంగా రూపొందించిన ఈ డి. వి.డిలో ఏడు మౌఖిక కథలున్నాయి. ఇందులోని 'స్టెప్స్' కథను, 1985లో రాసిన 'నా పాత స్నేహితుడు' అన్న రెండు కథల గురించి మాత్రమే నా అభిప్రాయాలను పంచుకుంటాను.

నా పాత స్నేహితుడు కథ కూడా స్టెప్స్ కథలాగే దుఃఖమయ సందర్భంలో మొదలవుతుంది. ఒకనాటి సాయంకాలం రామగుండం రైల్వే స్టేషన్‌లో వికల మనస్కుడైన ఓ మనిషి, చీకటి అలుముకున్న రామగిరి పర్వతాలను గుర్తుచేసుకుంటూ ప్రయాణం ఆరంభిస్తాడు. వికల మనస్కుడు అని ఎందుకన్నానంటే ఒక్క పాత స్నేహితుడి ఎడబాబు దుఃఖం మాత్రమే కాదు, స్పష్టాస్పష్టమైన భవిష్యత్తు, అందులోనూ ఒక సంఘర్షణమయమైన కాలంలో,లోకం అపుడపుడే తెలిసొస్తున్న వయసులో మనసెంత కల్లోలంగా ఉంటుందో

"పల్లెతల్లి పో పొమ్మంటుంది
పట్నం రారమ్మంటుంది" అంటూ దిక్కులేక పట్నానికి వెళ్తున్న పరిస్థితిని చూపాడు. అట్లే
"తల్లి కడుపు జూస్తుంది
పట్నం పైస జూస్తుంది" అనటంలో వాస్తవికత కనిపిస్తుంది. పల్లెతల్లి మాత్రమే కడుపు చూపగలదుకానీ, యాంత్రికమైన జీవితాలు స్వార్థ పూరిత కృత్రిమ ప్రేమలు గల మార్కెట్ సంబంధాలు పైసగాక ఇంకేం చూస్తాయి మరి! ఇట్లాంటి విషయాల్ని చిత్రించడానికి ఒడిదుడుకులమయమైన జీవితానుభవం బాలయ్యకు ఉండటమే కారణం. అందుకే ఆ వాస్తవాన్ని పట్టుకోగలిగాడు.
"ముడుచుకుపోయిన స్వభావం నుంచి
మార్పుకోసమే మా యుద్ధం
పోయిన కాడనే వెతుక్కో" అంటూ అణచివేసినచోటనే తిరుగుబాటు అట్లే చేయమంటున్నాడు. "అవమానం అడుగున అధికారం నిలుపుకో" అని జాగృత పరుస్తున్నాడు. ఇట్లా బాలయ్య కవిత్వం దారి పొడుగునా చిందిన నెత్తుటిని, చెమటను దోసిలికెత్తుకున్నట్లు కనిపిస్తుంది. ఓ తెలంగాణ పేద జీవితన యెతలన్ని చెబుతున్నట్లుంది. తిరుగుబాటు స్వరాన్ని వినిపిస్తున్నట్లుంది.

వందలాది సంవత్సరాలుగా దళితులు సామాజిక, రాజకీయ, ఆర్థిక వివక్షత నెదుర్కొంటున్నారు. తమ శ్రమనంతా ధారపోసి ఊళ్ళను శుభ్రపరిచారు. కానీ వాళ్ళు అంటరానివాళ్ళయ్యారు. మూతికి ముంతకట్టినా, ముడ్డికి చీపురు కట్టినా ఓర్చుకున్నారు. అణచివేత ఉన్న చోట తిరుగుబాటు తప్పదు కదా! దళితవనంలో పూసిన పూలే, అంబేద్కర్ లాంటి మేధావులందించిన కొత్త చూపుతో దళితుల జీవన విధానం, ఆలోచన సరళి మారిపోయాయి. మేమూ మనుషులమే అని ధిక్కరించగల్గుతున్నారు. ఈ క్రమంలోనే 1985 తర్వాత దళిత సాహిత్యం విస్తృతంగా వచ్చింది. ఎంతగా అంటే తెలుగు సాహిత్యమంటే దళిత సాహిత్యమే అనేంతగా. ఇక అగ్రకుల బ్రాహ్మణీయభావజాలంతో రాసే కవులు మూట ముల్లె సర్దుకున్నారు. ఈ చైతన్య పరిణామ క్రమంలోనే బాలయ్య ధిక్కారస్వరం విప్పారింది. కవితై కదిలింది, కదిలించింది.

కవితా వస్తువు పట్ల దృష్టి, విశాల జీవితం సంఘర్షణ ఉన్న బాలయ్య కవితా శిల్పం పట్ల కూడా శ్రద్ధపెడితే చిక్కటి కవిత్వం వస్తుంది. మేము శిల్పం గురించి మాట్లాడుతున్నామంటే అలంకారికులు చెప్పిన శిల్పం కాదని బాలయ్య అర్థం చేసుకోవాలి. శిల్పం జానపదుల జీవితంలోనే ఉంటుంది. శ్రమైక జీవితంలో శిల్పం అంతర్భాగంగా ఉంటుంది. జానపదులలో ఎవరినైనా ఎలా ఉన్నావని మనం పలకరిస్తే "ఏం చెప్పమంటావు నా బతుకు అడవిలో పొద్దు గునుకినట్లు ఉందని" కవితాత్మకంగా సమాధానం చెప్తారు.
"చీకటింట్లో చిలుక పలికే
శ్రీరాముని కోడి కూసే
పట్టపగలు వాన కురిసే
పలుగురాళ్ల చెరువు నిండే
అర్దముల్ల పొద్దు పొడిచే" ఇది జానపదులు పాడుకునే పాట. చక్కటి భాష పదజాలం, పోలికలు, భావచిత్రాలతో కూడిన శిల్పనైపుణ్యాన్ని శ్రమజీవులు సాధించారు. ప్రకృతి - జీవితం పట్ల స్పష్టమైన అవగాహన ఉండటం వలన వారికి ఇది సాధ్యమవుతుంది. గుండెలోని సున్నితత్వాన్ని స్పందింపజేసేదే కవిత్వం. అందమైన దాన్ని మరింత అందంగా, వికారమైన దాన్ని అంతకు రెట్టింపుగా ప్రతి దాన్ని పాఠకుడు ఆశ్చర్యపడేటట్లు చెప్పడమే కవిత్వం. కవిత్వమొక అందమైన కళ. ఆ కళను కళాత్మకంగా వ్యక్తం చేసే పనిని మనం చేయాలి. "కళా విలువలు ఎంత బాగా ఒదిగినప్పటికీ ప్రజా ప్రయోజనం లేని వస్తువు ఎట్లా నిరర్థకమో ప్రజా ప్రయోజనమున్న వస్తువు కళా విలువలు పాటించకపోతే అంతే నిరర్థకమని" మావో చెప్పిన మాటలు కవిత్వం రాసేవారందరం గుర్తుపెట్టుకోవాలి.

బాలయ్య తనకంటూ ఒక డిక్షన్ కలిగి ఉన్నాడు. " తాటాకులు తుడిచిన చప్పుడు", "పేగులెండిన సింగరేణి," "అనంత విశ్వమొక అగ్నిగోళం నేనొక నిప్పుకణం", "మానం మొండి చింతల మొద్దయ్యింది". లాంటి కవితాపాదాలు మనల్ని చదివిన తర్వాత వెంటాడుతాయి. ఇట్లాంటి మంచి పోలికలను తెచ్చిన బాలయ్య కొన్ని చోట్ల పూర్తి వచనం రాశాడు. "బ్రిడ్జిలు, బిల్డింగులు, కట్టలు, కాలువలు చెరువులు, కుంటలు, ఎలక్ట్రిక్ పోల్‌లు టెలిఫోన్‌లైన్లు, ఇసుక లారీలు" (పుట 71) పొద్దు పొడుపులో (ఎగిలివారంగ) మనతో కరచాలనం చేసిన బాలయ్య హుస్నాబాద్ (కరీంనగర్) లాంటి పోరాట ప్రాంతంలో పుట్టి తైదల అంజయ్య సహచర్యంలో ఉండి విప్లవోద్యమంపై ఒక్క కవిత కూడా రాయకపోవటం చూస్తే లోపం బాలయ్యదా? విప్లవోద్యమానిదా? ఆలోచించాలి. అంబేద్కర్ పట్ల ఉండే ఆచంచల విశ్వాసం కాబోలు ప్రతి సమస్యకు పరిష్కారాన్ని అంబేద్కరులో వెతికే ప్రయత్నం చేశాడు. ఇట్లాంటి కొన్ని మినహాయింపులు వదిలేస్తే బాలయ్య కవిత్వాన్ని సలసల కాగుతున్న హృదయంతో చదివి కళ్లను చంద్ర నిప్పులను చేయవచ్చు.

*

చెప్పడం కోసం.

నా పాత స్నేహితుడు కథలో వయసు మళ్లిన పల్లెటూరి స్త్రీ అడుగుతుంది. "అయ్యో కొడుకా నీవేనా - నేనెవరో అనుకుంటాన - పురాగ ఎట్లనో అయినవ్ కొడుకా" అని. బహుశా ఆమె ఈ పరిచితమైన మనిషి, ఇట్లా చిక్కి శల్యమైపోయాడనో, మునుపు తీరుగా లేడనే అర్థంలోనో అని ఉంటుంది కావచ్చు. కాని, ఆ ప్రశ్నను ఎదుర్కొన్న వికలమనస్కుడికి ఆ ప్రశ్న మరోలా తట్టి ఉంటుంది. సొంత ఊరిలో, అమ్మా, బాపుల దగ్గర ఉన్న రోజుల్లో తనకీ, ఇప్పటి తనకీ అన్ని విషయాల్లోనూ వేరైపోయాడు. మానసిక, భౌతిక దూరాలకు గురయి, గుక్క తిప్పుకోలేని దుఃఖంలో ఉండి ఉంటాడు.

ముఖ్యంగా అరవైయ్యో దశాబ్దం తర్వాత దేశంలోనూ, రాష్ట్రంలోనూ అప్పటి దాకా వ్యవసాయ రంగంలో ఉన్న యువత సేద్యం ఒట్టిపోయి, కాలి గోళ్లలో మట్టిసైతం ఒదలకుండా ముళ్లకంపల మధ్యనుంచి, బండ్ల బాటల మీదుగా పట్టణాలు చేరింది.దిగంతంలో విసిరేసినట్టుగా ఉండే స్థితిలో, ఏకాకితనంలో కొట్టుమిట్టాడింది. తెలియని ప్రపంచంతో మెలగడమే కాదు, అగాధంలోనే జీవిక వెతుక్కునే క్రూర స్థితిని చూసింది.

ప్రాణాన్ని పణంగా పెట్టి అందులో ఇమడటానికి వెయ్యిన్నొక్క శరాఘాతాలు తిన్నది. ఆ సందర్భంలో నుంచి స్టెప్స్ కథను, ప్రత్యామ్నాయ నిర్మాణం కోసం జరిగిన సాయుధ ఉద్యమం ఎన్ని మలుపులు తిరిగిందో పరిశీలించడానికి నా పాత స్నేహితుడు కథను చూడవచ్చు అనిపించింది.

సాగిపోతున్న రైలు ప్రయాణంలో, విడిపోయిన లేదా మరుపులోకి వెళ్లిపోయిన పాత స్నేహితుడు నిరంజన్ కలుస్తాడు. నిరంజన్ కనిపించిన క్షణంలో కలిగిన ఆనందం ఎంతో, క్షణాలు గడిచిన తర్వాత కలిగిన అలవిగాని దుఃఖమూ అంతే. ఏదో అవ్యక్త ఆందోళన మొదలవుతుంది. ఇద్దరి మధ్య భరించ శక్యం కాని మౌనం, ప్రేమాస్పదమైన చూపులు కొరవడిన ఉట్టి భౌతిక సాన్నిహిత్యం మిగులుతుంది. ప్రాణసమానుడనో, ఆత్మీయుడనో అంటాం కదా. అలాంటి స్నేహం, సాన్నిహిత్యం ఎందుకట్లా మారిపోయింది? రెండు దశాబ్దాల కాలం గడిచిన తర్వాత ఎవరం ఎక్కడ ఉన్నాం? అని పరి పరి విధాల ఆలోచనల, ప్రశ్నల జడి మొదలవుతుంది. వెంటపడి తరుముకొచ్చినట్లు గతం వెంటాడుతుంటుంది.

మానవ సంబంధాల విచ్ఛిన్నానికి, అంతులేని ప్రేమలు కలగడానికి కారణాలు చెప్పలేం. జవాబులు కనుక్కోలేం. అట్లా అశక్తకు గురిచేసే ప్రశ్నలు మదిలో మెదులుతూ అశాంతి గురిచేస్తాయి. నిరంజన్‌తో స్నేహం తెగిపోవడమైనా, రియాజ్ ఇచ్చిన ఆత్మీయస్పర్శ మరుపులోకి వెళ్లిపోవడమైనా సంవేదనశీలమైన హృదయాన్ని హింసపెడుతుంది. ఆత్మీయ స్నేహాన్ని కోల్పోయిన మనను ఎట్లా పిట్ట గోసపడుతుందో వ్యాఖ్యానించనవసరం లేదు కదా...

రఘోత్తమ రెడ్డిగారు నా పాత స్నేహితుడు కత 1985లో రాశారు. అటు ఇటుగా రెండున్నర దశాబ్దాల కాలం కత్తుల వంతెన మీదే వెళ్లిపోయింది.

ఆ రెండున్నర దశాబ్దాల క్రితం నాటి ఒకానొక సాయంకాలం మొదలైన సంఘర్షణ ఏఏ రూపాలు తీసుకున్నదో, చెప్పనలవిగాని దుఃఖ సంతోషాలను ప్రోది చేసుకున్నదో చెప్పడానికి, స్నేహం స్థల, కాలాలకు అతీతమైంది కాదని మరోసారి గుర్తుచేయడానికి నా పాత స్నేహితుడు కథకు స్టెప్స్ కథ కొనసాగింపుగా అనిపించింది.

స్టెప్స్ కథ ఆరంభంలోనే ఒకదయా రహితమైన ప్రశ్న ఎదురవుతుంది. "ఇపుడాయన నా స్నేహితుడో కాదో చెప్పలేను కానీ"..అని. కథ ఒక Hunting point లాంటి బాధాకరమైన ప్రశ్నతో పాఠకుణ్ణి చేరుతుంది.

మౌఖిక కథల్లో మనకు కొట్టొచ్చినట్టు కనిపించేది; కథ చెబ్బుతున్నప్పుడు మాటల మధ్య ఏర్పడిన మౌనం చాలా కతను నడిపిస్తుంది. పాఠకుడు కొంచెం జాగరూకత వహిస్తే చెప్పని కథ ఏమిటా అన్న ప్రశ్న వేసుకోవచ్చు. రఘోత్తమ రెడ్డి గారి ఈ మౌఖిక కథల్లో ఆయన స్వరంలో, కథ చెబుతున్నప్పుడు మధ్యలో మిగిలిన మౌనం గురించి కొంచెం ఆలోచించాలి. పాఠకులు సునిశిత దృష్టితో పరిశీలించాలి.

గాబ్రియల్ గార్షియా మార్క్వెజ్ తన Strange Pligrims కథల సంపుటికి రాసిన ముందుమాటలో

"మరణం అంటే ఏమిటి" అన్న ప్రశ్న వేస్తాడు. మళ్లీ ఆయన అందుకు జవాబుగా వేదనామయ స్వరంతో అంటాడు, "ప్రేమాస్పద సహచరుల మధ్యనుండి విడిపోవడమే కదా....." అని.

నా పాత స్నేహితుడు కథలో నిరంజన్‌తో స్నేహమైనా, భూమి గర్భంలోని బొగ్గు బావుల్లో పనిచేస్తున్న రోజుల్లో ఆప్త స్నేహాన్ని పంచిన రియాజ్‌తో పంచుకున్న ప్రేమాస్పద సందర్భాలైనా ఉట్టి పోసుకోలు మాటల వల్ల ఏర్పడిన మైత్రి కాదని అర్థమవుతుంది.

ఈ స్నేహం కలిగిన కాలాన్ని గురించి నా పాత స్నేహితుడు కథలో ఒక మాటుంది, "బిడ్డా ఇది సెప్ప వొశం గాని కాలం" అని. సరిగ్గా అలాంటి చెప్ప వొశంగాని కాలంలో ఏర్పడిన సాన్నిహిత్యం స్టెప్స్ కథలో రియాజ్‌తో స్నేహం కలిగే నాటికీ, కాలం గడిచి ప్రాణసమానుడు అనుకున్న రియాజ్ "ఈ ఊరికి వస్తున్నాను కాని, నిన్ను కలవడం లేదు" అని నిర్దయగా అనే రోజు రావడానికి మధ్య చాలా కాలం గడిచింది. అనేకానేక సామాజిక పరిణామాలను తెలుగు సీమ చవిచూసింది. ఇద్దరి స్నేహితుల మధ్యనే కాదు, రెండు కాలాల మధ్య అగాధం ఏర్పడింది. కొత్త సామాజిక, ఆర్థిక పరిణామం మనుషుల్లో అంతరాలను, వైరుధ్యాలను సృష్టించింది. అట్లా చూసినప్పుడు స్టెప్స్ కథలోని ఇద్దరి స్నేహితుల మధ్య ఏర్పడిన మానసిక, భౌతిక దూరాలు వాళ్లిద్దరివేనా అంటే కాకపోవచ్చు. కచ్చితంగా కాదు కూడా.

నా పాత స్నేహితుడు కథలో.... గోడల మధ్య గాలి ఆడవి సందర్భంలో "నిరంజన్ ఇక నేను మళ్లీ వస్తాను" అన్న రోజు సైతం బయటికి వినిపించిన ఆ మాటల వెనకాతల ఆ పాత్ర ఆత్మగతంగా ఏమనుకుని ఉంటుందో నిశిత దృష్టిగల పాఠకుడు ఊహించగలడు. ఖాళీని పూరించుకోగలడు.

రియాజ్‌తో స్నేహం కలడానికైనా, విడిపోవడానికైనా కారణాలను, జవాబులను సంఘర్షణమయమైన నాలుగు దశాబ్దాల తెలంగాణ జనజీవితంలో వెతకాలి. అట్లా వెతికినప్పుడు జవాబులే కాదు, ప్రశ్నల పరంపర మొదలవుతుంది. జవాబులన్నీ ప్రశ్నలయ్యే స్థితి తెలిసివస్తుంది. ఈ సామాజిక స్థితికి మన చెప్పుకుంటున్న కారణాలు నిజంగా కారణాలో కాదో అన్న అనిశ్చితి ఏర్పడుతుంది.

స్థల,కాలాలతో నిమిత్తం లేని స్నేహం ఉండదనీ అట్లాగని పూర్తి యాంత్రికంగా పరిస్థితులపై నెట్టేయలేమని ఈ రెండు కథలు చదివితే తెలుస్తుంది. వైయక్తిక స్వభావాలు భిన్న పరిస్థితుల్లో ఎట్లా ప్రవర్తిస్తాయో అర్థమవుతుంది.

తెగిపోయిన స్నేహం తాలూకు దుఃఖాన్ని మిగుల్చుకున్న వారొకరైతే, కాల ప్రవాహంలో తనను తాను కోల్పోయిన వారు ఇంకొకరు. మానవ సంబంధాల్లోని సంక్లిష్ట పార్శ్వాలను వ్యక్తావ్యక్తంగా చెబుతాయి ఈరెండు కథలు.

కోల్పోయిన స్నేహం గురించి కాలంతోపాటు కొట్టుకుపోయిన రియాజ్ ఆలోచించాడా అంటే కచ్చితమైన జవాబు చెప్పలేం. నిజానికి ఆ జవాబు ఒక్క రియాజ్ అనే మనిషిలోనే లేదు కూడా. తెగిపోయిన అనుబంధం గురించి రియాజ్ ఖేదపడ్డాడా అంటే జవాబు ఉండకపోవచ్చు కాని, ఆయన బతుకు యానంలో అది ప్రధానం కాలేదని మాత్రం చెప్పగలం. నిర్దిష్టమైన స్థల కాలాల్లో మానవ సంబంధాలు ఎట్లా రూపొందుతాయో, రూపొందే క్రమంలో వైయక్తిక స్వభావాలు ఎట్లా మారుతుంటాయో చెప్పే కథలు' నా పాత స్నేహితుడు', 'స్టెప్స్'.

తుమ్మేటి రఘోత్తం రెడ్డి
ఏడు మౌఖిక కథలు
డివిడి వెల : 50/-

*

సినిమా సమీక్ష ☆ రత్న

# అర్జంటుగా నిషేధించాల్సిన 'అరుంధతి'

'అరుంధతి' చూసిన తరువాత నాకొక గొప్ప సందేహం వచ్చింది. అసలు మనకొక సెన్సారు బోర్డు ఉందా అని! ఉంటే అందులో మహిళలు ఉన్నారా! ఉంటే అంత నిర్లక్ష్యంగా, నిర్లజ్జగా ఇలాంటి సినిమాలను జనంలోకి వదులుతారా! అది కూడా ఈవ్‌టీజింగ్‌లు, యాసిడ్ దాడులు, మానభంగాలు పెరిగిపోయి, స్త్రీలకు రక్షణ కరువయిందంటూ మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు ఆందోళన చేస్తున్న ప్రస్తుత పరిస్థితులలో...

ఇక సినిమా విషయానికొస్తే, సంసార పక్ష సినిమాలు తీస్తారని చెప్పుకొనే కోడిరామకృష్ణలాంటి దర్శకుడు, ఎం.ఎస్.రెడ్డిగారి లాంటి వ్యక్తి కుమారుడు ఎం.శ్యాంప్రసాద రెడ్డి నిర్మాతగా, మల్లెమాల ఎంటర్‌టైన్‌మెంట్ బ్యానర్‌గా విడుదలయింది.

క్లుప్తంగా ఇదీ కథ. గద్వాల్ రాజావారికి ఇద్దరు కూతుళ్ళు. పెద్దకూతురు భర్త పశుపతి (సోనూసూద్) స్వయాన రాజావారి చెల్లెలు కొడుకు. విపరీతమైన కాముకుడు. వాడికి అన్ని విధాల వత్తాసు పలికే తల్లి. (సుభాషిణి). రెండవ కూతురు అరుంధతి. ఆ సంస్థానానికి కాబోయే వారసురాలు. పౌరుషానికి ప్రతీక. పశుపతిగాడి పశువాంఛలు మితిమీరి ఆస్థానంలో నృత్యం నేర్పడానికి వచ్చిన నాట్యాచారిణిని మానభంగం చేసి చంపేస్తాడు. అది చూసిన అరుంధతి. జనంతోనే వాణ్ణి కొట్టించి, గుర్రాలతో ఈడ్పించి పారేస్తుంది. కాని వాడు చావాడు. కొన ఊపిరితో ఉన్న వాన్ని "అఘోరాలు" బతికిస్తారు. వాళ్ళ దగ్గర క్షుద్రశక్తులు, తాంత్రిక విద్యలు నేర్చుకొని వాడు కూడా 'అఘోరా' (దుష్టశక్తులను వశపరచుకొని, చేతబడులు గట్రా చేసి ప్రజల్ని పీడించేవాళ్ళు)గా మారిపోతాడు. అరుంధతి మీద పగసాధించడానికి మళ్ళీ ఆస్థానానికి తిరిగి వస్తాడు. అది అరుంధతి వివాహ సమయం. తనను చంపడానికి వచ్చిన పశుపతిని ఆ స్థానంలోనే సజీవంగా సమాధి చేసి, ఆ ఆస్థానాన్ని విడిచి వెళ్ళిపోతుంది అరుంధతి (ఒకవేళ వాడిని చంపేస్తే వాడు తిరుగులేని ప్రేతాత్మగా మారతాడని ఆస్థాన గురువుల హెచ్చరిక) అయితే వాడి మంత్రాల దుష్టగాలిసోకి ఆస్థానంలోని ప్రజలు, పొలాలు అన్నీ సర్వనాశనం అయిపోతాయి. (వీళ్ళ కుటుంబం మాత్రం సేఫ్‌గా మరోచోటికి వెళ్ళిపోతుంది) వాడిని చంపే ఆయుధం కోసం ఋషుల సలహాతో ప్రాణత్యాగం చేస్తుంది అరుంధతి. (మరి ఆ ఆయుధం ఆమె ఎముకలతో తయారు కావాలట!) ఊరి ప్రజలంతా 'జేజమ్మా' అంటూ పిలుచుకొనే అరుంధతి, మళ్ళీ ఆ వంశంలో మూడవ తరంలో జన్మిస్తుంది. తిరిగి ఆమె వివాహ సమయానికి పశుపతి సమాధి నుండి విడుదల అవుతాడు. తరువాత కథ ఏమవుతుంది? అచ్చం అన్ని తెలుగు సినిమాల లాగానే ముగుస్తుంది. చివరికి పశుపతి (అఘోరా) పీడ విరగడవుతుంది. ధర్మమే జయిస్తుంది???

కథ వింటుంటే ఏ మాత్రం విపరీతంగా అనిపించటం లేదు కదూ! చిత్రీకరించడంలోనే ఉంది అసలు తెగులంతా. చేతకి దొరికిన స్త్రీనల్లా అనుభవించి చంపేసే పశుపతి పాత్ర, నాట్యాచారిణిని మానభంగం చేసి చంపేసే దృశ్యం (చంపుతూ మానభంగం చేసే) వాడి పైశాచికానికి పరాకాష్ఠ. ఒక వేళ అది నటన కదా అనుకున్నా, మరి అంత పైశాచికంగా ఒక దృశ్యాన్ని చిత్రీకరించగలిగిన వికృతానందం ఎవరిది? అంతటి దుర్మార్గున్ని శిక్షించిన నేరానికి (?) ఆస్థానానికి సంబంధించిన ప్రజలంతా నాశనమై పోతారట. పైగా సినిమా మొదట్లో మేం క్షుద్రశక్తుల్ని నమ్మం. ఇది కేవలం కల్పితం అంటూ స్టేట్‌మెంట్ ఒకటి చూశారా! వాళ్ళు ఏ దుష్టశక్తుల్ని ప్రేతాత్మల్ని నమ్మరు. కాని మనమే వాటిని చూసి (డబ్బు పెట్టి మరీ) జడుసుకొని చచ్చిపోవాలి.

ఇక అరుంధతి ప్రాణత్యాగ మొక గొప్ప సీను (వాళ్ళదృష్టిలో). తనను అతిభయంకరంగా చంపాలని, తన మరణ యాతనలోంచి తనలో కసిరగలాలని ఆమె కోరికట. వాడు ఆ నాట్యాచారిణిని (ఆమె గుడ్డిది) చంపే దృశ్యం చూసిన వ్యక్తిలో కలిగే 'కసి' కంటే మించినది కూడా ఉంటుందా?

ఆద్యంతం హింసనే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొని, ప్రతి దృశ్యాన్ని వీలయినంత కిరాతకంగా చూపించగలిగిన డైరెక్టరు ప్రతిభకు, పశుపతి పాత్రకోసం అత్యంత నీచమైన డైలాగులు రాసిన రచయితగారికి, వాటిని వెన్నులో వణుకు పుట్టించేంత కర్కశంగా చెప్పగలిగిన డబ్బింగ్ ఆర్టిస్టుకి, అతికష్టంగా సినిమా మొత్తం చీరలోనే కన్పించిన హీరోయిన్‌కి రాబోయే సంవత్సరంలో అవార్డులు వస్తే రావచ్చుగాక! అవునూ, పశుపతి గాడేంచేశాడు. వాడికీ ఓ అవార్డు. నాకైతే ఆ థియేటర్‌లో కూచున్న అందరికీ తలమీద కొమ్ములు ఉన్నట్లుగా అనిపించింది. (మాతో సహా) మరి రాక్షసులకు తలమీద కొమ్ములుంటాయట కదా! పౌరాణిక సినిమాలలోను, 'భక్తి' సీరియళ్ళలోను చూస్తూ ఉంటాం గదా!

అసలు ఇలాంటి సినిమాలు ఎలా రిలీజవుతున్నాయి. 'ఎ' గ్రేడ్ పెట్టి చేతులు దులుపుకుంటే సరిపోతుందా! ఒక్క సినిమాతో కాదు టివి వాళ్ళు కూడా నేరాలు, ఘోరాలు అంటూ జరిగిపోయిన సంఘటనలను, సాధ్యమయినంత భయంకరంగా చిత్రీకరించి చూపిస్తున్నారు. ఒకవైపు ఇలాంటి కార్యక్రమాలతో మీడియా ఊదరగొడుతుంటే అంతకు రెట్టింపుగా, నేరాల సంఖ్య, మహిళలపై జరిగే అత్యాచారాలు (అది ఏ రూపంలోనివి అయినా) పెరిగిపోతున్నాయి. అఫ్‌కోర్స్, పోలీసులు, పోలీస్‌స్టేషన్లు, న్యాయవాదులు, న్యాయస్థానాల సంఖ్య కూడా పెరుగుతున్నదనుకోండి. అయినా ఎలా ఇలాంటి నేరాలు అరికట్టబడతాయి? అన్నది మాత్రం మిలియన్ డాలర్ల ప్రశ్నగా మిగిలిపోతుంది.

ఇలాంటి సినిమాలు తీసి జనంలోకి వదలి, వాళ్ళ బలహీనతని సొమ్ము చేసుకొంటున్న ప్రతి ఒక్కరికీ నాదో విన్నపం. అయ్యా! మీరు సృష్టించిన 'పశుపతులు' ఈ సమాజంలో మన చుట్టూ ఉన్నారు. వీళ్ళ పశుత్వానికి మీరు ఆజ్యం పోయకండి. మీ కుటుంబంలో కూడా స్త్రీలున్నారన్న విషయం మరవకండి. దుర్మార్గాన్ని ఎదిరిస్తే 'అరుంధతి'లా కష్టాలపాలవుతారన్న 'చచ్చు' సందేశాలను వాళ్ళలో నింపకండి.

అలాగే మన మహిళా సంఘాలకు కూడా. అమ్మలారా. చిన్న చిన్న డ్రస్సులను, సినిమా పేర్లను చూచి పోస్టర్ల మీద మాత్రమే ధర్నాలు చేయడం, చర్చలు జరపడం, స్టేట్‌మెంట్స్ ఇవ్వడం కాదు. అందమైన చీరకట్టు, వెలిగిపోతున్న నగల ముసుగులో కూడా, అత్యంత దారుణమైన విషాన్ని విరజిమ్మ గలిగే ప్రబుద్ధులున్నారు. కనీసం మనల్ని మనమైనా కాపాడుకోవాలి కదా. సంఘాలు ఏర్పాటు చేయడం, సందేశాలు ఇవ్వడమే కాదు, ఇలాంటి సినిమాలను అడ్డుకొనే ప్రయత్నం చేయండి. మీ ప్రయత్నం వల్ల కొంత మందైనా ఈ సినిమాలకు దూరంగా ఉంటారు. వాళ్ళ పిల్లల్ని దూరంగా ఉంచుతారు. చిప్స్ నములుతూ, కూల్‌డ్రింక్ తాగుతూ ఇలాంటి సినిమాలను ఎంజాయ్ చేస్తున్న ప్రేక్షకులారా అది మీలో, మీ పిల్లలలో నింపుతున్న విషబీజాలను గమనించండి. మన తలల మీద కొమ్ములు మొలవక ముందే జాగ్రత్త పడదాం. కనీసం మనుషులుగానైనా మిగలడానికి ప్రయత్నిద్దాం, ఏమంటారు. *

నివేదిక

# కరీంనగర్ కథకుల సమావేశం

## ఫిబ్రవరి 20, 21,22

☆ ఉజ్వల్

విరసం జరుపుతున్న కథల వర్క్‌షాపులలో భాగంగా కరీంనగర్ ఫిలిం సొసైటీ అతిధ్యంతో ఈ సారి కథల వర్క్‌షాప్ కరీంనగర్‌లో జరిగింది. ఫిబ్రవరి 20నుండి 22వరకు 3రోజుల పాటు సాగిన వర్క్‌షాప్‌లో సుమారు 50 మంది దాకా వివిధ ప్రాంతాలనుండి వచ్చిన కథా రచయితలు పాల్గొన్నారు.

విభిన్న సామాజిక అంశాలతో రూపొందించిన లఘు, డాక్యుమెంటరీ చిత్రాల ప్రదర్శనకు వివిధ రాష్ట్రాలను నుండి వచ్చిన ఎందరో దర్శకులతో సంభాషించి వారి చిత్రాలపై ప్రతిస్పందించి అభిప్రాయాలు పంచుకునే అరుదైన అవకాశం ఈ కథల వర్క్‌షాప్‌లో లభించింది. 20నాటి ప్రారంభ సమావేశంలో క.ఫి.సా అధ్యక్షులు వారాల ఆనంద్ "సినిమా, సాహిత్యం, పెయింటింగ్, సంగీతం.... ఏవీ వేర్వేరు కావని, ఇవన్నీ సృజనాత్మక భావ వ్యక్తీకరణ రూపాలని, వీటిమధ్య ఉండే అంతరాలు తగ్గించుకొని వీటి మధ్య వారధి నిర్మించుకోవా"లన్నారు.

సత్యజిత్‌రే 'పథేర్ పాంచాలి' మొదట నవల. తర్వాతే సినిమా తీశారు. సాహిత్యంలో మెయిన్ స్ట్రీమ్ సాహిత్యానికి భిన్నంగా పారలల్ సాహిత్యం వస్తున్నట్లే మెయిన్ స్ట్రీమ్ సినిమాకు, భిన్నంగా ఇండిపెండెంట్ సినిమా రావడానికి క.ఫి.సా.గా కృషి చేస్తున్నామన్నారు. ఈ చర్చలో క.ఫి.సా. కార్యదర్శిగా నాగభూషణం గారు, వారి సభ్యులు కూడా ఉత్సాహంగా పాల్గొనడమేకాక అన్ని ఏర్పాట్లూ దగ్గరుండి చేస్తూ ఆత్మీయంగా కలిసి పోయారు.

లఘు చిత్రాలపై ఆసక్తికరంగా సాగిన చర్చ అనంతరం సీనియర్ కథకులు తుమ్మేటి రఘోత్తమ రెడ్డిగారు కథల వర్క్‌షాప్‌ల ఆలోచనకు మూలమూ, వర్క్‌షాప్‌ల గమనమూ, ఉద్దేశమూ వివరించారు. ఈ వర్క్‌షాప్‌ల క్రమంలో దాదాపు 25మందిమి బృందంగా తయారై వర్క్‌షాప్‌ల్లో చదివి, చర్చజరిగి రూపొందిన కథలతో వచ్చిందే "కథల పంట" సంకలనం అన్నారు.

బి.వి.ఎన్. స్వామిగారు ప్రతి స్పందిస్తూ "కథల పంట చూశాను. వర్క్‌షాప్ ఉద్దేశం మంచిది. ప్రధాన పత్రికల్లో వస్తున్న వ్యాసాలు, కథలు, కథల వార్షిక సంచికల ముందు మాటలూ, వాటి సారాంశం అంతా చూస్తే వస్తువుకు కొరతలేదు. శిల్పమే కొరత అని తెలుస్తుంది. కథకుడు తాను నమ్మిన భావాల్ని ఎన్నుకున్న వస్తువుకు జోడించి పాఠకుడికి చెప్పాలనుకుంటాడు. దీనిలోంచి శిల్పం వస్తుంది. గీతలు గీసి ఇది శిల్పం అనే ధోరణి మొదలైంది" అంటూ తన అభిప్రాయాన్ని తెలిపారు.

హనీఫ్‌గారు తన మొదటికథ అనుభవాన్ని వివరిస్తూ "మా క్వార్టర్ ముందు సూరయ్య అనే కార్మికుడుండేవాడు. నూతన ఆర్థిక విధానాల ప్రభావంతో సింగరేణిలో ఏర్పడిన సంక్షోభంతో కంపెనీ కార్మికులను తగ్గించాలనుకుంది. అనారోగ్యం మూలంగా కంపెనీకి ఆబ్సెంట్ అయిన సూరయ్యను పనిలోంచి తొలగించారు. అప్పుడు ఆ కుటుంబం ఎదుర్కొన్న పరిస్థితులు, కార్మిక సంఘాల పాత్ర..... ఈ అంశాలన్నింటితో కథ రాశాను. కథలో జీవితం ప్రస్ఫుటంగా కనిపించా"లన్నారు.

సలిమెల భాస్కర్ తాను అనువాదం చేసిన కన్నడ కథ "మళ్ళీ జీవితంలోకి" చదివారు. ఈ కథను నియమ చంద్ర అనే స్త్రీ వాద రచయిత్రి రాశారు. భిన్న ప్రాంతాలు, భిన్న సామాజిక నేపధ్యాలు గల ఇద్దరు ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు. జీవిత ప్రయాణంలో భార్య 'సిక్' అవుతుంది. ఆమె తన జ్ఞాపక శక్తిని కోల్పోతుంది. భర్త ఆమెను మామూలు మనిషిని చేయడానికి ఆమెకు సపర్యలు చేస్తాడు. వాళ్ళు గడిపిన ప్రదేశాలకు తీసుకెళ్ళి పూర్వపు జ్ఞాపకాల్ని గుర్తు చేయడానికి ప్రయత్నిస్తాడు. మాట్లాడడానికి.., చదవడానికి, రాయడానికి, ఇలా పసి బాల్యంనుండి ఆమెను పూర్వపు మనిషిగా మార్చడానికి ప్రయత్నిస్తుంటాడు. ఏనాటికైనా ఆమె మామూలు మనిషి అవుతుందనే ఎదురు చూపుతో కథ ముగుస్తుంది. కథ రాసిన పద్ధతి, కథనం అద్భుతంగా ఉన్నాయి. కథపై అభిప్రాయాలు ప్రకటింపబడ్డాయి. వీరగోని పెంటయ్య మాట్లాడుతూ జీవితం ఎవరికైనా యుద్ధమే! సహచరి కోసం చేసిన యుద్ధాన్నీ, దాంపత్య విలువలకోసం నిలబడిన తీరు కథలో ఆవిష్కరించిన పద్ధతి బావున్నాయ్! అన్నారు.

రఘోత్తమరెడ్డిగారు - 'ఈకథపై భిన్న అభిప్రాయాలు ఉండడానికి వీలులేని కథ ఇది. మంచికథ. కథను ఎలా చదవాలో భాస్కర్‌ను చూసి నేర్చుకోవాలి. కథని ఫాలో అవుతున్నారా లేదా అని చూసుకొని చదివే పద్ధతి బాగుంది'.

నలిమెల భాస్కర్ 'నెగెటివ్ భావజాలం మన మనసుపై బాగా ప్రభావం వేశాయి. జీవితంలో ఆశావాద దృక్పధముంటే మంచి ఫలితాలు సాధించే అవకాశం వుంది'.

నాగభూషణం:-స్త్రీ చేసే సేవలు పురుషుడు కూడా అంతే గొప్పగా ప్రేమగా సహచరికోసం చేయడం ఉన్నతమైన విలువ.

నల్లూరి రుక్మిణి:- నాకు చెరబండరాజుకు సేవచేసిన శ్యామల గుర్తొచ్చింది. ఆయన బతకడని తెలిసినా సంవత్సరాల తరబడి సేవలు చేయడంతో ఆమె ఆరోగ్యం పాడైపోయింది. ఈ విషయాల్ని మనం కథగా మలచాల్సి ఉండే అనిపించింది.

అల్లం రాజయ్య:- దుఃఖం..వేదన..వీటికి సంబంధించిన కథలు ప్రపంచ వ్యాప్తంగా చాలా వచ్చాయి. కథకు సంబంధించి నాకు అభ్యంతరం లేదు. కాని దీన్ని మిగతా కథలకు పోలిక పెట్టుకోకూడదు. దేనిదారి అదే! బేసిక్‌గా ఇది సాంప్రదాయకమైన కథ. రికాలింగ్ ఫ్రం జీరో - బెంగాల్‌లో ఈ విధమైన సినిమా వచ్చింది. ప్రపంచంలో ఉండే సుఖదుఃఖాల గురించి స్థలకాలాలతో కూడా వైరుధ్యాల్ని చిత్రించడం పాజిటివ్ అంశమవుతుంది.

భోజన విరామం తర్వాత సమావేశం మళ్లీ మొదలైంది.

మధ్యాహ్నం సెషన్ పరిమళ్ కథ "కుర్మయ్య కల" తో ప్రారంభమైంది. పోలేపలి 'సెజ్' లో కుర్మయ్య అనే దళిత రైతు భూమి కోల్పోతారు. తాతలనుండి వారసత్వంగా 2 ఎకరాల అసైండ్ భూమి వస్తుంది. దానిమీద వ్యవసాయం చేసి ఆరెకరాలు చేసుకొని గోచినుండి మంచి బట్టల దశకు వస్తారు. సెజ్‌లో భూమిపోతే అదే కన్‌స్ట్రక్షన్ కంపెనీలో గేట్ కీపర్‌గా మారితే కంపెనీ డ్రస్ వేసుకోమని ఆదేశిస్తే "నేను వేసుకోను" అని చెప్పే సంఘటన ఆధారంగా సెజ్ నేపధ్యాన్ని వివరించిన కథ. దీనిపై మంచి అభిప్రాయాలొచ్చాయి.

బివిఎన్ స్వామి:- కథలోని ఉపకథ మాలమాదిగల సాంస్కృతిక విషయాన్ని తెల్పడం దీనికి ప్లస్ పాయింట్‌గా ఉంది.

శర్మ:- కుర్మయ్య పాత్రకు డైలాగ్స్ వాడలేదు. అతని ఉద్వేగాన్ని చిత్రించాలి. కుర్మయ్య స్ట్రగుల్‌ను చిత్రిస్తే బాగుండేది.

రుక్మిణి : యింకా మెరుగు పర్చాల్సిన అంశాలు కథలు ఉన్నాయి. జాంబవంతుని కథ కాకుండా కుర్మయ్య స్ట్రగుల్ చిత్రిస్తే బాగుండేది.

వరలక్ష్మి:- కాంప్లికేటెడ్ వస్తువు తీసుకున్నాడు. ఉపకథ అతకదు. రెండు మూడు సామాజిక పరిణామాలు కథలోకి తేవాలని ప్రయత్నించాడు. సరిపోలేదనిపించింది. నిర్మాణంలో లోపం ఉంది.

జీవన్:- నవల అంతటి విషయం తీసుకున్నాడు. నిర్వహించడంలో ఇబ్బంది అయ్యింది. ఇంకాబలంగా చిత్రించాలి.

బెజ్జారపు రవీందర్:- కథలో పేలిపోయే అంశం లేదు. సంఘటన నేపధ్యంగా

తీసుకొని కథ అల్లుకుంటూ వస్తే బాగుండేది.

అల్లం రాజయ్య:- అవసరమైన విషయమే. కథను నైపుణ్యంగా నిర్వహించాలి. కథలో వచ్చిన విషయాల మీద ఎక్కువ పనిచేయాలి. కథకు డైరెక్షన్ కన్పిస్తుంది.

చిన్నయ్య :- చిన్న కథగా కుదించడంలో సమస్య వచ్చింది. దీన్ని ఇంకా విస్తృతం చేసి రాయాలి.

తర్వాత నెమలికొండ జగన్ మోహన్‌రావుగారు "స్పందనా బంధం" కథ చదివారు.

అల్లుడు భార్యాపిల్లల్తో బైక్‌పై అత్తగారింటికి వస్తుండగా యాక్సిడెంట్ అవుతుంది. భార్య అపస్మారక స్థితిలోకి వెళ్తుంది. హాస్పిటల్ ఖర్చులనుండి అల్లుడు తప్పించుకుంటే మామ ఖర్చంతా భరిస్తాడు. హాస్పిటల్‌లో దోపిడీలు, అల్లుడి డబ్బు మనస్తత్వాన్నీ చిత్రించిన కథ. కథపై అభిప్రాయాలు వచ్చాయి.

వీరగోని పెంటయ్య:- కథ బలంగా చెప్పలేదు. విషయమంతా కథ ద్వారానే రావాలి.

చిన్నయ్య:-అల్లుడి ఆర్థిక పరిస్థితి తెలియదు. ఆయనేం చేస్తాడో కథలో చెప్పలేదు.

నాగభూషణం:- మామపాత్ర సంఘర్షణనే చిత్రించడం ముఖ్యంగా పెట్టుకునింటే కథ సక్సెస్ అయ్యేది.

రచయిత స్పందన:-ఇది నిజంగా జరిగింది. మామను నేనే! కథలో అన్నీ చెప్పం. కొన్ని అంతర్లీనంగా ఉంటాయి. కొన్ని ఊహించుకోవాలి.

అల్లం రాజయ్య:- చెప్పే అంశంలో ఇబ్బంది లేదు. మానవ సంబంధాలన్నీ డబ్బు సంబంధాలే! ఒక యాక్సిడెంట్ జరిగినప్పుడు మనుషులు ఎలా స్పందించాలి. డాక్టర్‌తో సహా..ఇదీ అసలు విషయం.

తరువాత శ్యామల "డప్పు" కథ చదివారు.

కథపై జీవన్‌గారు స్పందిస్తూ :- ఒకే అంశాన్ని కేంద్రంగా చేసుకొని అద్భుతంగా సాగింది. కథలో కథకురాలు చెప్పేది తక్కువ, పాఠకుడు ఊహించుకునేది ఎక్కువ ఉండాలి అన్నారు.

వరలక్ష్మి:- వృత్తిని రొమాంటిసైజ్ చేస్తున్నట్లనిపించింది.

కథలో తండ్రి కొడుకును డప్పు నేర్చుకోమంటాడు. కొడుక్కు అది ఇష్టముండదు. చనిపోయేప్పుడు తండ్రి కొడుకుతో డప్పుకొట్టే వృత్తిని స్వీకరించమని మాట తీసుకుంటాడు. ఒక కార్యంలో పిలిపించుకొని మరీ డప్పు కొట్టించుకొని, వృత్తిని చిన్న చూపుచూడడమేగాక వాయించినందుకిచ్చే డబ్బు కూడా తక్కువిస్తారు. దీన్ని కేంద్రంగా చేసుకొని కథ నడుస్తుంది. కానీ వృత్తిని రొమాంటిసైజ్ చేయడమే ఫోకస్ అయింది.

పెంటయ్య:- ఇప్పుడు డప్పు వాయించాలనుకోవడం వాళ్ళకే ఇష్టముండదు. ఇంకా డప్పు కొట్టి బతకాల్నా అనుకుంటారు. ఈ మార్పు గుర్తించాలి.

బివిఎన్ స్వామి:- కథ ప్రోగ్రెసివ్‌గా అనిపించలేదు.

శ్రీనివాసరావు:- సాంప్రదాయక కళలు అంతరించి పోతున్నాయనే దాన్ని చెప్పారు.

నెమలి కొండ జగన్మోహనరావు:- అవమానం జరిగినప్పుడు ఆ డప్పును అక్కడే విసిరేసినట్టు ఉండాలి.

అల్లం రాజయ్య:- పాత సందర్భం లో అయితే కథ సరిపోతుంది. ఇప్పటి సందర్భంలో సరిపోదు.

తర్వాత జాత శ్రీ "చవిటి నేల" కథ చదివారు.

ఒక ఊర్లో నేలంత చవిటినేలగా మారుతుంది. దాన్ని ఓ రిటైర్డ్ టీచర్ ఆ ఊరి ప్రజలకు అర్థం చేయించి చదువు చెప్పి శాస్త్రీయ పద్ధతులు తెలిపి ఆ నేలంతా సస్యశ్యామలం చేస్తాడు. ఉన్న పరిస్థితుల్ని బాగు పర్చుకుని అభివృద్ధిని సాధించే విషయాల్ని ప్రధానంగా చిత్రించిన కథ.

బివిఎన్ స్వామి :- అక్షరం అవసరమేకాని అది అన్ని సమస్యలను తీర్చలేదు. చదువుకున్నవాళ్ళు కూడా చవిటినేలలు తయారుకావడానికి కారణమౌతున్నారు.

ఉజ్వల్:- వ్యక్తివాద కథ ఇది. వ్యక్తి మారితే ఊరు, సమాజం మారతుంది అనే ధోరణి ఇది. ఊరిని మార్చాలనే వ్యక్తి ఎన్నో కష్టాలు ఎదుర్కోవాల్సి ఉంటుంది. అది చూయించలేదు.

చిన్నయ్య:- కలలాంటి కథ రాశారు. ఛత్తీస్‌ఘడ్‌లో అక్షర జ్ఞానం లేకుండా కూడా వ్యవసాయాభివృద్ధి సాధించారు. దానికి చైతన్యం,ప్రత్యామ్నాయ అభివృద్ధి భావన ప్రధానం. ఈ కథాంశంలోనే లోపం ఉంది.

పెంటయ్య:- చదువు మాత్రమే సమస్యకు పరిష్కారం కాదు.

విజయలక్ష్మి:- మంచి నేలలో కూడా వ్యవసాయం చేసేవాళ్ళు చనిపోతున్నారు.

అల్లంరాజయ్య:- దృక్పథంలో లోపం వుంది. సంస్కరణ వాద కథ.

తర్వాత శ్రీనివాసరావు "తీర్పు" కథ చదివారు.

సముద్ర తీరప్రాంతంలోని బెస్తపల్లెలోని చదువుకున్న అమ్మాయి ప్రేమలో మోసపోతుంది. ఆ ప్రేమకు ఖరీదు కట్టి ఆ ఊరి పెద్ద కొంత డబ్బు చెల్లించేట్లు తీర్పు చెబుతాడు. ప్రజాసంఘంలో పనిచేసే పద్మ దగ్గరికి ఆ తీర్పును ధిక్కరించి తీసికెళ్తుంది ఆ అమ్మాయి. స్థూలంగా కథ ఇది.

వరలక్ష్మి:- పద్మ పాత్రను కొంత ఎస్టాబ్లిష్ చేస్తే బాగుండేది.

హనీఫ్:- కథాంశం పాతదే. దీంట్లో కూడా కొత్తఅంశం తీసుకుంటే బాగుండేది. రిపిటేషన్‌లేకుండా కొత్త వస్తువు తీసుకొని రాయాలి.

విజయలక్ష్మి:- కథ బాగుంది. జెండర్ సమస్య పరిష్కరింపబడేదాకా ఇలాంటి కథలు వస్తుంటాయి.

కరుణ:- కథ నాకు నచ్చింది.

అల్లం రాజయ్య:- కథ పాత సమాజంలో పాత విలువలతో నడిచింది. ఆమె ఆ నిర్ణయం తేలికగా తీసుకోదు. ఆమె సంఘర్షణను చిత్రించాలి.

దీంతో మొదటిరోజు కథావర్క్‌షాప్ సాయంకాలం అరుదాకా నడిచి ముగిసింది. అనంతరం అందరం కల్సి రాత్రి షార్ట్ డాక్యుమెంటరీ చిత్రాలు చూసి డైరెక్టర్లతో చిత్రాల్లోని పలు అంశాలపై చర్చించాం.

రెండోరోజు ఉదయం రుక్మిణి అధ్యక్షతన సమావేశం ప్రారంభమైంది.

మొదట

బివిఎన్ స్వామి "తాయిమాయి" కథ చదివారు.

ప్రవీణ్:- మాండలికం వాడుకలో ఒక పద్ధతి పాటించలేదు. అరువు తెచ్చుకున్న పదాలు కన్పించాయి. డిస్క్రిప్షన్ అన్ని సీన్స్‌లో లేదు. సెంటర్ పాయింట్‌ను మాత్రమే చర్చించాడు. ప్రతి సీన్‌లో డిస్క్రిప్షన్ ఉంటే ఇంకా బాగుంటుంది. ఎల్లవ్వ పాత్ర హిస్టారికల్. ఆ పరిణామం చాలా గంభీరమైంది.

కరుణ:- దొంగగామారే మానసిక స్థితి అసహజంగా ఉంది.

జగదీష్:-ఫోర్స్‌డ్ ముగింపుగా అన్పించింది.

జాతశ్రీ:- దొంగగా మారే పరిస్థితిని బలంగా చిత్రించలేదు.

చిన్నయ్య:- ప్రభుత్వ సారాయన్నారు. ఇప్పుడదిలేదు. ప్రైవేట్ సారా వచ్చింది ఇంకా భయంకరంగా తయారైంది. ముగింపు ఇబ్బంది అన్పిస్తోంది. ఊరివాళ్లు జోక్యం చేసుకొని ఉంటే బాగుండు.

ఉజ్వల్:- దొంగగా మారే పరిస్థితి అర్థం చేసుకోడానికి ఇబ్బంది అన్పిస్తుంది.

రమేష్‌బాబు:- పనిచేయకుండా వ్యసనాలకు అలవాటుపడిన వాళ్ళు దొంగతనాలు చేస్తారు. కష్టపడి పని చేసేవాళ్ళు డబ్బుపోయినా కొద్దిరోజులు బాధపడి మళ్ళీ కోలుకుంటారు.

యాదగిరి:- కథ చెప్పే పద్ధతి నచ్చింది. మాండలికాన్ని కథలో వీలున్నంత వరకు వాడొచ్చు. అది శిల్పాన్ని దెబ్బతీయదు. ఎల్లవ్వది బాగా కష్టపడే మనస్తత్వం. ఆమె దొంగగామారడం ఇబ్బంది అన్పించింది. ఆమె పాత్రను దిగజార్చకూడదు. ముగింపుపై శ్రద్ధచూపాలి.

జీవన్:- ప్రతి కథా పరిష్కారం చూపాలని ఏమీలేదు. పాఠకునికి స్పందన కలిస్తే చాలు. ముగింపు స్పష్టంగా చెప్పలేదు. నిజంగా దొంగానే చిత్రించాడా! అని అనుమానంగా ఉంది. పాత్ర స్వభావం రీత్యా మాండలికం, వ్యవహారం కలిసినా

తప్పేంలేదు. ముగింపు గూర్చి కథకుడే చెప్పాలి.
శ్రీనివాస్:- మొత్తం కథే ఆమె ఘర్షణ. భర్తను ఎదుర్కోవడంగా ఉంటే సరిపోయేది. అట్లాంటి సంఘటన చూసి రాసి ఉండొచ్చు. కథల ఉన్న పరుగెత్తే సీన్ ముందుచెప్పి తర్వాత పాత్రలను పరిచయం చెయ్యొచ్చు.
రుక్మిణి:- ప్లంబింగ్‌లోకి ఆడవాళ్ళు రావడం ప్రత్యేకత. ఆడవాళ్ళు దొంగతనాలకు వెళ్ళేది కూడా తక్కువ సందర్భాల్లోనే. పరుగెత్తుతూ ఉంటే జనంచూస్తూ ఉంటారా ఆ సీన్ అనవసరంగా ఉంది. ఆ వృత్తి చేసే మనిషి బలంగా ఉంటుంది. రోడ్డు మీది అసహాయంగా పరుగెత్తదు.వాళ్ల మాటలను బట్టి దొంగ అయినట్లు అర్థమవుతుంది. పాత్ర అట్లా కాలేదు.
రఘుత్తం:- మనకు కథలోని మొదటి పార్శ్వం తెల్సినట్లుగా రెండో పార్శ్వం తెలీదు. కంటికి కనబడే క్రమం వెనుక చాలా ఉంటాయి.
అల్లం రాజయ్య:- చాలా సంక్లిష్టంగా ఉంది. స్క్రీన్‌ప్లే రాసినట్లనిపించింది. స్థలకాల ప్రసక్తిలేదు. మార్పుమీద దృష్టి ఉంది. అయితే ఎల్లమ్మ పాత్రలో చాలా అసంబద్ధత ఉంది. రోడ్డు ప్రక్కన గ్రామం కావడంవల్ల గ్రామం చెడిపోయి ఉండొచ్చు. ప్లంబర్ పనిలో చాలా ఘర్షణ ఉంటుంది. ఆమె చాలా ఫైట్ చేసి ఉండాలి. ఆమె దొంగగానో తిరుగుబోతుగానో మారడానికి చాలా పరిణామక్రమం ఉంటుంది. చాలా మంచి వస్తువు.
రచయిత స్పందన:- "ఎల్లవ్వ పాత్రతో చాలా దగ్గరి పరిచయం ఉంది. అయినా ఆమెను అర్థంచేసుకోలేకపోయాను. చాలా సంక్లిష్టత వుంది. ఆమె వ్యక్తిత్వం గలది. పరిష్కారం చాలా కష్టంగా ఉంటుంది" అన్నారు.
ఆ తరువాత కరుణ కథ చదివారు.
కనిపెంచిన కొడుకు ఉద్యమంలోకి పోవడం - తల్లి ఘర్షణ, అనుభవం - ఆమెలోని పరిణామం కథాంశం.
చిన్నయ్య:- రాజకీయ పదాలున్నాయి. వాటిని తీసేయాలి.
యాదగిరి:- ముగింపు వచ్చేసరికి పాఠకులకు గోర్కీఅమ్మ జ్ఞాపకం వచ్చింది. అక్కడ కొడుకు కోసం, సమాజం కోసం ఆమె నిర్వహించిన పాత్ర. ఇక్కడ కొడుకు చదువుకొని సంతోషమైన జీవితాన్ని గడపాలని రాజకీయాలు అర్థంచేసుకుంటుంది. తండ్రి పాత్ర సహాయకుడిగానే ఉంది. కథకు "అమ్మ" పేరు సరిపోతుంది.
భూపతి:- ప్రతి పాత్ర ఆదర్శంగా ఉండాల్సిన పనిలేదు. అలా ఉంటే అన్ని కథలూ ఒకేలా ఉంటాయి. అమ్మ ప్రేమను ప్రధానంగా చూయించారు కాబట్టి అమ్మ ప్రేమ అనే పేరు సరిపోతుంది.
విజయలక్ష్మి : సానుభూతి కథల మీద మాట్లాడ్డం ఇబ్బంది.
శ్రీను:-కథ బాగుంది. కథనం గురించి ఆలోచిస్తే బాగుంటుంది.
జీవన్:- మళ్ళొకసారి మహాశ్వేతదేవి కథ గుర్తొచ్చింది. "ఒకతల్లి" ఇలాంటి ఇతి వృత్తాలతో వివిధ భాషల్లో అనేక కథలొచ్చాయి. కరుణగారి ముద్ర ఉంది. కొడుకు పాత్రకు ఇంకా న్యాయం చేయడానికి ఊర్లో అతని గురించి కొన్ని పాత్రలతో చెప్పించి ఉండాల్సింది. కథను నడిపించడంలో మాతృహృదయం బాగా ఆవిష్కరించింది
రుక్మిణి:- 'ఒకతల్లి' కథ ఆంధ్రదేశంలో ఒక ముద్ర వేసింది. ఏతల్లి అయినా కొడుకు చనిపోతే అలానే బాధపడ్తుంది. వాడు దుర్మార్గుడైనా! తల్లిని బాధపెట్టడం ఎందుకు అనే అభిప్రాయం కూడా ఉంటుంది. కానీ రాజకీయ భావం ఉండాలి. ఇక్కడ అదే ప్రధానం.
రాజకీయ:- అనేక కారణాల రీత్యా సమాజంలో, వ్యక్తుల్లో దుఃఖం ఉన్నది. దాన్ని ఎదుర్కోవడానికి మనిషి ప్రయత్నం చేస్తాడు. "పతనం చావు" ఇవి ఒక్కరోజులో వచ్చేవి కావు. జ్ఞాపకాల్ని తలచుకునే వరకు కథ బాగుంది. అది అనుభవించేవాళ్ళు దాన్నుండి బైటపడడానికి చాలా ప్రయత్నం చేస్తారు. ఒకతల్లి మీద విమర్శలున్నాయి. మార్పుకు సంబంధించినక్రమంలో జరిగిన దాన్ని మార్పుకు సంబంధంలేకుండా చిత్రించడం వల్ల భయంకరమైన వాతావరణం వస్తుంది. జ్ఞాపకాలు రాసుకున్నా బయటపడడానికి ప్రయత్నం చేయాలి. స్మృతి గీతాలు, స్మృతి కథలు ఒకేలా రాయడానికి అలవాటుపడ్డాం.
చిన్నయ్య:- తండ్రి ద్వారా ఏమైనా చెప్పొచ్చు. కొడుకు ఎందుకు చనిపోయిందీ...
కరుణ:-ఉద్యమ క్రమంలో మంచి, చెడు, దుఃఖం అన్నీ ఉంటాయి. బాధపడడం సహజం. తల్లి బాధగురించే రాయాలనుకున్నా!
రుక్మిణి:- దుఃఖం మాత్రమే చెప్తే అదే మిగిలిపోతుంది. ఒక కొనసాగింపు ఉండాలి. బంధుమిత్రుల కమిటీలో తల్లి దండ్రులంతా అలాంటి వాళ్ళే! వాళ్ళకూ దుఃఖం ఉంది. కానీ దాన్ని బైటపడటానికి ఏదో ఒకటి చేస్తున్నారు. ఈ కథలో అది మార్గం కావాలి.
అనంతరం జీవన్ "వెంటాడే జ్ఞాపకం" కథ చదివారు.
పెంటయ్య:-సంపన్న కుటుంబాల్లో తల్లిదండ్రుల పట్ల ప్రేమ, ఆప్యాయతలు ఉండవు. అవి కథలోకి రాలేదు. శ్రామిక కుటుంబాల్లో ఆ స్పృహ ఇంకా ఉంది.
యాదగిరి:- ప్రారంభంలోనే చేయి తిరిగినట్లుగా అనిపించింది. కొత్త రచయితలకు పాఠంలాగా తోడ్పడుతుంది. ఇలాంటి కథలు ఎన్నో వచ్చాయి. ఈకథ జ్ఞాపకాల రూపంలో చెప్పాడు. మొదట్లో చూపిన స్పష్టత రానురాను లోపించింది అనిపించింది. రానురాను వివరణకే సరిపుచ్చారు.
జగదీష్:- శ్రమ జీవుల్లో ఇంకా కొన్ని విలువలున్నాయని చెప్పారు.
సమ్మెట ఉమాదేవి:- జీవన్ గారి సాహిత్యంలో జీవం ఉంటుంది. కథతోపాటు మనల్ని తీసుకెళ్ళారు. తనతో పాటు రైల్లో తీసుకెళ్ళారు. గొప్ప కథగా అన్పించింది. మినీ కథలకు అలవాటు పడ్డాం కాబట్టి ఇది పెద్దదనిపించింది.
రాజయ్య:- ఈ మధ్య సాధన కథ చదివాను. ఇలాంటి వస్తువు అనేక రూపాల్లో వచ్చాయి. మార్పుల్ని యధాతథంగా చిత్రించే అనేక కథలవల్ల ఒక అసంతృప్తి కల్గుతుంది. కొకు కథలు కూడా ఈ మధ్య చదివాను. ఈ కథలో మూడు అంశాల్ని ప్రస్తావించారు.
1. పసిపిల్ల2. ఆధునిక సౌకర్యాలన్నీ పొందుతున్న కుటుంబాల్లో తలెత్తుతున్న వైరుధ్యాలు. 3. గ్రామీణ నేపథ్యంలో మహిళ
ఈమూడు అంశాల్లో రావిశాస్త్రి చెప్పినట్లు ఐతే ఏమిటి? అని ప్రశ్న ఎదురవుతుంది. ముందులాగా ఎందుకులేదు? సంపద పంపకాలలో తేడా వచ్చింది. ఈ భావజాలం కుటుంబాల్లో భాగం అయ్యింది. బాగుపడ్డానికి కూడా ప్రయత్నం సమాజంలో జరుగుతుంది. ఆర్థిక మాంద్యం వచ్చినప్పుడు కొ.కురాశారు. ఇప్పుడు తెలుగు సమాజం పాతస్థితి దాటాలి. కానీ కనీసం ఆ యత్నం కూడా జరగడం లేదు. ఘర్షణని ఏ దృష్టితో చూడాలి. ఏ విధంగా చెప్పాలి. ఆలోచించాలి. అప్పుడది వెంటాడే జ్ఞాపకంలా ఉండదు. ఆ విషాదంలో ఎక్కడ నిలబడాలో తెలుస్తుంది. సమాజం ఒక ప్రవాహంగా ఉంది. దాన్ని చిత్రించడానికి పాత మోడల్‌ని వదిలి పెట్టాలి.
రుక్మిణి:- మొదటి పేజీలు చాలా బాగున్నాయి.
కార్పొరేట్ కుటుంబాలలో వైరుధ్యాలు చిత్రిస్తారేమో అనిపించింది. కాని దాన్ని మధ్యలో వదిలేసి చేసి వేరే విషయాల్లోకి పోయింది. వ్యవసాయ సంబంధాల్లో కూడా మార్పులొచ్చాయి. గ్రామాల్లో లేకుండా ఎక్కువ వలసలు పోతున్నారు. ముసలివాళ్ళే ఇళ్ళలో ఉంటారు.
జీవన్ :- కార్పొరేట్ ప్రపంచాన్ని తీవ్రంగా విమర్శ పెట్టే కథలున్నాయి. నేను ఒక సూక్ష్మ రూపంలో ఈ ప్రపంచాన్ని చూపే ప్రయత్నం చేశాను.
అనంతరం హనీఫ్ "పడమటినీడ" కథ చదివారు.
పెంటయ్య:- కథనం బాగాలేదు. కథా శిల్పం లుప్తం. పిల్లలుంటే మనస్పర్థలు తగ్గిపోతాయి. ఇక్కడ దానికి వ్యతిరేకంగా అసహజ భావన చూపారు.
చిన్నయ్య:- ఉద్యమకారుడు బయటకొచ్చాక వచ్చే సమస్యలు చాలా ఉంటాయి. జనజీవన స్రవంతి అనే పదమే గందరగోళం. పతనం కావడానికి అనేక అవకాశాలుంటాయి. ఏం చెప్పదల్చుకున్నాడో అర్థం కాలేదు.
సమ్మెట ఉమాదేవి:- వైవిధ్యంగా ఉంది. గంభీరమైన వస్తువు. ఆధునిక వైద్య పద్ధతిలో కన్న సంతానమే ఆమెకు లోకమైంది. తోడు అవసరమైన సమయంలో ఆమె బిడ్డను తీసుకొని దూరమైంది. ఇంకొంచెం ఆకర్షణీయంగా రాయాడానికి

ప్రయత్నించాలి.
కరుణ:- ఉద్యమంలో పిల్లల్ని కనడం స్వార్థం అనే అభిప్రాయంలేదు. అది కష్ట నష్టాల విషయం.
శ్యామల:- కొత్త అంశం తీసుకున్నాడు. ఆసక్తి గలిగేట్లుగా రాయాలి. కానీ స్వార్థం ప్రవేసిస్తుందనే అభిప్రాయం ఉన్నట్లు ఈ కథ రాశారు. అసలు సమస్య అది కాదు. కథ దాన్ని ఫోకస్ చెయ్యలేదు.
పాణి:-కృత్రిమ గర్భధారణ గ్లోబలైజేషన్ ఎలా అవుతుంది?! శాస్త్ర విజ్ఞానం దానంతట అదే గ్లోబలేషన్ కాదు. దాన్ని అర్థం పర్థం లేకుండా మనం అన్వయిస్తున్నట్టుంది. గ్లోబలైజేషన్ మన పాలిట బ్లాక్ హోల్‌లాగా తయాలయ్యింది. ప్రతి ఆలోచన అందులోకి జారి పోతోంది. ప్రతి దానికి ప్రపంచీకరణ అనే పదం వాడి దానితో నేరుతో నేరుగా ముడిపెట్టేస్తున్నాం. దీని వల్ల ప్రపంచీకరణతో వాస్తవిక సంబంధం మరుగున పడిపోతుంది. ఈకథలో ప్రధాన పాత్ర పూర్వ జీవితం కొన్ని విలువలతో ఉన్నది. ఇప్పటి జీవితంలో ఘర్షణ సరిగా వ్యక్తీకరించలేదు. పిల్లలకూ స్వార్థానికి అంత ప్రత్యక్ష సంబంధం ఉందా! దాన్ని చర్చించే శక్తి కథకు లేదు. కథలో సంఘటన లేదు. రచయిత కథకు వెలుపల ఉన్నారు.

భోజన విరామం అనంతరం మధ్యాహ్నం సెషన్‌లో వరలక్ష్మి "చివరి మజిలీ" కథ చదివారు. ఇది వృద్ధాప్య సమస్యమీద వ్రాసిన కథ.
రమేష్ బాబు:- ఈటైటిల్‌తో కథ ఉంది. ఇది వర్థమాన కథ. ఆశ్రమాల సంఖ పెరిగిపోతున్నది. తప్పని పరిస్థితి. మధ్యలో చిన్న కథ బాగుంది.
రాము:- కథలో వాతావరణ చిత్రణ బాగుంది.
ఉమాదేవి:- కొత్త రచయిత రాసిన కథలా లేదు. అనుభవం ఉన్న రచయితలా అన్పిస్తుంది. గాంధీ కొటేషన్స్ బాగా వాడుకుంది. ఇంగ్లీష్ పదాలు తగ్గించాలి. వృద్ధుల మనోభావాలు కూడా చిత్రించి ఉంటే బాగుండేది. సొంత ఇళ్ళలోనే చావాలనే భావన పెద్దవాళ్ళలో ఉంటుంది.
గీతాంజలి:- బాగుంది! కథకురాలు క్లుప్తత సాధించింది. దిగ్భ్రాంతిని కలిగించడానికి సత్యాన్ని తెలుసుకునేలా చేయడం బాగుంది. పాత్రకు జీవన సాక్షాత్కారం కలిగింది.
జీవన్:- ఆమె వయసులో ఈ కథ రాయడం ఆశ్చర్యం. ప్రాక్టీస్, రీడింగ్ ద్వారా ఇంకా ఇంకా బాగా రాయొచ్చు.
పాణి:- మంచికథ. వృద్ధాప్యం ఇవాళ చాలా పెద్ద సమస్య. ఉమ్మడి కుటుంబం పోవడం వల్ల ఈ సమస్య వచ్చిందని అనుకుంటారు. అది నిజమే కావచ్చు కాని ఉమ్మడి కుటుంబం కరిగిపోయింది. అది ఇంకరాదు. పెట్టుబడిదారీ విధానం చిన్న కుటుంబాన్ని ముందుకు తీసుకువచ్చింది. అక్కడ వృద్ధాప్యం పెద్ద సమస్య. బాల్యం కూడ సమస్యే! మళ్లీ పాత కుటుంబం వస్తే లేదా అలాంటి సంబంధాలు వస్తే సమస్య పరిష్కారం అవుతుందనే ఆలోచన చాలా మందిలో ఉంది. అది ఎంతవరకు నిజం! కొత్త వ్యవస్థలో కొత్త కారణాలవల్ల తలెత్తిన సమస్యకు కొత్త పరిష్కారంఉంటుంది. అది వ్యవస్థాగతంగానే ఉండాలి. అది ఎట్లా సిద్ధిస్తుంది? ఈ కథలో ఆ అమ్మాయి తన అవ్వను మళ్లీ ఇంటికి తీసుకెళ్లాలనుకుంటుంది. ఇది మానవీయమైన బాధ్యాతయుమైన స్పందన. కానీ ముసలామె ఇంకికి వెళ్లాక మళ్లీ పాతసమస్యలే తలెత్తుతాయి. సంభాషణలు ఇంకాస్త శక్తివంతంగా ఉండాల్సింది. ఆస్థిలాక్కొని ముసలామెను తోసేశారు. అది కథ. అస్తి భావజాలానికి సంబంధించిన పాత్రలు ఉండాలి. చిన్నాన్న, తండ్రి పాత్రలు.
అనంతరం ఉజ్వల్ "చెల్లని రాజ్యం" కథన చదివారు. చేనేత కార్మికుల జీవితం మీద
ఉదయమిత్ర:- చేనేత జీవితం మీద ఆవేశపూరితమైన ప్రకటన. చెలం- ఒక పువ్వు పూసింది లాగా మంచి కథ.
గీతాంజలి:- వర్ణనలు ఎక్కువ కావడం వల్ల దెబ్బతింది. భావోద్వేగాలు రిపీట్ అయ్యాయి. అన్నీ చెప్పకూడదు. రచయిత అదుపు తప్పారు. ఎన్నిక మంచిది. అల్లిక సరి చూడాలి.
జగన్మాధవ రావు:- సమస్యకు ఆత్మహత్య పరిష్కారం కాదు. ఎదుర్కొనే చైతన్యం తీసుకురావాలి.
శర్మ:- దళారీల స్వభావం గురించి చెప్పలేదు.
స్వామి:- కథ రాసేటప్పుడు మూలమేమిటి ఆలోచించాలి. పనిదొరిక్కపోవడానికి ఆత్మహత్యలకు కారణాలు వెతుక్కోవాలి.
ఉమాదేవి:- ఉద్వేగ భరితంగా ఉంది.ఆర్ద్రతతో కూడిన వర్ణన కథకు ఆకర్షణగా ఉంది. మంచి పదాలు వాడారు. మంచి ప్రయోగం, ఆత్మహత్యల్ని ప్రోత్సహిస్తున్నట్లుగా ఏమిలేదు. శైలి చాలా బాగుంది.
కరుణ:- వ్యవసాయం లేకపోతే ఇంకోసారన్నా వాన పడ్తుందేమో, రేటు వస్తుందేమో అని ఉంటుంది. కాని సాలెలకు ఆ పరిస్థితి లేదు. సమస్య మూలాలు రాయాలి. సంభాషణలు చివర్లో తగినట్లులేవు.
ఎమ్. శ్రీనివాస్:- చేనేత సంక్షోభంలో హ్యాండ్‌లూమ్ సంక్షోభమా, పవర్‌లూమ్ సంక్షోభమా? అది తేలాలి. నేపథ్యం స్పష్టంగా చెప్పాలి.
పాణి:- వాళ్ళు బట్టలు నేసేవాళ్ళు. వాళ్ళ పిల్లలకు బయట బట్టలు కొనాలి అనుకుంటాడు. ఇది ఆవృత్తిలోని వైరుధ్యం. చేనేత కార్మికులకు సమస్య దేనివల్ల వస్తుందన్నది ముఖ్యం. హ్యాండ్ లూమ్ నుండి పవర్ లూమ్‌కు రావడం వల్లనా? మార్పుకు తగినట్లుగా ఆధునికతను అందుకోక పోవడం వల్లనా! ఈ రెండు రకాల సమస్యలు చేనేతలో ఉన్నాయి. పవర్‌లూమ్‌లోకి వచ్చాక ప్రభుత్వ విధానాలు సంక్షోభంలోకి నెట్టివేశాయి. ఈ క్రమాన్ని స్పష్టం చేసుకుంటే కథ ఇంకా బాగా వస్తుంది. మంచిప్రయత్నం చేశారు. కథల్లో కవిత్వం మంచిదికాదు.
ఉజ్వల్ స్పందన:- బాధితులతో కలిసి వారి జీవితాలను పరిస్థితుల్ని చూసి మిగతా ప్రాంతాల చేనేత జీవితాలకూ సిరిసిల్ల పరిస్థితులను ఉన్న తేడాలు గమనించి రాశాను. హ్యాండ్‌లూమ్ నుండి పవర్ లూమ్‌కు మారడంతో సంక్షోభం మొదలైంది. మూడంచెల వ్యవస్థలో ప్రభుత్వం ప్రేక్షక పాత్రలో ఉంది. పరిహారాలు ప్రకటనలకు పరిమితమై జీవోలోని లొసుగుల మూలంగా తలెత్తిన సమస్య రాద్దామని ప్రయత్నం చేశాను.

అనంతరం పెంటయ్యగారు గండుచీమలు కథ చదివారు.
దీనిపై ప్రతిస్పందనలిలా వ్యక్తమయ్యాయి.
యాదిగిరి:- కథ చాలా బాగుంది. 'గండుచీమలు' సింబాలిక్ అర్థాన్నే ఇస్తాయి. వాచ్‌మెన్‌తో డైరెక్ట్ సంభాషణలో దిగకుండా ముందు స్కూల్ పిక్చర్ ఇచ్చి ఉండాలి అన్నాడు.
పాణి:- కథ బాగా నచ్చింది. పుట్టలకొద్దీ చీమలు దేన్ని సింబాలిక్ చేస్తాయి. అనే సందేహం కలిగేలా ఉంది. కథకు నప్పని పదాలు ఉన్నాయి. రైతు భార్యతో మాట్లాడేటప్పుడు బషీర్‌బాగ్, ముదిగొండ, - నేరుగా రావడం ఇబ్బంది. మంచి ఫ్లో ఉంది. ల్యాండ్ మార్కెట్, పర్యావరణం కథలో ఏది ప్రధానం స్పష్టం కాలేదు. చీమలు చేసినపని తెలివిగా చేసినట్టు కాదు. అది వాటి స్వభావం. కానీ రచయిత తెలివిని ఆపాదించినట్లుంది.
తరువాత చంద్రశేఖర్ కథ "ఓ అమ్మాయి ఆశయం" చదివారు. రచయిత రాసిన తొలి కథ ఇది.
ఎస్.వి గారు స్పందిస్తూ:- ఈ కథ మీద సినిమాల ప్రభావం విపరీతంగా ఉంది. అబ్బాయిల గురించి రాయాలి. బాగా తెలిసిన జీవితం రాయాలి.
జీవన్:- కొకు ఒక మాటంటాడు సినిమాల గురించి "జీవితం తప్ప అంతా ఉంటుంది". తరువాతసండిమెట్ల రామయ్య "ఓ పిల్లా ముత్యమంత నవ్వం పెట్టు" చిన్నకథ చదివారు.

మూడవరోజు జరిగిన ఉదయపు సమావేశానికి జాతశ్రీగారు అధ్యక్షత వహించారు. "ఉదయమిత్ర" నిప్పులమూట కథతో ప్రారంభమైంది. కథ చదివాక జరిగిన చర్చలో మొదటగా
జీవన్ : భారమైన కథ. సహజమైన వాతావరణం చిత్రించారు. మొదట్లో ఉన్న బిగి చివర్లో తగ్గింది. పాపని నదిలో పారేసిన దగ్గర కథని ముగిస్తే సరిపోయేది.

నిజంగా అక్కడే కథ అయిపోయింది.

దేవి యాదగిరి:- టైమ్ సెన్స్ పాటించాలి. క్రిష్టమస్ ప్రస్తావించారు. డిసెంబర్లోనది కొండల్ని ఒరుసుకుంటూ పారదు. రైలుపోలిక చిరుతవులిలా కాక అనకొండలా అంటే బావుండేది".

కరుణ:-పాపని విసిరేసినప్పుడు పాలకోసమో, తల్లి ఒడికోసమో ఏడవడం అని చెప్పడం అసహజంగా ఉంది".

స్వామి:- "కథలో అనేక అంశాలురావడంతో చదివిన కథే అనిపించింది. కలలో కూడా కొండ చిలువ మింగేస్తుంది. కల, వాస్తవం కలిపి కొత్త టెక్నిక్‌తో రాయొచ్చు.

గీతాంజలి:- నిద్రలో పాపగురించి అడిగే సీన్ బలంగాలేదు. పాప సెంటిమెంట్ రాలేదు.

చిన్నయ:- పదాలు వాడటంలో జాగ్రత్త పడాలి. కొన్ని పదే పదే వాడారు.

జాతశ్రీ:- దీన్ని 6 పేజీల్లో రాయొచ్చు. హృదయవేదన అంతా కథలో తేవాలని అనుకున్నట్లుంది. అది కథకు కొన్ని సమస్యలు తెచ్చి పెట్టింది.

ఎమ్ శ్రీనివాసరావు:- ఏడోనెల గర్భవతిగా ఉన్నప్పుడు వలసపోతారా? పోడానికి సిద్ధపడినా తీసుకెళ్తారా?! ఎంత దుర్మార్గుడైనా పాపను నదిలో విసిరేస్తాడా!

ప్రశాంత్:- చెకోవ్ ది స్లీప్ కథ గుర్తొకొచ్చింది. మేస్త్రీ (సత్యం) పాత్ర బాగా చిత్రించలేదు. చాలా భావోద్వేగాలు రావాలి.

పాణి : కథ వింటుంటే బాధగా ఉంది. కథలో ఉన్న దాన్ని దృష్టిలో పెట్టుకొని మాట్లాడిన - ఇప్పటికే చాలా కథలు రాసినా రచయిత ఈ కథలో అవసరమైన పరిణతిని ప్రదర్శించలేదు. నిజానికి ఈ కథలో పసిబిడ్డ నిప్పుల మూట కాదు. పసిబిడ్డను నిప్పుల మూట అనిపించిన పరిస్థితి ఒకటున్నది. అది చాలా ప్రధానమైనది. కానీ దాని గురించి, ఆస్థితిలో మనిషిలో కలిగే వేర్వేరు ఆలోచనల గురించి కథ పట్టించుకోలేదు. పనివాళ్ల మీద అందువల్ల పాపను లాలించలేకపోతాడు. కానీ నదిలోవిసిరేసిన తర్వాత పశ్చాత్తాముంటుంది. ఖుషీగా ఉన్నట్టు రాయడం అసహజం. ఎంత దుర్మార్గుడైన కొన్ని భయాలూ, ఆందోళనలూ ఉంటాయి. ఆమె కలలోనుండి లేచినపుడు వాడు గిల్టీ ఫీల్ కావడంగా ఉంటే మంచి కథ అవుతుంది. మనిషికి సంబంధించిన లోతైన విషయాలుంటాయి. చివరికి మనిషితనం వెలికితీయాలి.

గీతాంజలి:-గుంపు మే స్త్రీల స్వభావం చాలా దుర్మాంగా ఉంటుంది. అన్నారు.

ఉదయమిత్ర:- జరిగిన సంఘటనకే గుంపుమేస్త్రీలు విలోలు. 7నెలల గర్భిణి చాలా చీప్‌గా దొరకుతుంది. వాళ్ళను కూడా తీసుకుంటారు. మళ్ళీ చర్చను సాగిస్తూ రాము: ఫాక్ట్ ఒక్కటే లిటరేచర్ అవుతుందా? అన్నారు.

ప్రశాంత్:- "మనుషుల్ని దుర్మార్గులుగా చిత్రించాలా? ఆసామాజిక పరిస్థితిని చిత్రించాలా" అన్నారు?

పాణి:- సాహిత్యం చేయవలసింది వ్యవస్థ వల్ల మనిషి ఎట్లా తయారవుతాడో చూపాలి. సామాజిక దుర్మార్గాన్ని మనుష్యుల చర్యలలో చూపించినా దీనికి కారణం సమాజంలో ఉన్నదీ అనిపించినప్పుడే అది మంచి సాహిత్యం అవుతుంది.

జాతశ్రీ:- దుర్మార్గం గూర్చి రాసినా పాఠకుని మనసులో మానవత్వాన్ని పైకి తేవడం జరగాలి అన్నారు.

ఆ తరువాత రాము" చావు మంజిలీ" కథ చదివారు. ఇది ఆత్మహత్య నేపధ్యంలో సాగిన కథ.

మొదటగా కరుణ:- పేరు సరిపోయింది. మజిలీ అంటే తాత్కాలికంగా ఆగడం.

ఉమాదేవి:- నవీన్ అంపశయ్యలా సాగింది. స్టైల్ బాగుంది. చైతన్య స్రవంతి సరళిలో ఉంది.

జీవన్:- చైతన్య స్రవంతి, గోపీచంద్, అంపశయ్య - నవీన్, రాజయ్య అతడు వీటి ప్రభావాలు చూడొచ్చు. ఈ రచయిత పూర్తిగా సఫలీకృతుడయ్యాడని చెప్పలేం! అన్నారు.

యాదగిరి:- క్లారిటీలేదు. పాఠకుడికి అర్థంచేయించడంలో శ్రద్ధ పెట్టలేదు.

వరలక్ష్మి:- సునిత దగ్గర కథమొదలవుతుంది. అన్వర్ జ్ఞాపకాలు ఒక ఫ్రేమ్‌లాగా వస్తాయి. చైతన్య స్రవంతి ప్రక్రియలో ఆలోచనలన్నీ లింక్ చేసే ఒకే సూత్రం ఉంటుంది. అది ఇక్కడ సరిగ్గా వచ్చిందా అని అనుమానం అన్నారు.

స్వామి:-కథలో ఫిలాసఫికల్ టచ్ ఇవ్వాల్సి వుంది. రెండు నేపధ్యాలు ఏకంగా సాగే క్రమం ఉంది. అట్లారావాలేమో!

బాసిత్:- వైరుధ్య పూరిత వర్ణనలు, కొన్ని గ్యాప్స్, గెంతులున్నాయి. వయసు మించిన తాత్వికత కన్పిస్తుంది. మనో విశ్లేషణ తగినట్లు అనిపించింది. భావచిత్రాలు గొప్పగా వున్నాయి.

పాణి:- కథను మొత్తంగా చూసే పద్ధతి మనకింకా అలవాటు కాలేదు. దీని వల్ల కథలోని ఒక్కో అంశం బాగున్నదని లేదా బాగా లేదని విశ్లేషిస్తున్నాం. ఇది సరైన పద్ధతి కాదు. కథలో అనేక పాత్రల సన్నివేశాల ఘటనల భావాల అంతర్ తర్కం ఉంటుంది. దాని పర్యవసానం కూడా రచనలో కనిపిస్తుంటుంది.ఈ పరస్పర సంబంధాల్లో మొత్తంగాకథ ఏ దిశగా సాగింది. అనే చట్రంలో భాగంగా అవసరమైతే విడి విడి అంశాలను కూడా పరీక్షించవచ్చును. కాని అలాంటి చట్రం గురించి పట్టింపు లేకుండా విశ్లేషణ సాగితే రచయితకు పెద్దగా ప్రయోజనం ఉండదు. అసలు రచయితకూడా తన రచనా నిర్మాణాన్ని ఇలాంటి మొత్తంలో భాగంగా నిర్మాణం చేశాడా? లేదా? అనేది కూడా ముఖ్యమే. అంటే కథ ఒక వాచకంగా సమగ్ర నిర్మాణాన్ని పొందడానికి అవసరమైన సరంజామానంతా సమకూర్చుకొని ఉండాలి. అప్పుడు విశ్లేషణ' కూడా మొత్తంచట్రాన్ని పరిగణలోనికి తీసుగొనిసాగితే కథలో బయటకి వ్యక్తమవుతున్నవాటిని, వ్యక్తం కానివాటిని విశ్లేషించడానికి వీలు దొరుకుతుంది. ఈ కథలో వేరువేరు స్థాయిలు కనిపిస్తాయి. పాత్రలు కూడా అట్లాగే నిర్మాణమయ్యాయి. వీటిన్నింటి వల్ల కథ తానుగా తనకేంద్ర అంశాన్ని వ్యక్తం చేసుకోలేక పోయింది. అందువల్ల పాఠకులకు ఇంతకూ ఈకథ దేన్నిగురించి, దేన్ని చెప్పాలనుకుంటోంది అనే సందేహాలు తలెత్తుతాయి వీటన్నింటినీ కలిపే అంశం ఏదో ఒకటి ఉంటుంది.దాని గురించి రచయిత ఆలోచించాలి. ఇక్కడ జరిగే చర్చ కూడా దాన్ని స్ఫురింప చేసేలా ఉంటే కథ మొత్తం పునర్నిర్మాణం చేయడానికి దోహద పడ్డట్టవుతుంది.లేకపోతే కథ యథాతథంగాఉంటూనే అక్కడక్కడ కొన్నిసంభాషణలుకొన్ని సన్నివేశాలు మార్చడానికి, కొన్ని ఖాళీలు పూరించడానికి మనచర్చ ఉపయోగపడుతుంది. అలాంటిది కూడా అవసరమే అయినా కొత్తగా కథ రాస్తున్నప్పుడు కథను మళ్లీ మళ్లీ నిర్మించుకోవడానికి దోహదపడేలా మన చర్చ ఉండాలి. అట్లా చూసినప్పుడు ఈ కథలో ఒక రకమైన మనస్థితి అంతా పరచుకొనిఉన్నది. అది తానుగా ఏంవ్యక్తీకరిస్తున్నది? బహుశా రచయిత ఈకథద్వారా చెప్పాలనుకుంటున్న ప్రధానమైన విషయానికి సంబంధించిన మూడ్ అది. అయితే కథా నిర్మాణంలో వేర్వేరు అంశాలమధ్య సమన్వయం లేకపోవడం అనేసమస్య ఉంది.

గీతాంజలి:- కథ చాలా బాగుంది. మంచి కథకుడయ్యే లక్షణం ఉంది.

అనంతరం సంపత్‌రావు ఒక ఆసక్తికరమైన ప్రసంగం చేశారు. వేర్వేరు భాషా సాహిత్యాల్లో, సామాజిక సందర్భాల్లో నలుగురురచయితలు రాసిన కథల ఆధారంగా ఆయన ప్రసంగం సాగింది. భోజన పదార్థాల మీద రాసిన నాలుగుకథలుతీసుకొని అందులోని శిల్ప వైవిధ్యాలనే కాక ఆ కథలువ్యక్తం చేసిన సామాజిక విషయాలను కూడా వివరించారు. ఆయన కథల ఎంపికలో తుమ్మేటి రఘోత్తం రెడ్డి చావు విందు కూడ ఉంది. సంపత్‌రావు ప్రసంగం మీద మంచిచర్చ జరిగింది. ఈ ప్రసంగాన్ని ఆయన వ్యాస రూపంలో పెట్టడం వల్ల అందరు ఇలాంటి తులనాత్మక అధ్యయనం పట్ల ఆసక్తి పెంచుకుంటారనే అభిప్రాయం వచ్చింది.

తరువాత ఉమాదేవి గారు "పితృదేవోభవ" కథ చదివారు. కథపై స్పందిస్తూ రాజేశ్వర్:- రచయిత్రికి అభినందనలు. రేడియోలో వింటున్నట్లు అన్పించింది. కథ బాగుంది.

చిన్నయ్య:- హృదయ వయసుకు మించిన సంభాషణలున్నాయి.

చంద్రశేఖర్:- చిన్న కూతురు అంటే ఇష్టం ఎందుకు? పెద్ద కూతురును ఎందుకు

దూరం చేయడం?

గీతాంజలి:- నాటకీయత ఎక్కువైంది. నెగిటివ్ సిగ్నల్స్ ఇచ్చేలా 'ఉంది. పితృస్వామ్యాన్ని ఎదుర్కొనేందుకు స్త్రీకి మరింత సహనం ప్రేమతో మార్చుకోవచ్చు అనే సందేశం ఇందులో ఉంది. పాత కథ తిరిగి వింటున్నట్లుగా అనిపించింది.

జీవన్:- 15 ఏళ్ళ అమ్మాయిలకు అంత మెచ్యూరిటి ఉంటుందా? అంటే ఉంటుంది అనొచ్చు. ఇంకా చిన్న పిల్లల్లో కూడా చూడొచ్చు. స్త్రీ పురుష సంబంధాలో అనేకకోణాలుంటాయి. చలం, కొకు సమస్యల్ని ఎట్లాచూశారు. ఇది రిఫర్మిస్ట్ ధోరణిలో ఉంది. అన్నారు.

జాతశ్రీ:- నేనైతే అనుమానపు మనిషి (తండ్రి) జీవితం ఎంత అస్తవ్యస్తంగా ఉంటుందో చెప్పేవాడిని. ఇవ్వాళ స్త్రీ ప్రశ్నించే స్థాయికి ఎదిగింది. తక్కువ స్థాయి ఆలోచనలు ప్రతిబింబిస్తే రచయితలుగా మనం ఫెయిలవుతాం.

యాదగిరి:- స్త్రీ పక్షపాతంతో రాసిన కథే.

ఉమాదేవిగారి స్పందన:- చాలా అభిప్రాయాలొచ్చాయి. అమ్మాయి జీవితం ఆమెతో ఇలా మాట్లాడించింది. కుటుంబాలు విచ్ఛిన్నం కాకూడదు. అందుకే హృద్య పాత్ర అన్నారు.

అనంతరం బాసిత్ "ఘర్ బార్ ఔర్ సంసార్" కథ చదివారు. కథపై అభిప్రాయాలొచ్చాయి. మొదటగా

జీవన్:- "స్కై బాబా కథ ఇదే అంశంపై వచ్చింది. ఇవే అంశాలు రాకుండా చూడాల్సింది" అన్నారు.

చిన్నయ్య:- ఇంతకు ముందొచ్చిన కథ చదవాల్సిఉండి. అయినా వరంగల్ ప్రాంతంలో ఎదుర్కొన్న సమస్యకు హైద్రాబాద్‌లో ఎందుకు వెతుక్కోవాలి? హైద్రాబాద్‌కు వెళ్ళాల్సిన అవసరంలేదు అన్నారు.

ప్రశాంత్:- రచయితకు కథాంశంపట్ల స్పష్టత లేదు. సంబంధంలేని చర్చ చాలా ఉంది.

స్వామి:-హిందూ కుటుంబాల మధ్య ఇళ్ళు దొరకడంలేదు. ఇదొక వివక్ష లద్దాఫ్ అని ముస్లింల నుండి కూడా వివక్ష ఎదురైంది. ఏదో ఒక దాని వైపు నుండి రాయాల్సింది.

ఉజ్వల్:- స్కైబాబా కూడా ఇదే అంశంపై కథ రాశాడు. వివక్ష ఉంది. నాకూ అనుభవం లోనిదే. దళితుల పట్ల చూపే వివక్షకు తీసిపోని, ఒక్కోసారి అంతకు మించిన వివక్షకూడా ఎదురౌతుంది. చిన్న ఊర్లూ పట్టణాల్లో మత, కట్టుబాట్లు సమాజుల వంటి పట్టింపులు, వత్తిళ్ళు ఉంటాయి. హైద్రాబాద్‌లాంటి నగరాల్లో అంత కాన్సన్‌ట్రేషన్ ఉండదు. ఇళ్ళ సమస్య అయితే ఉన్నది.

రుక్మిణి:- "ఉపతెగలు అవసరంలేదు. కొన్ని పాత్రలే అవసరం లేదు. ఉద్యమనే పథ్యంలో పరిష్కారం చూపొచ్చు. అన్నారు.

బాసిత్ ప్రతి స్పందన:- స్కైబాబా కథ చదివాను. అందులో రాని కోణం చెప్పాలని అనుకున్నా, అన్ని అనుభవించి రాసినవే!

బాసిత్ కథతో కథా పఠనం, చర్చ పూర్తయింది.

తర్వాత మూడు రోజుల సమావేశం మీద సమీక్ష జరిగింది. కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ మిత్రులు ఇట్లా తమ ఆతిధ్యం మేరకు విరసం రచయితలు కరీంనగర్‌లో సమావేశాలు నిర్వహించుకోవడం తమకు ఆనందంగా ఉందని అభిప్రాయ పడ్డారు. ముఖ్యంగా వారాల ఆనంద్, నాగభూషణంగారు మాట్లాడుతూ ఈ మూడు రోజులు మా ఫిల్మ్ ఫెస్టివల్ సన్నాహాలు, నిర్వహణ మొదలైన వాటివల్ల అన్ని కథలు వినలేకపోయామని, అది తమకు చాలా వెలితిగా ఉందని అన్నారు. సరిగ్గా కథా రచయితలు కూడా ఇట్లాగే అభిప్రాయపడ్డారు. ప్రత్యామ్నాయ సినిమా, డాక్యుమెంటరీ మొదలైన కళా ప్రక్రియల్లో ఫిల్మ్ సొసైటీ సభ్యులు తమ కథల మీద ఒక విలక్షణమైన అంచనా ఇస్తారని అనుకున్నప్పటికీ అది నెరవేరకపోవడం తమకు వెలితిగానే ఉన్నదని అన్నారు. మొత్తంగా విరసం చేపట్టిన ఈ వర్క్‌షాప్‌ల ప్రయత్నం పట్ల హాజరైన సోదర రచయితలు చాలా సంతోషం వ్యక్తం చేశారు. రచయితలను తయారు చేయడం అంటే వారి జీవితానుభవాన్ని, దానిలోని గాఢతను వారే విప్పి చూసుకునేలా దృక్పధ సునిశితత్వాన్ని అలవర్చడమే అని అభిప్రాయ పడ్డారు. ఆ జీవితానుభవాన్ని, దృక్పథాన్ని కళాత్మకంగా మలచడం ఎలాగో ఈ వర్క్‌షాప్‌లో నేర్పిస్తాయని అన్నాడు. ఆ తర్వాత ఫిల్మ్‌సొసైటీ ఎంపిక చేసిన లఘుచిత్రాలను, డాక్యుమెంటరీలను కొన్నింటిని ప్రదర్శించింది. ఈ కార్యక్రమ ఆరంభంలో తుమ్మేటి రఘోత్తం రెడ్డి రూపొందించిన మౌఖిక కథల డివిడి ఆవిష్కరణ జరిగింది. దీన్ని కథా రచయిత్రి విజయలక్ష్మి ఆవిష్కరించారు. ఆ తర్వాత అందులో ఉన్న మొదటి కథ లక్ష్మణరేఖ ప్రదర్శించారు. ఆ తర్వాత ప్రముఖ రచయిత సినీ దర్శకుడు అక్కినేని కుటుంబరావు అధ్యక్షతన ఫిల్మ్ సొసైటీ ముగింపుసభ జరిగింది. ఆ తర్వాత ప్రదర్శించిన లఘు చిత్రాలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. వీటిలో టెర్రరిజంగురించి, మతోన్మాదం గురించి తీసిన ఒకటెండు లఘు చిత్రాలు రియాక్షనరి అయినప్పటికీ మిగతావి చాలా ఆలోచనాత్మకంగా, కళాత్మకంగా ఉన్నాయి.

మొత్తం మీద కరీంనగర్ కథకుల సమావేశంలో ఫిల్మ్ సొసైటీ ప్రదర్శించిన చిత్రాలు చూడ్డం వాటిని తీసిన దర్శకులతో సంభాషించడం కథా రచయితలకు ఒక అరుదైన, అవసరమైన అనుభవంగా మిగిలిపోయింది. *

పత్రికా ప్రకటన

## ఈలం తమిళుల పోరాట పతాక ప్రభాకరన్‌కు జోహార్లు
## శ్రీలంక తమిళుల స్వాతంత్ర్య ఆకాంక్ష వర్ధిల్లాలి

జాతి విముక్తి పోరాటాల్లో తలమానికమైన తమిళ ఈలం ఉద్యమాన్ని నెత్తురుటెరుల్లో ముంచి, ఎల్టీటీ ఈ అధినేత ప్రభాకరన్‌ను హత్యచేసిన శ్రీలంక ప్రభుత్వ సైనిక చర్యలను విరసం తీవ్రంగా ఖండిస్తోంది. దశాబ్దాలుగా సొంత గడ్డ మీద సింహళజాతి ఆధిపత్యానికి గురయిన తమిళుల స్వతంత్ర ఆకాంక్షను అణచివేసినందువల్లనే ఈలం కోసం సాయుధపోరాటం ప్రారంభమైంది. శ్రీలంక పాలకులు భారత్, అమెరికా ప్రభుత్వాల సహకారంతో ఎల్టీటీఈ మీద దారుణమైన అణచివేత సైనిక చర్యలు చేపట్టారు. సుమారు మూడు దశాబ్దాలుగా ప్రభుత్వ అణచివేత.... ప్రతిఘటనల మధ్యనే ఎల్టీటీఈ శక్తివంతమైన పోరాటసంస్థగా ఎదిగింది. మన కాలపు జాతి విముక్తి ఉద్యమాల్లో లోపలా బైటా పెద్ద ఎత్తున మద్దతు పొందిన సంస్థ ఎల్‌టీటీఈ. తమిళుల స్వతంత్ర ఆకాంక్షకు ఉద్యమ రూపాన్ని ఇవ్వడంలో, దానికి ప్రపంచ స్థాయి గుర్తింపును, సమ్మతిని సంపాదించడంలో ప్రభాకరన్ పాత్ర విశిష్టమైనది. ఈక్రమంలో వ్యక్తిగా ప్రభాకరన్‌లోగాని, సంస్థగా ఎల్‌టీటీఈలో గాని కొన్ని పెడధోరణులు తలెత్తి ఉండవచ్చు. కాని భారతప్రభుత్వం, అమెరికా సామ్రాజ్యవాదం అండదడంలతో శ్రీలంక పాలకుల దశాబ్దాల అణచివేతను ధిక్కరించి రాజీలేకుండా ఈలం తమిళులు విముక్తి పోరాటాన్ని కొనసాగించారు. తప్పులు ఎందరైనా చేస్తారు త్యాగాలు మాత్రం కొందరే చేస్తారు అన్నమాట ప్రభాకరన్‌కు, ఈల్టీటీఈకి పూర్తిగా వర్తిస్తుంది. ఇవ్వాళ ఎల్టీటీ ఈ ఓడిపోవచ్చుగాని మహత్తర పోరాటంగా అది చరిత్రలో నిలిచిపోతుంది. స్వాతంత్ర్యం కోసం, స్వేచ్ఛకోసం ఎంత పెనుగులాడవలసి ఉన్నదో, ఎన్ని బలిదానాలు చేయవలసి ఉన్నదో తన విషాదకరమైన ఓటమిలో శ్రీలంక తమిళ పోరాటం మరోసారి నిరూపించింది. ప్రభాకరన్ మరణంతో స్వతంత్ర ఈలం ఆకాంక్ష చల్లారిపోదు. ఈలం సమస్య ఉన్నంతవరకూ, ప్రభాకరన్ స్మృతి సజీవంగా నిలిచి ఉన్నంత వరకూ శ్రీలంక తమిళుల పోరాటం ఉంటుంది. ఈలం తమిళుల స్వాతంత్ర్య పోరాట పతాక అయిన ప్రభాకరన్‌లోని ఉద్యమకారునికి విరసం జోహార్లు చెప్తోంది.

వరవరరావు వి. చెంచయ్య రత్నమాల పాణి గీతాంజలి. *

నవల సీరియల్ ☆ పాణి

# గుమ్మెటమోత ②

*(గత సంచిక తరువాయి....)*

ఇప్పుడెవరైనా 'యా ఊరు మన్ది?' అని అడిగితే బిజినేముల అని చెప్పడంలో కించిత్ ఆత్మవిశ్వాసం పొటమరిస్తుంది. అయినా చిన్నప్పుడు ఊళ్ళు పట్టుకొని తిరగడం ఎన్నటికీ విస్మృతి కావడం లేదు.

ఇందాక జేజినాయిన తననుద్దేసించి 'అయిద్రాబాదులో ఉంటున్నా' అన్నప్పుడు అవతల ముసలోడు ఎట్లా అర్థం చేసుకున్నాడో! 'ఊర్లెంబటి తిరుగుతూ హైద్రాబాదు చేరుకుండాడా?' అనుకున్నట్టనిపించింది.

దాన్ని తన మనసు ఒప్పుకోదు.

జేజినాయిన, నాయిన ఊళ్ళు పట్టుకొని తిరిగిందీ, తనిప్పుడు తిరుగుతున్నదీ ఒకటేనా?

పొద్దున్నే లేచి ఊర్లో పాటలు పాడుకుంటూ నాలుగిండ్లు అడుక్కొచ్చుకొని తిని, గుడారం పీకేసి యింకో ఊరికి దారితీసిన రోజులు గుర్తుకొచ్చాయి. జేజినాయిన గుడారం పట్టలు ముదురు చుట్టుకొని ముందుకు నడిచిపోతుంటే గుమ్మెట తాంబురలు తగిలించుకొని జేజి అనుసరించేది. ఆ వెనుక అమ్మనాయిన చెంబులు తపేలాలు, గడ్డల మూటలతో వెళ్లేవారు. తమ్ముడు నాయిన భుజమ్మీదెక్కి కూచునే వాడు. చెల్లెలు తల్లి చంకలోంచి దుస పీక్కోని వెళ్ళి జేజినాయిన కాళ్ళకు అడ్డంబడేది. నెత్తిమీదుండే బరువు చంకలోకి మార్చుకొని దాన్ని భుజానికెక్కించుకొనేవాడు.

ఆ పిల్ల పైకెక్కి - బారెడు పొడువున మెలితిరిగి జనపనారవలె ఉండే జేజినాయిన తలవెంట్రుకలు సవరదీసేది.

"పొట్టీ... ఎట్లా సిగ యిప్పదీసినావుగాని మీ జేజినాయిన తల తూర్పు పొయ్యే. పేలు పగలబన్నాయి. దినాం పైటాలయ్యేతలికి యిరబోసుకొని ముందు కూచుంటాడు. నాకా చూపు అనకబాయె...." జేజి కేకేసి చెప్పేది.

మధ్యాన్నమప్పుడు రోజూ ఉండే దృశ్యమది

"యహాః.... అవతలికిపో. దినాం ఇదో కతయ్యింది నాకు...." అని జేజి కసురుకుంటుంది.

"యాడికి పొయ్యేదే... పేలు చూపించుకోనీక యింగోదాన్ని కట్టుకోమంటవా ఏంది?" అని పరిహాసమాడేవాడు జేజినాయిన. "చేసుకున్నప్పుడు నన్నడిగే చేసుకుండవా ఏంది?"అని - గొగ్గిరికాళ్ళ మీద జుట్టు విరబోసుకొని కూచున్న జేజినాయిన్ను అట్ల వెనక్కి తోసేసేది.

"ఓసి.... నియ్యమ్మ.... నువ్వెక్కడి ఆడిదానివే...." అని తిట్టుకుంటూ గుడారంలోకి వెళ్ళి గుడ్డల సంచీ బుడికి ఈరుబాన తెచ్చుకొనేవాడు. చెట్టుకు ఆనుకొని కాళ్ళు బారజాపుకొని ఈరుబానతో జుట్టు పీక్కుంటూ తన్మయంలో మునిగిపోయేవాడు.

జేజినాయిన, పెండ్లయిన నాలుగేళ్ళకు మరో ఆడామెను తెచ్చుకున్నాడట. ఆడబిడ్డను ప్రసవించి వాయిగమ్మి చనిపోయింది. ఆమె పిల్లల పిల్లలు ఎక్కడో ఉన్నారు. ఆమె దూపమోల్ల యింటికి పోయింది. మొక్కార్తె పున్నమికి డోన్‌లో కలిశారు. ఆమె సంసారం గంపెడయింది. చెట్టుకొకరు పుట్టకొకరు తిరుగుతుంటారు. "మీ దూపమోల్లు...." అని వాళ్ళ ప్రస్తావన వచ్చినప్పుడు ఊళ్ళో చెప్తుంటారు.

సందు దొరికితే చాలు జేజి సవతిని గుర్తు చేసుకుంటుంది. ఆ పేరుతో జేజినాయిన్ను ఎత్తిపొడుస్తుంది.

సిన్నోడా....? అని జేజి పిలిచింది.

ఉలిగప్ప తన అంతర్జగత్తు నుండి బైటికొచ్చాడు.

అప్పటికి ఊరి చివరికి చేరుకున్నారు. కడాకు నాలుగు సాయిబుల ఇండ్లుంటాయి. వాటిని అనుకొని కాపోళ్ళ దొడ్లు, కళ్ళాలు. ఆ తర్వాత - ఊళ్లో కొట్లాట వల్ల బీడుపడిపోయిన దేవుని మాన్యం. అక్కడ రెండు గుడారాలు.

"ఏందిరా.... ఇట్లొచ్చినావు.... బడిపోదూ...." అని అడిగింది.

"సెలవులిచ్చినార్లే. ఎల్లుండి కర్నూల్లో సంగం మీటింగుంది. మిమ్మల్ని గూడ చూసినట్టుంటదని వస్తి. మీకేమో ఇంట్లోది చేదాయె....."

చివరి మాటకు జంబులు తటాలున తలతిప్పిచూశాడు. ఆ ఉదయపు లేత ఎండకు నొసటి మీద పెట్టుకున్న కుంకుమ బొట్టు చెమటతో తడిసి సన్నని ధారగా ముక్కు కొన మీదికి చేరుకుంది. పండిపోయిను గుబురు మీసాల మధ్య కనిపించని నోరు, బిరుసు గడ్డం.... అంతకు మించి మనవడి మాటకు ముడిబడిన నొసలు...? ఆగ్రహ ఛాయలు తొంగిచూశాయి.

అంతమాట తన నోటెంట వస్తుందని ఉలిగప్ప కూడా అనుకోలేదు. అది తరచూ తల్లి అనేమాట. జోలె తగిలించుకొని పోవడం ఆమెకు అభ్యంతరం కాదు. సుంకమ్మదొక విచిత్ర వర్తన. ఎవరూ అడగకపోతే అత్తమామలు ఎటుపోయినా తలచుకోదు. 'ముసలోల్లు యాడికి పోయినారు?' అని ప్రత్యేకంగా అడిగితే 'గుమ్మెట తాంబుర ఎత్తుకొని పోయినారు' అని యధాలాపంగా చెప్తుంది. అట్లాపోవాలని కోరుకోదుగాని, పోవడం మామూలేగదా అనుకుంటుంది.

'ముసలోల్లను నీడపట్టున ఉంచుకొని యింత బువ్వ పెట్టి నీళ్లు పోస్తే నీగంటేం కరిగిపోతది?' అని అడిగితే కొంచెం చిన్నబుచ్చుకుంటుంది. అది కూడా ఈ నడమే. ఇల్లని, వాకిలని ఒక తావున ఉండబట్టినాకే. తనకు ఈ భావన ఎందుకు కలిగిందో ఆమె ఎన్నడూ యోచించలేదు.

'నేను చేసిపెట్టేది వాళ్లకు చేదంట' అనేది. అడుక్కొచ్చుకొంటేనే రుచి.... అనే అంతరార్థం పలికేది ఆ మాటలో.

అలాంటి మాట తనిప్పుడు అన్నానని స్ఫురించేసరికి విలవిలలాడాడు ఉలిగప్ప. అది తీపి - చేదుల వ్యవహారం కాదు. 'తిరిగే కాలు ఒక తాన యాడుంటది?' అని తమ్ముడు రామలింగం అనే మాట కూడా నిజంకాదు. దానినొక అలవాటుగానే చూచి విసుగుపడ్డకాలం వొకటి ఉంది. ఇవేవీ నిజంకాదని ఉలిగప్పకు బోధపడ్డాక అట్లా అనడం మానేశాడు. అనేక మందిలోని అనేక అలవాట్లను దగ్గరిగా చూసి చూసీ నిర్ధారణకు వచ్చాడు. జేజీ జేజినాయింది కూడా అట్లాంటి అలవాటేనా? కాదేమో?

ఎప్పటి వలెనే ఇప్పుడూ తలపడ్డానికే వచ్చినట్టు జేజినాయినకు అర్థం కావడం ఎంత దురదృష్టం! పైగా సంగం గురించి చెప్తూ ఈ మాట అనడం! నిజమే.., సంగం - ఇంట్లో తిండి చేదు - అనే రెండు పదాల్లో ఒకదాని మీది నుండి మరోదాని మీదికి జంబులు మనసు అసహనంగా తిరుగాడింది. అది ఉలిగప్ప మీద కాదు. పిల్లనాయాలు తిరిగి మాటలు నేర్చుకుండాడు... ఎవరెంట తిరుగుతాడోగాని చెడనూకినారు అనుకున్నాడు. మనవడి నోటెంట ఇలాంటి సంభాషణ వచ్చినప్పుడల్లా జంబులు అనుకొనే మాట యిది. ఆ రోజుల్లో తనెంట ఎంత తిప్పుకున్నా కొడుక్కి పాటలు రాలేదు, కతలు చెప్పడం రాలేదు. అయినా పిల్లల్ను కంటూ కూడా ఎనకీడ్తి వచ్చేటోడు. చెప్పింది చెప్పినట్టు చేసేటోడు. కడాకు ఈ వయసులో అందరిలెక్క బిందెల కావడి బుజానేసుకొని పోవచ్చు....! కానీ ఈ పిల్లోడు అట్లకాదు. సదూకోడమంటే ఇట్లాంటి మాటలు నేర్చుకోడమా?

జంబులు అక్కడిదాక ఆలోచిస్తాడు. ఆ తర్వాత ముందుకు సాగదు. మనవడు ఎందుకిట్లా మాట్లాడుతాడో తెలియదుకాని, దాని మీద 'చిరాకు మాత్రం కలుగుతుంది. నడుస్తున్న దారి అక్కడి నుండి అట్లా సుదూరంగా చేలల్లోకి సాగిపోతుంది.

ఉలిగప్ప ఈసారి ఎట్లాగయినా జేజినాయిన్ని వొప్పించాలని సమకూర్చుకున్న వాదన పెటిల్లున చిట్లిపోయింది. మరోసారి జంబులు

ముఖంలోకి చూశాడు.

ప్రశాంతంగానైతే కనిపించలేదు.

కుడివైపు వేపచెట్లకిందున్న గుడారాలవైపు దారి మళ్ళాడాయన.

ఎందుకో ఉలిగప్ప కొన్ని క్షణాలు తటపటాయించాడు.

తమకెప్పటి నుండో చిరపరిచితమైన మార్గానికి చీలిపోయినట్టు, అటువైపు ప్రవేశార్హత తమకే ఉన్నట్టు ముసలాళ్ళిద్దరూ ముళ్ళకంపలు దాటుకొని వడివడిగా సాగిపోయారు.

ఆ యింతలోనే ఎంతో వెనుకబడ్డట్టనిపించింది ఉలిగప్పకు.

ఈ నడక సరే తను ముందా? జేజినాయిన ఎవరు ముందా?

జంబులు వెళ్ళి గుడారంలోని గుడ్డల మూట మీద తాంబుర పెట్టేశాడు. వెనుక వున్న మశమ్మకు అది మామూలుగా పెట్టినట్టపించలేదు. అపురూపంగా పసిపాపవలె తాంబురను అటు ఇటూ తిప్పడం మాత్రమే ఆమె చూచింది. అది అంత సున్నితమైదేమీ కాదు కానీ ఆయన స్పర్శ మరెక్కడికన్నా తాంబుర దగ్గర సున్నితమైపోయేది.

అప్పుడు తాంబుర నుండి వింతధ్వని వెలువడింది. అదేమిటో మశమ్మకు అర్థం కాలేదు. మామూలుగానైతే పట్టించుకొనేది కాదు. ఉలిగప్ప మాటతో మొగుని మనఃప్రకంపనలను లీలగా ఆలకించడం వల్లనేమో తాంబుర ధ్వని ఏం కావచ్చనే ప్రశ్నకు గురయింది. దానికి తోడు తలపాగం తీసిన తీరు కూడా తేడా అనిపించింది.

జంబులు గుడారం బైటికి వెళ్ళి చుట్ట వెలిగించుకొన్నాడు.

ఆ పక్క గుడారంలో ఉండే గురప్ప.... అల్లంత దూరంలో వస్తున్న ఉలిగప్పను చూచి "ఎవురా పొట్టిగాడు....?" అని అడిగాడు.

జంబులు కొన్ని క్షణాలు పలకలేదు.

ఏదో బరువు బాపుకుంటున్న వాడివలె చుట్ట పొగ వదులుతున్నాడు. అదలా గాలిలో అదృశ్యమైపోయినట్టే లోపలి వ్యథ కూడా ఆవిరైపోతే బాగుండను కున్నాడు.

గురప్ప తననుద్దేశించే అడుగుతున్నాడని తెలిసినా అతనివైపు తలతిప్పి కూడా చూడలేదు. గురప్ప తెగిపోయిన వలను అల్లుతున్నాడు. కుడిగాలి బొటనవేలితో లాగి పట్టుకొని పోగులు ముడేస్తున్నాడు.

మశమ్మ ప్లాస్టిక్ లోటాతో నీళ్ళు తీసుకొచ్చి మొగునికి అందిస్తూ ఏదో చెప్పబోయేలోగా ఉలిగప్ప దగ్గరికొచ్చి గురప్పను పలకరించాడు.

"ఏందే! వలదీసినవ్! సందెకాడ తిరిగొస్తవా? ముంగిస తినిక శానా దినాలాయె...." అన్నాడు.

గురప్ప ఎవురూ? అన్నట్లు చూచాడు.

"కొడుకు నే మర్చిపోతే ఎట్లబ్బా...." అని, అప్పటికీ పోల్చుకోలేదని అర్థమై "ఉలిగప్పనుగాదూ...." అన్నాడు.

"ఓరోరి... లంగనాయాల... నువ్వొంటరా? సంగపోన్నని చెప్పు. వారం దినాల కింద కోడుమూరు నుండి మనోల్లు వచ్చిండిరి. నీ గురించి చెప్పిరి. నువ్వు లీడరువైనవంటగా.... మీ తూర్పాటోల్లే సంగానికిప్పుడు అనిరి...."

ఉలిగప్పకెందుకో సంబరమనిపించింది.

అంతక ముందటి వొత్తిడి తీరిపోయింది. కొత్త తలంలోకి రెక్కలు కట్టుకొని ఎగిరివచ్చినట్టయింది. గురప్ప తనను గుర్తించిన తీరువల్ల తనకిష్టమైన ఆవరణకు ఉనికి దొరికినట్టయింది. గతానికి కొత్త ఆకృతినిచ్చే తన నైపుణ్యాన్ని ఆయన గుర్తించాడని సంతృప్తి కలిగింది. చేలివేళ్ళ కదలికలతో దారానికి వలరూపాన్నిచ్చే గురప్ప ఒక క్షణం సేపయినా తను చేస్తున్న పనిని వొప్పేసుకోవడంతో ఎక్కడ లేని బలం ప్రాప్తించింది. గురప్ప అదే వలను పదే పదే అట్లాగే అల్లగలడు. ఎక్కడ తెగిపోయినా తిరిగి అట్లాగే అతుకుపెట్టగలడు. అవే పోగులను తనిప్పుడు సరికొత్తగా ముడిపెట్టాలని చూస్తున్నాడు.

కట్టలు తెగిన ప్రవాహంవలె ఉలిగప్ప ఊహలు అలా అల్లుకుంటూ సాగిపోతాయి. జేజినాయిన తడుముకోకుండా కాటమరాజు కతనో, ఆరెవాళ్ళ కతనో ఎక్కడ మొదలు పెట్టినా ఎట్లా అదుపు లేకుండా నడిపించగలడో సరిగ్గా తనకూ అలాంటి ఊహలే సాగుతుంటాయని ఉలిగప్ప అంచనా. యింతకూ జేజినాయినకిదంతా జ్ఞాపకమా... ఊహనా? యిన్నిన్ని కతలను, పాటలను కేవలం జ్ఞాపకంలోనే దాచుకోవడం అయ్యేదేనా? ఊహ తోడవ్వకపోతే పాతబడిపోతాయేమో? కాకుంటే జేజినాయిన ఊహ ఎంత అనంతమైనదో అంత అతార్కికమైనది. బహుశా ఆయన ఊహకదే పదును కావచ్చు. జ్ఞాపకానికదే సారుగు కావచ్చు.

గురప్ప మాట ఉలిగప్ప నొక కొత్త ఊహారీతికి లోను చేసింది అది పారవశ్యానికి గురి చేసింది. అక్కడి నుండే 'జేజినాయినకెందుకు యింత విముఖం?' అనే ప్రశ్న కూడా తలెత్తింది. కానీ దాన్ని కేవల వ్యతిరేకతగానే ఒప్పేసుకోలేక పోయాడు. ఈ ముసలోడికి ఏదో బలమున్నది? దాని వల్లే యిదంతా. అది ఎక్కడి నుండి సంక్రమిస్తున్నది?' అని సంభ్రమంగా జేజినాయిన ముఖంలోకి చూశాడు.

గతకాలపు విశేషాకృతివలె జంబులు ముఖం కనిపించింది.

మనవడు అట్లా చూడటం ఆయన గుర్తించకపోలేదు

కొంచెం తెప్పరిల్లాడు.

అటు తర్వాత ఉలిగప్ప చూపు గురప్ప మీదికి పోయింది. పెద్ద నాయిన వరసయ్యే గురప్ప అదే వొడుపుతో పోగులు ముడేస్తున్నాడు. ఈ చివరంతా సరి చూశాక లేచి నిలబడి వలను అమాంతం విదిలించాడు. ఆ వైపు ఎక్కడో కన్నం కనిపించింది. దాన్ని చేతిలోకి తీసుకొని అదే భంగిమలో నేలమీద కూచొని పని మొదలుపెట్టాడు. తల ఓరగా నేలకేసి, మధ్యమధ్యలో ఉలిగప్పకేసి అలా ముఖం ఎగరేసి చూస్తూ పని కానిస్తున్నాడు.

ఉలిగప్పకు అప్పుడేదో అద్భుతంగా తోచింది.

సృష్టిలో అర్థాంతరంగా మిగిలిపోయిన దాన్ని భర్తీ చేస్తున్నవాడివలెనో - లేక అస్తవ్యస్తమైపోయిన దాన్ని సవరిస్తున్న వాడివలెనో గురప్ప కనిపించాడు.

"అయిద్రాబాదులో ఉండవంటనే. సంగం పనేనా? నౌకరీ చేస్తుండవా?" అని అడుగాడు గురప్ప.

"సదువయితే గదా నౌకరిచ్చేది?"

"ఏందిరోయ్.... తాటిమానులెక్క పెరిగినావ్. యింకా బడికాలేదా. నీ పాయమోల్లకు పిల్లలయినారు, ఎరికేనా?" అన్నాడు గురప్ప

ఉలిగప్ప భళ్ళున నవ్వాడు.

"మన జాతి మీద రిసర్చ్ చేస్తుండా"

"అదేందిరోయ్.... అడక్క తినేటోల్లం.... ఉడతలు, ముంగిసలు పట్టుకొనేటోల్లం, మన మీద బల్లో సదువు చెప్తరా?" చేసేపని అపి అడిగాడు గురప్ప. 'ఈ పిల్లోడుగిన ఆటపట్టిస్తుండా ఏమి?' అని సందేహం ఉందాయన మాటల్లో.

"ఎందుకు చెప్పరు? మనకు ఎట్లాంటి ఆటపాటలుండేదీ, ఎట్లా మనం శికారీపొయ్యి యాట కొట్టకొచ్చేదీ రాసియ్యాల...."

ఆ మాట పూర్తికాక ముందే జంబులు అడ్డుపడ్డాడు.

"రాయనీక వచ్చని.... అడ్డంపట్టిచ్చి రాస్తరేమోగదూ...." అన్నాడు చురుగ్గా. వెంటనే ఏమనాలో ఉలిగప్పకు బోధపడలేదు. కానీ గురప్ప అందుకున్నాడు. "ముసల్నాకొడకా?... ఎప్పుడో మీ యబ్బకాలంలో పాటలు పద్యాలు నేర్చుకొని, ఈ పొద్దటికీ అవే పాడుకొనేటోనివి నువ్వు... అన్నిట్లో ఏం పెడతావే. ఉన్నదున్నట్టు రాస్తారు అడ్డంగా ఎందుకు రాస్త్రారా? తలపుచ్చిపోయిందా ఏమి?" అన్నాడు.

"ఉన్నదున్నట్టయితే యింగ రాయడమెందుకు? ఉండయిగదా. కాయిదాలు దండగ...." అని అంతే తీక్షణంగా ఎని క్షణంలో గొంతు, పలుకు, ముఖ కవళికలు మార్చి "సదూకున్నోల్లు మనం అడుక్కతింటున్నామని

ఉద్ధరించనీక ఇట్లాంటి పన్లు చేస్తుంటారు. వాటిల్లో అదే రాసేది...." అన్నాడు.

అట్లా జేజినాయిన మాటల్లో నాటకీయమైన మార్పులను చూడటం ఉలిగప్పను భలే ఇష్టం. వలవల కన్నీళ్లు కార్చే దుఃఖస్వరం క్షణంలో రౌద్రమై వొళ్ళు గగుర్పొడుస్తుంది ఆయన గొంతులో రాబోయే మార్పు ఎట్ల తెలుస్తుందో గాని జేజి చేతులు గుమ్మెట మోతను అంతే వాడుపుగా మార్చేస్తాయి. కానీ ఆమె పీలగొంతు జేజినాయినకు సమతూకంలో సాగేది కాదని ఉలిగప్ప చాలాసార్లు పసిగట్టాడు.

రెండు మనోతలాల మీది నుండి ఏకకాలంలో వినిపించిన జేజినాయిన గొంతును ఉలిగప్ప ఈసారి కళా సంబంధంగానే తీసుకోలేకపోయాడు.

దాంతో బీరుపోయాడు. పురావశేషమైన జేజినాయిన విశ్వాసం కట్టలు తెంచుకొని బైటికి వచ్చిందని, ఏకకాలంలో అది కోపంగా, నిరసనగా వెల్లడైందని అర్థం చేసుకున్నాడు. కానీ వాళ్ళ సంవాదంలో తనకేమైనా చోటు ఉంటుందా? తను చాలా చెప్పాల్సిన సమయమిది అనుకున్నాడేగాని ఎక్కడి నుండి మాట్లాడాలో తోచలేదు. జేజినాయినకూ ఇలాంటి యిబ్బంది ఉంటుందా? తననే వెంటాడుతోందా? కొన్నిసార్లు తన మాటలు ప్రసరించలేని శూన్యం ఎందుకు ఆవరించినట్లవుతుంది. ఈ నిస్సహాయత ఏమిటో...?

అలాంటి స్థితిలో కూడా జేజినాయిన మాటల్లో ఏదో ఉందనిపించింది. ఉన్నవాటిని రాయడం దేనికి? అని ఎందుకన్నాడు? అడ్డంగా రాస్తారని వ్యతిరేకతా? లేక అసలు రాయడం మీదే వ్యతిరేకతా? జేజినాయిన లోలోపలి అసహనాన్నంతా ఉగ్గబట్టి ఒకే ఒక బిందువు దగ్గర వెల్లడించినట్టుంది. ఆ కోపం తనమీదికి కూడా కొంచెం ప్రసరించినట్టయి ఉలిగప్ప నొచ్చుకున్నాడు.

పొద్దు పైకెక్కింది. చలి సాంతం ఇరిగిపోయి ఎండ పళపళ లాడింది. పంట తీసిన పొలాల్లో కనిపిస్తున్న మంచుగొడుగు కరిగిపోయింది. చెట్ల ఆకుల మీది తడి ఆవిరైపోయింది.

పాడటం, వడివడిగా నడవడం, అంతకన్నా మనవడితో సంభాషించడం వల్ల ఎన్నడూలేని విధంగా జంబులుకు అలసట కలిగింది. అది లోలోపలి వొత్తిడిగా గుండెలపై ఎందుకు కూచున్నదో ఆయన ఎన్నటికీ తెలుసుకోలేడు. ఎదురుగా రెండడుగుల దూరంలో మనవడు కూచొని ఉన్నాడు. తమ ఇద్దరి మధ్య ఎందుకు బిగుసకపోయిందో వివరించుకోలేని పండుముసలికి గొంతు పట్టేసినట్టయింది.

చివరిదాకా కాలి ఆరిపోయిన చుట్టను విసిరిపారేసి, తల వెనక్కి తిప్పి ఓ.... అనే వింతశబ్దం చేసి 'నీల్లియ్యి' అని చెయి సాచాడు.

అప్పుడే మశమ్మ జోలెను నేలపై విప్పింది. గొగ్గిరికాళ్ళమీద కూచొని అన్నం - అనుపాకం వేరు చేస్తున్నది. ఒక స్టీలు గిన్నెలోకి అన్నం ఎత్తింది. తెల్లగా లేత గోధుమ వన్నెలో, పొడిగా, లావుపెళ్ళలుగా, ముద్దగా నూకల్తో, లావుబియ్యంతో చేసిన అన్నం. నిన్న పొద్దువాలుతున్నప్పుడో, రాత్రో వండి తినగా మిగిలిన సద్ది అన్నం, జొన్నరొట్టెలు జోలెలో పడ్డాయి. రకరకాల కూరలు, పప్పు, ఊరిబిండి అన్నీ ఒక లోటాలోనికి ఎత్తింది.

బైట మగవాళ్ళ మాటలు వింటూనే పనిలో లీనమైంది. ఆ మాటలేవీ ఆమె ప్రత్యేకంగా, ఆసక్తిగా వినడంలేదు. గాలిలో పోరాడి చెవి జేరుతున్నాయి. అంతే. మధ్య మధ్యలో ఏవో సొంత ఆలోచనల తాకిడి వల్ల, బైటికి గొణుక్కోవడం వల్ల బైటి మనసుకు ఎక్కడం లేదు.

జంబులు రెండవసారి కేకేశాడు.

అదమరపు నుండి బైటపడి అన్నం చేత్తోనే బిందె వంచి అడుగున ఉన్న నీళ్ళు లోటాలో పోసింది. నీళ్ళు తీసుకొని వెనుదిరుగుతుంటే ఆమె కాలో, చెయ్యో తగిలి గుడ్డల మూట మీది నుండి తాంబుర ఏటవాలుగా జారిపడింది. మశమ్మ అటుకేసి చూడటం, తాంబుర రకరకాల స్థాయి స్వరాల కలయికతో శబ్దం చేయడం ఒకేసారి జరిగిపోయాయి.

గుడారానికి వీపు చేసి కూచున్న జంబులు దిగ్గున లేచాడు. తాంబుర చేసిన శబ్దం, జంబులు లేచిన వైనం కలగలసి ఉలిగప్పలో అలజడి రేపాయి.

ఏమైందన్నట్టు చూశాడు గురప్ప.

మోకాళ్ళ మీద కూచొని ఉండి తటాలున లేచినందువల్ల జంబులు నిటారుగ నిలబడలేకపోయాడు. నడుం, మోకాలు పట్టేశాయి. కాలు ఈడ్చుకుంటూ బరబరా గుడారం వైపు అడుగులు వేశాడు. ఆ ఊపు చూచి ఉలిగప్ప కలవరపడ్డాడు. జేజిని కొడతాడేమో అనిపించింది. వెనుకే రెండడుగులు వేశాడు.

గురప్ప పని ఆపేసి వెనక్కి తిరిగాడు.

నీళ్ళలోటాతో వస్తున్న మశమ్మ అట్లే నిలబడిపోయింది.

జంబులు ఆగ్రహానికి లోనయ్యాడని మాత్రమే చెప్పలేం. ఏదో అసౌకర్యం, స్థిమితంగా కూచోలేకపోవడం, దీనికితోడు తాంబుర పడిపోయిన వికారధ్వని కలసి ఆయన్ను అతలాకుతలం చేశాయి. ఆ కొన్ని క్షణాల్లో ఆయన మనఃస్థితిలో అనేక విచిత్ర క్రమాలు బయల్దేరాయి. వీటన్నిటివల్ల అప్పుడాయన పిచ్చివాడివలె కనిపించాడు. బైటికి కనిపించిన దానికన్నా అనేక రెట్ల మనో ప్రకోపానికి లోనయ్యాడు. ఆగ్రహమో, వేదనో, కించింత్ అవమానమో..... పలు ఉద్వేగాల తీవ్రత వ్యక్తమైంది. నిలువునా చీరుకపోయిన గాయం నుండి యావత్ శరీరాన్ని కూడగట్టుకొని ప్రతిక్రియగా లంఘించిన తోడేలు వలె ఆయన దేహం కదిలింది. మామూలుగా జంబులును కులంలో 'నర్సింసామి' అంటారు. అప్పుడాయనకు పట్టపగ్గాలుండవు. నిజంగా అప్పుడనిపిస్తుంది- ఏ ఆగ్రహ సన్నివేశంలోనైనా కళను పండించడానికి, నిజ జీవిత వర్తనలోని ఆగ్రహానికి ఎంత తేడా అని?

ప్రతిసారీ మశమ్మ పెడబొబ్బల మధ్య, తిట్ల మధ్య వాతావరణమంతా శోకంలోకి జారిపోయేది. ఆమె పీలగొంతులో ఒకలాంటి జీర అప్పుడు మాత్రమే వినిపించేది. జంబులు భార్యను కొట్టి, నీళ్ళున్న కాలమైతే చేపలు పట్టేందుకో లేక ఉడుములు పట్టేందుకో వెళ్లిపోతాడు. అట్లా పోవడంలో ఏదో కసి వ్యక్తమయ్యేది. యిక మశమ్మ తిట్లతో, దెప్పుతో మొదలు పెట్టి... అవన్నీ అయిపోయి ఆమెలో ఎప్పటి నుండో పేరుకుపోయిన దుఃఖాన్నంతా రాగాలుగా బైటికి తీసేది. మధ్యాహ్నం గడచి, సాయంత్రమై చీకటిపడ్డాక కూడ ఆమె గుడారం ముందు కూచొని వలపోసుకునేది. అప్పుడామె మామూలు మాటలనే ఒకరకమైన తూగుతో, విరుపుతో పాటగా సాగదీస్తుంది. అప్పటికప్పుడు దొర్లి వచ్చే మాటల్లో జంబులు - మశమ్మ మాత్రమే ఉండరు. 'నీకింత చేస్తి.... నీ కోసరం ఇన్ని కష్టాలు అనుబగిస్తి.... నీ ఎదాన దుమ్ము బొయ్య' అని మొగుని ప్రస్తావన వచ్చినట్లే లోకం మీద కోపం తెచ్చుకొనేది. మాటలుగా - పాటలుగా అది గాలిలో తేలి ఊర్లోకి చేరుకునేది. మిగతవాళ్ళు పట్టించుకోకపోయినా అయ్యగారి యిండ్లలోని బోడి అమ్మయ్యలు "అసుర సంధ్యవేళ... ముదనష్టపుది ఏం ఏడుస్తుంది! దాని గంటంత పోయినట్టు....!" అని తిట్టుకొనేవారు.

జంబులు ఈ నడుమ భార్యను కొడ్డడం మానేశాడు. పిల్లల పిల్లలు కూడా ఎదిగి వచ్చారనే వివేకం ఆయనను అదుపు చేసింది. ఇది కొత్తగా పట్టుబడ్డదే.

కొట్టేదాకా వెళ్ళి వెనక్కి తగ్గడం ఆయనకు అలవికాదు. అట్లా అదుపు చేసుకోవడం వల్ల మనిషి విచిత్ర వర్తనకు గురవుతాడు.

సరిగ్గా ఇప్పుడూ అదే అయింది.

గుడారందాకా వెళ్ళినవాడు మశమ్మకు ఒక అడుగు దూరంలో పాలపొంగువలె తగ్గిపోయాడు.

భార్య ముఖంలోకి గుడ్లురిమి చూశాడు.

ఎప్పటివలె అది ఆగ్రహపూరితమైనదే కాదు. వివేకశూన్యత నుండి అదుపు తప్పినదీ కాదు. కనుచూపులు కిందికి వదిలి.... కొన్ని క్షణాలయ్యాక వెనక్కి చూస్తే మనమడు!

భార్యను దాటుకుంటూ లోనికి వెళ్ళి తాంబురను చేతిలోకి తీసుకున్నాడు. ఆ స్పర్శకది సన్నగా పలికింది. దానితో సహా వెనుదిరిగాడు.

అప్పుడు జేజినాయినను ఉలిగప్ప పరీక్షగా చూశాడు. ఇన్నేండ్లలో ఎన్నడూ అట్లా కనిపించలేదు. కత చెప్తున్నప్పుడేకాదు, మామూలప్పుడూ భిన్న మనః స్థితులకు అద్దంపట్టే ఆయన ముఖంలో ఏనాడూ కనిపించని నీడలు తొంగిచూస్తున్నాయి. అదేమిటో ఉలిగప్పకు అంతుపట్టలేదు. కేవలం డెబ్బై ఏళ్ళపైబడిన ముసలాడి విషాదంగా మాత్రమే కనిపించలేదు. వందల వేల ఏళ్ళ మానవుడిలో, కఠోర వ్యవస్థలో బీటలుబారిన దృశ్యం కనిపించింది. సకలం ఊడ్చుకపోయినప్పుడు నిస్సహాయతలో భీతిల్లిన సన్నివేశం కనిపించింది. యింకా అలాంటివే ఎన్నో కలసి అత్యంత ప్రయాసతో, మూల్గులలోని రవ్వంత శక్తిని కూడా వెచ్చించీ సాధ్యంకాక కాలంలో కరిగిపోతున్న చివరి ప్రాచీన జీవిలా జేజినాయిన కనిపించాడు.

జేజి వెళ్ళి అన్నం గిన్నె మీద వాలిన ఈగలను తోలి గుడ్డ కప్పింది.

జంబులు తాంబురను భుజానేసుకొని దూరంగా వెళ్లిపోయాడు. ఒక కానుగ చెట్టు మొదట్లో చతికిలపడి సన్నగా మీటడటం ఆరంభించాడు.

మొదట మశమ్మే తేరుకున్నది.

ప్రకృతి తీవ్రతగాని, లోకపు వొత్తిళ్లుగాని లేని ఆ ఆరుబైలు పాలాల్లో ముగ్గురంటే ముగ్గురే ఉన్నప్పటికీ పెను కల్లోలం చెలరేగి ఇప్పుడిప్పుడే తెరిపిచ్చినట్లయింది. లోకంలోని ఏ విడి ముక్కా వొరిపిడి పుట్టించకపోయినా ఆ ముగ్గురిలో నిరంతరం పుడుతూ చిక్కుపడుతూ ఉన్న ప్రపంచంలోని కాకవికలమే ఇదంతా అని జంబులుకూ తెలియదు.... మశమ్మకసలే తెలియదు. అట్లాంటి ప్రపంచం ఈ ఎట్లా నడిపిస్తే అట్లా నడిచినవాళ్ళకు అదే కల్లోలమై పోవడం ఎట్లా తెలుస్తుంది. దాని పర్యవసానమైన వొత్తిడిని మోయడం తప్ప.

అంతా అయిపొయ్యాక మిగిలిన కట్టకడపటి మానవుని విషాదంవలె, మేలుకొలుపువలె, తనలో తన ఊరడింపువలె జంబులు తాంబురమోత వినిపిస్తోంది.

మశమ్మ మళ్ళీ నీళ్లలోటా తీసుకొని మొగుని దగ్గరికి వెళ్లింది. అప్పుడామె ఉనికిని సైతం జంబులు గుర్తించలేదు. తనకీ జగత్తుతో తెగతెగింపులయిపోయినట్టు తాంబుర మీటడంలో లీనమయ్యాడు.

ఉలిగప్ప దిగ్భ్రమనుకులోనై త్వరలోనే తేరుకున్నాడు.

ఏమిటి? తనకు బాగా తెలిసిన వ్యక్తులే కలనైనా ఊహించని రంగస్థలంలో పాత్రలయినట్లనిపించింది. తరచిచూస్తే తననూ అందులో పాత్రధారుని చేసినట్లుంది.

గురప్ప అదేపనిలో తలమునకలై ఉన్నాడు. జరిగిందానికి ఆయన సందిగ్ధపడ్డాడో సంకటపడ్డాడో తెలియడంలేదు. తదేకంగా వలను మరమత్తు చేస్తూనే ఉన్నాడు.

జేజి నిరామయంగా కనిపిస్తోంది.

ఇప్పుడామె ఏమనుకుంటుంది? ఉలిగప్ప ఇట్లా యోచిస్తున్నప్పుడే మశమ్మ పళ్ళెంలో యింత అన్నం, రకరకాలు కలిసిన కూర వేసుకొని తెచ్చి "సిన్నోడా" మా జేనాయిన కత ఎప్పుడుండేదేలే. ఎదారుపడితే అయ్యేదికాదు. అట్లగినయితే నేనేపొద్దో బొక్కకుపోయేదాన్ని... మబ్బులో ఎప్పుడు తిండావో ఏమో...'' అని అందించింది.

పళ్ళెం చేతిలోకి తీసుకుంటున్నప్పుడు గుర్తుకొచ్చింది.

"ఇంట్లోది చేదయితది'' అని తానన్నమాట....

అప్పుడు జేజి కూడా విన్నది. నిస్సంకోచంగా ఇప్పుడదే అన్నం పెడుతున్నది. అంత మాట అన్నా కోపించకుండా, చిన్నబుచ్చుకోకుండా అత్యంత సహజంగా తనను సంలీనం చేసుకుంటున్న కులంవలె అప్పుడామె కనిపించింది. అందులో ప్రేమ ఉండదని ఎలా అనుకోగలడు? విచిత్రమల్లా ఆమెకు ఇవేవీ తెలియకపోవటమే.... ఆకలి వేళకు అడక్కొచ్చిందాంట్లో రుచికరమైందాన్ని తీసి మనవడికి పెట్టడమే తెలుసు....

ఉలిగప్ప యింకో క్షణం ఎక్కువ ఆలోచించలేదు.

గుడారం ముందున్న చెట్ల మధ్యనే బాసిపట్లేసి కూచొని గబ గబ తినేశాడు. తంబుర మోత మధ్యమధ్యలో ఆగుతూ సాగుతోంది.

మనవడికి పెట్టి మశమ్మ తానూ తినేసింది

అన్నం తినేసరికి ఉలిగప్పకు లోపలి అలసట అంతా బైటికి పొంగింది. కళ్ళు మూతలు పడ్డాయి. మశమ్మ లోపల్నుంచి పట్ట తెచ్చిచ్చి.... "సిన్నోడా....! రొంచేపు నిదరబో, కడుపుకాలితే వాయినే లేచొస్తాడు'' అన్నది మొగుడిని ఉద్దేసించి.

అన్నిటినీ, అంతటినీ సహజంగా తీసుకోవడం ఆమెకు పట్టుబడ్డ వివేకమా? పూర్వీకుల నుండి సంక్రమించిన పామరత్వమా? ఆమె ఎప్పుడూ అంతే. దేన్నయినా ఉన్నదున్నట్టు తీసుకొంటుంది. ఉన్నదానికి భిన్నమైన ఊహ చేయదు. చేయకుండా ఎట్లా ఉంటుంది? బహుశా ఉన్నదాని గురించిన ఊహ చేయవచ్చు.

యిట్లా అనుకుంటే జేజినాయన తాంబురమోత కొత్త అర్థంలో వినిపిస్తోంది. ఉన్నదాని గురించి, జరిగిందాని గురించి ఆయన తనదైన కథనశైలిలో స్వీయవాదన వినిపిస్తున్నట్టుంది. దానికి ఆయనే ప్రమాణం. బలీయమైన ఆకాంక్షలు, విశ్వాసంతోపాటు గూడుకట్టుకపోయిన భయసందేహాల సంక్షోభం మాత్రమే ప్రమాణం....

ఎండ కొరివిలా మీదికి వచ్చిందో, అంతస్సీమలోని ఆలోచన కలివిడి కలల వొత్తిడో లేక బైటి అరుపులు కేకలో ఉలిగప్ప మేలుకున్నాడు. నల్లగా దట్టైంలాంటి మనిషి జేజినాయిన మీదికి కొట్టడానికి పోతున్నాడు. తాగిన మైకంలో ఎంత దుర్బలంగా ఉన్నాడో అంత మొండిబలంతో నానా గలీజు తిట్లతో జంబులు పొడవాటి జుట్టు దొరకబుచ్చుకొని....

ఉలిగప్ప దిగ్గునలేచాడు.

వెనకవైపు నుండి ఆ వ్యక్తిని అమాంతం లాగిపారేశాడు. ఊహించని తాకిడివల్ల అతను దూరం విరుచుకుపోయి పడ్డాడు. అప్పుడాయన నుదురు నేల మీది పలుగురాయికి తగిలి చింతగింజ మందాన బొప్పికట్టింది. నల్లటి చర్మం మీద నెత్తురు పొంగుకొచ్చింది. దెబ్బకన్నా ఈ హఠాత్పరిణామం వల్లే అతనికి దిమ్మతిరిగిపోయింది.

జంబులు తేరుకున్నాడుగాని ఎద్దువలె వొగిరిస్తున్నాడు.

అంత సులువుగా తప్పించుకోగలనని అనుకోకపోవడం వల్ల భయం నుండి దిగ్భ్రమకు చేరుకున్నాడు. నిలబడను చేతగాక అట్లాగే నేలమీదికి సొరిగిపోయాడు. అంతవరకూ అరుస్తూ, సాపిస్తూ ఉన్న మశమ్మ మొగుణ్ణి చేతుల్లోకి తీసుకున్నది. ఉలిగప్ప ఉరుక్కుంటూ పోయి జేజినాయిన్ను వొళ్లంతా తడిమాడు.... ఆ తర్వాత తలదిప్పి చూస్తే అవతలి వ్యక్తి తలవిదుల్చుకొని మళ్ళీ మీదికి వస్తున్నాడు. ఈసారి ఉలిగప్ప పొట్లగిత్తవలె మీదికి పోయాడు. ఆ ఊపు చూచి జడుసుకున్నాడేమో అతను తప్పుకొని అల్లంత దూరంలో ఉండే చెట్టుచాటున నక్కాడు.

ఉలిగప్ప గుడారంలోకి వెళ్ళి నీళ్ళు తెచ్చి జేజినాయిన నోటికి అందించాడు. జంబులు గుండె యింతెత్తున ఎగిసిపడటం వల్ల నీళ్ళు లోపలికి పోవడం లేదు. ఒక్కొక్క గుక్కే మెల్లగా తపించాడు.

"ఎక్కన్నా కొడుకునుగన్నానో... వచ్చినాడంటేసాలు... గుబగుబలాడిస్తాడు... కని... పెంచినందుకు కనికరం లేకపాయె. ముసలోన్ని చంపితేగాని ఈనాకొడుక్కి కుదటపడేతట్లలేదు....'' మశమ్మ తిడుతూనే ఉంది.

ఉలిగప్ప అప్పటికిగాని పోల్చుకోలేదు.

అతను చిన్నాయినవుతాడు. పేరు బిచ్చావతి.

రేగి కంపలాంటి జుట్టుతో, పై మీద ముదురు నీలం రంగు నిక్కరుతో ఎండిపోయిన ముఖకవళికలతో పోల్చుకోడానికి ఏమీ మిగల్లేదు.

ఉలిగప్ప ఆయన్ను చూడక ఎన్నేండ్లయిందో! బిచ్చాతి అనే పేరు ఎప్పుడైనా మాటల మధ్య దొర్లినప్పుడు విన్నదే. ఆయన రూపం ఉలిగప్పకు అస్పష్టమే....

'ఏం జంబులూ... నీ చిన్నకొడుకు దేశం బట్టిపోయిండంటగా. పాపం.....' అని ఒకరంటే,

'మీరే ఊర్లు బట్టుకొని తిరిగేటోల్లు. వాడింకా ఎట్టికి తిరగబట్టె. మీరంటే యాడికిపోయినా సంసారాన్ని ఎనకేసుకొని పోతారు... ఆ తిక్కనాయలేందిరా.... అట్లాయె....' అని ఇంకొకరంటారు.

'అయినా ఏంది జంబులూ... ఇన్ని శాత్రాలు చెప్పేటోనివి. వాడికి తలకాయ తిరిగి తప్పు చేసినాడనుకో... మీ పెద్ద మంచులు అంత లావు తీరుమాసం చేస్తా ఉంటే ఒగమాటనేది లేదా?' అని కొందరు మందలించేవాళ్లు.

అప్పుడు మశమ్మ వలవలా ఏడుస్తూ 'బాగ చెప్పినారు సామీ! తాంబురెత్తుకున్నప్పుడే శాత్రాలు. దించినాడంటే మతికుండదు. ల్యాకపోతే సన్న పొట్టెగాడు... ఏదో అన్నాడనుకో మంచుల్లో కలవనియ్యరా...' అని కుమిలిపోతుంది.

ఆనాడు మశమ్మ పెద్ద మనుషుల ముందు గుడ్లనీరు కుక్కుకుని ఏడుపు దిగమింగుకుంది. గుడారానికి వచ్చాక ఒకటే శోకందీసింది. రాళ్ళు కరుగుతాయేమో అనేంతగా ఏడ్చింది. దుఃఖం వల్లనే లోపలిదంతా తీరిపోదని ఆమెకు అర్థమైందేమోగాని మళ్ళీ పెద్దగా బాధపడ్డట్టులేదు. ఎవరైనా ఇట్లా కదిపితే చాలు - మొగున్ని, కట్టడిని, పెద్ద మనుషుల్ని ఒక్కొక్కటే లెక్కించి పక్కన పెడుతుంది.

'అరే! ఏందీ మంచి.... తిక్కోని లెక్క తయారైనాడు...' అనే ఆశ్చర్యమూ... యింత కాలానికి చూశానుగదా అనే సంభ్రమమూ.... ఈ రెంటిని మించి జేజినాయున్ను చంపనీక రావడమేంది? అనే ప్రశ్నా చుట్టుముట్టాయి ఉలిగప్పను.

రెండు మూడు నిమిషాలకే జంబులు కొంచెం కుదుటపడ్డాడు. కటికనేలమీద ఒక పక్కకు వొత్తిగిల పడుకొని సన్నగా ఎగబోసుకుంటున్నాడు.

ఉలిగప్ప జేజినాయన్ను వదిలి ఇవతలికి వచ్చాడు. బిచ్చావతి అదే చెట్టుపక్కన ఉన్నాడు. ఇప్పుడాయన దెబ్బకాచుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఒక నిమిషంపాటు ఒకరిని ఒకరు చూసుకున్నారు.

బిచ్చావతి కన్నుల్లోని తీక్షణతకు ఉలిగప్ప హడలిపోయాడు. ఆ చూపుల్లో విపరీతమైన కసి, ఆగ్రహం ఉన్నాయి. వాటితోపాటు సమస్తం మీద అనుమానం ఉట్టిపడుతోంది. దిమ్మరివలె కనిపిస్తున్నప్పటికీ అట్లా తిరుగాడటం పట్లనే అసహనం ఉన్నట్టుంది.

బిచ్చావతి చూపులు అర్థం కావడంతోనే ఆయనతో సామీప్యం పెరిగినట్లనిపించింది. తేటతెల్లమైన మానవుడు శాపవశాత్తు క్లిష్టంగా, జటిలంగా, అభేద్యంగా తయారైనట్టు, ఆయనన్ను విప్పి చూడటానికి ఆ కనుచూపుల అర్థాలు తెలుసుగోవడం తప్ప మార్గాంతరం లేదని ఆ కొద్దిసేపట్లోనే ఊహించగలిగాడు.

బిచ్చావతి రెండడుగులు ముందుకు వేశాడు. ఆయనకింకా కోపం తీరలేదు. ఉలిగప్ప వైపు చూస్తూ అరచేత్తో నుదురు వొత్తుకున్నాడు. దెబ్బ తగిలిన చోట భగ్గున మండింది. బాధతోపాటు కోపమూ పెరిగింది.

మశమ్మ గమనించింది.

"ఒరే.... లంగనాబట్ట.... పిల్లోడు ఎవరనుకున్నావు రా. పెద్దోని కొడుకు ఉలిగప్ప...." అని క్షణం సేపాగి "పుట్టించుకున్నోన్నే చంపనీకొస్తవు.... యింగ నీకేమి ఎరికైతది?" అని అరుచుకుంటూ వచ్చింది.

బిచ్చావతి ఆగలేదు. అంతే తీవ్రంగా అడుగులు వేస్తుంటే మశమ్మ మీదికిపోయి ఎడాపెడా చెంపలు వాయించింది.

ఉలిగప్ప అదిరిపోయాడు.

బిచ్చావతి నుండి ఏ ప్రతిస్పందన లేదు. నెమ్మదిగా కళ్ళలో నీళ్ళుబికాయి. ఏలోతుల్లోనో దాగిన జల బీడు తలాన్ని చేరుకున్నట్టు.... వొళ్ళంతా కండరాలు బిగుసకపోయి సన్నగా వొణుకుతున్నవాడు చల్లబడ్డాడు. తడి చూపుల్లోంచి కరుణలాంటిదేదో వ్యక్తమవుతోంది. మెల్లగా ప్రసన్నమయ్యాడు.

కానీ మశమ్మ లోపల చెరువు కట్ట తెగింది. ఎప్పటి నుండో, ఎక్కడెక్కడి నుండో చేరుకొని కట్టలు వొరసుకుంటూ వొదిగి ఉన్న దుఃఖం బద్దలైపోయింది.

గుడారాలు మోసుకుంటూ నిత్య సంచారంతో ఉన్నట్టు కనిపిస్తారుగాని పారీపారని నది వంటి మనుషుల్లో, పురాతనమైన కళను తమ జోలెలో పదేపదే పునరుత్పత్తి చేస్తూ నిరామయంగా బతికేవాళ్లలో ఏమిటీ కల్లోలం....! ఉదయం ఇంటి దగ్గర బయల్దేరినప్పటి నుండి పలు రూపాల్లో చుట్టుముడుతున్న వొత్తిడిని భరించడం కష్టమవుతున్నది. జేజినాయిన కంటే చిన్నాయన్ను అర్థం చేసుకోవడం మరీ కష్టం కావచ్చు. బలీయమైనదేదో పట్టి ఉంచడమో, పరిగెత్తించడమో, తీరని ఉక్కబోతకు గురిచేయడమో, చూస్తుండగానే అరచేతిలోనిది అట్లా అదృశ్యమైపోవడమో... విశ్వాసాలకు - సంధిగ్ధాలకు, స్థిరానికి - చరానికి, బంధనాలకు - స్వేచ్ఛకూ మధ్య నలిగిపోతున్నట్టుంది. లోకము వల్ల, లోకరీతి వల్ల.... అని నిత్యమూ తమ లోపలి నుండి పునర్జీవించే తీరువల్ల, స్వయం శిక్షణకూ - స్వేచ్ఛావర్తనకు మధ్య ఎదుర్కొంటున్న సంక్షోభమిది కావచ్చు.

ఇంత వరకూ కంటికి కనిపిస్తున్న వాటిని, తనకైనా - ఇతరులకైనా అనుభవంగా రూఢి అయిన వాటిని మాత్రమే పోగుచేస్తున్న ఉలిగప్పకు ఈ క్షణాన ఎందుకిలా అనిపిస్తున్నదోగాని అదొక వెలుగువలె ఉన్నది. కానీ దేన్నీ మరొక దాన్నుంచి వేరు చేసుకోలేకపోతున్నాడు. ఏ రెంటినీ కలిపి అర్థం చేసుకోలేక పోతున్నాడు. దేనికైనా తనదగ్గరున్న సాధనాలేమిటి? జేజినాయినకు, చిన్నాయినకు ఉన్నంతలో గొప్ప విశ్రాంత. అనుభవాన్ని మించిన పనిముట్టు లేదు. విశ్వాసాన్ని మించిన బలంలేదు. అవిగాక మరొకటి ఉంటుందని తెలియక పోనేవచ్చు. దాంతో వారి దుఃఖానికి ఎంత లోతున్నా పరిధీ ఉన్నదేమో.

ఉలిగప్ప ఈ సంకటం నుండి బైటపడే సరికి - ఆ యింత సేపట్లోనే మశమ్మ ఏడ్పులు తూడ్పులు పూర్తయిపోయాయి. గుడారంలో కొడుక్కి ప్రియంగా బువ్వ పెడుతోంది. అప్పుడామె ఎదురుగా కూచొని బిచ్చావతి ముఖంలోకి చూస్తున్న తీరు చాలా అరుదైనది. అదేదో బిచ్చావతికీ తెలుస్తోంది. అడక్కొచ్చిన దాంట్లోంచి మంచి అన్నం పెళ్ళలు తీసితీసి పెడుతోంది. అటుచూస్తే... జంబులు లేచి మోకాళ్ళ చుట్టూ చేతులు బంధించి కూచోని కొంచెం ముందుకూ వెనక్కీ ఊగుతున్నాడు. చూపులు ప్రసన్నంగానే ఉన్నాయి.

బిచ్చావతి ఈనాటి ఆకలితోనే తినలేదు. ఉన్నదంతా ఊడ్చేశాడు. అంత వరకు ఒక్కమాటయినా మాట్లాని ఉలిగప్ప.... 'ఏందే... సిన్నాయినా బో ఆకలి మీదుండావు...?" అన్నాడు.

బిచ్చావతి క్షణంసేపు వాడిగా చూచి... "సీకిరేటుంటే సారేయ్..." అన్నాడు.

ఉలిగప్ప లేదన్నాడు.

"అయిద్రాబాదులో సదువుతున్నవంటగా.... సీకిరెట్లు లావా? లంగనాయాల.... ఎంతెత్తు పెరిగిపోయినావురా.... గుర్తు పట్టేటట్లలేవు..." అన్నాడు.

అందులోని మురిపెం ఉలిగప్పకు అందింది.

"సిన్నోడికేంరా.... పుటా బెమ్మాండంగా ఉంటుంది...." అన్నది మశమ్మ.... ఎంగిలినీళ్ళు చెట్లల్లో పారబోస్తూ.

"బీడీల్లేవూ...." మళ్ళీ అడిగాడు బిచ్చావతి, ఆశతీరక.

మాశమ్మ బొడ్లోంచి సంచీ తీసి ఆకొక్కలోకి ఉంచుకున్న చుట్టముక్క తీసి కొడుకు మీదికి విసిరేసింది.

చుట్ట వెలిగించుకొని బిచ్చావతి గుడారం కోసం కట్టిన రాయికి వీపు చేసి కాళ్ళు బారజాపుకు కూచున్నాడు.

"సిన్నోడా.... ఎప్పుడొచ్చినావురా. పెద్ద బల్లో సదువుతున్నవంటగా...." అని అడిగాడు.

అప్పటికే పొద్దువాలింది. ఒకవైపు నుంచి చలితెరలేస్తున్నట్టుంది.

ఉలిగప్ప చిన్నాయనకు ఎదురుగా కూచున్నాడు.

అంతదూరంలో మశమ్మ. దూరంగా ఉన్న జంబులు లేచి బిర్రుగా

అందరివైపు చూసుకుంటూ అక్కడా ఇక్కడా తచ్చాడి ఎడంగా రాళ్ళగుట్ట మీద కూచున్నాడు. ముసిల్ది.... రాయ్యా.... అనలేదు, సిన్నోడు కూడా పిలవలేదని మంటగా ఉంది. కడాకు ఉండేకన్నా కలవడమే నయమనుకున్నాడు. తనట్లా తాంబుర మీటి.... ఆ.... అరీ అరీ నారాయణాది నారాయణా.... అనగానే ఎక్కడెక్కడి జనాలు తన ముందు గుంపయితారు. తను చెప్పే శాత్రం కోసం పిట్టకతల కోసం నోరు తెరుచుకొని ఉంటారు. అట్లాంటిది తను లేకుండా నలుగురు గుంపైతే జంబులుకు ఆవ తాగినట్టుంటుంది. ఒక్కోసారి ధుమధుమలాడుకుంటూ తిరుగుతాడు. మరోసారి వెళ్ళి తలకాయ దూర్చి మధ్యలోకి వెళ్ళిపోతాడు.

యిప్పుడు ఆ రెండూ చేయలేకపోయాడు. యింత గలాటయినాక.... అని. మామూలుగా అయితే బిచ్చావతి సుడిగాలి. ఎప్పుడు ఎక్కడి నుండి వస్తాడో తెలియదు. వచ్చాడంటే తండ్రి మీద కమరబడాల్సిందే. ఆ రోజంతా తన్నుకోడాలు, తిట్టుకోడాలు. మధ్యలో మశమ్మ ఇప్పుడట్లా కాకుండా చుట్ట కాల్చుతూ మారాజువలె కాలూపుకుంటూ, ముఖం ఇంత చేసుకొని మాట్లాడుతున్నాడు.

జంబులుకు దాని మీద ప్రత్యేక అభిప్రాయమేమీ కలగలేదుగాని, తన స్వభావానికి భిన్నంగా వెళ్ళి మౌనంగా కూచున్నాడు.

"ఈమయిను సుదువుకుండవు గదా.... అడక్కతినే ముసల్నాకొడుకు కాడికి ఎందుకొచ్చినవ్‌రా... ఏం తిందామని" అని అడిగాడు బిచ్చావతి.

కొంచెం ఎకసెక్కెంగానే అన్నాడు.

"అందుకే వచ్చిండేది. యింటికిపోగానే నాయిన అమ్మ చెప్పిరి. గుమ్మెట తాంబుర తీసుకొని పోయినారని. ఎట్లయినగాని ఈ తూరి యింటికి తోలకపోనీకే వచ్చినా. ఇయ్యాల నుండి గుమ్మెట తాంబుర అడుక్కోనీక గాదు..." ఉలిగప్ప చెప్తుంటేనే మధ్యలో అడ్డంబడి" నువుగాదు, నిన్ను పుట్టించిన బెమ్మ దేవుడికి గూడ వల్ల గాదురా సిన్నోడా. ముసలోడు ఊపిరి పొయ్యేటప్పుడు కూడా అడకొచ్చిన ముద్దే పెట్టమంటాడు. నేను చెప్తున్నా సూడు.... ముసలోడు తాంబుర దించేది కల్లోమాట.... నా మాట నమ్మకపోతే వాన్నే అడుగు.... కాదంటాడేమో...." అని తండ్రి ముఖంలోకి వేలు చూపించాడు బిచ్చావతి.

ఉలిగప్పకు ఈ ఉదయం నుండి ఈ క్షణాలే చాలా బాగా అనిపిస్తున్నాయి. తను వచ్చిన పని చక్కపెట్టడానికే చిన్నాయిన వచ్చినట్లుంది. లేకుంటే యింత సూటిగా అడగడం తనవల్లకాదు.

"ఏం జేనాయినా.... చెప్పు...." కొంచెం సరదాగా, ఎత్తిపొడుస్తున్నట్టుగా అడిగాడు ఉలిగప్ప.

జంబులుకు రోషం తన్నుకొని వచ్చింది.

"నేన్యాడికి రాను... నా కడుపున పుట్టినోల్లు నాకే చెప్పేటోల్లయ్యిన్రా. కుల వుత్తిని కాల్దన్నేంత ఎదవ నాయాల్లున్గాలా... యింకా. ముసలిముప్పున మీకాడ తేరగతినోటోన్ననుకుండరా? నా వొంట్లో సత్తవ పోయినప్పుడు మీతోనే నీల్లు పోయించుకుంటాలే...." అని విసురుగా లేచాడు.

"నేన్చెప్పలా... ఈ నా కొడుక్కి ఇల్లిల్లు అడక్కతింటేనే కమ్మగుంటది. కులాసారాన్ని ఈడొక్కడే బతికించాల...." బిచ్చావతి అంటుంటే.... "ఎక్కువ తక్కువలు కూసినావంటే నరుకుతా సూడి... గబ్బునాయాల...." అని కోపం తీరక అబ్బిల్లు పట్టి "లెయ్యరా.... ముందు ఈన్నుంచి లెయ్. ఈ సగాల కనిపిచ్చినావంటే ఏంజేస్తానో నాకే తెల్దు...." అని కొడుకు రెట్టపట్టుకొని లాగాడు.

బిచ్చావతి ఉదరబిక్కొని లేచాడు. రెండడుగుల వెనక్కివేసి....

"రోయ్ యిందాకనే నిన్ను దొమ్మలిరిసి బూంచిపెట్టేటోన్ని. సిన్నోడు అడ్డంబడకపోతే...." అని తీవ్రావేశంతో తండ్రి గుండెమీద చేత్తో వెనక్కి తోశాడు. జంబులు విరుచుకొని పడబోయి నిలదొక్కుకున్నాడు.

"నేన్చెప్పలారా.... ఈ నాకొడుక్కి కులమంటే బయ్యం. దాంతోనే ఆ పొద్దు పెద్ద మంచులు నన్ను ఎలేస్తుంటే గుమ్మునుండాడు. నాకేం బయ్యం! యిట్లాంటోల్లంతా ఏకమైనా నన్నేం చెయ్యలేరు. ఒక్కొక్కడ్ని వరసబెట్టి సంపుతా. ఎవరాదుకుంటారో చూస్తా... రేయ్ సిన్నోడా... నువు సుక్కుదూ న్నోనివి. ఈనిగాల్లతోని నీకేం పని? వీల్లనెవ్వలు బాగజెయ్యలేరు. నేనే ఈ గుబ్బునా కులాన్ని ఎంగిలి మాదిరి ఊంచిపారేసినా. అవునని తలకాయ వొంచితే జుట్టుపట్టుకుంటారు. నువ్వేంది.... నీ కట్టేందని తలెగరేసినామనుకో కిందా మిందా మూసుకోమంటారు...." అని అరుచుకుంటూ ఆ అసుర సంధ్యలో, చలి ముసురుకుంటున్న వేళ బిచ్చావతి వెనక్కి వెనక్కి నడుచుకుంటూ కొన్ని అడుగులు దూరం వెళ్ళాడు.

ఆయనట్లా వెళ్లిపోతాడని ఉలిగప్ప ఊహించనైనా లేదు. సుడిగాలి సమస్తాన్నీ ఊడ్చుకొని వెళ్లినట్లు వెళ్ళిపోయాడు. అతనలా తిడుతూనే వెళ్ళాడు. దూరమైపోయేదాకా తిట్లు వినిపిస్తున్నాయి. మధ్యమధ్యలో వెనక్కి తిరిగి గాల్లోకి చేతులెత్తి ఆగ్రహంతో, శరీరంలోని శక్తినంతా వెచ్చించి అరుస్తున్నాడు. లోకమంతా ఒక్కటై కొరత వేసేందుకు సిద్ధమైనా నేనింతే... నేనిట్లాగే ఉంటాను.... నేనే మీలో కలవను... మిమ్మల్ని వొప్పుకోను అని పదే పదే ప్రకటిస్తున్న వాడివలె అగుపించాడు.

అతనట్లా వెళ్ళిపోవడంతో ఉలిగప్ప లోపలంతా శూన్యం ఆవరించింది. ఎప్పటికో కూడగట్టుకున్నాక కొత్త జగత్తు రూపొందనారంభించింది.

* * *

నలభై ఏళ్ళ కిందట...

ఏరంచు ఊళ్ళేకాదు, దూరపు పల్లెలను కూడా భయం ఆవహించింది. శ్రీశైలం కొండల మీద ఏదో డ్యాం కడతారని, ఊళ్ళన్నీ మునిగిపోతాయని జనాలు కతలు కతలుగా చెప్పుకున్నారు. నిజంగా ఏం జరిగేదీ ఎవ్వరికీ తెలియదు. వినడం ద్వారా తెలియనిదాన్ని ఊహించుకోవడం తప్ప మార్గాంతరంలేదు.

ఊళ్ళు పోతాయట, చేలుపోతాయట, భూములున్న ఆ సాములకు ధర కట్టి దుడ్లిస్తారట, అవతలి దిక్కు గడ్డన ఊరు కట్టిస్తారట.... అని చెప్పుకోసాగారు.

అప్పుడు జంబులు వయసెంతో ఆయనకే తెలియదు. పెండ్లయింది, పిల్లలు కలిగారు.

'అప్పుడు నీవెంతోనివి?' అని అడిగితే...

'మా రాముడు యింత పొట్టెగాడు. మాంచి పాయంలో ఉంటిలే. ఊపు మీద కత చెప్తాంటి. ఏందిరా.... ఈ నాకొడుక్కి ఇంత ఇరగబాటా? అనుకుంటరేమో, కత చేప్తాంటే నాకే బలే ఊపొచ్చేది. ఒక్కోతాన కత ఎట్లా నడిచిండేది తెల్లారి మతికొస్తేచాలు దిన్నమంత సంబరంగా ఉండేది.... అంటాడు.

జంబులట్లా ప్రవాహంలా మాట్లాడతాడు. దేనికీ వెతుక్కోవడం ఉండదు. తడబాటు ఉండదు. భాష అట్లా జారిపోతుంటుంది. శాస్త్రాలు, సామెతలు, విరుపులు, పిట్టకతలు పాతవి కొన్ని, కాయించి చెప్పేవి కొన్నీ... అలుపుండదు. ఒక్క జంబులనేగాదు, కులంలో ఎవర్ని కదిపినా అంతే. ఆడామగ తేడాలేదు.

జంబులు ఎన్నటికీ తలబోసుకొనే రోజులవి.

'పాయం దినాల్లోనే గదా దేనికైనా. కత చెప్తాంటే - ఎక్కన్నాకొడుకురా వీడు, వీనెమ్మ.... గొంతులో వీడికి, చిన్నప్పుడు వాల్లమ్మ గంట పెట్టినదా ఏమి? ఎత్తుకుండాడంటే చుక్కపొడిచేదనకే ఒకటే లెక్కన కత చెప్తాడు.... అనేటోల్లు అట్లుండేది కంటం. మా ఆడిది ఒక్కల్లి పిల్లోన్ని సంకనేసుకొని పాలిస్తా, యింకొక్కల్లి గుమ్మెట కొట్టేది. దాని గుమ్మెటమోత ఏమి? నా పదాలేమి?... పోటీపడి అల్లాడ్లాడేవి....'

జంబులు చెప్పుకుంటాడని కాదు గాని, యిదంత నిజమే అని కులంలో, చుట్టుపట్లా వొప్పేసుకుంటారు. ముసలోన్ని కదిలిస్తే చాలు.... ఒక తాయాన ఆపడు గదా. వాగిసులో ఉన్నప్పటి ఇరగబాటంత సదువుతాడు.... అని ఇప్పటివాళ్ళు చాలా మంది అంటారు గాని జంబులు అబద్ధాలు చెప్తున్నాడని

ఎవ్వరూ అన సాహసించరు. ఎందుకంటే జంబులు ఎట్లా కత చెప్పేది ముసలోళ్ళు సదా తల్చుకుంటూనే ఉంటారు కాబట్టి.

బొబ్బిలి యుద్ధం చెప్తుంటే కళ్ళముందు కత్తుల కోలాటం జరుగుతున్నట్లుండేదని, చెంచుపురాణం చెప్తుంటే - భుజమ్మీద తాంబురతో గిరగిర తిరిగి ఎగిరి గంతేస్తే అచ్చం నర్సింహస్వామి మాదిరి కనపించేవాడని అనుకుంటారు. అట్లాంటి జంబులు ఏడాదంతా ఏటికి ఈ పక్క నందికొట్కూరు, ఆత్మకూరు చుట్టుపట్ల పల్లెల్లో ఎక్కడెక్కడ తిరిగినా, ఎన్ని ఊళ్ళల్లో యాచన చేసినా ఒక్కసారైనా ఏటవతలికి వెళ్ళేవాడు. ఏరు అడ్డమని ఎన్నడూ అనిపించలేదు. పోవాలనుకుంటే పోవడమే. పిల్లకాలువ మీద దాటినట్లు కృష్ణానదిని జనాలు పుట్ల మీద దాటుతునే ఉంటారు. ఎక్కడన్నా కనిపిస్తే 'ఏంది జంబులా! మా వూర్లకు వచ్చేది లేదా?' అనో 'నీకు గిట్టుబాటయ్యేంత తాంబూలం మేమియ్యలేమనా.. మాకెల్లి రావడం మానేసినావు' అనో అడుగుతారు. అల్లిరాణి కతను ఏటవతలి వాళ్ళే బాగా ఇష్టపడతారని జంబులు అభిప్రాయం.

ఊర్లు మునిగిపోతాయని తెలిసినప్పుడు జంబులుకు అలవిగాని భయం కలిగింది. అప్పుడు పాతకోట ఊరి శివార్లలో గుడారం వేసుకున్నాడు. నాలుగు కుటుంబాలు కలిశాయి. ఒకటి ఏటవతలి నుండి కొత్తగా వచ్చింది. మిగితావి ఎప్పటి నుండో యిక్కడిక్కడే తిరిగేవే. ఆ రోజు పొద్దున్నే తాంబుర తీసుకొని పెండ్లాంతో ఊళ్లోకి వెళ్ళినప్పుడు రంగారెడ్డి ఇంటి దగ్గర కాపోళ్ళంతా గుమిగూడి ఉన్నారు. ఈ ఉదయం పూట ఊరు ఊరంతా విషాదం చుట్టి వచ్చినట్లుంది. ఏం చెయ్యాల్రా బగవంతుడా! ఏది దారి? అని ఆసాములంతా సమాలోచనలో పడ్డారు. ఆలోచన కన్నా ఆందోళన, భయమే ఎక్కువగా వాళ్ళను ఆవరించాయి.

పెద్ద పెద్ద రాతి స్థంబాలతో, యింటిముందు అటు ఇటూ విశాలమైన అడుగులతో ఏనాడో కట్టిన మట్టి మిద్దెలున్న వీధి అది. అన్నిటిలోకి రంగారెడ్డి ఇల్లు సకల జంతు సమూహంలో సింహము వలె ఠీవిగా వెలుగొందుతుంది. అలాంటి యింటి యజమాని రంగారెడ్డి దంతెలవైపు, స్థంబాలవైపు విచారవదనంతో చూస్తూ మౌనంగా ఉన్నప్పుడు దూరం నుండే చూచి మశమ్మ గుమ్మెట కొట్టడం ఆపేసింది.

ఇద్దరూ వెళ్ళి మెట్లకింద ఓ పక్కకు ఒదుక్కొని నిలబడ్డారు. ఊరి కాపులంతా అక్కడే ఉన్నారు గదా.

తలా ఒకమాట అన్యాపదేశంగా అంటున్నారు - మునిగిపోయే ఊరు గురించి, ఇళ్ళ గురించి మాటలు పొడిపొడిగా సాగుతున్నాయి. మాటల మధ్య గడ్డకట్టిన విషాదం....

జంబులుకు అర్థం కాలేదు. ఊరెందుకు మునిగిపోతుంది? అయినా యింతమంది మాట్లాడుకుంటున్నారంటే నిజమే కావచ్చు.

"ఇల్లూ వాకిళ్లూ మునిగిపోతే ఎట్ల రొడ్డీ...." అని అడిగాడు.

అంత వరకు అక్కడ సాగుతున్న తర్జనభర్జనలకు - విషాదాంత వాక్యాలకు, నిట్టూర్పు స్వరాలకు భిన్నంగా జంబులు మాట వినిపించింది.

రంగారెడ్డి తన ముఖ భంగిమ మార్చకుండా, చూపుల అర్థం మార్చకుండా కనుగుడ్లు జంబులు వైపు తిప్పాడు. ఆయన ఏమీ మాట్లాడలేదు.

అంతా కొన్ని క్షణాలు నిశ్శబ్దం....

"ఏమిరా! ఊర్లు పట్టుకొని తిరిగే నాయాలువు.... నీకేం నొప్పాయెరా.... ఇండ్లా.... సేలా?" అని ఎవరో అన్నారు.

"ఇయ్యాల ఈ ఊర్లో, రేపు యింగో ఊర్లో ఉంటావు. ఇదంతా మునిగిపోయిందనుకో, యా ఊర్లో ముద్దేస్తరో నీకు తెల్దా ఏమి? ఈ పరిగణ అంతా ఎత్తక తిరిగినోడివి...." అని యింకెవరో అన్నారు.

జంబులు బీరు పొయ్యాడు.

ఏ ఊళ్ళో ఎంత బిచ్చమెత్తిందీ పెట్టిన వాళ్ళకంటే జోలెపట్టిన తనకే గుర్తుంటుంది. యాచించిన నోటనే కత చెప్పిన ప్రతిరోజూ కాపోళ్ళను పేరుపేరున స్తుతించింది వీళ్ళే మర్చిపోయినట్టుంది.

"అది కాదు రొడ్డీ... ఊర్లు, ఆ సాములు పచ్చగుంటేనే కదా మాకు ముద్ద దొరికేది?" అన్నది మశమ్మ.

"తాతల్నాటి ఇండ్లూ, పొలాలు పోతాయని మేం ఎదారు పడుతుంటే ముద్ద దొరకదని మీరేడుస్తుండారు..." కొంచెం విరక్తిగా, వేదాంత ధోరణిలో ఎవరో అన్నారు.

ఆ మాట మశమ్మకు, జంబులుకు సమాధానంగా అన్నా, అక్కడ ఓ రకమైన వైరాగ్య వాతావరణాన్ని పులిమింది.

జంబులు తేరుకున్నాడు. కానీ దెబ్బతిన్నవాడి వలె.

నిజమే... ఆయనకు తాతల్నాటిదేదో ఈ ముంపులో కొట్టుకపోతుందనే భయం వెన్నాడుతోంది. జంబులును తాత, నాయిన వేలు పట్టుకొని ఈ పల్లెలు తిప్పారు. పగలు యిల్లిల్లూ అడక్కచ్చుకున్నా సందేవేళ మొదలు పెట్టి రాత్రంతా సాగే కళాప్రదర్శనలో ఆయనకీ ఊళ్ళు అర్థమయ్యాయి. ఊళ్ళ ప్రాచీనత్వంలో జంబులు సేదతీరేవాడు. అదొక గొప్ప భరోసానిచ్చేది. అది నిత్యమని నమ్మకం ఉండేది. ఊళ్ళు మునిగిపోతాయనే వార్త ఆయన పాలిట అశనిపాతమైంది. ముంపు వల్ల ఇళ్ళూ చేలూ పోతాయని, నష్టపరిహారం ఎంతిస్తారని, తిరిగి మళ్ళీ కుదురుకుంటామా? అనీ పరిపరివిధాల రైతులు మధనపడుతున్నారు. కానీ జంబులు వ్యధ ఇది గాదు.

ఆయనకు ఊరంటూ లేదు
ఇల్లూ పొలాల మాటే లేదు
మరెందుకు?

జంబులుకు ఎందుకు స్ఫురించిందోగాని ఈ ఊళ్ళు మునిగిపోతే కొత్తగా వచ్చే ఊళ్ళు ఎట్లుంటాయి? అని. ఊరు మునగడమంటే తరతరాలుగా ఊళ్ళలో దాగి ఉన్నదంతా తుడిచిపెట్టుకుపోవడమే గదా అనే ఆలోచన కలిగాక భయకంపితుడయ్యాడు. ఊళ్ళంటే బలమైన పునాదులు గల ఇళ్ళూ, ఏడాదికి ఒకటో రెండో పంటలు యిచ్చే చేలు మాత్రమే కాదుగదా! జంబులు అసలు అట్లా చూచే అవకాశమే లేదు - ఆయన ఊరును చూచిన తీరేవేరు.

మనిషి జ్వరపడిపోయాడు
కొన్ని రోజులపాటు అదే వ్యధ
లేచింది లేదు... తాంబుర ముట్టుకున్నదీ లేదు
పిల్లలు చిన్నవారు

ఊళ్ళోకెళ్దామని మశమ్మ శతవిధాల పోరేది. జంబులు కదిలే వాడుకాదు. ఆకలికి తాళలేక మశమ్మ, పిల్లల్ను తీసుకొని గుమ్మెట తగిలించుకొని ఊళ్ళోకి వెళ్ళింది. గుమ్మెట వాయించబోతే వింత అనుభవం, విచిత్రమైన స్థితి....! ఆమె చేతులు గుమ్మెట మీద ఒక్క సవ్యమైన శబ్దాన్నీ పలికించడం లేదు. కుడిచేతికీ ఎడంచేతికీ పొంతన కుదరడం లేదు. అంతకు మించి ఆమెకు గొంతు పెగలడం లేదు. ఆమె ఇలాంటి స్థితి వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఎక్కడి నుంచో వచ్చి తారసపడడం కాదు - ఆమెలోనే అలాంటి స్థితి ఉన్నది. జంబులు గొంతుకు వంతపాడటమే వచ్చు. ఆయన ఎక్కడి నుండి ఎత్తుకొని ఎటు తీసికెళ్తే ఆమె గొంతు అట్లా సాగిపొయ్యేది. ఆ స్వరాన్ని చేతులు గుమ్మెట మీద ఎన్నెన్ని స్థాయిల్లోకి తీసికెళ్ళేవో!

మొగని గొంతు పలకనిదే ఇప్పుడామె గొంతు పెగలడం లేదు. ఆయన పాడే పాటల్లోని పదాలన్నీ ఎరికే. కానీ పాట కావడం లేదు. పిల్లల్ను తీసకపోయి యిండ్ల ముందు నిలబెట్టి ఏదో గొణిగేది... పెట్టినవాళ్ళు పెట్టేవాళ్ళు, లేదంటేలేదు. అట్లా ఎన్ని రోజులో!

'ఏమే మసీ... మీ ఆయన యాడికి పోయినాడే. వొక్కదానివే వచ్చినావు' అని అడిగినవాళ్ళూ ఉన్నారు. ఊరు తిరిగొస్తే ఆ పూటకికక దిగులుండదని మాత్రమే నమ్ముతూ వచ్చిన మశమ్మకు తన దుర్బలత్వమే తెలియడం లేదు. ఇక జంబులు వ్యధ ఎట్లా అర్థమవుతుంది? *(ఇంకా వుంది)*

కోర్టు స్టేట్‌మెంట్

# పెళ్లికుట్ర కాదు, తెలంగాణను అడగటం రాజద్రోహం కాదు

రాయలగండి (మహబూబ్‌నగర్ జిల్లా అమ్రాబాద్ మండలం) కుట్ర కేసులో మా మీద ఉన్న ఆరోపణ ఏమిటంటే - మేము మే 3, 2006న చెన్నకేశవ స్వామి దేవాలయములో జరిగిన చెవ్వ రఘుపతి, జయల పెళ్లికి హాజరై, ఆ ముసుగులో సిపిఐ (మావోయిస్టు) పార్టీ మహబూబ్‌నగర్ జిల్లా కమిటితో సమావేశమయ్యామని. అది రహస్య సమావేశమని. అక్కడ కొందరి ప్రముఖ అధికారుల, రాజకీయ నాయకులను చంపటానికి పథక రచన జరిగిందని. ఈ సమావేశానికి నెల ముందే మేము మాధవానిపల్లి సమీపంలో ఒక ప్లాటూన్ సభ్యుడిని కలిసి 100 ఎలక్ట్రికల్ డిటోనేటర్స్ ఇచ్చామని. తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్ (టిఎస్‌ఎఫ్) ముసుగులో మావోయిస్టు పార్టీ కమిటి ఆదేశాలు పాటిస్తూ హైద్రాబాద్‌లో డెన్ నిర్వహిస్తున్నామని.

పెళ్లికి హాజరు కావటం మినహాయిస్తే పోలీసులు మామీద ఆరోపించినవన్ని అబద్దాలు. మేము వృత్తి రీత్యా ఒకరం ఉస్మానియా యూనివర్సిటీ అనుబంధ కళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్. మరొకరం హైకోర్టులో ప్రాక్టిస్ చేస్తున్న న్యాయవాది. మేమిద్దరం జీవిత సహచరులం. రఘుపతితో గత 20 సంవత్సరాల పరిచయంతో దేవుడి గుడిలో అతడు చేసుకున్న పెళ్లికి హాజరయ్యాం.

ఇక మా రాజకీయాల విషయానికి వస్తే - మేమిద్దరం తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్ వ్యవస్థాపక సభ్యులం. 1998 అక్టోబర్‌లో తెలంగాణలోని యూనివర్సిటీ విద్యార్థులం కలిసి ఈ సంఘాన్ని ప్రారంభించాం. ఈ సంఘం ఏ రాజకీయ పార్టీకి అనుబంధం కాదు. నిషేధిత సంస్థ అంతకంటే కాదు. కేవలం తెలంగాణకు జరుగుతున్న అన్యాయాన్ని చూసి ఈ ప్రాంత బిడ్డలుగా స్పందించాం. సంస్థను ప్రారంభించాం.

పగిలిన వరిమడిలో వేప చెట్టుకు వేలాడుతున్న రైతు శవానికి కారణం ఏమిటని అడిగాం. బిరబిర కృష్ణమ్మ 293 కి.మీ. పరిగిడుతుంటే జలజల మా పాలమూరు కన్నీళ్లు ఎందుకు కారుతున్నాయని ప్రశ్నించాం. బుడ్డగోచి, కారం మెతుకులు, నెత్తురు కారే చేతులు, నెత్తిన మట్టి తట్ట జీవితానికి కారణాలను అన్వేషించాం. 18లక్షల పాలమూరు జనాభా వలస ఎందుకు పోతుందని తెలుసుకున్నాం. ఏరంచు ఊరు - ఊరంచు ఏరు - ఎటు పార చూసిన ఎడారిలాగ ఎందుకుందని అన్నాం.

చదివిన చదువులు సత్తుబండలయ్యి తెలంగాణ యువత దిక్కులెందుకు చూస్తుందని ప్రశ్నించాం. 610 జీవో శంబూకుడి తలలా 25 సంవత్సరాలుగా ఎందుకు శోకిస్తుందని అడిగాం. ఏటా 6వేల పాఠశాలలు, ప్రభుత్వ కళాశాలలు ఎందుకు మూస్తున్నారు. ప్రపంచ బ్యాంకుకు తెలంగాణ ప్రయోగశాలగా ఎందుకు మారింది? నగ్నంగా తిరిగే మనిషికి తన నరాలే దారాలుగా చేసి బట్టను అల్లి నాగరికత నేర్పిన నేతకాడు ఎందుకు ఉరిపెట్టుకుంటున్నాడు. ఆరే రంపం పదును ఆరిపోయి తంగెడు చెక్క ఎందుకు బంగపడ్డది? బతుకమ్మ ఆటలు, భజన కీర్తనలు రచ్చకట్ట మీద బోరున విలపిస్తున్నాయి. మూసి నది మురికినది అయింది. హుస్సేన్ సాగర్ కంపు కొడుతుంది. భాగమతి ప్రేమలో తడిసిన భాగ్యనగరం రక్తపు టేరుల్లో స్నానమాడుతుంది.

ఇట్లా అనేక ప్రశ్నలు - కొన్ని సందేహాలు మదిని తొలిస్తే మట్టి ఇచ్చిన జ్ఞానంతో మాట్లాడకుండా ఉండలేకపోయాం. రాజ్యాంగం కల్పించిన హక్కుల పరిధిలో ప్రశ్నించటమే తప్పంటే ఇక ప్రజాస్వామ్యానికి విలువెక్కడిది. ప్రజల సమస్యల గురించి విప్లవ రచయితగా రాయక తప్పని స్థితిలో సమాజం ఉంది. ప్రశ్నించటం, మాట్లాడటం, రాయటమే రాజద్రోహమైతే ఇక మనిషి బతికేదెట్లా? స్నేహం, బంధుత్వం, పెండ్లిలాంటి మనవ సంబంధాలు కలిగి ఉండటమే కుట్ర అయితే మానవ కాసారం మిగులుతుందా?

రాయలగడి కుట్రకేసులో దాదాపు 3 సంవత్సరాలుగా రాజ్యాంగం మాకు కల్పించిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను అడ్డుకోవటమే కాకుండా మమ్మల్ని, మా కుటుంబాలను శారీరకంగా, మానసికంగా వేధించారు. అరెస్టు సమయంలో మా ఇంటి నుంచి 1500పుస్తకాలు, మా పెళ్లి ఫోటోలను, సివిల్ సర్వీస్, ఎం.ఏ విద్యార్థులకు బోధించే మెటీరియల్ పోలీసులు అక్రమంగా ఎత్తుకొచ్చారు. మా జ్ఞాన సంపదను మాకు ఇప్పించాలని విజ్ఞప్తి. అట్లే మా కాలంతోపాటు కోర్టు వారి అమూల్యమైన సమయాన్ని, డబ్బును వృధా చేశారు. ఇట్లాంటి నిరాధారమైన కేసును కొట్టివేసి బాధ్యులైన వారిపై చర్య తీసుకోవాలని మనవి.

ఇట్లు

ఎం.స్నేహలత, బి.ఎ.ఎల్.ఎల్.బి.
న్యాయవాది

డా.సి.కాశీం, ఎం.ఎ.,ఎంఫిల్, పిహెచ్.డి.
అసిస్టెంట్ ప్రొఫెసర్

---

*(.... 67వ పేజీ తరువాయి)*

కాంగ్రెసు ముగింపు సన్నాహాలలో భాగంగా సభ ఏర్పాటు అయింది. కా. గణపతి, కా.కిషన్ దాస్ మాట్లాడారు. దీదిని ఉపన్యాసం ఇవ్వాలని వేదిక మీద నుండి కా. సునిర్మల్ ప్రకటించేశాడు. అప్పుడే ప్రిసీడియం బాధ్యతల నుండి బయట కొచ్చి తన ఉపన్యాసం ఉంటుందనే వార్త ఆమెకు చేరకముందే ప్రకటన వచ్చేసింది. ఒక్కక్షణం నొసలు ముడి వేసింది. వెంటనే స్టేజిమీదకు ఎక్కి తన నేస్తాలతో బాతాఖానీ చేసినంత సహజంగా ఆమె ఉపన్యాసం సాగింది. ఆమె వాక్ప్రవాహంలో ఎంత మైమరచి పోయానంటే మారు మ్రోగే కరతాళధ్వనులతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాను. అది నేను విన్న దీది మొదటి ఉపన్యాసం. అదే ఆమె చివరి ఉపన్యాసం అవుతుందని కలలో కూడా ఊహించలేదు.

వేదిక నుండి క్రిందకు రాగానే భాకపా (మావోయిస్టు) ప్రధానకార్యదర్శి కా. గణపతి ఆమెకు అభినందనలు తెలియజేశాడు. నిలువెల్లా సంతోషం ఉట్టిపడే ఆ అభినందన కరచాలనం ఒక సుందర దృశ్యం. ఆ దృశ్యం ఇప్పటికీ నాకళ్ళ ముందు కదలాడుతూ ఉంది. అది ఆమె సామర్థ్యానికి అందిన బహుమతి. తుపాకుల ఘర్షణల నడుమ తిరుగాడే మా కంటే మైదాన ప్రాంతాలలో జీవితాలు ఎంతో కొంత సురక్షితంగా ఉంటాయేమోనన్న భ్రమను, ఆశనిపాతంగా అందిన ఆమె అకాల మరణవార్త పటాపంచలు చేసింది. పీడిత ప్రజల పక్షాన నిలిచిన ఆ బహుముఖ ప్రజ్ఞాశాలికి వినమ్రంగా నివాళులు అర్పిస్తున్నా.

దీది అమరత్వం వదలిన లోటు ఎంత లోతు అంటే ఓ జీవితకాలం అని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. ఆమె స్మరణను వ్యక్తీకరించిన ప్రతిసారీ గొంతు పూడుకు వస్తున్నది. ఆమె సహచరుడు సలీందా అన్నట్లుగా, 'ఆమె అలా వెళ్ళవలసినది కాదు. అయినా వెళ్ళిపోయింది'. అలా అర్థాంతరంగా నిష్క్రమించిన మన ప్రియతమ నేస్తం భారత విప్లవోద్యమ అగ్రగామి నాయకురాలు అనురాధ గాంధీ అఖిల భారత విప్లవ మహిళా ఉద్యమకేతనమై విముక్తి ఆకాశంలో ఎగురుతూనే ఉంటుంది. తన ఎత్తులకు ఎదగమని మనల్ని ఆహ్వానిస్తుంటుంది.

*



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M147 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | bhanu |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |